# తెలుగు కథకులు కథన రీతులు

## 4

సంకలనం:

సింగమనేని నారాయణ



# తెలుగు కథకులు కథన రీతులు

నాల్గవ సంపుటం

4

సంకలనం :

సింగమనేని నారాయణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

TELUGU KATHAKULU - KATHANA REETHULU - Vol. 4
*Compiled by Singamaneni Narayana*

ప్రచురణ నెం 2350/25

ప్రతులు 1000

ప్రథమ ముద్రణ మే, 2004



టైటిల్ డిజైన్ · చంద్ర

**వెల : రూ. 100-00**

ప్రతులకు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ



అక్షరాలంకరణ కాంపాక్ట్ గ్రాఫిక్స్, అంబర్‌పేట్, హైదరాబాద్

ముద్రణ శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్ ఫోన్ 23224831.

**సమర్పణంగా,**

**సమర్చనంగా ...**

'తెలుగు కథ కోసం ఏదైనా చేయాలబ్బా' అంటూ

నిరంతరం తపిస్తూ,

ఈ సంపుటాలు ఇలా రూపొందటానికి

మూలకారకులైన,

కీ॥శే॥ మధురాంతకం రాజారాం గారికి ....

# చివరిగా ...

"తెలుగు కథకులు - కథన రీతులు", నాల్గవ సంపుటి, చివరి సంపుటి, ఇది! ఈ సంపుటితో కలిపి, మొత్తం వందమంది కథకుల గురించి, వంద వ్యాసాలను, పాఠకులకు అందించిన బృహత్ప్రయత్నమిది! ఇలాంటి ప్రయత్నం, తనకు తెలిసినంతవరకూ, ఏ భాషలోనూ జరగలేదని, ప్రముఖ విమర్శకులు, వల్లంపాటి వెంకట సుబ్బయ్య ఒక సందర్భంలో అన్నారు

వంద సంవత్సరాల కథా సాహిత్య చరిత్రలో వందమంది కథకులేనా? అయితే ఏ ప్రయత్నానికైనా ఒక పరిమితి ఉంటుంది - అందువల్ల చాలా ప్రసిద్ధులైన కొందరి కథకుల గురించిన వ్యాసాలు ఇందులో కన్పించక పోవచ్చు! ఈ సంపుటాల్లో ఫలానా వారు లేరే, ఫలానా ప్రాంతాలకు చెందినవారు తక్కువగా ఉన్నారే అన్న సందేహాలు కూడా సహజంగానే కలుగుతాయి. అయితే ఈ సంపుటాలు రూపొందించటంలో మేము ఏ పక్షపాత వైఖరినీ అవలంబించలేదని స్పష్టం చేస్తున్నాము కథా సంపుటాలు లభింపక కొందరి కథకుల గురించీ, వ్యాసకర్తలు దొరక్క మరి కొందరి గురించీ, వ్యాసాలు రాయటానికి అంగీకరించీ, కొందరు వ్యాసకర్తలు రాయక పోవటంవల్ల యింకొందరి గురించీ, మేము కొంతమంది కథకులకు ఇందులో స్థానం కల్పించలేకపోయాము. మేము ఈ సంపుటాలకు సంపాదకులమేగాని, పరిశోధకులం గాము అని ఈ సందర్భంగా గ్రహింప గోరుతున్నాము.

ఈ ప్రయత్నానికి మొదట రూపకల్పన చేసింది, సుప్రసిద్ధ కథకులు మధురాంతకం రాజారాం గారు - వారికి అండగా నిల్చింది నేను అయితే దురదృష్టవశాత్తూ రెండవ సంపుటం పని కూడా పూర్తికాకుండానే వారు కీర్తిశేషులయ్యారు అయినా ప్రారంభించిన పని అర్ధాంతరంగా ఆగిపోకూడ దనే సంకల్పంతో, మిగిలిన సంపుటాలకు, సంపాదకత్వాన్ని నేను వహించాల్సి వచ్చింది

తెలుగు కథా సాహిత్య చరిత్రను అర్థం చేసుకోటానికి, కథకుల కథన రీతుల్ని, వారు ఎన్నుకున్న కథా వస్తువులను, వారి సామాజిక దృక్పథాన్ని, తాత్విక కోణాల్ని, అవగాహన చేసుకోటానికి, ఈ సంపుటాలు పాఠకులకు ఉపయోగపడగలవని నేను నమ్ముతున్నాను అదే సందర్భంలో

వంద సంవత్సరాల తెలుగునేల పరిణామాల్నీ, సంస్కృతీ సంబంధాల్నీ, కథా సాహిత్యంలో వచ్చిన వివిధ ధోరణుల్నీ, వాదాల్నీ, రూప వైవిధ్యాన్నీ, అర్థం చేసుకోటానికి కూడా ఈ సంపుటాలు ఉపకరించగలవని నేను విశ్వసిస్తున్నాను.

ఇందులోని లోపాల్నీ, పొరపాట్లనీ తెలియచెప్పితే, మలి ముద్రణలో సవరించుకోగలమని కూడా విజ్ఞప్తి చేస్తున్నాను

దాదాపు 'వేయిపుటల' ఈ పుస్తకాన్ని నాలుగు సంపుటాలలో ప్రచురించిన 'విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్' వారికి సాహితీ ప్రియులు ఋణపడి వుండాలి


**సింగమనేని నారాయణ**
సంకలనకర్త

6-2-285, కోవూరు నగర్,
అనంతపురం

01-03-2004

# ఇందులో...





# కీ.శే. శారద

♦ సురేష్ ♦

తెలుగు సాహిత్య ప్రపంచానికి 'శారద' గా చిరపరిచితుడైన ఎస్.నటరాజన్ జన్మస్థలం తమిళనాడులో పుదుక్కోట బాగీరధి, సుబ్రమణ్యయ్యరు దంపతులకు 1924లో చివరి సంతానంగా జన్మించాడు నటరాజన్ ఆ దంపతులకు ఇద్దరు కూతుళ్ళూ, ఇద్దరు కొడుకులూ నటరాజన్ రెండవఏటనే తల్లిని పోగొట్టుకున్నాడు మద్రాసులో అప్పటికే పెరిగిపోయిన కట్నాల బెడదవల్ల తన ఇద్దరు కూతుళ్ళనూ తెనాలి వారికే ఇచ్చి వివాహం జరిపించాడు సుబ్రమణ్యయ్యరు వృద్ధాప్యంలో అల్లుళ్ళ పంచనయినా బతుకుదామని చిన్నకొడుకుని తోడుతీసుకుని తెనాలి వచ్చాడాయన.

అలా 1937 నాటి ఒక చలికాలపు ఉదయాన తెనాలి రైల్వేస్టేషన్‌లో కాలు మోపాడు, నటరాజన్ - పన్నెండేళ్ళ వయసులోనే అరచేతుల చొక్కా, అడ్డుకట్ట పంచె, ఎర్రగా, సన్నగా వలుచటి మొహం, తీక్షణమైన చూపులూ ఇదీ ఆనాటి అతని రూపం. అంత చిన్నవయసులోనే తండ్రి పోషణభారం వహించిన నటరాజన్, జోలెపట్టి దేవాలయాల వెంట తిరిగాడు. వారాలు చేసుకొన్నాడు అతికొద్ది కాలంలోనే వలస వచ్చిన అనేకమంది అయ్యర్ల సరసనే హోటల్ పనిలోకి దిగి చివరిదాకా అందులోనే కొనసాగి నిత్యదారిద్ర్యంతో మూర్ఛ జబ్బుతో తన ముప్పయ్యొకటవ ఏట 1955, ఆగస్టు 17న ప్రాణాలు కోల్పోయాడు

బాల్యంలోనే సాహిత్యాభిలాష కలిగి వున్నవాడు కావటంతో తెనాలి చేరేనాటికే తమిళ సాహిత్యాన్నీ తమిళంలోకి అనువాదమైన ప్రపంచ సాహిత్యాన్ని చదివాడు నటరాజన్ తెనాలి వచ్చాక తెలుగు సాహిత్యాన్ని చదవాలన్న అభిలాషతోనూ, హోటల్ పనిలో అత్యవసరంగా మాట్లాడవలసి రావటంతోనూ తెలుగు భాషను నేర్చుకున్నాడు అతికొద్దికాలంలోనే పురాణాలూ, ప్రబంధాలూ, చదవగలిగే స్థాయికి వచ్చాడు చలాన్నీ, కొ కు నీ అవుపోసన పట్టాడు తెనాల్లో వున్న మున్సిపల్ లైబ్రరీ, ఆంధ్రరత్న గ్రంధాలయం అతడికి ఆవాసాలయ్యాయి.

అతడు తెనాలి వచ్చిన నాటికే తెనాలి 'ఆంధ్రా ప్యారిస్'గా తెలుగుదేశపు సాంస్కృతిక, సాహిత్య కేంద్రంగా నిలిచి ఉంది. చలంనుంచి కొ కు దాకా, చక్రపాణి నుంచి గోపీచంద్‌దాకా, అటు విశ్వనాథ, ఇటు త్రిపురనేని రామస్వామి చౌదరి, గోరా నాస్తికోద్యమం, శ్రీశ్రీ కవితా ప్రభంజనం అరసం ఆవిర్భావం, స్వాతంత్ర్యోద్యమం, తెలంగాణా సాయుధపోరాటం, బలాబలాలు మోహరిస్తున్న కాంగ్రెస్, కమ్యూనిస్ట్ శ్రేణులు, నాస్తికవాదం, హేతువాదం, నవ్య మానవ

వాదం, మార్క్సిజం తెనాలి పట్టణపు యువతరాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి

అలా ఎక్కడో పుదుక్కోటలో పుట్టి, తెనాలి వచ్చి హోటల్ పనిలో మునిగి పోయిన నటరాజన్‌ను అనతికాలంలోనే తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన గొప్ప రచయితగా మార్చింది తెనాలి పట్టణమే అందుకే 'నటరాజన్' జన్మస్థలం తమిళదేశమయితే 'శారద' జన్మస్థలం మాత్రం తెనాలి అయింది

శారద రచనా వ్యాసంగమంతా ప్రధానంగా 1948 నుంచీ 1955 వరకూ జరిగింది ఈ ఏడేళ్ళలోనే అతడు అసంఖ్యాకంగా రచనలు చేసి తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయాడు అపస్వరాలు, మంచీ - చెడూ, ఏది సత్యం, చీకటి తెరలు, మహాపతి, అందాల దీవి, చదరంగం, సందేశం, నాగరీకుని ప్రేమ, కార్యదర్శి, హోటల్లో శవం వంటి పదిపన్నెండు నవలలూ, వందకు పైగా కథలూ, నాటికలూ, క్షణంలో సగం పేరుతో ఏభైకి పైగా వ్యంగ్య రచనలూ, ఒకటి రెండు కవితలూ అతడి కృషికి నిదర్శనంగా కనిపిస్తాయి అతడి మొదటి కథ, 'ప్రపంచానికి జబ్బు చేసింది' 1946లో ప్రజాశక్తిలో అచ్చయ్యింది అప్పుడే అతడు 'ప్రజావాణి' అనే రాత పత్రికను కూడా ప్రారంభించాడు రెండు మూడు సంచికలతో ఆగిపోయిన 'చంద్రిక' అన్న ప్రతికను కూడా మిత్రుల సహకారంతో ప్రచురించి, తనే సంపాదకత్వం వహించాడు అయితే కొన్ని దశాబ్దాల కితం అచ్చయిన అతడి రచనలనేకం ఇప్పుడు లభ్యం కావటంలేదు ఆనాడు అతడి రచనల్ని ప్రచురించిన పత్రికలు తెలుగు స్వతంత్ర, జ్యోతి, హంస వంటివి ఇప్పుడు మూతపడ్డాయి. ప్రస్తుతం 'రక్తస్పర్శ' కథా సంకలనం (ప్ర శారదా సాహిత్య వేదిక, తెనాలి) శారద నవలలు (ప్ర పర్‌స్పెక్టివ్, హైదరాబాదు), శారద రచనలు (ప్ర శారద సాహిత్య వేదిక, తెనాలి) మాత్రం పాఠకులకు అందుబాటులో ఉన్నాయి

పై రచనల ఆధారంగా శారద ఎంచుకున్న వస్తు, శిల్పరీతుల్ని క్లుప్తంగా పరిచయం చేయటం ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం

**శారద కథలు:**

కథా రచనలో, సంవిధానంలో ఎంతో పరిణతి సాధించిన రచయితగా కన్పిస్తాడు శారద కథలో ఉపన్యాస ధోరణిని అతడు క్షమించేవాడు కాదనీ, 'కథని చెప్పటం కాదు కథని చూపించాలి" అని నమ్మేవాడనీ ఆలూరి భుజంగరావు తన 'సాహిత్య బాటసారి శారద' లో రాశారు

ఈ నేపథ్యంలోంచి చూస్తే హరిశ్చంద్రుడు శవం విలువ, అసలు సమస్య, గొప్పవాడి భార్య, సంస్కరణ వంటి కథలు సూటిగా, క్లుప్తంగా రెండు మూడు పేజీలకే ముగిసిపోవటం కనిపిస్తుంది అయినా గానీ అవి పాఠకుడిమీద వేసే ముద్ర ఎంతో బలంగా వుంటుంది ఈ కథల్లో ఎంతో సాధారణమయిన వస్తువునే ఎంచుకున్నప్పటికీ వాటిని తన శిల్పప్రజ్ఞతో, సునిశితమైన దృష్టితో అసాధారణంగా మలిచాడు రచయిత ఊరిపక్క చంద్రోదయమవుతున్న పొలాల మధ్య ఉన్న సినిమా థియేటర్ గేటు దగ్గర ఒక ఆడ మగా కలవటం -

వారిద్దరూ ఒకరినొకరు మభ్యపెట్టుకుని ప్రణయాన్ని సాగించటం - చివరిగా ఆమె అతడి లాల్చీ జేబుని వెతుక్కుంటునప్పుడు అతడన్న మాటలతో కథా వస్తువుని వ్యంగ్యం, ఉద్రేకం, బాధ, హాస్యం కలగలసిన 'రసన'గా తీర్చిదిద్దటం 'హరిశ్చంద్రుడు' కథలో కనిపిస్తుంది 'శవం విలువ' కథలో ఓ పంట కాలువ మీద వంతెన పక్క ఒక శవాన్ని పడుకోబెట్టి ఇద్దరు స్త్రీలు ఏడుస్తుంటారు సున్నిత మనస్కుడు, భావుకుడూ అయిన అర్జునరావు "ఎంతఘోరం?" అనుకుంటూ ఆ స్త్రీలకు తోచిన సాయం చేసి అక్కడే నిలబడి ఉన్న తన మిత్రుడయిన ట్రాఫిక్ పోలీసుని కలుస్తాడు "నువ్వేమయినా అను! ఎవడేనా బతికున్నప్పుడు సాయం చెయ్యాలి గానీ, చచ్చాక నినాదాలు చెయ్యటం, చందాలు వెయ్యటం ఘోరం" అంటాడా పోలీసు తన మిత్రుడి కఠిన హృదయాన్ని తిట్టుకొంటూ సాయంత్రం వేళ మళ్ళీ వంతెన దగ్గరకొచ్చిన అర్జునరావుతో పొద్దుణ్ణించీ అక్కడ పడివున్న శవం శవం కాదనీ, చీటి పడగానే చక్కా నడిచిపోయిందనీ అసలు రహస్యం చెప్తాడు పోలీసు మిత్రుడు "ఎంత మోసం?" అనుకుంటున్న అర్జునరావుకి 'లోకధర్మం' ఇలా బోధిస్తాడా పోలీసు. "బతికున్నపుడు పైసా ఇవ్వరనీ, చచ్చాకే చందాలు వస్తాయన్న సంగతి ఆ ఆడవాళ్ళకి తెలుసు లోకం తననుతాను మభ్యపెట్టుకుంటుంది ఆ లోకాన్నే మభ్యపెట్టటం కొందరికి అవసరం అవుతుంది."

ఇలా కథలోని ముగింపు వాక్యాల ద్వారా కథా వస్తువుపై కొత్త వెలుగుని ప్రసారం చేయటం మాత్రమే కాకుండా, కథకు పెట్టిన పేరు ద్వారా కథా వస్తువుని ఓ కొత్త కోణంలో చూపించటం 'కోరికలే గుర్రాలయితే' కథలో కన్పిస్తుంది. ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటులో "యునైటెడ్ రిపబ్లిక్ ఆఫ్ ఇండియా" ఏర్పడటం, 'ఆంధ్రా రిపబ్లిక్' ఏర్పడటం, ఆంధ్రదేశమంతా భూతల స్వర్గంగా మారటం, ప్రాజెక్టులూ, పంటలూ, గనులతో తెలుగు ప్రజలంతా సుఖశాంతులతో జీవించడం ఈ కథలో చిత్రించాడు రచయిత. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడకముందే రాసిన ఈ కథలో చిన్న రాష్ట్రాల ఏర్పాటువల్ల మంచి జరుగుతుందని రచయిత చెప్పదలుచుకున్నాడా లేక కథలో వర్ణించిన సుఖశాంతులన్నీ ఎండమావులే అని కథకు పెట్టిన పేరు ద్వారా సూచించాడా అన్నది చాలా ఆసక్తి గొలిపే సందేహం "ఉత్తరాది క్షవరం ఉన్నన్నాళ్ళూ ఆంధ్ర ఒకటి ఉన్నదని ప్రపంచానికి తెలీదు. ఆంధ్రజాతి విడిపోయి ప్రపంచం విస్తుపోయేంత అభివృద్ధి సాధించింది" అని ఊహిస్తాడు రచయిత - 1949లోనే అయితే ఆ ఊహనే కథకు పెట్టిన శీర్షిక ద్వారా మళ్ళీ శేష ప్రశ్నగా మిగిల్చాడు రచయిత.

అయితే 'అసలు సమస్య' కథలో ఏ సంశయమూ లేకుండా మద్రాసు నగరం మాదంటే మాది అని కొట్టుకోబోయినంత పనిచేసిన తమిళకంద స్వామీ, తెలుగు వెంకటేశ్వర్లూ ఇంటి యజమాని అద్దె పెంచటం వల్ల ఒకేసారి, ఒక్కలాగే రోడ్డున పడతారు "ఈ మద్రాసు మీదీ కాదు, మాదీ కాదు డబ్బున్న వాడిదే సార్ ఈ పట్నం" అని కందస్వామి అన్న ముగింపు మాటలతో, లోకంలో అన్ని జాతులూ డబ్బున్న జాతి ముందు తీసి కట్టే అని నిరూపించాడు రచయిత. ఈ కథాకాలం కూడా 1948 అవటం చూస్తే శారద భాషా ప్రయుక్త

రాష్ట్రాల ఏర్పాటువల్ల ఉన్న సందేహాలు చాలా ముందుచూపుతో ఏర్పడినవే అని అర్థమవుతుంది ఇన్ని దశాబ్దాల తర్వాత, మళ్ళీ ఊపిరి పోసుకుంటున్న 'ప్రత్యేక తెలంగాణా' ఉద్యమ నేపథ్యంలో ఈ కథల్ని మళ్ళీ చర్చించవలసినంత 'వర్తమానత'ను అప్పటికే ఈ కథల్లో సృష్టించాడు రచయిత

శారద కథా వస్తువుల్ని పరిశీలిస్తే వాటిని (కేవలం సౌలభ్యం కోసం) ఈ కింది రకాలుగా వర్గీకరించవచ్చు

స్త్రీవాద కథలు :

ఎప్పుడో అర్థశతాబ్ది క్రితం శారద రాసిన కథల్ని ఇప్పటి స్త్రీవాద ధోరణిలోకి చేర్చటమేమిటన్న సందేహాల్ని వాయిదా వేసి మరలా చక్రం, గొప్పవాడి భార్య, వింత ప్రకృతి, రక్త స్పర్శ, పరిశోధన కథల్ని పరిశీలిస్తే శారద తన కలం కన్నా ఎంతో ముందుకు పోయి, స్త్రీవేదన, సంవేదనల్ని పట్టించుకొన్నాడనీ, స్త్రీ స్వేచ్ఛని నిర్ద్వంద్వంగా సమర్థించాడనీ అర్థమవుతుంది.

మరలో చక్రం కథలోని స్త్రీకి తండ్రి, అన్న, భర్త తమ తమ ఆదర్శ భావాలతో స్వేచ్ఛని ప్రసాదించామని అనుకొంటారు. తండ్రి 'సంస్కార' భావాలతో, అన్న 'కాంగ్రెస్' భావాలతో, భర్త కమ్యూనిస్ట్ భావాలతో ఆమెని తన కనుకూలమైన 'మరలో చక్రా'న్ని చేయబోతారు ఈ బందిఖానాలనుంచి బయటపడిన ఆమె 'తన అవసరాన్ని గుర్తించిన', 'తనకంటే భయం కూడా ఉన్న' ఒక హోటలతనితో కలిసి బతకటం ప్రారంభిస్తుంది "ఇప్పుడు నేను హాయిగానే ఉన్నాననాలి నన్నొక హోటలతను ఉంచుకున్నాడు సాధ్యమైనంత గౌరవంగానే చూస్తున్నాడు. అతనికి నేను అవసరం. అతనికేమీ ఆదర్శాలు లేవు. నేను వాటి వెనక తిరగక్కర్లేదు నన్నేమన్నా అంటే ఎటయినా పోతానేమో అన్న భయంతో నన్నేమీ అనకుండా ఊరుకుంటున్నాడతను" అని ధైర్యంగా ప్రకటిస్తుంది. స్త్రీ పురుషుల్ని కలిపి ఉంచేవి, 'ఆదర్శాలు కాదు పరస్పర నైసర్గికావసరాలు' అన్న సూచన ఈ కథలో కనిపిస్తుంది. స్త్రీ స్వేచ్ఛకోసం, ఇప్పుడు తెలుగు సాహిత్యం ద్వారా స్త్రీవాదులు చేస్తున్న ప్రయత్నాలకు నలభై ఏళ్ళ కితమే శారద రాసిన 'మరలో చక్రం' కథ బహుశా ఆరంభం కావచ్చు

'వింత ప్రకృతి' కథలో స్త్రీ సహజ లైంగిక సంవేదనని పట్టుకునే ప్రయత్నం చేశాడు శారద. ఒక వానరాత్రి తన చెంతకు చేరిన మొదటి భర్తతో "ఇది అవసరం. ఈ రాత్రి వొంటరితనం నాకు చాలా కష్టంగా ఉంది" అనేస్తుంది ఈ కథలోని ముఖ్యపాత్ర. రచయిత ఆ సంఘటననేమి ఆదర్శీకరించకుండా తన పాత్ర సంవేదన పట్ల సానుకూలంగా స్పందించటం ఈ కథలో కన్పిస్తుంది.

ఇక శారదకు ప్రాతినిధ్య కథ అనదగిన 'రక్త స్పర్శ'లోని అనసూయ ఏ ఆధారమూ లేని స్థితిలో, పసివాడైన తమ్ముడి భారాన్ని భుజాన వేసుకుని జీవిత ప్రవాహానికి ఎదురవుతుంది. అందుకు ఆమె అంటే గౌరవం ఉన్న ఒక వ్యాపారస్థుడు కూడా సహాయపడతాడు చివరాఖరికి జీవితంలో స్థిరపడిన తమ్ముడి తిరిగొచ్చి ఆమెకీ ఆ వ్యాపారస్థుడికీ ఉన్న 'అవినీతి'ని ప్రశ్నిస్తే అనసూయ ఊరుకోదు. "నేనేమీ నీలాగా ఎవరినీ ఆత్మహత్యల పాలు చేయలేదు.

మోసం చేయలేదు పై పంచె వేసుకొని, మర్యాదస్తుడిగా, గౌరవనీయుడిగా తిరిగే నీకు ఇవ్వాళ నేను పరువు తీసిన దాన్నైనాను కదూ'' అంటుంది తెగతెంపులు చేసుకొని తమ్ముడు వెళ్ళిపోతుంటే ఆమె పిచ్చిదానిలా నిలబడి దుఃఖిస్తుంది ''రక్త స్పర్శ ఎక్కడికి పోతుంది?'' అని కథని ముగిస్తాడు రచయిత స్త్రీకి మాత్రమే తెలిసిన పేగుబంధాన్ని, 'రక్త స్పర్శ'నూ ఈ కథలో ఎంతో ఆర్ద్రంగా చిత్రించాడు శారద

ఈ కథల్లోని స్త్రీలపట్లా, బాధితుల పట్లా, తన సానుభూతినీ ప్రేమనూ అంతే నేర్పుగా పాఠకుడికి కూడా కలిగేట్లు చిత్రించాడు శారద. శారద కథలలోని స్త్రీలు పడి ఉండే స్త్రీలు కాదు ప్రశ్నించే, నిలబడే సాహసం ఉన్నవాళ్ళు. 'స్వార్థపరుడు' కథలో అవిటితనంతో బాధపడే పద్మ తన ఆస్తిని కబళించబోయిన భర్తను ఎదిరిస్తే అతడు 'దీనికొక్కటే ప్రతీకారం, ఈ కుంటిముండని వది లెయ్యటమే' అని నిర్ణయించుకుంటాడు. అయితే 'ఆమె మాట్లాడకుండా ఊరుకుంది అతడనుకున్నట్లు ఆమె అతడి కాళ్ళమీద పడలేదు. అప్పుడే కాదు - ఆమె జీవితాంతం వరకు అతని కోసం ఏ బాధా పడలేదు' అని రాయటంతో ఆగకుండా - అసలామె భర్త పాదాలమీద పడెయ్యటం సంభవిస్తే ఈ కథ రాయటం అనవసరం అని రచయితగా తన దృక్పథాన్ని ప్రకటించాడు శారద

అందరిలా అన్నం తినటం మామూలు పనిగనక నువ్వుల నూనె, నారిజం తొక్కల రసమూ అలవాటు చేసుకున్న గొప్పవాడు తన భార్యను 'పతీ అనుసరణీయ' గా మార్చి ఆమె జిహ్వనూ, ఆత్మనూ చంపి చివరకు ఆమెను ఆత్మహత్యకు గురి చేస్తాడు. ఆమె సమాధిని గొప్పగా కట్టించి పత్రికల్లో కూడా గొప్పగా ప్రకటిస్తాడు - 'గొప్పవాడి భార్య' కథలో. స్త్రీ హృదయం లోతులు తీసేందుకూ, అమూలాగ్ర పరిశోధన చేసేందుకూ లేబరేటరీ కట్టిన పరిశోధకుడ్ని ముప్పతిప్పలు పెడుతుంది స్త్రీ హృదయం అతడు చేసిన అన్ని నిర్ధారణల్ని పరిహసించి, తిరస్కరించి, ''అసలు నువ్వు నా గురించేమి శ్రమపడక్కర్లేదు'' అని ఛాలెంజ్ కూడా చేస్తుంది 'పరిశోధన' కథలో. అలాంటి ఆత్మస్థైర్యాన్ని, వ్యక్తిత్వాన్ని తను అన్ని స్త్రీ పాత్రలలో ప్రవేశపెట్టాడు శారద. ఆ రకంగా ఈ కథలన్నీ ఇప్పటికీ చర్చించదగినవీ, ఆలోచింప దగినవీ అవుతున్నాయి

రాజకీయ కథలు :

దేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న తొలినాళ్ళలోనే అప్పటి సమకాలీన రాజకీయ భావనలయిన స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, దేశభక్తిలను తనదైన వ్యంగ్య శైలిలో తీవ్రంగా అపహాస్యం చేశాడు శారద. దీనికి ఉదాహరణగా క్షణంలో సగం, స్వాతంత్ర్య స్వరూపం, దేశమును ప్రేమించుమన్నా, సంస్కరణ వంటి కథల్ని చెప్పవచ్చు ఈ దేశ ప్రజలు కష్టార్జితమైన స్వాతంత్ర్యం తిన్నగా దోపిడీకి పొంచికూచున్న శిష్టవర్గాల చేతుల్లోకే పోయిందన్న సూచన 'క్షణంలో సగం' కథలో కన్పిస్తుంది స్వాతంత్ర్యం వచ్చిందని ప్రజలంతా సంబర పడుతున్న తొలి క్షణాల్లోనే ''కొంత పెట్టుబడి పెట్టి 'ప్రజాసేవ' చేశావు అంటే నీ రూపాయి

రెండు రూపాయలై తిరిగి వస్తుంది పైపెచ్చు ఎంతో కీర్తి కూడానూ" అని ఈ శిష్టవర్గం గుర్తించింది ఈ విషయాన్నే ఆ కథలో ఎంతో చమత్కారంగా రెండుపాత్రలతో ఇలా చెప్పించాడు శారద

"మన ప్రభుత్వం మన ప్రజాస్వామిక సిద్ధాంతాల్ని గురించి లక్షల టన్నుల పుస్తకాలు అచ్చేయిస్తోంది కదా! మరి యెన్నడైనా ప్రజలకోసం ఏమైనా చేసిన పాపాన పోయిందా?"

"మంచి ప్రశ్న! మనది ప్రజాస్వామిక 'పరతంత్ర' వ్యవస్థ. వోటర్లు వోటర్లు ఎలక్షన్లప్పుడు స్వతంత్రులూ, తర్వాత పరతంత్రులున్నూ!"

ఈ పద్ధతిలోనే స్వాతంత్ర్యానంతరం వెల్లివిరిసిన సంస్కరణోద్యమాలను కూడా అపహాస్యం చేశాడు శారద 'సంస్కరణ' కథలో రోడ్డు మీద ఎదురయినా సామాన్యుణ్ణి కూచోబెట్టి హరిజనులకు దేవాలయ ప్రవేశం అవసరాన్నీ, స్త్రీ జాతి ఉద్ధరణ అవశ్యకతనీ బోధిస్తాడు సంస్కర్త పాతికేళ్ళకు పైగా దేవుణ్ణి పూజిస్తున్నా తనకేమీ ఊడిపడలేదనీ ఇప్పుడు వాళ్ళకి మాత్రం ఏం వొరుగు తుందనీ ప్రశ్నిస్తాడు సామాన్యుడు పైగా "అణగారిన వాళ్ళకు అన్నం పెట్టించాలి, చదువులు చెప్పించాలి గానీ, దేవాలయ ప్రవేశం ఎందుకు? ఉన్న మతి పోవటానికి?" అని అడుగుతాడు సామాన్యులు బతికే ఉపాయం, దరిద్రం వదిలే మార్గం ఈ సంస్కరణల్లో ఉండవన్న నిర్ధారణ కొస్తాడు

ఈ కథలు రెండూ ఒకెత్తయితే 1948లోనే స్వాతంత్ర్యం తీసుకొన్న, తీసుకో బోతున్న రూపాన్ని, "స్వాతంత్ర్య స్వరూపం" కథలో మరింత నగ్నంగా బట్ట బయలు చేశాడు శారద నానా అవస్థలు పడి స్వాతంత్ర్యాన్ని సంపాయించుకొన్న ఒక పిల్లదేశం అందుకు గుర్తుగా ఒక విగ్రహాన్ని ప్రతిష్టించాలని తలిచి దాన్ని చెక్కేపని ఒక శిల్పికి అప్పజెబుతుంది తమ పోరాటాల చరిత్రకు గుర్తుగా ఒక మహావీరుడి విగ్రహాన్ని చెక్కమని తీర్మానం చేస్తుంది అయితే పరాయిదేశం డబ్బు స్వాములతో 'గుసగుసలూ వికవికలూ' చేసి అధికారం హస్తగతం చేసుకున్న ఈ దేశస్వాములు మహావీరుడి విగ్రహం ప్రజలకి 'అల్లరీ ఆగం' బోధించకూడదనీ విధేయత నేర్పే సన్యాసిలాగా ఉండాలని శిల్పిని 'ఆజ్ఞాపించారు' శిల్పి 'చిత్తం' అని అంతవరకు చెక్కిన విగ్రహాన్ని ఆపుచేసి, దాన్ని సన్యాసి రూపంలో మలుస్తాడు అధికారంలో ఉన్న మరికొందరు స్వాములు ఆ విగ్రహం 'వ్యాపారస్థుడ్ని' ప్రతిబింబించాలనీ, ఇంకొందరు 'సైనికుడ్ని' ప్రతిబింబించాలనీ 'హుకుం' జారీ చేస్తారు. అందర్నీ సంతృప్తిపరుస్తూ ఆ శిల్పి స్వాతంత్ర్య విగ్రహాన్ని పూర్తి చేస్తారు ఆ దేశాధ్యక్షుడు ఓ సుముహూర్తాన ఆ విగ్రహం పైన మొహమల్ గుడ్డను తొలగించగానే 'స్వాతంత్ర్య విగ్రహం ఆధునిక ఆయుధాలతో సాక్షాత్కారించింది. భయంకరమైన దయ్యం రూపంలో' 'ఇప్పుడా దెయ్యం తన ఆయుధాలను ఆంధ్రదేశంలో కరీంనగర్ నుంచి బషీర్‌బాగ్‌వరకూ రాయలసీమ నుంచి విజయవాడ వరకూ, చివరకు శారద అప్పుడు నివసించిన ఇప్పటి తెనాలి వరకూ సాచి - స్వాతంత్ర్యం అంటూ 'రాజ్యహింస' అన్న విషయాన్ని నిస్సిగ్గుగా ప్రకటిస్తున్న వర్తమానంలో - స్వాతంత్ర్యం వచ్చిన ఏడాదికే, 1948లోనే ఈ కథ రాసిన శారద తప్పకుండా గొప్ప దార్శనికుడై ఉండాలి

ఉద్యమ కథలు.

తెలంగాణా సాయుధ పోరాటాన్ని సమర్ధిస్తూ, నైజాం రజాకార్ల ఘాతుకాల్ని ఖండిస్తూ తన కాలంనాటి ప్రజల ఆకాంక్షలను ప్రతిఫలించే కథలను కూడా రచించాడు శారద 'కొత్తవార్త' కథ ఊరంతా ఏకమై రజాకార్లను మట్టి కరిపిస్తే, వారిలో ఉన్న సామాన్య సైనికులు తమ సర్దార్‌ను మట్టి కరిపించి ప్రజల్లో కలిసిపోవటంతో ఆశావహంగా ముగుస్తుంది 'గెరిల్లా గోవిందు' కూడా ఒక సామాన్య రైతే అయినప్పటికీ తన గెరిల్లా యుద్ధ తంత్రంతో ప్రజలకే కాక నైజాం సైన్యానికి కూడా ఆరాధించదగిన వాడవుతాడు గెరిల్లా గోవిందు కథలో ఈ రెండు కథల్లోని సామూహిక చైతన్యాన్ని, సాహసిక పోరాటాన్ని చైనా వరకు తీసుకెళ్ళి అక్కడి ఎర్రసైన్యానికీ, ప్రభుత్వసైన్యాలకీ జరిగే యుద్ధాన్ని కూడా చిత్రీకరించాడు 'ఆదర్శాల చిమ్మ చీకటి' కథలో

ఫాంటసీ కథలు:

శారద రచనలన్నింటిలోనూ కొట్టవచ్చేట్టు కనబడే ప్రక్రియ 'ఫాంటసీ' కథనం తనలోని బలీయమైన ఆకాంక్షలనూ, ఆదర్శాలనూ చిత్రీకరించటానికి వాస్తవికతా భూమిక సరిపోని సందర్భంలో కాల్పనిక వాతావరణాన్ని సృష్టించి మలిచిన కథలు వింతలోకం, ఎగిరే పళ్ళెం, కోరికలే గుర్రాలయితే, కౌముది

నిరంతర ఘర్షణలతో, మార్కెట్ యుద్ధాలతో, పరస్పరహరణోద్యోగంలో మునిగి ఉన్న మానవజాతికి మనుష్యులు ఇంకోలాగా కూడా జీవించవచ్చనీ, 'లోహపు బిళ్ళల'కోసం 'లోహపు ముద్దలకోసంకాక ఒకరి కోసం కూడా ఒకరు బతకవచ్చనీ, ఫ్లైయింగ్ సాసర్ లోంచి దిగిన అంగారకులు వివరిస్తారు 'ఎగిరేపళ్ళెం' కథలో. అసలు మానవుడు సృష్టించే ప్రకృతి విధ్వంసం వల్ల మానవజాతే నాశనమవుతోందని అకాల మరణాలూ, రోగాలూ ఎరగని అంగారకుల ద్వారా 'పర్యావరణ స్పృహ' కూడా ప్రదర్శిస్తాడు శారద 'మిమ్మల్ని మీరు ప్రేమించుకోండి 'నాది' అన్న వ్యక్తిభావం, దాచుకోవటం మానేసి ప్రేమ-సాంఘిక సమిష్టిభావం అలవర్చుకోండి' అన్న సందేశం శారదదే అని వేరుగా చెప్పనవసరం లేదు

ఇక ఫాంటసీని శిఖరాగ్ర స్థాయికి తీసుకు వెళ్ళిన కథ 'వింతలోకం'. సూర్యుడికి కొన్ని కోట్ల మైళ్ళ దూరంలో కలిగిన ఒక చిన్నమార్పు వల్ల సమస్త భూగోళం మళ్ళీ 'హిమయుగం'లోకి ప్రవేశిస్తుంది. చరాచర ప్రపంచం అల్లకల్లోల మవుతుంటే "నువ్వేమిటి? నేనేమిటి? ఇల్లేమిటి? వాకిలేమిటి?", అన్న వైరాగ్యాన్ని ప్రదర్శించిన కథా నాయకుడు "అద్సరే గానీ వంటమాత్రం తొందరగా కానియ్యి" అని భార్యకి తన మామూలు ఫిలాసఫీ చెప్పి తన పురుష ప్రవృత్తిని ప్రదర్శించటాన్ని మర్చిపోకుండా చిత్రించాడు శారద. అలాగే 'ఉన్న మహారాజులు విమానాల్లో, రాకెట్లలో దూరప్రాచ్యంలోని ఏదో రహస్య ప్రదేశానికి వెళ్ళి పోతున్నారన్న' విషయమూ రచయిత మరచిపోడు అయితే ఎగిరే పళ్ళెంలో అంగారకులు బోధించిన నూతన వ్యవస్థను 'వింతలోకం'లో ప్రకృతి బీభత్సం తర్వాత నిర్మించేందుకు పూనుకొంటారు అన్ని దేశాల ప్రతినిధులుగా మిగిలిన

ఆరుగురు మనుష్యులు ఈ ప్రయత్నాని కవసరమయిన విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానాన్ని ఈ కథలో శారద ప్రతిభావంతంగా ప్రదర్శించాడు 'కథని చూపాలన్న' శారద సంకల్పానికి 'వింతలోకం' కథ తిరుగులేని ఉదాహరణగా నిలుస్తుంది

**కుహనా విలువలు.**

శారద కథలలో మరొక ముఖ్యమయిన అంశం కుహనా విలువల పట్ల, దిగజారుడుతనం పట్ల ఏహ్యాభావం పిరికిప్రియుడులో గోవిందరావు, సంస్కార హీనుడులో కృష్ణంరాజు, మర్యాదస్తుడిలో సుబ్బన్న, రక్త స్పర్శలో ప్రసాదరావు, గొప్పవాడి భార్యలో గొప్పవాడు పాత్రలలోని డొల్లతనాన్ని చీదరించుకున్నాడు శారద వీరందరినీ సృజించిన సంఘం మాత్రం తనకు ఎదురు తిరిగిన వాళ్ళను నీచంగా చిత్రించి, బాధపెట్టి, స్మశానంలో వాళ్ళ శవం తాలూకూ పొగ కన్పించే వరకూ సంతృప్తి పడకపోయినా, శ్రుతి మించినట్లయితే వాళ్ళనే తప్పక పొగడుతుందంటూ 'సంఘనీతిని' విమర్శించాడు శారద అయితే 'జీవితసారం' కథలో మాత్రం ఇంకా కోల్పోని మనిషితనమూ, డబ్బుకు కూడా లొంగని ధీరతమూ కలిగి జీవితసారంగా ఉంటాయని, ఉండాలని ఆశావహ దృక్పథాన్ని ప్రదర్శించాడు.

**క్షణంలో సగం:**

ఇతర రచనలన్నీ ఒక ఎత్తయితే 'క్షణంలో సగం' పేరుతో 1950 లలో తెలుగు స్వతంత్రలో ప్రతి పక్షమూ, శారద రాసిన ఈ రాజకీయ సామాజిక వ్యంగ్య రచనలు మరొక ఎత్తు 'అధివాస్తవిక వ్యంగ్య ప్రధానం' గా నడిచిన ఈ గల్పికలన్నీ ఆనాటి సామాజిక పరిణామాలపై శారద చెప్పిన రన్నింగ్ కామెంటరీ అనవచ్చు ఎన్నికలంటే 'ఏ ఏ పార్టీల్లో ఎన్నెన్ని గెలుపులున్నాయో, కొత్త పార్టీలు లేవటానికి ఎన్నెన్ని అవకాశాలున్నాయో తేల్చేముహూర్తం' అనీ, సోషలిజం అంటే 'ఎన్నికలప్పుడు ప్రతిపార్టీకీ ఎదుటి పార్టీ ఆశయాలే కనబడని ఒకతత్వ - విశేషం' అనీ చమత్కరించాడు శారద

స్థూలంగా చూస్తే వస్తువు ఎంపికలో ఎంతో విస్తృతినీ, శిల్పంలో మరింత వైవిధ్యాన్ని ప్రదర్శించాడు శారద తన రచనలన్నింటిలోనూ. ఈ లక్షణం వల్లే ఆయన పరిణతి సాధించిన కథకుడిగా, నవలాకారుడిగా, తత్వవేత్తగా, దార్శనికుడిగా కన్పిస్తాడు కథా నిర్వహణలో సునిశిత వ్యాఖ్యలూ, వ్యంగ్య ధోరణీ ఆయన ప్రత్యేకతలు కథకు పెట్టే పేరునుంచీ, చివరి వాక్యం వరకూ శారద చూపిన శ్రద్ధ ఆయనను ఉత్తమ స్థాయి కథకుడిగా తీర్చిదిద్దింది సర్వసాక్షి, ఉత్తమ పురుష, ఫాంటసీ కథనాలను సమర్థవంతంగా ఉప యోగించటంతో శారద కథలకు 'చదివించే లక్షణం' బాగా వచ్చింది అతి సాధారణ అంశాన్ని గూడా గొప్ప కథగా మలిచే శిల్పచాతుర్యాన్ని సాధించాడు శారద. (దీనికి అపవాదుగా 'రహస్యం' వంటి ఒకటి రెండు పేలవమయిన కథలు లేకపోలేదు)

శారద భావాలపై 'చలం', శిల్పంపై కొ కు. ప్రభావం కన్పిస్తుంది కానీ

చలం స్త్రీలకన్నా శారద స్త్రీలు నేలకు మరింత దగ్గరగా వుంటారు కొకు కథలలో కథకుడి ప్రమేయం కన్నా శారద కథలలో కథకుడి జోక్యం బాగా తక్కువ శారద ఇతివృత్తాలలోని కాలాన్నీ, ప్రాంతాన్నీ, ఆయన చిత్రించిన 'సోషల్ డైనమిక్స్'నూ పరిశీలిస్తే తెలుగు సాహితీ చరిత్రలో 'కొకు'కీ, రావిశాస్త్రికీ మధ్యన తెగిపోయిన ఒక ముఖ్యమైన లింకు 'శారద' అన్న విషయం అవగత మవుతుంది అలాగే తెలుగు సాహిత్య చరిత్రలో 'శ్రామికవర్గ రచయిత'ల తరానికి, తొలినాటి ప్రతినిధి శారద' అని కూడా ఏ సందేహమూ లేకుండా చెప్పవచ్చు అయితే ఇంత ముఖ్యమయిన రచయితనూ, ఆయన రచనలనూ ఇంతకాలం మర్చిపోవటం, తెలుగు సాహిత్య చరిత్రలో ఇంకా ఆయన తెరవెనుకే మిగిలిపోవటం తెలుగువాళ్ళు ఎంతో సిగ్గుపడాల్సిన విషయం



# ఐ.వి.యస్. అచ్యుతవల్లి

♦ డా॥ కె.బి. లక్ష్మి ♦

యుక్తవయసులోనే కలంపట్టి, తొలి రచనలు తిరిగి రాకుండా మంచి పత్రికల్లో అచ్చయి, తిరుగులేని 'నిశిత లేఖిని'గా లబ్ధ ప్రతిష్ఠురాలైన రచయిత్రి ఐ వి యస్ అచ్యుతవల్లి

తను నమ్మిన సిద్ధాంతాల్ని, రాద్ధాంతాల్ని - కుటుంబంలోను, సమాజంలోను, ఘర్షణతో కూడిన స్త్రీ పురుష సంబంధాల తీరు తెన్నులను - వ్యవస్థలోని అవ్యవస్థను నిర్భీతితో పాఠకుల ముందుంచి - ప్రగతిశీల దృక్పథంతో పరిణామశీల పాత్రలతో పదిహేనవ యేటనే రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టారు అచ్యుతవల్లి

సమకాలీన రచయిత్రుల మధ్య ముందు చూపున్న రచయిత్రిగా సున్నితమైన సెంటిమెంట్, వస్తువుకి సంబంధించిన సూక్ష్మాంశాల వ్యక్తీకరణ, ఆకర్షణీయమైన నిర్మాణ శిల్పం, సంభాషణల్లో, కథనంలో తొణికిసలాడే హాస్య చమత్కారాలు, సామాన్యమైన వ్యవహార పద్ధతికి భిన్నమైన, వేగవంతమైన శైలి అచ్యుతవల్లి ప్రత్యేకతలు.

జీవితమే ఆమె కథా వస్తువు సమాజానికి కావల్సిన వస్తువుని దార్శనికతతో అందించి కాలానికి నిలబడిన రచయిత్రి స్వతంత్ర ప్రతిపత్తి, స్వాభిమానాల కలయికే ఆమె పాత్రల స్వభావం అచ్యుతవల్లి కథల్లో వాస్తవికత స్పష్టంగా కనిపిస్తుంది ప్రకృతిలోని ప్రతి దృశ్యం, సంఘటన కథా వస్తువుగా ఒదిగిపోతుంది చెప్పాలంటే సమాజంలోని వ్యథలే అచ్యుతవల్లి కథలు. మధ్యతరగతి పాత్రలు, నిమ్నజాతి జీవన రూపాలు రచయిత్రి వాస్తవిక దృష్టికి అద్దం పడతాయి సాధారణ మధ్యతరగతి, దిగువతరగతికి చెందిన పాత్రలు అత్యంత వాస్తవికతతో ప్రవర్తించడం అచ్యుతవల్లి కథనశైలి ప్రత్యేకత మానవ సంబంధాలు ప్రాతిపదికగా అభ్యుదయ, విప్లవభావాలను పరిప్లవించే అచ్యుతవల్లి పాత్రలు ఎప్పుడూ నేల విడిచి సాము చేయలేదు కథ చెప్పే విధానం గొప్పది ఆమె కథా కథనం పాఠకుణ్ణి ఆఖరిపేజీదాకా తీసుకెళ్తుంది, ఆలోచింప జేస్తుంది

ఆధునిక రచయిత్రుల్లో తనదైన ప్రత్యేక కంఠస్వరం, దృష్టికోణం కలిగిన ఐ.వి యస్ అచ్యుతవల్లి జీవితం, సాహిత్య జీవిత రేఖలు, కథన రీతుల పరిచయానికి వస్తే -

స్త్రీ అభ్యుదయం, సమానత్వం అన్న పదాలకు అర్థం ఆమె మాటల్లోనే "పురుషాధిక్యతకు వ్యతిరేకంగా పోరాడడమేగాని, పురుషులకే వ్యతిరేకం, వాళ్ళంటే ద్వేషం కాదు, స్త్రీ పురుషులు పరస్పరం సహకరించుకోవడం వల్ల

బతుకులో ప్రేమ, శక్తి, ఆనందం కలుగుతాయి అలాగే స్త్రీ స్వేచ్ఛ అంటే పురుషులతో తెగతెంపులు చేసుకోవడం కాదు, రాజీపడిపోయే అవసరం రానివ్వని పరస్పర వ్యక్తిత్వాల అవగాహన'' అని చెబుతూ పేదా గొప్పా, చిన్నా పెద్దా తేడాలేని సమన్యాయమే సామాజిక న్యాయం అని స్పష్టం చేయడం అచ్యుతవల్లి కథల ఇతివృత్తాల సారాంశం

సమాజపు చీకటి నీడల్లో దాగిన మనోవేదనల్ని ఎలాంటి 'వాద' ముద్రలు లేకుండా మానవతా దృక్కోణంలోంచి పరిశీలించి నిజమైన విలువలకు దర్పణం పట్టిన కథలు, నవలలు, వ్యాసాలు, నాటికలు, కాలమ్స్ తదితర ప్రక్రియల్లో తనదైన బాణీ గల బహుముఖ ప్రజ్ఞాశాలి అచ్యుతవల్లి తన రచనా కాలంనాటి సాంఘిక, ఆర్థిక, సామాజిక దృక్పథాలు రచనల్లో విస్ఫుటింప చేసిన అగ్రశ్రేణి రచయిత్రి

ఐ.వి.యస్ అచ్యుతవల్లి పూర్తి పేరు ఇరంగంటి వెంకట శేష అచ్యుతవల్లి పెళ్ళికాక ముందు కె.వి.యస్ అచ్యుతవల్లి పేరుతో, పెళ్ళయ్యాక కొన్ని రచనలు (భర్త రాఘవేంద్ర) 'రాఘవేంద్ర' అన్న కలం పేరుతో రాసేవారు

1943 మే నెల ఒకటవ తేదీ అచ్యుతవల్లి పుట్టిన రోజు. పుట్టిన ఊరు పశ్చిమ గోదావరి జిల్లా దొంతవరం ఆ గ్రామంలో పాఠశాల లేని కారణంగా అమ్మమ్మ తాతయ్యల దగ్గరవుండి పిఠాపురం రాజా హైస్కూల్లోనూ, తర్వాత కాకినాడలో చదివారు. ఆంధ్రా యూనివర్శిటీలో బి.ఎ. పట్టా పొందిన అచ్యుతవల్లి వివాహానంతరం ముప్ఫయి అయిదేళ్ళ వయస్సులో మైసూరు యూనివర్శిటీలో హిస్టరీ ప్రధానాంశంగా ఎం.ఏ చేశారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి విశారద, అలాగే డాక్టర్ అనంతశయనం అయ్యంగార్ అధ్యాపకత్వంలో సాగిన దక్షిణ భాషా ప్రచారం వారి సంస్కృత భాషను అధ్యయనం చేసి సమర్థ విశారద (బి.ఎ) చేశారు.

కేవలం డిగ్రీలు సంపాదించడం కాకుండా ఆయా భాషల్లో ప్రావీణ్యతను సాధికారతను కలిగి వుండడం, వాటిని సందర్భానుసారం తన రచనల్లో చొప్పించి మనోల్లాసం కలిగించడం ఆమె భాషాభిమానానికి నిదర్శనం. అచ్యుతవల్లి సంగీతజ్ఞత, లోకజ్ఞత, విషయ పరిజ్ఞానం, వ్యక్తిత్వ పరిశీలన ఆమె కథల్లో ఎడనెడ దర్శనమిస్తూ వుంటాయి.

అచ్యుతవల్లిని సాహితీ రంగం వైపు ఆకర్షితురాలిని చేసిన పరిస్థితుల్ని గమనిస్తే - ఆమె తాతగారు లాయరు. ఆంగ్లంలో రచనలు చేసేవారు ఇంట్లో అందరికీ సంగీత సాహిత్యాల్లో ఆసక్తి వుండేది. తల్లి అంజమ్మగారు భాషా ప్రవీణ, వయొలిన్ విద్వాంసురాలు. ఇంటికి జగతి, భారతి వంటి పత్రికలు వస్తుండేవి ఆడపిల్లల్ని చదివించడానికి, వ్యక్తిత్వ వికాసానికి అభ్యంతరాలు లేని కుటుంబం. అటువంటి స్వేచ్ఛాయుత వాతావరణంలో రచయిత్రి ఆలోచనలు వ్యక్తిత్వ పరిశీలన ముఖ్యాంశంగాసాగి సంస్కరణ ప్రియత్వం, సంప్రదాయ విలువల నేపథ్యంలో విప్లవాభ్యుదయ భావాలతో నిండి, నిజాయితీ, నిబద్ధతతో కూడిన సామాజిక స్పృహతో పురులు విప్పాయి.

విద్యావతి అయిన అచ్యుతవల్లి మంచి పాఠకురాలు కూడా అందుబాటులోకి వచ్చిన పత్రికలు, గ్రంథాలు విరివిగా చదవడంవలన తనకి కూడా "నేను రాయకూడదా?"అని ఆలోచన వచ్చింది దాంతో "కథలెలా రాయాలి?" అని ప్రమదావనం మాలతీ చందూర్‌ని అడిగితే "వెయ్యి కథలు చదివి ఒక కథ రాయాలని" సలహా లభించింది అప్పటికి అంతకన్నా ఎక్కువే కథలు చదివి వున్న అచ్యుతవల్లి 1958-59లో రాసిన తొలికథ 'వంచిత' ఎన్ ఆర్ చందూర్ సంపాదకత్వంలో వెలువడే 'జగతి' మాసపత్రికలో వచ్చింది 'అప్పట్లో ఆ కథకి ఐదు రూపాయల పారితోషికం పొందిన ఆనందం ఇప్పటికీ మరపురానిది' అంటారు ఆ రోజుల్ని తల్చుకుంటూ అచ్యుతవల్లి ఈ సందర్భంగానే పత్రికలు కొనితెచ్చి ఇచ్చి "నువ్వు ఇంతకన్నా మంచి కథలు రాయగలవు" అన్న మేనమామ లాయర్ రంగావారి ప్రోత్సాహం కూడా లభించింది

మొదటి కథ జగతిలో వచ్చినా, 'భారతి'లో వచ్చిన 'దీపకరాగం' కథ, కథకురాలిగా అచ్యుతవల్లికి మంచి పేరు తెచ్చింది. భారతి సంపాదకవర్గంలో వున్న పిలకా గణపతి శాస్త్రిగారు 'ఫలించని కలలు' అన్న తన కథ శీర్షికను 'దీపకరాగం'గా మారుస్తున్నానని, కథ బావుందని ఉత్తరం రాయడంతో 'ఈసారి కథకు పేరు మార్చలేనంత గొప్పగా రాయాలని పట్టుదల వచ్చిందన్న' అచ్యుతవల్లి ఆ మాట నిలబెట్టుకున్నారు . ఆ తర్వాత పుంఖానుపుంఖాలుగా వెలువడిన ఆమె సాహిత్యంలో శీర్షికా ఔచిత్యం, సౌందర్యం, హిందీ, ఇంగ్లీష్ టైటిల్స్‌తో సహా పాఠకుల్ని ఆకట్టుకుంది

కథా రచయిత్రిగా లబ్ద ప్రతిష్ఠురాలైన అచ్యుతవల్లి 400 కథలు రాశారు. ఆమె కథలు 'మూగవోయిన ప్రకృతి', 'అవ్యక్తాలు - మనస్తత్వాలు', 'బాత్ ఏక్ రాత్‌కీ', 'నాగావళి నవ్వింది', 'అచ్యుతవల్లి కథలు' ఇత్యాది సంపుటాలుగా వెలువడ్డాయి. అనేక కథాసంపుటాల్లో చోటుచేసుకున్నాయి

అచ్యుతవల్లి అనగానే సన్నాటా, ముత్యాల చెరువు, వర్షం వచ్చిన రోజు, అభిశంస, ప్రయాణం, ఇజ్జత్ కథలు ఠక్కున గుర్తొస్తాయి వర్షం వచ్చిన రోజు కథ 1967లో హిందీ, తదితర భాషల్లోకి ట్రాన్స్‌లేట్ అయింది దండమూడి మహీధర్ హిందీ అనువాదం 'బర్సాత్ కా ఏక్ దిన్' పేరుతో సారికా హిందీ పత్రికలో వచ్చింది. ఆపైన అచ్యుతవల్లి అనేక కథలు కన్నడ, తమిళం, హిందీ మొదలైన భారతీయ భాషల్లో అనువాదాలుగా వచ్చాయి

కుటుంబ జీవితం ఒడుదుడుకులు లేకుండా సాగాలంటే ఆర్థిక స్థితిగతులు, సామాజిక పరిస్థితులు కలిసిరావల్సిన ఆవశ్యకత ఎంతయినా వుంది. కానీ అనేక అనర్థాలకు, అస్తవ్యస్తాలకు కారణభూతమైన 'లేమి' జీవితాలతో, మనస్తత్వాలతో ఎలా చెడుగుడు ఆడుకుంటుందో చెప్పే కథ 'సన్నాటా'

పావురాళ్ళ గూళ్ళ వంటి పాతకట్టడం దగ్గరికి ఒకనాడు ఒక కారు వచ్చి ఆగుతుంది. ఆగూళ్ళల్లో వున్న పావురాళ్ళవి మానవ రూపాలే. ఆ కారుని చూడగానే వాళ్ళల్లో ఒక్కొక్కరికి ఒక్కొక్క భావం కలుగుతుంది డాక్టర్ వచ్చాడేమో అనుకుంటుంది రోగిష్టి సూరమ్మ. తను హీరోయిన్‌న్ని చేయడానికి సినిమావాళ్ళు

వచ్చారేమో! అనుకుంటుంది అరవై ఏళ్ళ ముసలివాడి మూడో పెళ్ళాం మాలిని, అకార్లోంచి పెళ్ళివారు దిగారేమో అనుకుంటుంది పాతికేళ్ళ కన్య సుబ్బులు, తీరా చూస్తే దిగినవాడు ఆ ఇంటి యజమాని ఆ పాత కట్టడాన్ని లాడ్జింగ్‌గా మార్చాలని అతని ప్లాను స్థూలంగా ఇదీ కథ యజమాని వచ్చేంతవరకూ హోరెత్తిన అందరి ఆలోచనలు అతని ప్లాను తెలిసేటప్పటికి ఒక్కసారిగా స్తబ్దమై పోతాయి ఓ పెద్ద గందరగోళం తర్వాత హఠాత్తుగా ఏర్పడిన నిశ్శబ్దానికి ప్రతీక సన్నాటా ఎంతో అర్థవంతమైన శీర్షిక, నిష్కృతి లేని జీవితాల మీద సమాజపరంగా విసిరిన సుతిమెత్తని సెటైర్

మానవ మనుగడలోని సామాజిక, అసమానతలకు అద్దం పట్టే కథ, 'వర్షం వచ్చిన రోజు' పెద్ద బంగళాలోని ధనిక దంపతులు సునంద, జయరాం - ఎదురుగా రోడ్డు పక్క గంగరావి చెట్టుకింద మొక్కజొన్నపొత్తులు కాల్చి అమ్ముకునే ఎల్లమ్మ - టీ అమ్మే అప్పిగాడు - ఓ వర్షం రోజునాటి నేపథ్యంలో ఈ నాలుగు పాత్రల మనస్తత్వ చిత్రణతో ఎన్నో సామాజిక వాస్తవాలను ఆవిష్కరించిన అద్భుత కథనం, సంభాషణా సహజత్వం ఆ కథకి ప్రత్యేక స్థానాన్ని సంపాదించి పెట్టాయి.

లేత జాజితీగలాంటి సునందను వరించి పెళ్ళి చేసుకున్న జయరాం ఆమె అనారోగ్యవంతురాలవగానే 'ఈమెతో జన్మంతా నిర్లిప్తంగా గడపాల్సిందేనా?' అనుకుంటాడు వర్షంరోజు కిటికీలోంచి ఎల్లమ్మ శ్రామిక సౌందర్యాన్ని చూసి మరింత పొగులుతుందతని హృదయం దాంతో భార్య గురించి 'ఎప్పుడూ ఏదేదో రోగం' ఇప్పుడిప్పుడు అనుమానరోగం కూడా పట్టుకుంది ఉదయాస్తమానం తన కెదురుగా కూర్చోమంటుంది. దాన్ని చూస్తూ కూర్చుంటే, దాని మాటలు వింటుంటే నాక్కూడా ఏదైనా రోగం పట్టుకుంటుందేమోనని భయం వేస్తోంది. ఈ మేడలూ, మిద్దెలూ వదిలి ఏ రిక్షాయేనా లాక్కుంటే నయం, ఇంటికెళ్ళే సరికి వాళ్ళ భార్యలు ఎంతో ఆదరంగా మాట్లాడతారు. పిల్లా జెల్లా దరికి చేరుతారు హాయిగా అప్పిగాడి దగ్గర ఓ టీ తాగి, ఎల్లి దగ్గర ఓ పొత్తి కొనుక్కుని, వాళ్ళతో పిచ్చి పిచ్చి కబుర్లతో కాలక్షేపం చేస్తారు బస్సొచ్చేదాకా. బస్సు వస్తే బేరాలు తగుల్తాయి వాళ్ళకి, అని తన జమిందారీ కంటే రిక్షాలాగడమే బెస్ట్ అనుకుంటాడు జయరాం.

"ఆ రోజుల్లో ప్రేమ ప్రేమ అని నాచుట్టూ తిరిగితే "ఊ" అన్నాను పాపం, ఆనందపురం యువరాజు నా కోసం పడిగాపులు పడ్డాడు. ఇప్పుడేం అనుకుంటే ఏం లాభం? నా ఖర్మ ఇలా రాసిపెట్టాకా" అనుకుంటుంది సునంద.

'మేడమీద అయ్యగారు పెట్టి పుట్టారు రత్నమాణిక్యాలు కట్నంగా ఇచ్చి అప్సరసలాంటి భార్య దొరికింది తను మూడు తులాల బంగారం పెడితేనే గాని పిల్ల దొరకదు. రెక్కాడితే గాని డొక్కాడని జీవితాలు' అని అప్పిగాడు బాధపడితే -

జయరాం కారు డ్రైవర్ ఈరాసామి సరస సంభాషణని తల్చుకుని మురిసి

పోతూ ఇంట్లో అప్రయోజనకరంగా ముసుగుతన్ని పడుకునే సూరీడు మమకారాన్నీ గుర్తు తెచ్చుకుంటుంది ఎల్లి

ఎవరికీ వున్న దాన్తో తృప్తిలేని తత్వాన్ని ఎంతో ఆర్ద్రంగా చెప్పే అంతరంగ కథనం పూసలహారంలోని దారం మొదటి పూసని, చివరి పూసని కలిపి ముడి వేసినట్లు కథ ఎత్తుగడ, ముగింపు కథకి ఎంత చక్కని సమాహారాన్ని ఇచ్చాయో అనిపిస్తుంది "వర్షం వచ్చిన రోజు" కథలోని తొలి, తుది వాక్యాలు చదువుతుంటే..

"ఛీ ఛీ వెధవ వర్షం, ఒకటే ఈదురు గాలీ, తుంపర, తెల్లవారిన దగ్గర్నించీ వెధవది చిరాకుగా" అనుకుంటూ మేడమీది కిటికీ గాజు తలుపులు తీసి కిటికీలో కూర్చున్నాడు జయరాం ఎదురుగా గంగరావి చెట్టుకింద పగిలిన కుండముక్క తిరగేసి, వూకతో నింపి మొక్కజొన్న పొత్తులు కాలుస్తూ, నిప్పు వూదుకుంటూ కూర్చుంది ఎల్లమ్మ "అన్నవి కథ ప్రారంభ వాక్యాలు

"తను ఏనాటికైనా వాళ్ళల్లా బ్రతగ్గలదా? తననీ పాడు రోగాలు వదిలిపోతాయా?" అప్రయత్నంగా కంటనీరు తిరిగింది ఆ కన్నీళ్ళు చేత్తో తుడుచుకోవడానికి కూడా ఓపిక లేనట్లుగా కూర్చుంది సునంద చెంపల మీదుగా ధారాపాతంగా కారుతున్న కన్నీళ్ళను చూడలేని గంగరావి చెట్టు ఆకులు గలగల్లాడాయ్ ఆకుల చివర్లనుండి వర్షపునీళ్ళు జలాజలా రాలాయ్" అన్న వాక్యంతో కథ ముగుస్తుంది

జీవితానుభవాలనుండి కథా వస్తువుల్ని ఎన్నుకోవడం అచ్యుతవల్లి కథా సరళి ప్రత్యేకత. చిన్నతనంలో తను కళ్ళారా చూసిన వర్గభేదం, తాననుభవించిన తరతమ భేదాలు, వయసు పెరుగుతున్న కొద్దీ అర్థమవుతూ వచ్చిన సామాజిక ధోరణులు ఆమెను తీవ్ర ఆవేదనకు గురి చేశాయి. ఆలోచింప చేశాయి. సంప్రదాయ బ్రాహ్మణ వైష్ణవ కుటుంబంలో పుట్టినా, నిమ్నవర్గ పక్షపాతంతో మంచి కథలు రాసేలా పురికొల్పాయి మిగతా అనేక కథల్లో వాటి ప్రస్తావన వున్నా, వస్తురీత్యా ప్రాధాన్యతను సంతరించుకున్నవి 'ముత్యాల చెరువు', 'గోడకు కొట్టిన బంతి'.

దళిత స్త్రీ సమస్యను వ్యక్తం చేసిన కథ 'ముత్యాల చెరువు'. ఇందులోని కథానాయిక ముత్యాలు, ఆర్థిక, శ్రామిక దోపిడీకి గురవుతున్న దళిత స్త్రీ లెందరికో ప్రతీక.

అగ్రకులం, నిమ్నకులం అనేవి రెండు విభిన్న భావ కేంద్రాలకు రెండు విభిన్న సంకేతాలు. అయితే భిన్నత్వంలో ఏకత్వం చూపించేందుకు ప్రయత్నిస్తూ, అభ్యుదయ భావాలతో సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించడం ఎలాగో తెలియజెప్పే కథ ఇది

ఒక పాలేరు కూతురికి, ఓ భూకామందుగారమ్మాయికి మధ్య స్నేహం, పల్లెటూళ్ళో ఆచారాలు, సెంటిమెంట్లు, విద్యావంతుల వివేకం, ప్రకృతి అందాలు, ప్రవృత్తి బంధాలు, కట్టుబాట్లను, కార్పణ్యాలను కరుణరస ప్లావితంగా ఆలోచనాస్ఫోరకంగా అందించిన కథ, కథనం

పట్నంలో చదువుకుంటున్న బ్రాహ్మణ కామందు కూతురు చిట్టి, పల్లెని క్షుణ్ణంగా చదివిన పాలేరు కూతురు ముత్యం ఇద్దరి మధ్యా అలవికాని స్నేహం తల్లీ, అత్త, నానమ్మా తిడుతున్నా శెలవులకి వచ్చినప్పుడల్లా ముత్యంతో చెరువు గట్టున తిరగడం మానదు. ప్రకృతినుండి పాఠాలు నేర్చుకున్న ముత్యం తనకన్నా గొప్పదని చిట్టి భావన

ముత్యాలు వాళ్ళ కులంవాడు సీతయ్యని ప్రేమించినా, అతగాడి కుటుంబం కిరస్తానీ మతం తీసుకున్న కారణాన ముత్యాల్ని సీతయ్య కిచ్చి పెళ్లి చెయ్యనంటాడు తండ్రి. మతం మార్చుకుని ఉద్యోగంకోసం పట్టణం వెళ్ళిపోయిన సీతయ్యను కాదని ఇంకెవర్నీ మనువాడనంటుంది ముత్యాలు వాళ్లల్లో వాళ్లకే కులమత భేదాలు.

కామందు తక్కువ కూలికి పనిచేయమనడం, ఎక్కువ కూలి డబ్బులకి పక్క వూరికి పనికిపోతే వచ్చాకా సాధించడం, బెదిరించడం - కమతగాళ్లకి తక్కువ తిండి గింజలు కొలవడం, గొడ్డు చాకిరీ చేయించుకోవడం, దొరతనాన్ని చెలాయించడం, నిమ్నవర్గాలపట్ల సింహస్వప్నంగా మారే పరిస్థితుల సహజ వర్ణన, రచయిత్రి నిమ్నవర్గ పక్షపాతాల్ని తెలియజేస్తాయి

చిట్టి తండ్రి చదువుకున్న ఆమె మాటల్ని ఖాతరు చేయడు. శ్రుతి మించితే విన్నట్లు నటించి చేసేది చేస్తుంటాడు. భగ్న ప్రేమికురాలైన ముత్యాలు ఊరి తామర చెరువులో పడి మరణిస్తుంది. ఈత వచ్చినా ప్రాణ రక్షణ చేసుకోదు. ఆ తర్వాత శెలవులకి వచ్చిన చిట్టి సంగతి తెల్సి దుఃఖితురాలై దానికి ముత్యాల చెరువు అని పేరు పెడుతుంది అప్పటిదాకా కాసిని పూలే పూసే చెరువు మంచి మనసున్న ముత్యాల్ని కడుపులో దాచుకోవడం వల్ల చెరువులో తామరలు విరగబూస్తాయి. ప్రతి పువ్వూముత్యంలా తనని పలకరిస్తున్నట్లు ఫీలవుతుంది చిట్టి. అంత స్నేహంలోనూ "నిన్నో పాలి ముట్టు కోవచ్చా?" అని "దాందేముంది" అనగానే అలా ముట్టుకొని ఇలా చటుక్కున చెయ్యి తీసేసుకునే ముత్యాలు గుర్తొచ్చి అంతా మనుష్యులమయినా మనుగడలో ఎంత వ్యత్యాసం అని బాధపడుతుంది.

మూడుగంటల చలనచిత్రం చూసిన భావన కలుగుతుంది, ఈ చిన్న కథ 'ముత్యాల చెరువు' చదివితే. పశ్చిమగోదావరి జిల్లా యాసతో ముత్యం మాటలు ముచ్చట గొలుపుతాయి. అవసరానికి అనుగుణంగా, పాత్రోచితంగా మాండలికం వాడుకునే రచయిత్రి నేర్పు ఎన్నదగినది.

ఈనాటి దళితవాద నేపథ్యంలో అసలు ఎవరికయినా కావల్సిందేమిటి? బతుకు సారాన్ని, జీవిత విలువల్ని, మానవ సంబంధాల్ని అతి సున్నితంగా చెబుతూ, అభ్యుదయం నేర్పే అందమైన కథ ముత్యాల చెరువు.

ఈ కథ గురించి 1999 మార్చిలో Challenges before Women in the 21st Century అన్న అంశం మీద తిరుపతిలో జరిగిన జాతీయ సెమినార్‌లో సమర్పించిన ఒక పరిశోధనా వ్యాసంలో ప్రత్యేకంగా విశ్లేషించడం గమనార్హం. హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక కోసం 1910 నుంచి 1998 వరకు

సేకరించిన కథల్ని ఐదు సంకలనాల్లో పొందుపరిస్తే, వాటిల్లో మొత్తం కథలు 118 అయితే అందులో స్త్రీలు రచించినవి 7 మాత్రమే అంటే 88 ఏళ్లకు 118 కథలు ప్రచురితమైతే రచయిత్రుల ప్రాతినిధ్యం 88 ఏళ్లకు 7 మాత్రమే అయితే వాటిలో ట్రీట్‌మెంట్‌కు నిలబడినవి ఐదు ఐదింట్లో ఐ.వి.యస్ అచ్యుతవల్లి ముత్యాల చెరువు ఒకటి

పనివాళ్లల్లో ఒక్కరికి సాయం చేస్తే మిగతా వాళ్లకి కూడా అచ్చం అలాగే జరగాలని ఒక కట్టుగా ఆశించే అమాయకత్వాన్ని, ఆశని కరుణార్ద్రంగా చెప్పిన కథ 'గోడకు కొట్టిన బంతి' ఊహించని కొసమెరుపు నవ్విస్తూనే కంటతడి పెట్టిస్తుంది

భార్యాభర్తల సంబంధాలు, స్త్రీ పురుష సంబంధాలు, పరస్త్రీ కోసం తన తల్లిని, తనని వదిలేసి ఒక్కనాడైనా చూడ్డానికి రాని తండ్రిపట్ల ఎదిగిన కూతురి కుండే ఫీలింగ్స్, తనకి కాబోయే భార్య మనసు నెరిగి ఎలా అనువర్తకుడుగా వుండాలో గ్రహించే యువకుని భావాలు ఎంతో సూటిగా, పారదర్శకంగా, ప్రస్ఫుటంగా కథలు అనేకం రాశారు అచ్యుతవల్లి. అందులో 'అభిశంస' ఎన్నదగిన కథ 1988 నాటి ఈ కథలోని దయావతి ఆధునిక స్త్రీకి అచ్చమయిన ఉదాహరణ.

"మా కన్నీ మానాన్నే కొంటారు మీ నాన్నేం చచ్చిపోలేదు. మిమ్మల్ని వదిలేశాడు" అని స్కూల్లో తోటి పిల్లలు వెక్కిరించినప్పటి అవమానం, తాతయ్య తన ఫొటో తీసికెళ్ళి "ఇది నీ కూతురు, ఒక్కసారి వచ్చి చూసి పసిపిల్లకు ఆనందం కలిగించమని" బతిమాలితే తిరస్కరించినప్పటి వేదనని అనుభవించిన దయావతి తన పెళ్లిపీటలమీద కన్యధారపోయడానికి వస్తానన్న తండ్రికి ఆ స్థానం ఇవ్వడాన్ని వ్యతిరేకిస్తుంది. 'ఇరవై ఏళ్ల తర్వాత భర్త పక్కన కూర్చునే అపురూప అవకాశం తల్లికి వస్తుందని' కాబోయే భర్త చెప్పినా కాదంటుంది. పెళ్లికి వస్తే అందరు అతిథుల్లా వచ్చి పోతాడుగానీ పితృస్థానం ఇవ్వడంలో అర్థం లేదంటుంది "హైందవ వివాహ ధర్మం, సెక్స్ కోరికలకు లైసెన్స్ అనుకుంటారు చాలామంది పురుషులు గృహస్థ ధర్మంలో ఎంత ఆనందం పొందవచ్చునో, ఎంత నిర్భయం, సంతృప్తి, ప్రశాంత జీవన మాధుర్యం అనుభవించ వచ్చునో చాలామందికి తెలియదు జీవితాన్ని సమస్యల వలయంలోకి నెట్టుకుంటారు" అని వివాహ ధర్మాన్ని గురించి చెబుతూ, "తానేం పోగొట్టుకున్నాడో ఆయనకి తెలియాలి పరాభవం అంటే మనస్తాపం, పరాయితనం అంటే ఏమిటో తెలిసి రావాలి. పెళ్లికి వచ్చినా పరాయి వ్యక్తిగానే వుండిపోవాలి" అంటుంది

స్వేచ్ఛగా, నిష్పూచీగా, హాయిగా చీకూచింతా లేకుండా గడపచ్చని భావించి సింగిల్ లైఫ్ సింద్రోమ్‌ను అభిలషించిన స్త్రీ పురుషులు దీర్ఘకాల ఏకాంత జీవనంలో వచ్చిన అనేకానేక విచిత్ర సమస్యలని జీవితాంతం తట్టుకోవడం అనవసరం అనిపించి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాలనుకున్న కథ 'జీవితానికో తోడు'. 1975 జ్యోతి దీపావళి సంచికలో వచ్చిన కథ అప్పట్లో పెద్ద సంచలనం.

కథలో ఒకానొక సందర్భంలో "జీవితంలో చివరి దశలో పెళ్ళి చేసుకున్నా సిగ్గుపడాల్సిన అవసరం లేదంటారా?" అన్న 36 ఏళ్ల కథానాయిక వనజ ప్రశ్నకు "సిగ్గెందుకు పడాలి? మనం బాల్య చాపల్యంవల్లకాని, ప్రేమ - వ్యామోహం వల్లగాని ఒక ఇంటి వాళ్లమవడం లేదు. జీవితంలో ఒకరికొకరు తోడుగా వుంటాం ఎవళ్ల ఆర్జన పట్ల వాళ్లకి పూర్తి స్వేచ్ఛ వుంటుంది ఒకరి ఇష్టాలను ఒకరం మనస్ఫూర్తిగా అంగీకరిస్తూ జీవితం చివరివరకూ కలిసి వుండడానికి ఒక ఒప్పందం మాత్రమే ఇందువల్ల మీ బంధుజాలం నుంచి, మా బంధుజాలం నుంచీ మనకు స్వేచ్ఛ లభిస్తుంది" అంటాడు జీవితంలో తోడుగా నిలబడబోయే వెంకట్రావ్

బద్ధకం, నిర్లక్ష్యం పుష్కలంగా వున్న భర్తతో మనలేక ఇద్దరు పిల్లల తల్లి అయినా స్వేచ్ఛా భావాలున్న అనసూయ వేగలేక, విసిగి వేశారి ఇల్లు వదిలి పోదామని రైల్వే స్టేషన్‌కు వస్తుంది అక్కడ తాగుబోతు తండ్రికి పట్టని, తల్లి వదిలేసిపోయిన పిల్లల్ని ఆదరించే పామరుల నుండి బతుకుకి సరైన అర్థం తెలుసుకుని ఇంటికి చేరుతుంది. కుటుంబ జీవితంలో భార్యభర్తల బాధ్యతను వర్ణించే ఈ కథ అనసూయ లాంటి వారినెందర్నో ట్రాన్స్, ట్రామాలనుండి బైటపడేసే సాహితీ వైద్యం చేస్తుంది 'వర్షించని మబ్బులు' కథ.

ఇలా స్త్రీ పురుష వ్యక్తిత్వ, మనస్తత్వాల పరిశీలన, తాదాత్మ్యత, తాత్వికత లకు విషయ విశ్లేషణ జతచేసి అచ్యుతవల్లి కథరాసే విధానం గొప్పది కొడుకుల్ని, కూతుళ్లని చక్కగా చదివించి, పెళ్లిళ్లు చేసి మంచి జీవితాన్ని ఇచ్చిన వృద్ధుడైన కన్నతండ్రి పట్ల వాళ్ల ధోరణిని, మనిషి బతుకుకి, చైతన్యానికి లేని విలువని ఆయన తదనంతరం ఇంట్లోని వస్తువులకిచ్చే వైనాన్ని -వృద్ధుడైన వీరభద్రయ్య కొడుకులకిచ్చిన ఆదర్శవంతమైన జీవన సందేశాన్ని అందించిన ఆల్ టైం కథ 'వెయిట్ ఫర్ ద టైం'

స్వతహాగా అచ్యుతవల్లికి పిరికితనం అబలత్వం అంటే నచ్చదు పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొని సమస్యల్ని పరిష్కరించుకోవాలి. లేదా తదనుగుణంగా తగిన జాగ్రత్తలు, నిర్ణయాలు తీసుకోవాలనేదే ఆమె కథల్లోని అంతస్సూత్రం. అందుకే కాబోలు ఆమె రచనల్లో స్త్రీ పాత్రలు సబలలుగానే వుంటాయి కథానుగుణంగా ఎక్కడైనా అబలలు వున్నా పక్కనే సబలలు కూడా వుంటారు. 'నాతి చరామి'లో పాఠాలు చెప్పే వివాహితుడైన సంస్కృతం మాష్టారి కాముకత్వాన్ని యుక్తిగా బహిర్గతం చేసిన జయప్రద, 'మూగబోయిన ప్రకృతి'లోని గ్రామీణ యువతి శంకరి 'అబల' కథలో ప్రేమను మించిన సుఖాలు, కోరికలు, లగ్జరీస్ కోసం అన్వేషిస్తూ మిసెస్ వినోద్ కుమార్‌గానో, మిసెస్ సంజయ్‌గానో మిథ్యాగౌరవంతో బతకడానికి ఇష్టపడని అచల, 'ఆజ్ అవుర్ కల్' కథలో సెన్సిటివ్‌గా వుంటూనే తోటివారి ప్రవర్తనా రీతుల్ని గమనిస్తూ తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్న బీదరాలు మధుర పాత్రలు ఈ కోవకు చెందినవే.

భర్త స్నేహితులు ఆడైనా, మగైనా భార్య విశాల హృదయంతో ఆదరించి, అతిథి మర్యాదలు చేయాలని ఆశిస్తారు. అదే భార్య స్నేహితుడు ఎంత సహృదయుడైనా సంకుచిత్వం వదులుకోలేక మాటలతో, చేతలతో ఆమె మనసు

గాయపరుస్తాడు భర్త' ఈ లోకరివాజుని ఎంతో హృద్యంగా చెప్పిన కథ 'సృష్టిలో చెల్లనిది'.

బాల్య స్నేహాలు, లలిత భావాలు, కుటుంబ అంతరాలు, కలవలేక విడిపోవడాలు . ఎవరికి వారైన ఎన్నో ఏళ్లకి పిల్లలకి పెళ్లీడు వచ్చేనాటికి ఓ రైలు ప్రయాణంలో అనుకోని కలయిక 'ప్రయాణం' కథ. హీరోయిన్ శంకరి గతాన్ని గుర్తు తెచ్చుకుంటూనే వర్తమానంలో "గతం తాలూకు తలపోతలు మనసుని అల్లకల్లోలపరిచి జీవితాన్ని శూన్యంలోకి తోస్తుంటాయి. ఎప్పటికప్పుడు జీవితాన్ని మరొక కోణంలోంచి అర్థం చేసుకుందుకు ఆలోచించాలి అప్పుడు నీకు శూన్యం కనబడదు ఆనందం, ఆశ, సుఖం ఎప్పుడూ నీ చుట్టూ వుంటాయి" అని తన చిన్ననాటి ప్రియనేస్తం సూరిపండు కూతుర్ని తన కోడలిగా చేసుకుంటుంది "రెండు కుటుంబాల మైత్రీ భావనకి పిల్లలు వంతెనల్లాంటి వారు" అని స్నేహానికి చక్కని నిర్వచనం ఇస్తుంది

'ఇజ్జత్' కథలోని సుమలత రాడికల్ ఫెమినిస్ట్ ధోరణిని కనబరుస్తూ, నిరంతరం స్త్రీ స్వేచ్ఛ గురించి మాట్లాడుతూ, మాటల్లో చేతల్లో స్వేచ్ఛా ప్రియత్వాన్ని వెల్లడిస్తూ వుంటుంది చివరికి మూడేళ్లు తన వెంట తిరిగి తనచేత 'నో' అనిపించుకున్న ప్రియుడు శేఖరం పెళ్లిలో పెళ్లి మంత్రాల అర్థం తెలుసుకుని తన జీవితానికి కొత్త దిశానిర్దేశం చేసుకోవాలని నిర్ణయించు కుంటుంది. బాధ్యత గల యువకుడిగా, నిజాయితీగల ప్రేమికుడిగా శేఖర్, స్నేహితుడిగా వెంకటప్ప పాత్రలు పురుష పాత్రల్లో ఆదర్శవంతమైనవి.

క్రమానుగత అభివృద్ధిగాక కలం పట్టిన తొలికథనుండీ ప్రతి కథా పదునుగా చెప్పడం విశేషం అపార వస్తు వైవిధ్యంతో అచ్యుతవల్లి వందల కొద్దీ కథలు రాశారు. కానీ ప్రస్తుతం వాటిలో చాలా కథలు అలభ్యాలు. కొన్ని కథా సంపుటాల్లో వేసుకున్నవి, కొన్ని విడిగా సంపుటాలుగా వేసినవి, మరికొన్ని వివిధ పత్రికల నుండి కత్తిరించి దాచినవి మాత్రమే మిగిలాయి. వాటిల్లో ఇంతకు ముందు ప్రస్తావించినవి గాక బాయ్ మీట్స్ గర్ల్, అహోరాగవతీ సంధ్యా, అందనిలోతులు, బాత్ ఏక్ రాత్‌కీ, నిదుర లేవని దేవుడా, గన్తవ్యం, నీడబారిన మొక్క, కృష్ణ సుందరి, శాంత, నీలి, సంకల్ప - వికల్పాలు, ఇంటిదీపం, మనస్తత్వాలు, ఆమె ఎవరు, లిల్లీ మామ, పుట్టుమచ్చ, కొసమెరుపు, ఆండాళ్లు - ఉల్లిపాయలు, ఆత్మబలి, స్వయంబద్ధ నిర్మల, ఇరుగు పొరుగు, మమత, మంగళాంబ, పరమేశం, అగ్ని, జయమాలిని, ఈతరం అమ్మాయి, ఉద్యోగస్థుడి భార్య, శ్రీమతి, జగపతి స్వగతం, ప్రియ, చిలక - జాంపండు, మెట్లు తదితర కథలెన్నో ఉన్నాయి

అచ్యుతవల్లి మరో ప్రత్యేకత తాను ప్రావీణ్యం సంపాదించిన సంస్కృత శ్లోకాలను కథానుగతంగా పాత్రలచేత చెప్పించడం, కథల్లో ఏం చెప్పాలన్నా పాత్రలే చెబుతాయి గానీ రచయిత్రి జోక్యం వుండదు.

కథల్లో అంతర్లీనంగా వుండే స్నేహం, కరుణ, ఆర్ద్రత, ఒక సామాజిక బాధ్యత, మానవ మనస్తత్వాలు, మనుగడ గురించిన 'అక్కర' కథల తత్వాన్ని రచయిత్రి వ్యక్తిత్వాన్ని తెలియజేస్తాయి

మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి, హైక్లాస్ సొసైటీ గురించి చెబుతూనే నిమ్నవర్గాల బతుకు చిత్రాలను కళ్లకు కడతారు అచ్యుతవల్లి స్త్రీల పక్షాన గట్టిగా నిలబడినట్లు అనిపించినా అదే కష్టస్థితిలో వున్న పురుషుల పక్షం వహించి వాదించిన కథలు కూడా వున్నాయి 'ప్రాచీనమైనవన్నీ ఆపేక్షించతగినవి కావు ఆధునికమైనవన్నీ ఉపేక్షించదగినవి కావు' అని ఆమె పాత్రల సంభాషణలు ప్రవర్తనలు చెబుతాయి.

అచ్యుతవల్లిని వరించి వచ్చిన అవార్డులు, పురస్కారాలు ఎన్నో వున్నాయి వాటిల్లో ముఖ్యమైనవి 1970లోనే మద్రాసు కేసరి కుటీరం వారి గృహలక్ష్మి స్వర్ణకంకణం, 1994 తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం, 1995 సుశీలా నారాయణరెడ్డి అవార్డ్, 2000 తె॥వి॥ ఉత్తమ రచయిత్రి విశిష్ట పురస్కారం, 2000 యువభారతి సాహితీ పురస్కారం, వివిధ పత్రికలు నిర్వహించిన పోటీలలోను, వివిధ సంస్థల ద్వారా ఎన్నో బహుమతులు, సన్మానాలు అందుకున్నారు

ఇదెక్కడి న్యాయం, సీతకలలు, కొడిగట్టిన దీపాలు, తీరం చేరిన కెరటం, భ్రమర గీతం, పుట్టిల్లు, కానుక, కోరిక, ఏకాంత మొదలయిన 19 నవలలు రాశారు

ఇదెక్కడి న్యాయం నవల సినిమాగా తమిళం, కన్నడ, హిందీలోకి వరసగా పెణన్ జన్మం, ఇదుయవ న్యాయం, ఏ క్యా ఇన్సాఫ్ పేర్లతో విడుదలై సూపర్ హిట్స్ అయ్యాయి 1977లో ఉత్తమ చలనచిత్ర కథగా, కథారచయిత్రిగా రాష్ట్ర ప్రభుత్వ అవార్డ్ నందుకున్నారు తమిళ వర్షన్, 'పెణన్ జన్మం'కు 1977లో మద్రాస్ లయన్స్ క్లబ్ వారిచే ఉత్తమ రచనా బహుమతి, ఇదే నవలకు సినీ హెరాల్డ్ వారి పోటీలో ఉత్తమ కథగా బహుమతి లభించాయి. పరిశీలనా దృష్టి, పరిపక్వభావాలు, అభ్యుదయ ఆలోచనలు, సామాజిక సమన్యాయం కోసం పోరాటం, నిబద్ధతలకు ఈ నవల గీటురాయిగా నిలుస్తుంది. అదేవిధంగా ఇతర నవలలు

అనేక రేడియో ప్రసంగాలు చేశారు రేడియో నాటకాలు రాశారు. పలువ్యాసాలు రాశారు రేడియోలోనే గాక స్టేజిమీద కూడా విజయవంతమైన అనేక నాటికల్లో గాలిల్లో, పునాది, ఆఫీసరు భార్య, తనదాకా వస్తే, అచ్చివచ్చిన చీర బహుళ జనాదరణ పొందాయి

అచ్యుతవల్లి సక్సెస్ ఫుల్ కాలమ్‌నిస్ట్ కూడా జయశ్రీ పత్రికలో 'ఇజ్జత్', 'ఆజ్ ఔర్ కల్', రచన మాసపత్రికలో 'బాతోంమే ఖూనీ' అచ్యుతవల్లి దీర్ఘకాలం నిర్వహించిన శీర్షికలు.

అన్వయ క్లిష్టతలేని సరళ సుందరమైన శైలి అచ్యుతవల్లిది. సరస సంభాషణా చతురురాలైన రచయిత్రి కథల్లోని సంభాషణా పరమైన సున్నితమైన హాస్య చమత్కారాలు ఆహ్లాద పరుస్తాయి బహుభాషా కోవిదురాలైన అచ్యుతవల్లి కథల్లో అన్యభాషా పదప్రయోగం తెలుగుతో సమానంగా ఇమిడిపోతుంది.

అచ్యుతవల్లి కథలు చదువుతుంటే వ్యక్తిత్వ వికాస ధోరణి పాఠకుల్ని ఆలోచింప చేస్తుంది ఎడ్యుకేట్ అవుతారు పాత్రలు, సన్నివేశాలు ఎంత సహజంగా వుంటాయంటే కథ చదువుతున్నట్లుగాక నిజంగా జరిగిన సంగతులు కళ్లకు కట్టినట్లుంటుంది పాత్రలు మనతో మాట్లాడుతున్నట్లే వుంటుంది శైలి కథలో వేగాన్ని పెంచుతుంది

ఆచార సంప్రదాయాలను మన్నిస్తూనే అభ్యుదయ పంథాలో నడిచే కథనం ఎన్నదగినది ఏ అంశాన్నయినా కన్విన్సింగ్‌గా చెప్పే తీరు బావుంటుంది.

యువతీ యువకుల సరదాలు, సమస్యలు - ఇళ్లల్లో పనిచేసే పనివాళ్ళు, ముఖ్యంగా ఆడపిల్లలు మగ యజమానులతో వ్యవహరించాల్సిన తీరు, జాగరూకత - పురుషాధిక్యతను వ్యతిరేకిస్తూనే కుటుంబ వ్యవస్థను గౌరవించడాన్ని మనం గుర్తించవచ్చు సబలలైన ఆధునిక స్త్రీల ఆలోచనా ధోరణి, హ్యాపీ హోం రహస్యాలు, మారుతున్న సమాజం, వ్యవస్థ గురించిన పరిణామ దశలు అవగాహన చేసుకోవచ్చు.

పరిస్థితుల్ని మనస్తత్వాల్ని అచ్యుతవల్లి ఆవిష్కరించే విధానం సమస్యలకి పరిష్కారాలు, మార్గ నిర్దేశక సంకేతాలు, ఎంతో ఉపయుక్తాలు.

సెంట్రల్ ఎక్సైజ్ ఆఫీసర్ అయిన భర్త ఉద్యోగరీత్యా తరచూ బదిలీలవల్ల ఆయనతోబాటు భారతదేశంలో పలు ఊర్లలో వుండే అవకాశం దొరికింది అచ్యుతవల్లికి. ఆయా ప్రాంతాల జీవన శైలి, భాష, ప్రాంతీయత అత్యంత సహజంగా ఆమె కథల్లో చోటు చేసుకుంటాయి కాలానికి నిలిచే కథలు రాసిన ఈ కమ్మని కథకురాలు కలానికి విశ్రాంతి నివ్వకుండా ఇప్పటికీ రేడియోకి కథలు, ప్రసంగాలు, నాటికలు రాస్తూనే వున్నారు. ఇంటికి 'ఎవర్ గ్రీన్' అని పేరు పెట్టుకున్న అచ్యుతవల్లి దంపతులు ప్రస్తుతం పశ్చిమగోదావరి జిల్లా పెంటపాడులో సొంత వ్యవసాయం చేస్తూ హరిత విప్లవాలు సృష్టిస్తున్నారు.

'సింపుల్ లివింగ్, హై థింకింగ్' ఇష్టమైన అచ్యుతవల్లి "దేన్నీ దేనికోసం వదులుకోనక్కర్లేదు సరిగ్గా ప్లాన్ చేసుకుంటే జీవితం, రచన ఎవర్‌గ్రీన్‌గా వుంటాయంటారు."

ఐ.వి యస్. అచ్యుతవల్లి సాహితీ జీవితం, వ్యక్తిత్వం ఇప్పటికీ మార్గ దర్శకంగా, ఆదర్శవంతంగా నిలవడం అభినందనీయం

# ముదిగంటి సుజాతారెడ్డి

♦ డా॥ తుమ్మల రామకృష్ణ ♦

యాభై అరవైయేళ్ళ సుదీర్ఘ జీవితానుభవం, సాహిత్య అధ్యయనం, బోధన, పరిశోధన, పాండిత్య ప్రతిభలు కలబోసుకున్న సుజాతారెడ్డి చాలా ఆలస్యంగానే సృజన రంగంలో అడుగు పెట్టారు 1990 నుంచి నవలలు, కథలు రాస్తూ వున్నారు ఇప్పటివరకు మూడు నవలలు, రెండు కథా సంపుటాలు ప్రచురించారు

1990 నుంచి సాహిత్యరంగంలో స్త్రీవాదం, దళిత వాదం, మైనారిటీ వాదాలు ప్రధానాంశాలయ్యాయి. చర్చలు, విమర్శలు ప్రతి విమర్శలు, నిందలు, ఆరోపణలు అన్ని రంగాల్లో ఉన్నట్లే సాహిత్య రంగంలోనూ ఉన్నాయి.

సామాజికరంగంలో ఎక్కువగా వినబడుతున్న మాటలు, ప్రచురణ ప్రసార సాధనాల్లో కనబడుతున్న మాటలు - ప్రధానంగా మూడు. లిబరలైజేషన్; ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్ సరళీకృత ఆర్థికవిధానాలు, పెట్టుబడులకు ఆహ్వానాలు, ఉగ్రవాదం - వేర్పాటు వాదాలు - సామాజిక అనిశ్చితి ధరలు పెరగడం - ప్రభుత్వాలు పన్నులు పెంచుతూ పోవడం - ప్రజలు ప్రతిపక్షాలు నిరసనలు, నిరాహార దీక్షలు - సర్దుబాట్లు. కరువు కాటకాలు - అధిక ధరలు - రైతుల ఆత్మహత్యలు -

సారాంశం అన్ని రంగాలు అవినీతిమయ కుంభకోణాల్లో పోటీ పడ్డం పేదలు ఇంకా పేదలుగా కూలీలుగా, బిచ్చగాళ్ళుగా మారిపోవడం - మధ్య తరగతి కన్జ్యూమరిజంలో కూరుకుపోవడం. ఉన్నత వర్గం పెట్టుబడి లాభార్జనలో మునిగిపోవడం అధికార యంత్రాంగం లంచగొండిగా మారిపోవడం. సమాజం సమస్యల సుడిగుండంగా తయారవ్వడం. కులం, మతం, జాతి ఏదైనా కావచ్చు- స్త్రీలు మాత్రం బానిసలే. బానిసలకు బానిసలుకూడా. లింగ వివక్ష, పితృస్వామ్య అధిత్యం, లైంగిక హింస, దోపిడీ, దౌర్జన్యం, పీడన చాప కింద నీరులా సాగిపోతూనే ఉంది. ఈ నేపథ్యంలో తెలంగాణా జీవితాలు, స్త్రీల బతుకుల్లోని విషాదాలు, పట్టణ నగర అభివృద్ధుల్లో నలిగిపోతున్న బడుగు బతుకుల వ్యథలు సుజాత కథలు.

ముదిగంటి సుజాతారెడ్డి 'విసుర్రాయి' (1998), 'మింగుతున్న పట్నం'(2001) అనే రెండు కథా సంపుటాలు ప్రచురించారు మొదటి కథా సంపుటం 'విసుర్రాయి'లో ఇరవై కథలున్నాయి. అందులోని రెండు కథలు మాత్రం 'చాటింపు', 'మూసీ' మాస పత్రికల్లో అచ్చయినాయి మిగిలిన కథలన్నీ డైరెక్టుగా అచ్చులోకి వచ్చినవే.

'మింగుతున్న పట్నం' సంపుటిలో పదిహేను కథలున్నాయి అందులోని ఒకటి రెండు కథలు మినహాయించి తక్కిన కథలన్నీ ఆంధ్రప్రభ (వారపత్రిక, ఆదివారం అనుబంధం) ప్రజాశక్తి, మూసీ, భూమిక, సుప్రభాతం, ఇండియా టుడే వంటి సుప్రసిద్ధ పత్రికల్లో, కదంబం వంటి రచయిత్రుల కథల సంకలనాల్లో ప్రచురింపబడ్డ కథలే

గత నాలుగైదేళ్ళలో ఇన్ని కథలు రాసి ప్రచురించి సంపుటాలుగా తెచ్చిన అరుదైన రచయిత్రి సుజాతారెడ్డి

కేతువిశ్వనాధరడ్డి అన్నట్లు సుజాతారెడ్డి సృజనాత్మక వ్యక్తిత్వపు వేర్లు తెలంగాణా గడ్డ రైతు కుటుంబంలో ఉన్నాయి ఆమె పుట్టింది నల్గొండ జిల్లా, నక్రేకల్ మండలం, ఆకారం అనే పల్లెటూర్లో ఆమె మెట్టినూరు కరీంనగర్ జిల్లాలోని పోత్కపల్లి రెండు రకాలుగా ఆమె తెలంగాణా ప్రాంత వాసి పైగా ఉద్యోగ జీవితం చాలా భాగం హైదరాబాద్‌లోనే కొనసాగింది అందువల్లే వరవరరావు "సుజాతారెడ్డి దాదాపు అరవైయేళ్ళ తెలంగాణా ప్రజా జీవన నేపథ్యం కలిగుంది" అంటారు ఆమె అపార, ప్రజా జీవన నేపథ్యం కలిగి వున్నా, 'చాలా జీవితానుభవం', సాహిత్యాధ్యయనం, నిశిత పరిశీలన అలవర్చుకున్న తర్వాతే సాహిత్య సృజనకు పూనుకున్నట్లు తెలుస్తోంది ఆమెలోని ప్రత్యేకత ఆమె తెలంగాణా భాషను వాడే తీరులో ఉంది ఎవరి జీవితాలకు సంబంధించిన ఘర్షణను వాళ్ళ భాషలో చెపితేనే రచనలు శక్తివంతంగా ఉంటాయి అనడానికి, సుజాతారెడ్డి కథలే నిదర్శనం వరవరరావే అన్నట్లు ఆమె కథల కొక 'విశ్లేషణ, వివరణ' అవసరం లేదు. కథలు ఆ జీవితాలంత వాస్తవంగా, నిజాయితీగా ఉన్నాయి. కథల్లో శిల్ప సంబంధమైన, సంక్లిష్టత వెతికినా దొరకదు కథలన్నీ సూటిగా, స్పష్టంగా, సరళంగా ఉంటూనే అవసరమైనంత ఘర్షణ కలిగి ఉన్నాయి

సుజాతారెడ్డి సమాజం పట్ల, మానవ సంబంధాలపట్ల, ముఖ్యంగా స్త్రీ - పురుష సంబంధాలపట్ల, రాజ్యంపట్ల, రాజ్యహింసపట్ల, సమాజంలోని ఆర్థిక అసమానతలపట్ల స్పష్టమైన అవగాహన కలిగి ఉంది. అందువల్లే 'విసుర్రాయి' కథల సంపుటిలో 'స్త్రీ విషయంలో సమాజం, పురుషుల దృక్పథం మారవలసి ఉంది స్త్రీల విషయంలో వాళ్ళ ఆలోచనల్లో ప్రవర్తనలో విప్లవాత్మకమైన మార్పు రావాలి సామాజిక వివక్ష పోవాలి స్త్రీ అంటే ఉన్న నిర్లక్ష్యం తొలగాలి స్త్రీ క్షమత, శ్రమ, విజ్ఞానం కార్యదక్షతలకు గుర్తింపు రావాలి. స్త్రీ మీద జరిగే శారీరక మానసిక హింసలు, దౌర్జన్యాలు నశించాలి. స్త్రీ ఎదుర్కొంటున్న శ్రమ దోపిడీ అణచివేత అన్యాయం అసమానతలు తొలగిపోవాలి ఇంకోవైపు అలంకారాలు అలంకరణలకు పరిమితమైన స్త్రీ జీవితంలో చైతన్యం రావాలి" అని తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా చెప్పారు

మొదటి సంపుటి 'విసుర్రాయి'లోని కథలు గమనించినట్లయితే, చాలా కథల్లో స్త్రీ ప్రధాన కేంద్ర బిందువు స్త్రీల జీవితాల చుట్టూ పరచుకొన్న కష్టాలు, కడగండ్లు, హింస, అణచివేత, వేధింపు, వివక్ష, దౌర్జన్యం ఎట్లా స్త్రీ

జీవితాన్ని దుర్భరం చేస్తున్నాయో, స్త్రీ ఎంత దారుణంగా అన్యాయమైపోతూ వుందో తెలియజెప్పే కథలే 'విసుర్రాయి సిండా

'విసుర్రాయి' స్త్రీ శ్రమకు సంకేతం విసుర్రాయి కథలో సక్కుబాయి పొద్దస్తమానం ఇంటి చాకిరీకి, పిల్లల సేవలకి, భర్త సుబ్బారావు రాక్షస రతికి బలైపోతుంది అమెదైన సంతోషంగాని, అమెదైన స్వేచ్ఛగాని ఆమె అనుభవించలేక గానుగెద్దు జీవితానికి అలవాటు పడిపోతుంది

ఏషియన్ గేమ్సులో పాల్గొని బంగారు పతకాలు సొంతం చేసుకోవాలని కలలు గన్న కవలలు, హరిత, సరిత జీవితాలు ఎట్లా మొగ్గలోనే బుగ్గి పాలయ్యాయో 'రౌడీయిజం' కథలో చూడవచ్చు

లేక లేక పుట్టిన మగబిడ్డ శేఖర్‌ని ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేసి చదువుసంధ్యలు చెప్పించి భర్తపోయినాక వచ్చిన డబ్బంతా కొడుకు పేర బ్యాంకులో కట్టి, కొడుకు పెద్దయ్యాక, కొడుకు కోడళ్ళ మమతానురాగాలకు దూరమై తన ఇంట్లోనే తను పరాయి మనిషై, తన వాళ్ళ మధ్య హాయిగా నవ్వు కోవడానికి కూడా స్వేచ్ఛలేని బతుకు బతకాల్సి వచ్చినపుడు చివరకు 'ఓల్డేజి హోమ్'కు వెళ్ళడానికి నిశ్చయించుకొన్న ఓ సరోజ కథ 'స్వేచ్ఛ'

యజమాని స్థానంలోకి వచ్చిన మగవాడు ఆర్థిక స్వేచ్ఛతో వ్యసనాలపాలై కుటుంబాన్ని నరకప్రాయం చేస్తే మల్లమ్మ లాంటి రజక స్త్రీ ఇస్త్రీ పెట్టె చేత బట్టి బతుకు బండిని లాగడానికి పూనుకోవడం 'పలాయనం' కథలో చూడవచ్చు

బతకడం కోసం బతుకు దెరువు వెదుక్కుంటూ మగవాళ్ళు పల్లెల్నుంచి కుటుంబాలు వదిలి పట్నాలకు దిన కూలీలుగా, కార్మికులుగా వస్తే వాళ్ళ లైంగిక అవసరాలు తీర్చే వేశ్యావాటికల్లో వాళ్ళ కుటుంబ స్త్రీలు కనబడ్డం 'బేరం' కథలో చూడవచ్చు

ఆడవాళ్ళ కష్టార్జితాన్ని మగవాళ్ళు ఎట్లా దోచుకుతింటారో 'దోపిడి' కథ చదివితే తెలుస్తుంది.

'విసుర్రాయి' సంపుటిలోని కథలన్నీ స్త్రీల సమస్యల చుట్టూనే నడిచాయి. 'విసుర్రాయి' కథలో కనిపించే సక్కుబాయి, 'రౌడీయిజం' కథలోని హరిత, సరితలు, 'స్వేచ్ఛ' కథలోని సరోజ, 'బొమ్మలో చైతన్యం' కథలోని వరలక్ష్మి 'స్నేహలతాదేవి లేఖ' కథలోని స్నేహలత, 'పంజరం విరిగింది' కథలోని లక్ష్మి వారసత్వం కథలోని కౌసల్య-లీలలు, 'బందీ' కథలోని అన్నపూర్ణ, 'పైతృకం' కథలోని విజయం, 'నేరమేమిటి కథలోని సుధ, 'మోక్షం' కథలోని రజని, 'ధర్మపత్ని' కథలోని పిచ్చెమ్మ, 'బేరం' కథలోని లచ్చి, 'పలాయనం' కథల్లోని మల్లమ్మ, 'కబ్జా' కథలోని అంజనమ్మ, 'దోపిడీ' కథలోని నర్సమ్మ, 'జవాబుల్లేని ప్రశ్నలు' కథలోని యాదమ్మ .. వయోభేదాలున్న స్త్రీలే అయినా వీళ్ళంతా మగపెత్తనం కిందో, కుటుంబ యజమాని పెత్తనం కిందో పురుష దురహంకారం కిందో, సమాజ హింస వల్లో, కుటుంబ వివక్ష వల్లో, ఆర్థిక అసమానతల వల్లో, ఆడవాళ్ళుగా పుట్టడం వల్లో, వివిధ స్థాయిల్లో, విభిన్న రీతుల్లో సమాజంలో, కుటుంబంలో, రాజ్యంలో అనేక అణచివేతలకీ, దోపిడీలకీ, లైంగిక

హింసలకీ, ఆధిపత్యాలకీ గురైనవాళ్ళే అవుతున్న వాళ్ళే కూడా

ఈ విసుర్రాయి సంపుటిలో ప్రత్యేకంగా పేర్కొదగ్గ కథలు రెండున్నాయి ఒకటి 'కబ్జా' కథ. రెండోది 'జవాబుల్లేని ప్రశ్నలు' కథ

'కబ్జా' పలుకుబడి, ఆస్తి, హోదా పెంచుకోవడం కోసం ఓ దుర్మార్గపు భర్త ఆడిన ఓ వింత నాటకం

రాజారెడ్డి అనే పెద్దమనిషి ఆస్తికోసం తన భార్యను రామిరెడ్డి రేప్ చేశాడని కథల్లి అందుకు భార్య 'అంజనమ్మ'ని ఒప్పించి, కోర్టులో భార్య చేత చెప్పించి కేసు గెలిచిన వైనాన్ని బయటపెట్టే కథ 'కబ్జా' మానసికంగా కుంగి పోయిన రాజారెడ్డి భార్య అంజనమ్మ కోర్టు నుంచి బయటికి వస్తూ భర్త నీచత్వానికి రోసి కోర్టు ఆవరణంలోనే భర్త ముఖంమీద ఉమ్మేస్తుంది

ఎంతోమంది పత్తి రైతులు గత ఐదారేళ్ళ కాలంలో ఆత్మహత్యలు చేసుకున్నారు ప్రభుత్వ వైఫల్యాలే రైతుల ఆత్మహత్యలకు కారణమని ప్రజలు ప్రతిపక్షాలు ప్రభుత్వం దేన్నీ పట్టించుకోనట్లే రైతుల ఆత్మహత్యల్నీ పట్టించుకోదు. కష్టాలకు, అప్పులకు భయపడి పురుగుమందు తాగి రైతులు ఆత్మహత్య చేసుకోవడం అటు తెలంగాణా, ఇటు రాయలసీమలోనూ సర్వసాధారణమే సుజాతారెడ్డి రాసిన కథ దానికి భిన్నంగా కనిపిస్తుంది పత్తి రైతు ఆత్మహత్య చేసుకున్నప్పుడు అసలు బాధితురాలు ఆ ఇంటి ఇల్లాలు. కష్టాలనుంచి తప్పించుకోవడానికి మగవాడు గుక్కెడు పురుగు మందు తాగి చచ్చిపోవచ్చు అయితే ఆ మగవాడు చచ్చిపోయాక ఆ అప్పులు తీర్చడానికి, పిల్లల్ని పెంచడానికి, ఉన్న పొలం పుట్ర సాగు చేసుకోవడానికి ఆ ఆడమనిషి ఎంత యాతన పడాల్సి వుంటుంది 'జవాబుల్లేని ప్రశ్నలు' కథలో భర్తను పోగొట్టుకున్న యాదమ్మ -

"నర్సక్క నువ్వే జెప్పు నేనేం జేయాలె? గీ పోరగాల్ల నెట్ల సాలెలో! గీ ఎవసాయం ఎట్ల నడపాలె ! ఐదెకరాల చెలక బోరు ఇంజను - గివన్ని నా ఒక్కదానికి అప్ప జెప్పిండు. తన దారి తను చూస్కుండు! గీ అప్పులన్ని మెడకు బడ్డయి ఎట్ల తీర్చాలె! నువ్వే జెప్పు నర్సక్క నేనేం జేయాలె? నాకొక్కమాట సెప్పి పోడాయె! నన్ను నా పిల్లల్ని దిక్కులేనోల్లనుచేసి పాయె! నేనేం జేద్దును లచ్చక్క నువ్వయిన జెప్పవే!.. రాములమ్మో నువ్వే జెప్పవే నేనేం జేయాలె! ఓ నాయనో! అందరి ముందల నన్ను నవ్వుల పాలుజేసి పోయిండు శంకరక్క నేనెట్ల గీ సంసారాన్ని నెగ్గుకొస్తనో నువ్వే జెప్పవే! నాయినో! నేనేం జేయాలె! నేనెక్కడికి పోను" అంటూ యాదమ్మ భోరున విలపిస్తూ ప్రశ్నిస్తుంది ఆమె ప్రశ్నలకి ఎవరి దగ్గర జవాబులున్నాయి యాదమ్మ గోడు చూసి రెండు కన్నీటి చుక్కలు రాల్చకుండా ఆ కథ చదివిన వాళ్ళు ఉండలేరు

'మింగుతున్న పట్నం' కథల సంపుటిలో కరువు నేపథ్యంగా వున్న కథలు ఆరేడున్నాయి. కరువును గురించి పెద్దగా వివరించాల్సిన పనిలేదు. వర్షాభావం వల్ల ఏదైనా ఒక ప్రాంతం పెద్ద ఎత్తున ఆహారం కొరత, అధిక ధరలు, ఆకలి చావులకు గురైనట్లయితే ఆ ప్రాంతాన్ని కరువు ప్రాంతంగా పేర్కొంటారు

భారతదేశంలో అందులో భాగమైన ఆంధ్రప్రదేశ్‌లో కరువుల చరిత్ర చెప్పలేనంత వుంది కరువులు సంభవించినప్పుడల్లా ప్రభుత్వాలు తాత్కాలిక నివారణోపాయాలు వెదికాయే తప్ప దీర్ఘకాలిక శాశ్వత నివారణ చర్యలు ఏ ప్రభుత్వమూ చేపట్టలేదు అందువల్ల తెలంగాణాలో దుర్భిక్షం తాండవిస్తూనే ఉంది తెలంగాణా ప్రాంతంలో నీటి పారుదల సౌకర్యాలు అభివృద్ధి చెందలేదు నీటి నిల్వలూ అభివృద్ధి కాలేదు దానికి తోడు అక్కడి వ్యవసాయం వర్షాధారమే 250 మండలాలు తీవ్ర దుర్భిక్షంతో మలమల మాడిపోయాయని ప్రభుత్వం అంగీకరిస్తే అందులో చాలా భాగం మండలాలు తెలంగాణా ప్రాంతానికి చెందినవే కరువు వచ్చినప్పుడల్లా ఉత్తర తెలంగాణా వాసులు మహారాష్ట్ర పట్టణ ప్రాంతాలకూ, దక్షిణ తెలంగాణా వాసులు హైదరాబాదు దానిచుట్టు పక్కల ప్రాంతాలకూ, పశ్చిమ తెలంగాణా వాసులు కర్ణాటక ప్రాంతానికి వలస పోవడం ఎన్నో ఏళ్ళుగా జరుగుతున్నదే - అట్లా వాళ్ళు వలసలు పోవడానికి కారణం తెలిసిందే కరువు సంభవించిన మండలాల్లో - తాగేందుకు నీళ్ళుండవు, తినేందుకు తిండి దొరకదు పశువులకు నీళ్ళు, మేత దొరకదు పంటలు పండే ప్రసక్తే వుండదు. భూములు మలమలమాడి నెర్లు చీలిపోతాయి. సేద్యపు నీటి బావులు, గొట్టపు బావులు ఎండిపోతాయి మనుషులు ముఖ్యంగా కూలినాలి చేసుకొని శరీర కష్టంతో బతికేటోళ్ళు, పేదోళ్ళు, ఒక ఎకరా రెండెకరాలు పెట్టుకొని సేద్యం చేసేటోళ్ళ జీవితాలు ఛిద్రమైపోతాయి. ఒకటి అర చినుకు పడినపుడు అప్పులు చేసి, విత్తనాలు కొని దుక్కులు దున్ని నేల్లో గింజలేసినా అవి వర్షాభావం వల్ల మలమలమాడి పోతాయే తప్పా ఫలితం వుండదు ఎరువులకు, క్రిమి సంహారక మందులకు, కూలీలకు చేసిన అప్పులు తడిసి మోపెడై వడ్డీలు కట్ట లేక బతుకు రోసి రైతులు ఆత్మహత్యలు చేసుకుంటారు పేదప్రజలు కూలినాలి దొరక్క, పస్తులతో చావలేక పురుగుల మందో, ఎలకల మందో తిని చావడానికి సిద్ధమైపోతారు. పశువులు అమ్ముకోవడం, పిల్లల్ని అమ్ముకోవడం, పిడికెడు మెతుకుల కోసం మానాలు పోగొట్టుకోవడం సర్వసాధారణమై పోతుంది. ఈ బాధలన్నీ భరించలేకనే పనులు వెతుక్కుంటూ మూట ముల్లె సర్దుకొని వలసలు పోతుంటారు.

మనిషి బతకడం ముఖ్యం కాబట్టి బతకడం కోసం ఏ పని చెయ్యడానికైనా వెనుకాడరు. అపసవ్య మార్గంలో డబ్బు సంపాయించాలనుకున్న శ్రీశైలం నిండు జీవితం ఎట్లా అర్థాంతరంగా ముగిసిపోయిందో చెప్పే కథ "పుత్రశోకం". ఈ కథలో శ్రీశైలంకి చదువు వంటబట్టదు తండ్రిలా మేస్త్రీ పని నేర్చుకుని నాలుగు రాళ్ళు సంపాయించడు ఎప్పుడూ మాసిన బట్టల్తో పెరిగిన గడ్డంతో తిరుగుతుంటాడు ఇంటి పట్టున వుండడు. ఎక్కడికో పోతుంటాడు. బుద్ధి పుట్టినపుడు ఇంటికి వస్తుంటాడు. తల్లి పుల్లమ్మ ఏమన్నా మాట్లాడితే అసహనంతో సమాధాన మిస్తూ వుంటాడు. చివరకు డబ్బు సంపాయించాలనే కోరికతో ఒక పెద్దమనిషి వలలో చిక్కుకుంటాడు. ఆ పెద్దమనిషి మాటలు విని దొంగతనంగా వాళ్ళు ఇచ్చిన సంచివాళ్ళు చెప్పిన అడ్రస్సుకు ఇయ్యటానికి ఒప్పుకుంటాడు. ఆ వ్యవహారం అట్లా ఎన్నాళ్ళు జరుగుతుందో తెలియదు.

ఒక రోజు అర్ధరాత్రి పోలీసులు కాశయ్య పుల్లమ్మల దగ్గరకు వచ్చి వాళ్ళను పోలీసు స్టేషనుకు రమ్మంటారు 'ఎందుకని' వాళ్ళు అడిగితే, 'అక్కడో శవముంది గుర్తుపట్టాలి' అంటారు. శవమనే మాటవిని కాశయ్య పుల్లమ్మలు ఒణికిపోతారు అక్కడికి వచ్చిన వాళ్ళలో ఒక పోలీసు 'దొంగతనంగా ఆయుధాలు చేరవేస్తున్న వ్యక్తి శవం' అంటాడు. కాశయ్య పుల్లమ్మలు పోలీసు జీబులో వెళ్ళి శవాన్ని చూసి గుండె దిటవు చేసుకొని, కళ్ళల్లోకి చెమ్మరానీకుండా జాగ్రత్తపడి 'మాకు తెల్వది ఈయనెవరో' అని కాశయ్య, 'మా శ్రీశైలం గిట్లెందుకుంటాడు కాదు' అని పుల్లమ్మ అబద్ధమాడి తాను ఇంటికి రాగానే పుల్లమ్మ గొల్లుమంటుంది "ఏడ్వకు మన రాత గిట్లున్నది ఏం జేస్తం ఎవర్నేమంటాం" అంటూ కాశయ్య పుల్లమ్మను ఓదారుస్తాడు చెట్టంత కొడుకు కళ్ళల్లో కదలగా వాళ్ళ పుత్రశోకానికి హద్దులు లేకుండా పోయాయంటూ రచయిత్రి కథను ముగించింది.

పుత్రశోకం కథలో పుల్లమ్మ కాశయ్యలు పుట్టినూర్లో వరుసగా నాలుగేండ్లు కరువు రావడంతో వ్యవసాయం విడిచిపెట్టి పట్నంవలసవచ్చి బతుకీడుస్తుంటారు పట్నాల్లో ఎన్ని దుర్మార్గపు పనులు జరుగుతుంటాయో చెప్పలేం. పట్నాలు పెట్టుబడి సంస్కృతికి లోబడి ఉంటాయి అక్కడ డబ్బే ముఖ్యం. ఏ పని చెయ్యొచ్చు ఏ పని చెయ్యకూడదని నియమాలుండవు. చదువు సంధ్యలు లేని యువకులు, ఒళ్ళొంచి కష్టం చేయలేని యువకులు ఏదో ఒక విధంగా సులభంగా సంపాయించి సుఖంగా బతకాలని చేయరాని పనులు చేస్తుంటారు అలాంటి యువతకి శ్రీశైలం ఒక ప్రతీక కథా నిర్వహణలో ఒకటి రెండు దోషాలున్నా బాగా ఆలోచింపచేసే కథ పుత్రశోకం.

'తప్పిపోయిండు' కథలో నాలుగేండ్లు వర్షాల్లేకపోవడం వల్లే మైసయ్య వ్యవసాయం మూలపడుతుంది మైసయ్య, లచ్చి నలుగురి పిల్లల్ని బువ్వ పెట్టి సాకలేక పోతారు ఇద్దరూ కూలిపనికెళ్ళినా ఇల్లు గడవదు పెద్ద కొడుకు 'చంద్రయ్యను' పట్నంలో కిషన్‌రావు దొర ఇంట్లో పనిచెయ్యడానికి జీతగాడుగా పంపించడానికి ఒప్పుకుంటాడు మైసయ్య. కొంత దరిద్రమైనా తీరుతుందని భావిస్తాడు పైగా వ్యవసాయానికి చేసిన అప్పు అసలు వడ్డీ చెల్లించమని ఈశ్వరయ్య తొందర పెడతాడు. ఈ పరిస్థితిలో చంద్రయ్యను ఎక్కడైనా జీతముంచి అప్పు తీర్చేయాలనుకుంటాడు

చంద్రయ్య పుట్టినూర్లో గొడ్లు మేపుకుంటూ పిల్లన గ్రోవి వూదుతూ, చెరువుల్లో ఈతలు కొడుతూ కబడ్డీ, చెర్నగోల, ఆటలు ఆడుతూ వుంటాడు 'అవన్ని పట్నంలో వుంటాయా?' అనుకుంటాడు. పైగా అమ్మను, నాయినను, తమ్ముళ్ళను, చెళ్ళెండ్రను విడిచి పెట్టి ఎట్లుండాలోని బాధపడతాడు. దొర ఏడాది జీతం ఒక్కసారే ఇస్తనన్నడు కరువు కాలంలో ఇట్లా అందరూ ఆకలితో చచ్చిపోవడం కంటే దొర ఇంట్లో పనిచెయ్యడమే మేలనుకుంటాడు. చంద్రయ్య కిషన్‌రావు దొరతో పట్నం వచ్చేప్పుడు తల్లి 'నాయనా పోతున్నవ! గక్కడ పట్నంల పదిలం కొడుక! ఎవరి జోలికి పోకు ఆగంగాకు బిడ్డా! జాగర్త నాయన! బుద్ధిగుండు, సెప్పిన పని మంచిగ సెయ్యి' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ బుద్ధిమాటలు చెపుతుంది చంద్రయ్య తల్లి చెప్పినట్లే కిషన్‌రావు

దొర ఇంట్లో నీళ్ళు పట్టడం, ఇల్లు వూడ్చడం, బండలు తుడవడం, గిన్నెలు కడగడం అన్ని పన్లూ చంద్రయ్యవే ఒకరోజు దొర్సాని `ఒరేగిక్కడ బంగారు గొలుసు పెట్టిన తీసినావురా!'' అని అడుగుతుంది చంద్రయ్య ``గొలుసా! నాకెరుక లేదు దొర్సాని'' అంటాడు 'గొలుసు ఎవరికిచ్చావో చెప్పు' అంటారు చివరకు పోలీసులకు పట్టిస్తారు 'నేను దొంగతనం చెయ్యలేదు దొంగను కాను' అని ఎన్నిసార్లు చెప్పినా పోలీసులు వినరు పైగా చితక్కొడతారు గొలుసు అద్దం ముందరే వుంటుంది ఒక్కరోజు చంద్రయ్య లేకపోయేసరికి ఎక్కడి పనులు అక్కడే పడుంటాయి పోలీసు స్టేషనుకు వెళ్ళి చంద్రయ్యని విడిపించుకు రమ్మంటుంది దొరసాని కిషన్‌రావు పోలీసు స్టేషనుకు వెళ్ళి కేసు వాపస్ తీసుకొని ``రారా ఇంటికి పోదాం' అంటాడు ఇంట్లో పనంత అట్లనే పడి ఉన్నది జల్దీ జల్దీ నీ పని చేసుకో అంది దొరసాని ఆ రాత్రంతా చంద్రయ్య ఆలోచనలోపడ్డాడు ``గిప్పుడు ఊరికి ఇంటికి పోతే దొర నాయనను బతకనియ్యడు ఇచ్చిన జీతం కక్కుమంటాడు. నాయన గాపైసలు ఎక్కడ్నుంచి తెచ్చి యిస్తడు ఊరికి పోతే దొర నన్ను వదలడు. మల్ల పట్టు కొస్తడు పట్నం. ఇగ ఊరికిపోను, అని ఆలోచించి చంద్రయ్య రోడ్డు పొంటి నడిచాడు ఏ గమ్యం లేకుండా చంద్రయ్య చీకట్లో మాయమయ్యాడు. 'తప్పి పోయిండు' అని పోలీసు స్టేషన్లో రిపోర్టు రాయించాడు దొర మర్నాడు

'తప్పిపోయిండు' కథలో పేద రైతు కూలీలైన మైలయ్య, లచ్చిల బతుకు ఛిద్రమైపోవడానికి ప్రధాన కారణం కరువే. వాళ్ళ పెద్ద పిల్లోడు చంద్రయ్య బాల్యం బుగ్గయిపోవడానికి కారణం కరువే. కిషన్‌రావు దొర ఇంట్లో జీతానికి వెళ్ళిన చంద్రయ్య చివరకు ఏ గమ్యం లేకుండా రోడ్డు పొంటి చీకట్లో మాయమయ్యి పోవడానికి వెట్టిచాకిరీ, కరువు, హింసే కారణాలుగా కనిపిస్తాయి. పిల్లలందరి బాల్యం ఒకేలా మంచిగా లేదని చెప్పడానికి ఇంతకంటే సాక్ష్యం అవసరం లేదు

'మింగుతున్న పట్నం' సంపుటిలో దోపిడీ, దౌర్జన్యం, పీడనకు సంబంధించిన కథలు ఉన్నాయి స్వాతంత్ర్యం వచ్చి యాభైఏళ్ళు పైబడ్డా భూస్వామ్య విధానాలే రాజ్యమేలుతున్నాయి అసమాన ప్రాంతీయ అభివృద్ధికి, వలసవాద విధానం గట్టి పునాదివేసింది. ఆనకట్టలు, నీటి పారుదల సౌకర్యాలు కలిగి ఉన్న ప్రాంతాలు అటు వ్యవసాయరంగంలో, పారిశ్రామిక రంగంలో, వ్యాపార రంగంలో ముందంజ వేసి మిగులు ఉత్పత్తిని, లాభాలను పెట్టుబడులుగా మార్చి ఆర్థికంగా బలపడుతూ అధికార, ఆధిపత్యాలను కొనసాగిస్తూవుంటే - తెలంగాణా వంటి ప్రాంతాలు శాశ్వత వెనుకబాటుతనంలోకి నెట్టబడ్డాయి నాయకుల స్వార్థ ప్రయోజనాలు ఒకవైపు, ప్రకృతి పరాచికం మరోవైపు, దానికి తోడు భూస్వామ్య పెత్తందారీ విధానం దోపిడీ, దౌర్జన్యాలు, పీడనలు ప్రజల జీవితాన్ని మరింత దుర్భరం చేశాయి ముఖ్యంగా పేద రైతాంగం, శారీరక శ్రమతో బతికే శ్రామికవర్గం, అడవుల్ని నమ్ముకుని బతికే గిరిజన తెగలు ఎంతగా కష్టాలు, కడగండ్లు పాలుకావాలో అంతగానూ నలిగి నురిగిపోతున్నాయి పట్టణ ప్రాంతాలు, మైదాన ప్రాంతాలు ఎంతో కొంత అభివృద్ధి చెందుతూనే

వున్నాయి నానాటికి పల్లె ప్రాంతాలు, గిరిజన తండాలు అంతరించుకు పోతున్నాయి దళారీ వర్గం దోపిడీ, పీడన చాపకింద నీరులా వాళ్ళ జీవితాలను ముంచేస్తూ వుంది వ్యాపారుల, దొరల దోపిడి పీడనలు ఎంత సజావుగా సాగుతాయో నిరూపించే కథ 'ఆక్రమణం' ఈ కథలో లచ్చు భీమలతోపాటు మరో పదికుటుంబాల వాళ్ళు దట్టమైన అడవిలో పది గుడిసెల్లో జీవనం కొనసాగిస్తూ ఉంటారు ఆ గూడెం వాళ్ళంతా వాళ్ళ కులదేవత అయిన 'ఆకయ జాతర' వేడుగ్గా జరుపుకుంటూ వుంటారు. ఆ యేడు 'రంగయ్య' ఆ జాతరకి రెండు బండ్ల మీద రకరకాల సామాను - బెల్లం, పొగాకు, పేలాలు చక్కెర బిళ్ళలు, బట్టలు, పూసలు, కడియాలు, దండలు, పిన్నులు, రంగు రంగుల రిబ్బన్లు, ఇంకా వాళ్ళకి అవసరమైనవన్నీ వేసుకు వెళతాడు నిజానికి ఆ అడవి జనానికి ప్రపంచంతో సంస్కృతీ నాగరికతలతో లంకె రంగయ్య వల్లనే వాళ్ళు పండించిన ధాన్యం చాలా భాగం రంగయ్య సంచుల్లోకి పోతుంది వస్తు మార్పిడి పద్ధతిలో వాళ్ళెంత నష్టపోతారో వాళ్ళకు తెలియదు రంగయ్య సరుకులన్నీ జాతరలో అమ్ముడుపోయాయి

రంగయ్య తెచ్చిన సంచులు సజ్జలు, జొన్నలతో నిండిపోయాయి జాతర చాలా వేడుగ్గా రంగయ్య తెచ్చిన రకరకాల దుస్తులతో రంగు రిబ్బన్లతో, ప్లాస్టిక్ పూలతో జరుపుకున్నారు జాతర రాత్రి కన్వా తప్పు చేశాడని గూడెం గూడెం శిక్ష విధిస్తుంది కన్వా తెల్లవారు జామున చెప్పపెట్టకుండా గూడెం నుంచి జారుకుంటాడు. గూడెం వాళ్ళంతా తమకున్న కొడవలి, గొడ్డలి, మొనదేలిన కట్టెలు, బుట్టలు, కుండలు, అటికలు అన్నీ సర్దుకొని కొత్త జాగా వెతక్కుంటూ ఇంకా అడవి లోపలికి వెళతారు. అక్కడ మంచి ఎర్రనేల చూసుకొని మోదుగ ఆకులతో వెదురు బొంగులతో గుడిసెలు వేసుకుంటారు. 'ఆకయ' దేవరకి మంటపం వేస్తారు. అక్కడ పూజలు, జాతరలు జరుగుతున్నా రంగయ్య పోవడంలేదు ఉన్నట్లుండి ఒకరోజు సర్కారు మనుషులు వచ్చి అక్కడున్న మనుషుల లెక్కలు వేసుకొని అడవిలో వున్నందుకు, పంటలు పండిస్తున్నందుకు శిస్తులు కట్టమంటారు. అదంతా వాళ్ళకేం బోధపడదు మళ్ళీ ముందున్న చోటుకే పోదాం అనుకుంటారు. అక్కడికి వెళతారు అక్కడ ఎంతో మార్పు కనిపిస్తుంది. ఎక్కడైతే వాళ్ళ గుడిసెలు వుండేవో అక్కడో పెద్ద ఇల్లు ఉంటుంది. ఇంటి చుట్టూ ప్రహరిగోడ వుంటుంది చుట్టుపక్కల ముప్పై నలభై పెంకుటిండ్లుంటాయి. అట్లా ఎప్పుడూ జరగలేదు ఎప్పుడూ అడవిలో తమ జాగాలు తమకే ఉండేవి ఇట్లా ఎప్పుడూ కబ్జా జరగలేదు. ఆ పెద్దింటి ముందు దొర కనిపించాడు ధోవతి లాల్చీతో చేతిలో బెత్తంతో అతని పక్కన రంగయ్య నిలబడి వుండె. "దొరా మా గుడిసెలు ఇక్కడే వుండే . మా బూములు గవే" అని చెయ్యెత్తి చూపించారు లచ్చా భీములు "అయితే ఏందంట! ఇప్పుడు ఈ భూములన్నీ నావి. నాకు బాజప్తా పట్టా అయినయి సర్కారుకు శిస్తు చెల్లిస్తున్న...." అన్నాడు దొర కోపంగా అంతలో రంగయ్య కలగజేసుకొని "ఇక్కడ్నే వాళ్ళని వుండనియ్యండ్రి దొరా. ఇంతకు ముందు వాళ్ళు ఆయక దేవరను నమ్ముకొని బతికింద్రు. ఇప్పుడు మిమ్మల్ని

నమ్ముకొని బతుకుతరు మీ భూములు దున్నుతరు తలాయింత భూమి ఇయ్యంఁడ్రి పంట పండించి పోస్తరు" రంగయ్య లౌక్యానికి గూడెం వాళ్ళు లొంగిపోయారు. గుడిసెలు ఏసుకోవడానికి జాగా అడిగారు దొర సరే అన్నాడు రంగయ్యని పురమాయించి ముందు రంగయ్య వెనుక గూడెం వాళ్ళు - కొంత దూరం వెళ్ళేసరికి అక్కడో దుకాణం కనిపించింది అందులో ఓ ఆడమనిషి కనిపించింది. ఆ దుకాణం వైపు చూస్తూ రంగయ్య "అదేరా నా దుకాణం మీకు ఏం కావాలన్న రంఁడ్రి మన సంబంధం ఇప్పటిది కాదు గద" అంటూ నవ్వాడు చివరకు గూడెం వాళ్ళు "ఈ భూమి, యీ జాగ, యీ గాలి, యీ నీరు, యీ జంగల్, యీ దేవర మాకు సొంతం కాదా! అంటూ దిమ్మెర పోతారు

ఈ కథకు ఏ వ్యాఖ్యానం అవసరం లేదు. అడవిని, కష్టాన్ని నమ్ముకున్న గిరిజనుల్ని మైదానం ప్రాంతం నుంచి వెళ్ళిన వ్యాపారులు, దొరలు ఎట్లా దోపిడీ చేస్తారో కథ చదివితే స్పష్టమైపోతుంది

'అడవిరాజ్యం' పట్టణాలలో రియల్ ఏస్టేట్ వ్యాపారాల్లోని మోసాలను బట్టబయలు చేసే కథ. పట్టణ ప్రాంతాల్లో విస్తరిల్లుతున్న దౌర్జన్యానికి ప్రతీక. బతుకంతా లెక్కల మాష్టారుగా మంచి పేరు తెచ్చుకొని పదవీ విరమణ తర్వాత వచ్చిన డబ్బుతో పట్టణానికి కొంత చేరువలో ఒక చిన్న ఇల్లు కట్టుకొని, ప్రశాంత వాతావరణంలో పచ్చని మొక్కల మధ్య బతుకు వెళ్ళదీయాల నుకున్న ఆనందరావు జీవితం ఎట్లా దౌర్జన్యం పాలైందో అడవిరాజ్యం కథలో చూడవచ్చు.

పల్లెల్లో బతికేవాళ్ళు పట్టణం బతుకులు హాయిగా ఉన్నాయనుకుంటారు. పల్లెల్లో ఒప్పనితనం, ఓర్వనితనం. ఒకరు పచ్చగా ఉంటే చూడలేనితనం వల్ల పల్లె జీవితం అక్కడి రాజకీయాలవల్ల కలుషితమైపోయిందని బాధపడు తుంటారు. పట్టణ జీవితం కూడా అంతకన్నా మెరుగ్గా ఏమీ లేదు. మాఫియా లీడర్లు, రౌడీలు, కాంట్రాక్టర్లు, లంపెన్లు పట్టణాభివృద్ధితోపాటు అభివృద్ధి చెంది దోపిడీ దౌర్జన్యాలతో తమ ఆధిపత్యాలు పెంచుకుంటున్నారు అని 'అడవి రాజ్యం' కథ స్పష్టం చేస్తుంది

'రాజకీయ మంటలు' రాజకీయ నాయకులు సామాన్యులను కష్టాల పాలు జేసి తమ దారిలోకి వాళ్ళంతట వాళ్ళు వచ్చేలా ఎలా ఉచ్చులు పన్నుతారో తెలియజేసే కథ

ఊరి బయట నూరు ఎకరాల భూమిని స్వంతం చేసుకోవడానికి ఆనందరావు, కిషన్‌రావు కల్సి ఆడిన దుర్మార్గపు నాటకం 'రాజకీయ మంటలు' కథ ఊరి బయట బంజరు భూమి పేదోళ్ళకి (హరిజనులకి) ఇప్పించినట్లే ఇప్పించి రాజకీయ లబ్ధిపొంది తమవాణ్ణి యం.ఎల్.ఏ.గా గెలిపించుకొని ఆ తర్వాత ఆ భూముల్లో పక్కా ఇండ్లు కట్టిస్తామని ఇంటికి రెండు వేలు ఇవ్వడానికి వాళ్ళు సిద్ధమైతే మధ్యలో శ్రీరాములు వంటి యువకులు నాయకుల పన్నాగాలను పసిగట్టి ఎదురు తిరిగితే చివరకు వాళ్ళ గుడిసెలకు అగ్గి

పెట్టించి, వాళ్ళని నిరాశ్రితుల్ని చేసి మొసలి కన్నీళ్ళు కార్చి ఇంటికి వెయ్యి రూపాయలు ఇచ్చి గుడిసెలు వేసుకోమని చెప్పి అప్పనంగా రెండు వేలతో కాని పనిని వెయ్యితో పూర్తి చేశామని ఆనందపడిపోతారు రాజకీయ నాయకుల దుర్మార్గాలను ఏకరువు పెట్టడం సాధ్యంకాదు అందువల్లే ఈ కథల గురించి వరవరరావు "ఏభై ఏళ్లుగా నగరం ఈ వ్యవహారంలో ఏయే దశలో గడిచివచ్చిందో 'రాజకీయ మంటలు' కథలో ఆమె ప్రస్తావించిన పాకిస్తాన్‌కు పారిపోయిన జాగీరుదారు భూములు చేతులు మారిన వైనాన్ని బట్టి చెప్పచ్చు" అంటారు

పదెకరాల చెలక పెట్టుకొని ఒకరి ముందర చెయ్యి చాపకుండా, అప్పు చేయకుండా బతికిన నాగయ్య కొడుకు శీతయ్య సలహాతో చెలకలో బోరు వేయించి వ్యాపారపంటలైన పత్తి, మిర్చి పండించాలనుకున్న తండ్రికొడుకులు-కలెక్టరాఫీసులో పనిచేసే దేవేందర్ మాటలు విని 'ఊరిపక్కన విమానాలు దిగే ఏరోడ్రమ్ కడతరని, భూములకు మంచి గిరాకి వస్తుందని, సర్కారోళ్ళు కొనుక్కుంటరని ఆశపడతారు 'గుడిసెలు గుడిసెలు కథలో, ఊర్లో వాళ్ళు చెల్కలే మవుతాయేమోనని ఆలోచిస్తూ వుండగానే గవర్నమెంటు ఉద్యోగులు, పోలీసులు, ఇంజనీర్లు వస్తారు బుల్‌డోజర్లు మొత్తం చదును చేస్తాయి. ఇండ్లను నేలమట్టం చేస్తాయి 'మీరేం బాధపడకండి గవర్నమెంటు మీకు పక్కా ఇళ్ళు కట్టించి ఇస్తుంది తడికెలతో టెంపరరీగా అదిగో అక్కడ ఇళ్ళు కట్టిస్తున్నాం" అంటాడు వచ్చిన ఆఫీసరు మరుసటి రోజుకల్లా ఖాళీ జాగాలో వందల కొద్దీ గుడిసెలు లేస్తాయి గుడిసెలు లేచిన కొన్నాళ్ళకు అక్కడికి కలెక్టరు వచ్చి భూముల వివరాలు వినిపిస్తాడు. భూముల పట్టాలు గందర గోళంగా ఉంటాయి. రైతుల భూములు రైతుల పేరుమీద ఉండవు 'కాగితాల మీద రికార్డుల్లో లేకపోతే మేమేం చేయలేం! ఇప్పుడు నేను చదివి వినిపించిన భూములకే రైతులకు డబ్బు అందుతుందని' చావు కబురు చల్లగా చెపుతాడు కలెక్టరు. అడ్డికి పావుసేరు లెక్కన భూములు అమ్ముడుపోవడం చూసి రైతులు నిశ్చేష్టులవుతారు. భూములకు భూములు పోగొట్టుకుంటారు రైతులు, డబ్బులకు డబ్బులు నష్టపోతారు. నౌకరిస్తామని మొండి చెయ్యి చూపుతుంది గవర్నమెంటు అన్ని విధాల నష్టపోతారు

రైతులుగా బతికిన వాళ్ళు చివరకు పస్తులతో చావలేక కాంట్రాక్టరు దగ్గర మట్టి మోసే కూలీలుగా చేరతారు చివరకు రైతులు హోటల్‌ల్లో పనిచేసే వాళ్లుగా, పైపుల దుకాణాల్లో పైపులు మోసే కూలీలుగా, రిక్షా పుల్లర్లుగా బతుకీడ్చడానికి పూనుకుంటారు శీతయ్య పెళ్ళాం సరోజలాంటి వాళ్ళు నాలుగిళ్ళలో పనిచేసే పనిమనుషులుగా మారిపోతారు ఒకరిద్దరు కాంట్రాక్టర్లు బ్రోకర్లు బాగుపడతారు. ఏరోడ్రోమ్ వెలిగిపోతుంది దిగిన విదేశీయులు గుడిసెలు చూసి డర్టీ ఇండియా, పూర్ ఇండియా అంటూ ఆశ్చర్యపోతారు వరవరరావన్నట్లు 'గుడిసెలు గుడిసెలు' కథ ఒక భవిష్యత్తు పీడకల మాత్రమే కాదు ఇవాల్టి చేదు నిజం కూడా అభివృద్ధి పేరుతో ఏ పెద్ద ప్రాజెక్టులు వచ్చినా, ఏరోడ్రోమ్‌లు వచ్చినా, ఫ్యాక్టరీలు వచ్చినా పేదలకు, రైతులకు, కూలీలకు జరిగేది ఏమీ ఉండదు ఉన్నది ఊడ్చుకు పోవడం తప్పా.

బతుకు భారమైపోయినపుడు, బతుకు తెరువు లేదనిపించినపుడు, మనిషి ఆత్మహత్యకు పాల్పడతాడు చావు సమస్యలకు పరిష్కారం కాకపోయినా, బతకలేక చావును కోరుకుంటారు ఒక మనిషి చావును కోరుకుని నిండుప్రాణాన్ని చేతులారా చంపేసుకోవడానికి సిద్ధమైనాడంటే ఆ తప్పు ఆత్మహత్యకు పాల్పడిన వ్యక్తిది కాదు ఆ తప్పు ఆ వ్యక్తిని అట్లా ఆత్మహత్యకు పురిగొల్పిన వ్యవస్థది వ్యక్తులది. దోపిడీ దౌర్జన్యాలు నిండిన సమాజానిది ప్రభుత్వానిది 'మింగుతున్న పట్నం' కథలో కష్టజీవి ముత్తమ్మ పట్నంలో పని దొరుకుతుందని కరువు మూలంగా వలస వచ్చి మొగుడు కల్తీసారా తాగి సచ్చినా కంటతడిపెట్టదు పిల్లల్ని సాకడం కోసం నానా తిప్పలు పడి చివరకు పట్నం మిగిల్చిన చేదు అనుభవాలతో బతకలేమని తెల్సి కారంలో ఎలకల మందు కలిపి పిల్లలకి పెట్టి తనూ తిని కన్నుమూస్తుంది నిజానికి ముత్తమ్మ కుటుంబానిది ఆత్మహత్య కాదు. హత్య దుర్మార్గ సమాజానికి ముత్తమ్మచావు ఒక నిరసన అనిపిస్తుంది 'అప్పుల బతుకులు' కథలో పట్నంలో నాలుగు వీధుల్లో పాలుపోసి బతుకీడుస్తూ వచ్చిన సమ్మయ్య అప్పుల బాధలు తట్టుకోలేక ఎలకలమందు తిని చచ్చి పోతాడు. సమ్మయ్య మంచివాడే, మాటకారే, అయినా బతుకు సమ్మయ్యకు చేదు విషమైపోయింది. సమ్మయ్య బతకలేక చచ్చిపోయాడే తప్పా. కాలం తీరో, రోగమొచ్చో చావలేదు పట్నాల దుర్మార్గాలకు సమ్మయ్య చావు ఒక చురక

పట్నాలు, నగరాలు అభివృద్ధి వైపు పయనిస్తున్నాయో, లేక మూఢ నమ్మకాల వైపు, హేతు రహిత, విశ్వాసాల వైపు పయనిస్తాయో అర్థంకాని అయోమయంలో వున్నాయి రాతి విగ్రహాలు, లోహం విగ్రహాలు, మట్టి విగ్రహాలు మనుషులు చేసినవే. అవి పాలు తాగుతాయని ప్రసార మాధ్యమాలు, పత్రికలు పుకార్లు పుట్టిస్తే గుడ్డిగా నమ్మడమే కాదు లీటరు పాలు వంద రూపాయలకు కొని రాళ్ళమీద, పుట్టలమీద, చెట్లమీద ముఖ్యంగా వినాయకుడి మూతి దగ్గర పోసిన సంస్కృతి మనది. అలాంటి సంస్కృతి మధ్య బతికే పోచయ్య. పుల్లమ్మలు, కన్నబిడ్డల్ని చంపుకోక చేయగలిగింది ఏముంది. డబ్బు పిచ్చి, మత పిచ్చి ఎక్కువైపోయిన చోట మానవత్వం మంట కలుస్తుందనడానికి సాక్ష్యం "పాలు పొంగె పుణ్యభూమి" కథ

"నిశ్శబ్దం .. నిశ్శబ్దం" కథలోని సుకన్యది చావుగాని చావులాంటి జీవిత వ్యథ. ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీలో వచ్చిన విప్లవం పుణ్యమా అని అందరూ అమెరికా వెళ్ళే మొగవాళ్ళను పెళ్ళి చేసుకుంటే సుఖపడిపోతామని భ్రమలో బతుకుతారు. ముఖ్యంగా అమ్మాయిల తల్లిదండ్రులు. 'నిశ్శబ్దం నిశ్శబ్దం' కథలో సుకన్య అనుభవించిన ఒంటరితనం, నిరాదరణ, హింస, చావు కంటే తక్కువేమీ కాదు. రచయిత్రి ఆమె ఒంటరితనాన్ని మానసిక స్థితిని రాక్షసుడు రాజకుమారిని ఎత్తుకుపోయి ఒంటిస్థంభం మేడలో పెట్టినట్లు పోల్చి చూపించింది ఒక వాస్తవాన్ని చెప్పడానికి ఒక అవాస్తవాన్ని కల్పించడం అందులోని ప్రత్యేకత.

'విసుర్రాయి' సంపుటిలోని కథలు స్త్రీల విషాద హింసామయ జీవితాలకు అద్దం పడితే - 'మింగుతున్న పట్నం'లోని కథలు తెలంగాణా బతుకులకు,

కరువులకు, పట్టణ నగరాల రాక్షసత్వానికి నిలువుటద్దాల్లా కనబడుతున్నాయి. ఈ కథలు చదువుతూవుంటే - ఎంత గోడు, ఎంత బాధ, ఎంత ఆర్తి, ఎంత ఆశ, ఎంత కసి, ఎంత కోపం, ఎంత దుఃఖం, ఎన్ని కష్టాలు, ఎన్ని కన్నీళ్ళు, ఎన్ని చావులు .. అన్నీ గుర్తుకొచ్చి మన చుట్టూవున్న సమాజం, మన సంబంధాలు, మన జీవితం ఇట్లా వుందా అని ఆశ్చర్యపోతాం. ఆలోచనలో పడతాం.

# బోయ జంగయ్య

**♦ బి.ఎస్. రాములు ♦**

**బో**య జంగయ్య గారి జీవితంలాగే వారి కథలు కూడా విశిష్టమైనవి అతని జీవితమే అతని సాహిత్య పథాన్ని ముందుకు నడిపింది జీవితానుభవాలే సాహిత్యరూపం సంతరించుకుంటాయనడానికి జంగయ్య చూసిన జీవితమూ, రాసిన సాహిత్యమూ నిలువెత్తు సాక్ష్యం యిస్తాయి.

1942 సెప్టెంబర్‌లో ఒకటవ తేదీన నల్గొండ జిల్లాలోని అమ్మమ్మగారి ఊరైన లింగారెడ్డిగూడెం పూరిగుడిసెలో పుట్టారు సొంత ఊరు పంతంగి పేదవాడలో పెరిగారు జంగయ్యగారి మాటల్లోనే చెప్పాలంటే "నాకంటె ముందు వాళ్ళు అప్పటి రోగాలకు గురై అకాలమరణం చెందగా చివరికి మిగిలింది నేను, నా తర్వాత ఓ సోదరి నా బాల్యంలో అమ్మానాన్న హైద్రాబాద్‌లో ఉండేవాళ్ళు రోజువారీగా దొరికిన పని చేసుకొని పూట గడుపుకునే వాళ్ళు ఆ పట్టణంలో చదువుకునేవాళ్ళను చూసి, నన్ను చదివించాలనే కోరిక కలిగిందట."

"నా ఎత్తు చెక్కపలక, దోసాకు పసరు, బొగ్గుతో శుభ్రం చేసికునేవాణ్ణి పోలీసు యాక్షన్ తరువాత ముస్లిం సోదరులు వదిలివెళ్ళిన నాటి జాగీరుదారుని బంగ్లాలో నేడు స్కూలు క్లాసులో నన్ను నా మిత్రుడు లక్ష్మిపతిని మిగతా విద్యార్థుల పక్కన కాకుండా కొంచెం దూరంగా కూర్చోబెట్టేవారు. అట్లా అక్కడ ఆ వూళ్ళో నాలుగవ తరగతి వరకు చదివాను. ఐదవ తరగతి హైద్రాబాద్‌లో జస్లమ్ ఏరియాలో ఓ రేకుల గుడిసెలో ఉంటూ చదివాను. 1955-56లో ఆరవ తరగతి జిల్లా హెడ్ క్వార్టర్స్‌లో చదువుతూ ప్రభుత్వ వసతి గృహంలో నివాసం. అట్లా పన్నెండవ తరగతి వరకు సాగింది. తల్లిదండ్రులు ఊళ్ళో రైతుకూలీలు. చాలీ చాలని చేతి ఖర్చులకోసం మధ్య మధ్య కూలీపనికి వెళ్ళడం. 1964లో బి.ఏ.లో చేరాను. 1967లో అది ముగిసింది. కాలేజీలో ఉన్నప్పుడు కథలు రాయడం జరిగింది అంతకుముందు పదవ తరగతిలో వున్నప్పుడు 'కష్ట సుఖాలు' నాటిక రాసి, పాఠశాల వార్షికోత్సవంలో ప్రదర్శించి, పదుగురి ప్రశంసలు పొందటం జరిగింది. ప్రథమ బహుమతినీ గెలుచుకున్నాం. దీనిని 1963లో పుస్తకంగా ప్రకటించాను అదే నా మొదటి పుస్తకం."

"విద్యార్థి జీవితమంతా ఒడిదుడుకులే! అమ్మ చనిపోయింది. అమ్మ చావుతో ఇంటికి ఓ కూలిరావడం ఆగిపోయింది. రెండు పూటలు తిండి పోయి ఒక్కపూటకు తగ్గింది. కారంపొడి, పచ్చిపులుసు ప్రధాన ఆహారంగా మారింది. నేనొక్కడ్నే కాదు నాచుట్టూ వున్నవాళ్ళ పరిస్థితి దాదాపు అంతే. ముంజలు,

తాటిపండ్లు, సీతాఫలాలు, చింతచిగురు ఆ రోజుల్లో అందుబాటులో ఉండే ఆహారం పేదరిక బాధలు ఇంతా అంతా కావు వాటికిచ్చిన రూపమే నా కథలు వాటికి తోడు కుల అవమానం కుంగదీసేది నాకు చదువు అన్నం పెట్టింది ఆలోచన రచయితను చేసింది నేను రాసిన అన్ని కథల వెనక నేను చూసిన వాస్తవాలున్నాయి"

ఇలా స్వాంతంత్ర్యం వచ్చాక రాయడం నేర్చిన తొలితరంనుండి ఉన్నత శిఖరాల కెదిగిన తొలి కథకుడు బోయ జంగయ్య అంచెలంచెలుగా ఎదిగి ట్రెజరీ శాఖలో అసిస్టెంట్ ట్రెజరీ ఆఫీసర్‌గా రిటైరైనారు బోయ జంగయ్య, భారతీయ గ్రామీణ అంతరాత్మను, పీడితుల, పేదల బతుకు అంతస్సారాన్ని కథా కథన శిల్పంలో నింపుకున్న గొప్ప కథకుడు భారతీయ సాహిత్యం ప్రపంచ సాహిత్యానికి తన వంతు వారసత్వంగా అందించే గొప్ప రచయితల్లో బోయ జంగయ్య ఒకరు శ్రామిక ప్రజలనుండి పుట్టి ప్రజల గురించి ప్రజల కోసం ప్రజాశిల్పంతో రాసే నిఖార్సయిన శ్రామికవర్గ ప్రజారచయిత బోయ జంగయ్య.

బోయ జంగయ్య, మపాసా, బాల్జాక్, మార్క్‌ట్వేన్, చెహోవ్, టాల్‌స్టాయ్, గోర్కి, షొలకోవ్, లూసన్, రవీంద్రనాథ్ టాగూర్, కిషన్ చందర్, ప్రేంచంద్, కొకు అఖిలన్, సాదత్ హసన్ మంటో, నామ్‌దేవ్ ఢసాల్, మహాశ్వేతాదేవి, పాలగుమ్మి పద్మరాజు, కారా, చాసో, రావిశాస్త్రి, కొలకలూరి ఇనాక్‌ల వారసుడిగా వారి వరుసలో నిలువెత్తు నిలబడిన కథకుడు వారికన్నా అదనంగా కుల అణిచివేత, కష్టాలు ఎదుర్కొని ఎదిగివచ్చిన కథకుడు కూడా తెలుగు విశ్వవిద్యాలయం వారి అత్యున్నత పురస్కారంతోపాటు ఎన్నో అవార్డులందుకున్న రచయిత కూడా

స్వాతంత్ర్యం తర్వాత పదిపదిహేనేళ్ళకే ప్రజల్లో అసంతృప్తి మొదలైంది. సామాజిక మార్పు దిశగా వెళ్ళడానికి స్వాతంత్ర్యం సాధనమవుతుందనుకున్న ఆశలు భ్రమలుగా భావించడంగా మొదలైంది రాజకీయాలు సామాజిక ఉద్యమాలు రెండూ వేర్వేరు దారులయ్యారు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందు తెలంగాణాలో ఎదిగిన సాహిత్యం ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక భ్రూణహత్యకు గురైంది 1968-71ల్లో సాగిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమం యువతరంలో రగిలించిన ఆత్మవిశ్వాసానికి కొలబద్దలు లేవు. ఇలా తిరిగి పొందిన ఆత్మవిశ్వాస క్రమంనుండి పాదులు వేసుకున్న రచయిత బోయ జంగయ్య. బోయ జంగయ్య కథకుడుగా ఎదగడంతో రాజ్యాంగం, అంబేద్కరిజం, దళిత జీవితానుభవం, ప్రత్యేక తెలంగాణా ఉద్యమం, కమ్యూనిస్టు పోరాటాల పరోక్ష ప్రభావంతోపాటు ట్రెజరీ శాఖలో దొరికిన చిన్న పాటి ఉద్యోగం ప్రధాన పాత్రను పోషించాయి

బోయ జంగయ్య తన యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా సామాజిక పరిణామాల గుండా ప్రయాణించాడు అందువల్ల వీరి కథల్లో 50 ఏళ్ళ సామాజిక పరిణామాలు చిత్రితమయ్యాయి. వస్తు వైవిధ్యంతో ప్రతికథా ఒక

ప్రత్యేకతను సంతరించుకున్నది తెలుగు కథా సాహిత్యంలో తన స్థానాన్ని ఒపెన్ కాంపిటేషన్‌లో జనరల్ కేటగిరిలో గెల్చుకున్న ధీరుడు బోయ జంగయ్య. అరసం అరసం వాళ్ళకు, విరసం విరసం వాళ్ళకు పెద్ద పీట వేస్తున్న కాలంలో తన పీఠం తాను ఏర్పరచుకున్న శ్రామికవర్గ మహారచయిత బోయ జంగయ్య శ్రీశ్రీ, రావిశాస్త్రి, కారాలను, విరసం తన ప్రతిష్ఠ కోసం మోస్తే, శ్రీశ్రీ, రావి శాస్త్రులు, బోయ జంగయ్యను భుజాల కెత్తుకొని ప్రశంసించారు.

బోయ జంగయ్య జీవితంలోని ఒక అంశాన్ని కథగా రాస్తాడు జీవితాన్నంతా ఒకే కథలో చెప్పాలనే ఉబలాటం లేని స్థిత ప్రజ్ఞుడు చిత్రించేది వాస్తవ జీవితమే అయినా తానుచెప్పదల్చుకున్న అంశం కోసమే కథ రాస్తాడు విలువిద్య సాధనలో అర్జునునికి చెట్టు పిట్ట కాకుండా, చెట్టుమీద పిట్ట కన్ను మాత్రమే కన్పించిందట. అట్లా ఎన్నుకున్న కథాంశం నుంచి ఎటువైపు తొంగిచూడకుండా గురిచూసి రాసే విలుకాడు బోయ జంగయ్య

బోయ జంగయ్య కథల్లో ఒక్క వాక్యం ఎక్కువ వుండదు. ఒక్క వాక్యం తక్కువ వుండదు. వ్యక్తిగతంగా అతను బోళామనిషి కథనంలో మాత్రం బోళాతనం కాకుండా ప్రతిపదాన్ని, వాక్యాన్ని బంగారంలా తూచివేసే పిసినిగొట్టు కులం పేరు చెప్పుకుంటే వచ్చిన పేరు పోతుందనుకునే దళితులు, దీనులు, హీనులున్న కాలంలో సాహితీ లోకంలో జైత్రయాత్రతో గెలుచుకున్న కీర్తిని మాదిగ సాహిత్య పరిషత్ వేదికనలంకరించి తన కులానికి నైతిక బలాన్ని, ఆత్మ గౌరవాన్ని అందించినవాడు బోయ జంగయ్య.

రావిశాస్త్రి రాజ్యాన్ని, అల్లం రాజయ్య విప్లవ పార్టీని, కాలువ మల్లయ్య జీవితాన్ని, బి.ఎస్.రాములు మానవ సంబంధాల్ని కేంద్రం చేసి కథలు రాస్తారు. వి.చంద్రశేఖరరావు, ఆడెపు లక్ష్మీపతి శిల్పాన్ని కేంద్రంగా చేసికొని కథలు నిర్మిస్తారు. బోయ జంగయ్య సామాజిక సమస్యల్ని, అవి వ్యక్తి జీవితంలో ప్రతిఫలించే తీరును శిల్పం మీద నిలబెట్టి చెక్కుతారు.

బోయ జంగయ్య గారికి వర్గ స్పృహ వుంది. కుల స్పృహ వుంది. స్త్రీవాద దృష్టితోపాటు దేశీయతా స్పృహ వుంది తెలంగాణా మాతృభాష ధ్వని కనువుగా మార్చుకున్న శిల్ప రహస్యం వుంది.

సాహిత్యానికి, సాహిత్య శిల్పానికి వర్గ, వర్ణ, కుల స్వభావం సమకాలీన స్వభావంతోపాటు, జెండర్ స్వభావం, దేశీయ స్వభావం, సంస్కృతి స్వభావం కూడా వుంటుంది. సాహిత్య శిల్పం కూడా రచయితల వ్యక్తిత్వాన్ని, కుల స్వభావాన్ని, జెండర్‌ను, సంస్కృతిని వ్యక్తీకరిస్తుంది ప్రజల పక్షం వహించిన రచయితల్లో పెత్తందారీ ఆధిపత్య ధోరణి (నేను మరియు ప్రపంచం,' నేను ప్రపంచాన్ని, అహంబ్రహ్మాస్మి 'వంటివి) శిల్పంలో కథాకథనంలో కన్పిస్తే వారు ప్రజల పక్షం వహించేపేర సమాజంపై, ప్రజలపై ఆధిపత్యం చెలాయించే అంతర్గత స్వభావం కలిగివున్నారని అది తెలుపుతుంది. బోయ జంగయ్య శిల్పంలో ఒప్పించే తీర్పు, అమాయకంగా కన్పించే గొప్ప చాతుర్యం, ప్రజలపట్ల అచంచల ప్రేమ వ్యక్తమవుతుంది

బోయ జంగయ్య కథా వస్తువూ శిల్పమూ చెహోవ్, గోర్కీ, కిషన్ చందర్, ప్రేంచంద్ వదిలిపోయిన క్రమానికి చెందినది వారి కథలు పాతవ్యవస్థలో ఉన్న ప్రజల దీనస్థితిని తెలిపితే బోయ జంగయ్య కథలు పాత వ్యవస్థ మారుతూ కొత్త వ్యవస్థ, కొత్త ఆత్మవిశ్వాసం రూపుదిద్దుకుంటున్న తీరును తెలుపుతాయి

బోయ జంగయ్య గారు యిప్పటికి 20 పుస్తకాలు వెలువరించారు 125 దాకా కథలు, రెండు నవలలు పిల్లల కోసం బడిలో చెప్పని పాఠాలు, సులభశైలిలో అంబేద్కర్, జగజ్జీవన్‌రామ్, కె ఆర్ నారాయణ్, జాషువాగార్ల జీవిత చరిత్రల, పరిచయం, అయిదు వచన కవితాసంపుటాలు వెలువరించారు వచన కవిగా శ్రీశ్రీ, కాళోజీ, గజ్జల మల్లారెడ్డి వంటి వారి ప్రశంసలందుకున్నారు 'తెలంగాణా వెతలు' అనే కథల సంపుటి తెలంగాణా పోరాట ప్రజల బతుకు పోరు చరిత్రను కథల్లో రికార్డు చేసింది

డా॥ ఆవంత్స సోమసుందర్ గారన్నట్లు "బోజ కథారచనలో అనవసర విస్ఫోటాలు, తెచ్చికోలు గొప్పలు, షోకిల్లా మెరుగులు, గోసాయి చిట్కాలు ఎక్కడ వెతికినా కనిపించవు. మంచి నీళ్ళంత స్వచ్ఛ సుందరంగా అతని కథలు తళతళ లాడుతాయి ఈ దేశవాసుల బాధా సహస్రాలే ఇతని గాథా సప్తశతులుగా పలకరిస్తాయి"

కాళోజీ గారన్నట్లు "ఆలోచనలు కలిగించే కవితలు రాసిన జంగయ్య అద్భుతమైన కథలు రాశాడు. గొర్రెలు, దున్న, ఎచ్చరిక, తెలంగాణా వెతలు అన్నీ సామాన్యుల గురించి రాసినవే. అసలు మనిషికి కష్టాలు ఎందుకు వస్తాయి? వాటికి కారకులు ఎవరు? అని ఆలోచించ మంటాడు కష్టాలకు కారణాలు వెతకమంటాడు. ప్రశ్నించమంటాడు ఎచ్చరించమంటాడు ఎదిరించ మంటాడు".

ఎన్నికలకు ముందు కార్యకర్తలు, నాయకులు పోట్లాడతారు. ఎన్నిక లయ్యాక నాయకులు కలిసిపోతారు కార్యకర్తలమధ్య వైషమ్యం అలాగే మిగిలి పోయే తీరును 'గొర్రెలు' కథలో చిత్రించారు బోయ జంగయ్య

ప్రజల సేవ కోసం నియమించబడ్డ ప్రభుత్వ ఉద్యోగులు ప్రజల పట్ల పీడకులుగా మారిన తీరును 'దొంగలు, అద్దం' కథలు చిత్రిస్తాయి. గొర్రెల పెంపకం కోసం అప్పు కావాలని ప్రభుత్వ ఆఫీసుల చుట్టూ తిరిగి తిరిగి ఖర్చుల పాలైన తీరు 'దొంగలు'.

దొంగలు కథలోని బీరప్ప చెహోవ్ రాసిన 'గమస్తా మరణం' లో జీ హుజూర్ అనకుండా దొంగనాకొడుకులు, తలుచుకుంటే అరగంట, తలుచుకుంటే ఆర్నెల్లా అని లోలోపల తిట్టుకున్నాడు. గొర్రెను తిన్న నాకొడుకులు ఇంత ఇస్సాసం లేదు వీళ్ళకంటే నామందకాడి కుక్క నయం. చారెడు గంజివేస్తే దినమంతా మంద కాసుద్ది అంటూ అవ్యక్త సమాజ భావాల్ని సభ్య సమాజానికి చెర్నాకోలలా అంటిస్తారు బోయ జంగయ్య. తాను ఏం చెప్పదల్చుకున్నాడో దానికి అనువైన పాత్రల్ని,

సంఘటనల్ని, సన్నివేశాల్ని చిత్రించాక ఇక 'రచయిత విడిగా చెప్పేదేముంది? బోయ జంగయ్య శిల్ప రహస్యాల్లో యిదొకటి

ప్రభుత్వ శాఖల అవినీతి గురించి ఎన్నో కథలు వచ్చాయి కానీ 'దొంగలు' లోని ముగింపు యివ్వడం నిఖార్సయిన ప్రజా రచయితకే సాధ్యం లంచం కోసం తన చేతి వెండి కడియం గుంజుకున్న ఉద్యోగుల్ని దొంగలు దొంగలు అని అరిచాడు బీరప్ప బస్సులోని జనం ఒక్కసారే లేచి వారిని చితకతన్నారు. బస్సుకదిలింది. బీరప్ప చేతికి కడియం మెరుస్తుంది అని కథ పూర్తవుతుంది

ఇలాంటి కథను ఇదే గొల్లల గురించి, ప్రభుత్వ ఉద్యోగుల అవినీతి, జులుంగురించి నేను గతంలో రాసినపుడు 'ఇంటర్వ్యూ' అన్న కథలో అన్యాయాన్ని వ్యతిరేకించడానికి ప్రజల్ని కూడా గట్టకుండా వర్గశత్రునిర్మూలన చేసి యావజ్జీవ శిక్షపడి కుటుంబమంతా చెల్లా చెదురైనట్టు రాశాను అల్లం రాజయ్య అదే కాలంలో ఇదే అంశంపై "అడవి మనిషి" కథను గొల్లల గురించి రాస్తూ "సారలీ ఇక నిర్బంధాల్లో బతకలేవు. విప్లవోద్యమంలోకి ఇల్లు విడిచి వెళ్ళిపోవాలని కొడుక్కు చెప్పడంతో ముగించాడు ఇది పార్టీకి కావాల్సిన కేడర్ రావాలని రాసిన కథే తప్ప, ప్రజలకోసం వారి సమస్య పరిష్కారం కోసం రాసిన కథ కాదు. ఇంటర్వ్యూ, అడవి మనిషి కథల్లో రచయితలు ప్రజలకు పోలీసుల్ని చూసి భయపడడం నేర్పితే బోయ జంగయ్య చీకట్లో బీరప్పను చూసి ఉచ్చపోసుకునే పోలీసులను గురించి రాసి చార్లీ చాప్లిన్‌లా అపహాస్యం చేస్తాడు. నిజమైన ప్రజా రచయితకూ, పార్టీ తరపు రచయితకు ఎంతో వైరుధ్యం వుంటుందని యిది స్పష్టం చేస్తుంది. ఒకరు పార్టీ అవసరాల్ని చిలక పలుకులు వల్లిస్తే, బోయ జంగయ్య ప్రజల సమస్యను, ఆ సమస్యను ఎంత వేగంగా ప్రజల్లోనే పరిష్కరించుకోవచ్చో వ్యూహం ఎత్తుగడలు నేర్పుతారు.

"చెదలు" కథ పేద రైతులు ఎందరి చేత ఎన్నివిధాలుగా దోపిడీ చేయబడుతున్నారో చిత్రిస్తుంది. గౌడ కులంలోని కులవృత్తిలో ఎదురయ్యే సామాజిక సమస్యను అదే సమాజంలో ఎలా పరిష్కరించుకున్నారో చెప్పిన తీరు "కుండ బద్దలు కొడత" కథలో చిత్రించారు. ఈ కథలో మానభంగం జరిగిన తీరును చెప్పి రచయిత పంచాయితీలో కూర్చున్నవారికి, పాఠకులకు ఉత్కంఠ కలిగిస్తారు. ఎవరు చేశారో చివరిదాకా చెప్పరు. పల్లెలోని పెత్తందార్లను ఒక సాదాసీదాగా ముసలి అత్త బోనులో నిలబెట్టిన తీరు ప్రజాభిప్రాయాన్ని, పంచాయితీ పెద్దలను కూడగట్టిన కథాకథనం తీరు తెలుగు సాహిత్యంలో అద్భుతం

"చూడుర్రి! మీరు సిగిత్స చేయకుంటే కుండబద్దలు కొడుత! నలభయి ఏళ్ళనుండి నా కడుపులో దాగినయన్నీ కక్కేస్తా! అప్పుడు సూడు ఎన్ని సంసారాలు గంగపాలు కావాల్నో!" గుండె చరుచుకుంటూ అంది అత్త.

దొర కొడుకులే ఈ పనిచేశారని ముందే చెప్తే నిందితులకు తన్నులు పడేదిపోయి బాధితురాలిమీదే నిందలేసి మీసం మెలేసేక్రమం ఉత్పన్నమవు తుంది. అందుకని సమస్యను ముందుంచి అందరి అభిప్రాయం దోషులకు

వ్యతిరేకంగా కూడగట్టిన తర్వాత దోషులెవరో బయట పెట్టారు ఇలా పల్లెటూరి జీవనక్రమాన్ని, మానవ స్వభావ సారాన్ని కాచివడబోసిన బోయ జంగయ్య పీడితులు జీవితాన్ని ఉన్న పరిధిలో ఎలా గెలవాలో సూచించారు

సోమసుందర్ గారు ఈ కథ ప్రత్యేకత గురించి ఇలా అంటారు "ఊరు నేలమని ఓట్లేస్తే మంది ఆడోళ్ళను గుంజితే ఎట్ల దొరా" అని అడిగింది వాళ్ళకోసం మనుషుల్ని పంపితే ఇంటిదగ్గర దొరకలేదు వాళ్ళేమైపోయారని మీమాంస పడుతుంటే ఒక పోరగాడు ఆముదం చేలో దాక్కున్నారని చెప్పాడు.

"రాములు తన కోత కత్తితో ఉరికాడు కొందరు మహావిప్లవ రచయితల్లాగా రచయిత రాములు చేత పెళ్ళాన్ని ముక్కలు ముక్కలుగా నరికించి గోనె బస్తాల్లో పెట్టింది జెండా కాడకు తెప్పించలేదు. పోనీ తన గౌరవాన్ని మట్టిలో కల్పిన శత్రువునైనా చంపేసి మొండెం తేలేదు. అలాంటి ఫీట్లు చేసి కథరక్తి కట్టించడం తెలికే బోయ జంగయ్య రాముల్ని ఆముదం తోటలోకి పంపించాడు. ఎంకటేశ్వరరావు పెద్దరెడ్డి, ఒకరినొకరు చూసుకుంటుండగా కథ ముగిసి పోయింది. కడకు ఏం జరిగిందో చివరికల్లా చెప్పక్కర లేదు"

ఇట్లా జంగయ్య తన కథల్లో రాజ్యాన్నో, అధికారాన్నో తప్పుపడ్తూ, దానిచేత ఓడిపోయే జీవిత క్రమాలు సాగే తీరులో బతకాలనుకోలేదు. అంబేద్కరిస్టు కావడంవల్ల అంబేద్కర్‌లాగే జంగయ్య తన చుట్టూ ఉన్న సమాజం మారాలని కోరుతూ కథనం చేశారు. అందువల్ల బోయ జంగయ్య కథనరీతి సమాజంలో భాగంగా సమస్యను పరిష్కరించే ప్రజాస్వామిక సంస్కృతిని కలిగి వుంటుంది.

అనుబంధాలు, మానవీయ విలువలు కోల్పోయి నేటి మనుషుల మనుగడ ఎంత యాంత్రికమవుతున్నదో 'వైకుంఠపాళి' కథలో చిత్రించారు

బోయ జంగయ్య గొర్రెలు, దున్న, ఎచ్చరిక, చీమలు, రంగులు, తెలంగాణా వెతలు, బోజ కథలు, అనే కథాసంకలనాలు వెలువరించారు. వీరి కథలు ముద్రణలు పొందాయి పలుసంకలనాల్లో చేరాయి. వీరు రాసిన కథల్లో చాలా కథలు సాహిత్యంలో నిలబడిపోతాయి ముఖ్యంగా దొంగలు, చెదలు, చీమలు, దున్న, మరుగుమందు, దొరసాని ఇంకానా ఇకపై సాగవు, ఎచ్చరిక, కుండబద్దలు కొడత, బొమ్మలు, ఒయాసిస్సు, తుపాకులు, సాలిని, ఇది కతా!, పాము, నాపేరు రాయొద్దు, వాయిదా పడిన కేసు, అడ్డం, కరెంటు కథ, లేకి బతుకులు, తెల్లకార్డు, ఊరు అదృశ్యం, చేపల చెరువు, శిధిల విగ్రహాలు, కొమ్ములు లేని ఎడ్లు, ఉప్పునీరు మొదలైన కథలు ప్రముఖంగా పేర్కొనదగినవి ఇంకా మరమరాలు, నిమజ్జనం, రంగులు, మనసు, గత్తర, బంచరాయి, పనిష్మెంటు, బతుకుపాట, మబ్బులు మొదలైన కథలు వస్తుశిల్పాల రీత్యా గుర్తుంచుకోదగిన కథలు

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంకానీ, నక్సల్బరీ తరహా తెలంగాణా పోరాటాలు కానీ గత ముప్పయి ఏళ్ళుగా ఎస్సీల్లోంచి ఎస్టీలోంచి ఒక్క కథా రచయితనైనా తయారు చేయలేకపోయాయి. అంబేద్కర్ పోరాడి సాధించిన హక్కుల్లో భాగంగా బోయ జంగయ్య జీవితాన్ని గెలుచుకుంటు గొప్ప కథకుడిగా

కూడా ఎదిగారు అందుకే అంబేద్కర్ నా పెంపుడు తండ్రి అని తన సామాజిక మూలాల్ని, చారిత్రక దృక్పధాన్ని ప్రకటించుకున్నాడు. విప్లవాల ఖిల్లా నల్లగొండ జిల్లాలో ఆవిర్భవించిన ఈ వృక్షం అంబేద్కర్ నాటిన విత్తనం

కష్టాలు, కన్నీళ్ళు, పేదరికం, కుల అణచివేత పెట్టే మానసిక హింస, నిరాశ, ఆత్మ న్యూనత బాగా తెల్సినవాడు, స్వయంగా అనుభవించినవాడు కావడంవల్ల బోయ జంగయ్య కథల్లో వారికవసరమైన గొప్ప ఆత్మవిశ్వాసం, జీవితం పట్ల ఆశ, పీడితులే గెలిచే క్రమం చిత్రించాడు.

పేద ప్రజలు ఆధునిక అభివృద్ధిని అందుకోవడంలో ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యల్లో అధికారుల, ఉద్యోగుల అవినీతి నిర్లక్ష్యం ప్రధానమైనవని వారికి నిత్యానుభవం. అందువల్ల బోయ జంగయ్య పెద్ద పెద్ద సిద్ధాంత చర్చల్లోకి పోడు పెద్ద పెద్ద రాజకీయాల గురించి ఊదరగొట్టడు. నిత్య జీవిత సమస్యలను పట్టించుకుంటూ వాటిని పరిష్కరించుకునే తీరును అంతర్లీనంగా సూచిస్తారు

ఆంధ్ర ప్రదేశ్‌లో భూసంస్కరణల చట్టాలు వచ్చాక, పట్వారీల స్థానంలో పూర్తి స్కేలు జీతంపై ప్రభుత్వ ఉద్యోగులుగా విలేజీ అసిస్టెంట్లను నియమించడం జరిగింది. దీనివల్ల "గ్రామ పెత్తనంలో వచ్చిన మార్పుల్ని "దున్న" కథలో చిత్రించారు. పట్వారి రంగారావు, రెవెన్యూ ఇన్సపెక్టర్‌కు రికార్డులు అప్పగించకుండా పారిపోవడం పల్లె ప్రజలకు దానికదే ఒక సంతోషకరమైన వార్త. పట్వారిది ఏ పాటి ఉద్యోగమో, ఏ పాటి అధికారమో వారికి తెలియడమే అందుకు కారణం

దున్న కథలో ముగింపు మరింత బావుంటుంది. "ఊళ్ళోకి బస్సు వచ్చి పోతుంది కాబట్టి అన్ని డిపార్టుమెంటుల వాళ్ళు వస్తూ వున్నారు" అంటారు. ఇలా సామాజిక పరిణామాలు బోయ జంగయ్య కథల్లో పూసల్లో దారంలా దాక్కొని ఉంటాయి.

"నా పేరు రాయొద్దు"కథ లైంగిక సంబంధాలకు దాంపత్య జీవితానికి మధ్య గల విలువల సమస్యను పెళ్ళి లేకుండా తల్లి అయిన స్త్రీ తన పిల్లల్ని స్కూల్లో చేర్పించాలని తండ్రి పేరుగా పేర్కొనడం కోసం తన జీవితంలోకి ప్రవేశించిన వారిని అడుగుతుంది. వారు నిరాకరిస్తారు. ఆ ఒంటరి స్త్రీ ఆవేదనే "నా పేరు రాయొద్దు" కథ.

స్వాతి కథలో ఒక చెడ్డవాడిని మంచివాడిగా మార్చేక్రమంఎలా సాగిందో, తద్వారా ఆ అమ్మాయిని అతడే పెళ్ళి చేసుకోవాలనుకోవడం చిత్రించాడు. చెడ్డవాడిని చెడ్డవాడని ముద్రవేసి వదిలేయడం తేలిక. కానీ అతనిలో మారాలనే తపన సృష్టించి తనను తాను సంస్కరించుకునేట్లు చేయడం కష్టం. ఆ కష్టమైన పనిని ఎలా సాధించాలో స్వాతికథలో సూచిస్తారు. "వాయిదా పడిన కేసు" కథ వరకట్నం మంటల్లో మాడి అనాకారి అయిన స్త్రీ జీవితం. కోర్టులో ఆమె "నా భర్తకు జైలు శిక్ష విధించవద్దు. మరణ శిక్ష అసలొద్దు. నా భర్త వంద సంవత్సరాలు బతుకుతూ మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదనే శిక్ష విధించండి" అని కోరుతుంది. భారత శిక్షా స్మృతిని ఇలా సవరించడం ఎంతో అవసరం.

సాదాసీదాగా ఒక గొప్ప ఆలోచనను మనముందుంచిన బోయ జంగయ్య లోలోతుల్లో ఎంత దార్శనికుడో ఇది స్పష్టం చేస్తుంది.

మానభంగం గూర్చి అతిగా భయపెట్టే రచనలు కోకొల్లలు అవి వేల ఏళ్ళుగా జరుగుతున్న తీరు తెల్సుకున్న బోయ జంగయ్య పల్లెల్లో చాలామందికి తెల్సిన సులభమైన పరిష్కారాన్ని "నిజం" కథలో చూపారు రాత్రి తన చేతుల్లో రంగారావు మర్మాంగాలు నలిగిపోతూ ప్రాణం వదులుతున్నప్పుడు తన శీలం గురించిన బాధ స్త్రీని వీడిపోయింది. ఇక్కడా బాధితుల్లో ఆత్మవిశ్వాసం కలిగించడమే ఉంది. నిరుద్యోగ సమస్య తీవ్రత గురించి చలించిపోయిన జంగయ్య "పోస్టుమార్టం" కథ ద్వారా పాఠకుల్ని చలింపజేస్తారు. "వైకుంఠపాళి" కథలో అభివృద్ధి అనేది ఇంట్లో తెచ్చిన పరిణామాల్ని చూసిన పెద్దాయన వెంకట్రామయ్య ఢిల్లీనుండి వెంటనే యింటిముఖం పడ్తాడు. మానవీయ విలువలు కోల్పోయిన అలాంటి అభివృద్ధిని ఎవరైనా కోరుకుంటారా! అయినా అభివృద్ధి పేరిట జరిగే పరుగు పందాన్ని ఎవరూ ఆపలేక పోతున్నారు. ఈ వైకుంఠపాళి అభివృద్ధి మరిన్ని జీవితాల్లో ప్రవేశించి జీవితమంటే అర్థం కోల్పోతున్నారు

'బతుకు పాట కథ" కథలో మారుతున్న పల్లె తీరుతెన్నుల్ని సత్యం టీచరు ద్వారా చిత్రిస్తారు. రాజయ్య చెకుముకి కొట్టాడు దూదికి నిప్పంటుకుంది. "అగ్గిపెట్టె కంటే యిదే నయం. దీనికి ఎక్కువ ఖర్చు వుండదు. దూది ఒట్టిగనే వస్తది కాకపోతే యినుపముక్క. ఇది కూడా ఈనాటిదికాదు. మా అయ్యది" అంటూ చెకుముకిని ప్రేమగా చూస్తాడు. ఇలాంటి అపురూప సన్నివేశాలు తెలుగు సాహిత్యంలో అరుదుగా చిత్రించబడ్డాయి. "దాదాపు అరవై ఏళ్ళు నడిచిపోయిన కాలం అడుగుల గుర్తులు రాజయ్య ముఖం నిండా, మరెన్నో అనుభవాల ఆనవాళ్ళు. కోసి వదిలిన వరిమడిలోని కొయ్యకాళ్ళల్లా అతని ముడుతలు పడ్డ ముఖాన పెరిగిన గడ్డం". గ్రామీణ దళిత రైతును ఎంతో ఆత్మీయంగా పాఠకులకు సన్నిహితం చేసే జంగయ్య కథన రీతులు తెలుగు సాహిత్యంలో అపూర్వం.

నిజాయితీ గల ఉద్యోగి యితర ఉద్యోగుల అవినీతికి ఆటంకం కావడం సహజం. "అవసరం" కథలో నిజాయితీపరునికి అవినీతిపరులొక్కటవడం వల్ల బదిలీలయ్యే తీరును చిత్రించారు.

బోజ కథల్లో కథానుసారంగా వెనకటి జీవన విధానం, సంస్కృతిని చిత్రించి యువతరానికి సామాజిక చరిత్రను అందిస్తారు. దొంగలు, కుండబద్దలు కొడత, చెదలు, ఎచ్చరిక, నిజం, దున్న, బతుకుపాట, మరుగుమందు, కరెంటు కథ, పాము, బొమ్మలువంటి కథలద్వారా ఇప్పటి తరానికి తెలియని సంగతులు తెలుస్తాయి

"మరుగుమందు" కథ తెలుగు సాహిత్యంలోనే ఒక అపురూపమైన కథ. బోయ జంగయ్య కథాకథన రీతి ఉన్నత శిఖరాలందుకున్న కథల్లో మరుగు మందు ఒకటి. మూఢ విశ్వాసాలు జీవితాల్ని ఎలా విచ్ఛిన్నం చేస్తాయో

యిందులోని కథా వస్తువు చలం "దోషగుణం" కథలో బ్రాహ్మణ జీవితాల్లోని మూఢవిశ్వాసాలతో బతుకంతా చితికిపోయిన తీరును చిత్రిస్తే బోయ జంగయ్య సామాన్య ప్రజల జీవితాలు "దోషగుణం" వల్ల చితికిపోయిన తీరును "పాము" కథ చిత్రిస్తుంది. "మరుగుమందు" కథ కుటుంబంలోని కలతలకు దారితీసే మూఢవిశ్వాసాల్ని, అందుకు గల అనారోగ్యపరమైన కారణాల్ని నేపథ్యంగా తీసికొని అల్లిన గొప్పకథ

హాయిగా కల్సి బతికే కొడుకు, కోడలు సంసారంలో అత్తగామారిన తల్లి తనకు తెలియకుండానే నిప్పులు పోసిందని రచయిత ప్రతీకాత్మకంగా చెప్తూ కథ ప్రారంభిస్తారు. దుర్గమ్మ తెల్లారకముందే కుంపటి ముందు కూర్చుని అందులో ఎండుపుల్లలు వేస్తూ మంటలేపుతూ ఉంది పల్లెల్లోని కొత్త దంపతులు ఉమ్మడి కుటుంబాల్లో ఎదుర్కొనే సమస్యలు ఎలావుంటాయో ఈ కథలో శిల్పచాతుర్యంతో చిత్రించారు కోడలువెంట కొడుకు తిరగడాన్ని కొత్తమోజు అని సరిపుచ్చుకోకుండా, కొడుక్కు మరుగుమందు పెట్టిందని భావిస్తుంది దుర్గమ్మ. క్రానిక్ మలేరియా వల్ల కొడుకు పుల్లలా అయిపోయాడని చెప్పే వాళ్ళు లేక కోడలు మరుగు మందు పెట్టడంవల్ల అలా అయ్యాడని భావిస్తుంది. పూర్వం పల్లెల్లో తల్లి దండ్రుల ఎదుట భార్యాభర్తల గతి ఎంత భయం భయంగా మొహం చూసుకోలేనిదిగా ఉండేదో ఈ కథలో చూడవచ్చు. కాళీపట్నం రామారావు రాసిన "నోరూం" కథ కొత్త దంపతుల కుటుంబంలోకి చొచ్చుకుపోకుండా పట్నం పంపి చిత్రిస్తే "మరుగుమందు" కథ కుటుంబం లోపలి విషయాలన్నీ తెల్సి రాసిన కథ.

"మరమరాలు" కథ కాస్త నవ్వుతూ మాట్లాడితే అక్రమ సంబంధాలు ఆపాదించే అసూయాగ్రస్త గ్రామీణ సమాజాన్ని తెలుపుతుంది. పల్లెటూళ్ళు స్వచ్ఛమైన మనుషులకు నిలయాలని ప్రచారంలో ఉంది. అవి ఎంత ఈర్ష్య, అసూయ, కుల అణచివేత, పెత్తందారీ దౌర్జన్యాలతో కూరుకుపోయి కొనసాగు తున్నాయో ప్రేమ్‌చంద్ లాగే బోయ జంగయ్య తనకథల్లో అద్భుతంగా చిత్రించారు. అగ్రకులాలవాళ్ళు కింది కులాలతో పనిచేయించుకో మరిగినవాళ్ళు, చుట్టపు చూపుగా పల్లెలకు వెళ్ళేవాళ్ళు పల్లెలు గొప్ప సంస్కృతి నిలయాలని అంటారు. వాటి అంతర్గత సౌందర్యంతోపాటు సమస్త దుర్గుణాలను బోయ జంగయ్య చక్కగా చిత్రించారు.

"కరెంటు కథ", విద్యుత్‌శాఖ అవినీతి తీరును తెలిపే కథ "సాలిని" కథ. సంఘ సేవకురాలైన సాలినిని శీలంలేనిదిగా భావించే పట్టణ సంస్కృతిని చిత్రిస్తుంది. అద్దం కథ కమర్షియల్ టాక్సు అధికారుల దర్పం, అవినీతిని చిత్రిస్తుంది. కిరాణా షాపతని కొడుకు ప్రసాద్ ఎస్‌టీవోను నిలదీయడంతో బేజారైపోయి, తీసుకున్న లంచం కూడా వాపసు యిస్తాడు ఇదే కథను శాడిజంలో కూరుకుపోయిన కొందరు కథకులు - అట్లా నిలదీసిన ప్రసాద్‌ను లాకప్‌లో పెట్టించి లాకప్పులోనే చనిపోయినట్లు చిత్రిస్తుంటారు ఎదిరించినవారి ధైర్యాన్ని చంపేస్తారు. బోయ జంగయ్య ఎదిరించే వారి ధైర్యాన్ని పెంచుతారు. అవి వాస్తవికతకు, ప్రజల చైతన్య స్థాయికి అద్దినట్టు సరిపోతాయి.

"రంగులు" కథలో స్వాతంత్ర్య సమరయోధుడు తన నిస్వార్థతకు ప్రతిఫలంగా బిచ్చగాడుగా మారిన తీరు తెలుపుతారు పాము కథ మూఢ విశ్వాసాలకు చెంపపెట్టు ఇందులో దళితపురుషుల్ని పల్లెల్లో లైంగికంగా వాడుకొని చివరకు ఎలా బలి తీసుకుంటారో చిత్రిస్తారు బంద్‌ల వల్ల పేద ప్రజలు ఎదుర్కొనే అవస్థల జీవితాల్ని "ఇది కతా!" కథలో చిత్రించి ప్రశ్నిస్తారు.

"బొమ్మలు" కథ నాస్తికులు, హేతువాదులు మాత్రమే రాయగల కథ. పరాయీకరణ ఎన్ని రకాలుగా జరుగుతుందో ఈ కథలోనూ చూడవచ్చు. రాళ్ళు కొట్టే కూలీలు, తమ నమ్మకం కోసం రాయికి పూజలు మొదలు పెడ్తే క్రమంగా అది దేవుడై దేవుని గుడి అయి ఎదుగుతుంది ఒక రాయి దేవుడైన తీరు, అది గిరాకీ పెరుగుతున్నకొద్దీ రాళ్ళు కొట్టే వారి నుండి పూజారి వర్గం కైవసం అయిన తీరు, అందుకు ప్రతీకారంగా ఆ రాతి బొమ్మల్ని, గుడిని బాధితులు పేల్చేసిన తీరును సున్నితంగా చిత్రించారు.

"దొరసాని" కథ ఎదుగుతున్న దళితులు ఎలా తమ కులాల నుండి, కుటుంబాలనుండి పరాయీకరింప బడుతున్నారో చిత్రిస్తుంది. కలెక్టర్‌గా ఎదిగిన దళితుడిని అగ్రకుల విద్యావతి పట్టేసుకొని కలెక్టర్ భార్యగా ఊరేగుతుంటే, అసలు భార్యా పిల్లలు ఎంత దయనీయమైపోతున్నారో చిత్రిస్తుంది బోయ జంగయ్య రాసిన గొప్ప కథల్లో యిదొకటి

"జన్మభూమి" వంటి ప్రభుత్వ కార్యక్రమాలు అవినీతి అధికారులను ప్రజల వద్దకు రప్పించి ప్రజలకు మేలు చేసే వారిగా మార్చుతున్న క్రమాన్ని గ్రామీణ కోణంలో చిత్రించారు.

"తెలంగాణ వెతలు" కథల్లో 50ఏళ్ళ నాటి చరిత్రను సమాజాన్ని నిక్షిప్తం చేశారు "చేపల చెరువు" గ్రామీణ సమస్యలు ఎలా పుట్టి పెరుగుతాయో చిత్రిస్తుంది

బోయ జంగయ్యకు ముందు తెలుగు సాహిత్యంలో గ్రామీణ జీవితం ఎంత చిత్రించినప్పటికీ బోయ జంగయ్య చిత్రించిన జీవితాలు, కోణాలు, దృక్పథం అపూర్వమైనవి మా గోఖలే, గోపీచంద్, కరుణకుమార, కొలకలూరి ఇనాక్, రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు, బి.ఎస్ రాములు, కాలువమల్లయ్య, సత్యం శంకరంమంచి వంటి వాళ్ళెవరూ చిత్రించని కోణాన్ని గ్రామీణ జీవితాన్ని దళిత హృదయంతో చిత్రించిన మహా రచయిత బోయజంగయ్య. వందేళ్ళ తెలుగు సాహిత్యంలో ఒక జాషువా, ఒక కొలకలూరి ఇనాక్, ఒక బోయ జంగయ్య వంటివారు తెలుగు సాహిత్యానికి అంతాదాకా లేని విస్తృతిని, వ్యాప్తిని కలిగించారు

బోయ జంగయ్య కథన శిల్పం తనకు తానే రూపొందించుకున్నది దేశీయతలో అలరారే వీరిశిల్ప చాతుర్యం అనన్యం సంఘటనల కల్పనలో సన్నివేశ చిత్రణలో కథను ఎలా ప్రవేశపెట్టి ఎలా ముగించాలో మర్మమెరిగిన మహారచయిత బోయ జంగయ్య ఒకే ఒక సన్నివేశంతో ప్రారంభమై ముగిసే కథల్ని వీరు ఎక్కువ రాశారు. అందువల్ల కథల్లో చుక్కలుంచి చాప్టర్లు,

సన్నివేశాలు మార్చే అవసరం వీరికథల్లో తక్కువ అయినప్పటికీ సన్నివేశంలో భాగంగానే గళాన్ని మానవ సంబంధాల పరిణామాల్ని సందర్భ పరిమితుల్లో చెప్పుకొస్తారు వీరి కథల్లో మానసిక చిత్రణ చాల తక్కువ అలాగే సర్వసాక్షి కథనం చేసే కథలు చాలా తక్కువ కెమెరామెన్‌లాగా సంఘటనల్ని, సన్నివేశాల్ని, సంభాషణల్ని, డాక్యుమెంటుగా దృశ్యీకరించడం ద్వారా కథల్ని పండిస్తారు "నేను" అని ఉత్తమ పురుష (ఫస్ట్ పర్సన్)లో నడిచిన కథొక్కటైనా జంగయ్యా రాయకపోవడం అసక్తిని కలిగిస్తుంది సన్నివేశ చిత్రణ లేకుండా వందలాది సంఘటనలతో కథా కథనంచేసే కథనరీతికి సంబంధించి ఒక్కకథ కూడా లేకపోవడం - బోయ జంగయ్య ప్రత్యేక కథన శిల్పరీతికి పరిమితమై అద్భుతాలు సృష్టించిన తీరును తెలుపుతుంది. పాత్రలు, స్వభావాలు, వ్యక్తుల గురించి రచయితగా తాను చెప్పడం కాకుండా సన్నివేశ చిత్రణ క్రమంలో పాఠకులకే ఊహలద్ది మనస్సులో రూపుదిద్దుకునేట్టు చేయడంలో దిట్ట బోయ జంగయ్య ఇంకొంచెం వుంటే బాగుండు అనే దశలో వీరి కథలు ముగింపు లుండడం వీరి చాలా కథల్లో కనపడే విశిష్టత. ఈ సస్పెన్సు, ఉత్కంఠ కలిగించే కథా నిర్మాణం ద్వారా సన్నివేశ పరికల్పనలో పాత్రల చిత్రణతో కథ సాగడం బోయ జంగయ్య కథా కథన రీతి

ఇలా సమాజంనుండే స్వీకరించినప్పటికీ తనదైన ముద్రతో కథల్ని మలిచిన మహారచయిత బోయ జంగయ్య వీరికథలు కాలం గడుస్తున్న కొద్దీ సామాజిక చరిత్రగా మరింత ప్రాధాన్యత సంతరించుకుంటున్న కథలు. భారతీయ సమాజాన్ని తెలుగువారి సంస్కృతి, మానవ సంబంధాల పరిణామాన్ని అర్థం చేసుకోవడానికి బోయ జంగయ్య కథలు కొత్త చూపునిస్తాయి.

# ఏ.వి. రెడ్డి శాస్త్రి

**♦ కోడూరి శ్రీరామమూర్తి ♦**

"- అస్తిత్వవాదం, అబ్సర్డ్ అనేవి తాత్త్విక భావాలుగా కాకుండా జీవితంలో వాటిని ఒక భాగంగా దర్శించడం బాగుంటుంది ఇది ఇవాళ కొత్తగా వచ్చినవి కావు. మానవజాతి మనుగడ ప్రారంభమైన నాటినుండీ వున్నవే కాకపోతే, వాటిని అస్తిత్వం అనీ, అబ్సర్డ్ అనీ పేరుపెట్టడం చేశారు మనకాలపు మేధావులు -"

- ఆలోచింప జేసే కథలు రాసిన కొత్తతరం కథకుల్లో పేర్కొనదగ్గ కథకులు ఏ.వి. రెడ్డి శాస్త్రిగారు. తమ కథల సంపుటి "అసంగతసంగతాలు" ముందుమాటలో మనముందు వుంచిన ఆలోచన యిది.

కథకుల్లో సాధారణంగా మూడు తరహాల వారుంటారు. కొందరికి కథలు కాలక్షేపం బఠాణీల్లాగా వుంటాయి హాయిగా పడకకుర్చీలో కూర్చుని వీటిని చదువుకోవచ్చు. ఇక - మరి కొందరి కథలు ఓ పట్టాన అర్థం కావు. కొరకరాని కొయ్యల్లాగ వుండే ఈ కథలను చదివినప్పుడు సగటు పాఠకుడు గాభరా పడి 'ఇదెక్కడి కథరా బాబూ' అనుకుని పేజీ తిప్పేస్తాడు. ఇంకొందరి కథలు మనకి తెలిసినా అంతగా పట్టించుకోని విషయాలను, వాటిప్రాధాన్యతను మనముందు వుంచుతూ మన ఆలోచనలను అనేకానేక ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలపైకి మళ్లేలా చేస్తాయి

మొదటి తరహా కథలు మనం ఎన్ని చదివినా వాటిని అంతలోకి మరచిపోతాము. కథలుగా వాటికి వుండే ఆయుష్షు కూడా చాలా తక్కువగానే వుంటుంది. ఇక, - మిగిలిన రెండు తరహాల కథల్లోనే మనం గుర్తుంచుకునే కథలు కనీసం కొన్ని లభిస్తాయి అయితే, - వాటికి నేపథ్యంలో వున్న భావజాలాలు, ఆ కథలు రాయడంలో కథకులు నిర్దేశించిన ప్రయోజనాలు, వేర్వేరుగా వుండవచ్చు.

అస్తిత్వవాద, అసందర్భ(అబ్సర్డ్) ధోరణిలో కథలు రాసిన, తెలుగు కథకులు తక్కువ ఆ ధోరణిలో రాసి మేధావుల మెప్పుపొందగలిగిన కథకులు మరీ తక్కువ. యిలా ఆలోచించినప్పుడు త్రిపుర, ఆర్.యస్. సుదర్శనంవంటి కొద్దిమంది పేర్లు మాత్రమే మన మనోవీధిలో మెదులుతాయి. నాలుగు పిచ్చిగీతలు మోడరన్ ఆర్ట్ కావచ్చు అర్థం కానట్లుగా కథను రాసి, తలాతోకాలేని కథనంతో కథను నడిపినంతమాత్రాన ఆ కథలో అస్తిత్వవాదమో అసంబద్ధ ధోరణో వుందని భ్రమపడవలసిన అవసరం లేదు

వెనుకటికి ఒక ఆసామి వుండేవాడు అతడికి ఇంట్లో పరిస్థితులు చాలా ఆందోళనకరంగా వుండి, తీవ్రమైన అశాంతితో బాధపడుతున్నప్పుడు ఏం చెయ్యాలో తోచక బుర్రలోకి వచ్చిన అస్తవ్యస్త ఆలోచనల్ని కాగితంమీద గిలికాడు చెల్లా చెదురుగా వున్న ఆ కాగితాల బొత్తిలోని పేజీలను ఒక మిత్రుడు తనకు తోచిన రీతిలో పేర్చి పత్రికకు పంపిస్తే - ఆ కథ అచ్చు కావడమే కాకుండా మంచి కథకుడిగా అతడికి మంచి పేరు తెచ్చి పెట్టింది కొందరు ఆ కథలో ఫ్రాయిడ్ సిద్ధాంతాల సారాంశాన్ని, గుస్టోయాంగ్ ఆర్కిటైపు సిద్ధాంతపు కథారూపాన్ని వెదుక్కుంటే - మరికొందరు స్ట్రక్చరల్ ఇంటర్ ప్రిటేషన్‌తో కథను అర్థం చేసుకోవాలన్నారు. ఇక, - మిగిలినవారు ఇది గొప్ప అబ్సర్డ్ కథ అని తేల్చిపారేశారు ఏమనాలో తెలియక కథకుడు జుట్టు పీక్కోవలసి వచ్చింది.

రెడ్డి శాస్త్రిగారు రాసిన "ఇజాలు - నిజాలు" కథలోని ఉదంతం యిది యిలాంటి "సూడో యింటలెక్చ్యువల్" కథలు కాకుండా విషయ పరిజ్ఞానంతో చక్కటి కథాశిల్పంతో, అస్తిత్వ వాద, అసంబద్ధ ధోరణి గల కథలు రాస్తున్న సమకాలీన కథకుల్లో రెడ్డి శాస్త్రి గారు పేర్కొనదగ్గ కథకులు.

నిజానికి, ఏ రచయిత అయినా, తనను తాను అన్వేషించుకునే ప్రయత్నంలోనే రచనకు శ్రీకారం చుడతాడు ఈ కృషిలో అతడి విలువలు చుట్టూ వున్న సమాజపు విలువలకు విరుద్ధంగా వున్నా అతడు తన కృషిని మానడు ఈ విధంగా ఆలోచించినప్పుడు చాలామంది రచయితల రచనల్లో అస్తిత్వవాద పోకడలు, అసంబద్ధతను ఆవిష్కరించే ధోరణులు కనబడతాయి.

"Existentialism and Modern French Novel" అనే గ్రంథంలో Robert Chapigny అనేటట్టు -

"-First of all it could be maintained that every work of literature is existential if not Existentialist -The philosophical critics of Existentialism want to deplore its literary turn As a matter of fact, the existential reflection about men and things is not fundementally different from a point of view, atleast from the point of view of thinking novelists, dramatists and poets-"

అనేది అన్ని తరహాల సాహిత్య ప్రక్రియల విషయంలోనూ వాస్తవమే అయినప్పటికీ, - అస్తిత్వవాద దృక్పథాన్ని జీవితంలోని అసంబద్ధతను అందుకు కారణభూతంగా వుండే విషయాలను, రచనల్లో అద్భుతమైన రీతిలో ఆవిష్కరించిన రచయితల పేర్లు చెప్పాల్సి వచ్చినప్పుడు కాఫ్కా, కేమూ, సార్త్రే అప్‌డైక్ వంటి పేర్లు మనోవీధిలో మెదలడం సహజం

వీరిలో కాఫ్కా, కేమూల వలన రెడ్డి శాస్త్రిగారు ప్రభావితులయ్యారు. "I continue to believe that this earth has to superior meaning But I know that some thing in it makes sense and that is man; because he is the

only being who insists upon its -" అనే అల్బర్ట్ కామూ (1913 - 1960) తానురాసిన "మిత్ ఆఫ్‌సిసిఫస్", "ది ప్లేగ్", "ది రిబెల్" (The Rebel) మొదలయిన గ్రంథాల్లో అసంబద్ధత (Absurdity) కు సంబంధించిన భావనలకు అక్షర రూపం యిచ్చారు

అసంబద్ధత అనే భావన కేవలం తత్వవేత్తల ఆలోచనలకు సంబంధించింది మాత్రమే కాదు సాధారణ ప్రభుత్వ గుమస్తా దగ్గరి నుండి గొప్ప గొప్ప విజేతల వరకూ అందరూ ఏదో సమయంలో ఈ అసంబద్ధ ప్రపంచంలో చోటుచేసుకున్న వైనాన్ని గుర్తించగలుగుతారు అని అన్నారు. 'కామూ....'

అయితే యిలాంటి ఆలోచన మనిషికి రావడానికి కొన్ని విషయాలు ప్రోదిని కన్పిస్తాయి అంటాడతడు

1 ప్రొద్దున లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకూ ఒకే మాదిరి దినచర్య, ఒకే తరహా పని, మళ్ళీ మళ్ళీ చేస్తూండగా ఏదో ఒక సమయంలో, "ఎందుకు యిదంతా?" అనిపిస్తుంది ఈ తరహా Boredum లోంచే ప్రపంచంలోని అసంబద్ధత అవగాహనకు వస్తుంది

2 మనిషి తాను నమ్మిన విలువలకూ, తన చుట్టూ వున్న సమాజంలోని విలువలకూ తేడా వుందని గ్రహించినప్పుడు, - Actor కు Setting కుమధ్య తేడా ఏర్పడినప్పుడు - అతడు జనసముద్రం మధ్య ఉన్నప్పటికీ ఒంటరితనం (Alienation) గురి అవుతాడు అనివార్యమైపోయిన ఈ ఒంటరితనం కారణంగా ఈ ప్రపంచం అసంబద్ధతలమయం అనిపిస్తుంది

3 మృత్యువు అనేది ప్రతి జీవికీ తప్పనిసరి విషయం అనేది నిర్ధారణ అయినప్పుడు మరణించేదాకా బతకడం అర్ధరహితం అనే భావన అంకురార్పణ కలుగుతుంది (అందుకే కమూ 'సార్త్రే' అంటాడు -శిశువు పుట్టగానే భవిష్యత్తు విషయంలో ఒక విషయం నిస్సందేహంగా చెప్పవచ్చు అది ఏమిటంటే ఈ శిశువు ఏనాటికయినా చావక తప్పదని!)

యిలా ఏ కారణం చేతనయినా ప్రపంచంలోని అసంబద్ధతను, అర్ధరహితస్థితిని, వ్యక్తి గుర్తించగలిగినప్పుడు ఏంచెయ్యాలి? ఎందుకీ అర్ధరహిత జీవితం అంటూ ఆత్మహత్యతో బతుకును ముగించుకోవాలా? లేక జీవిత పోరాటాన్ని కొనసాగించాలా?

కొందరు ఆత్మహత్యే శరణ్యం అని తీర్మానించినప్పటికీ Camus అందుకు అంగీరించలేదు. చుట్టూ వున్న అసంబద్ధతలను గుర్తెరిగి నలుగురూ నడిచిన దోవలోనే నడవాలనీ నియమం లేకుండానే సంప్రదాయ బద్ధమైన సమాజంవేసే సంకెలలనుండి బయటపడి, విజయం సాధించగలడనే నమ్మకం లేకపోయినా తిరుగుబాటు చెయ్యడమే మనిషి కర్తవ్యం - అంటాడతడు "My Freedom, My passion and My revolt" అంటూ ప్రతివ్యక్తీ తనదైన శైలిలో రూపొందించుకున్న జీవిత సంఘర్షణలోకి ఆనందాన్ని పొందుతాడు.

స్థూలంగా చెప్పాలంటే యిట్లాంటి బావజాలం రెడ్డి శాస్త్రిగారి కథలు కొన్నింటికి నేపథ్యంలో కనబడుతుంది

శాస్త్రిగారు చాలాకాలం కళాశాలల్లో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేశారు ఆయనకు గల ఆంగ్ల సాహిత్య పరిజ్ఞానము, ఆంగ్లభాషా బోధనలో చోటు చేసుకుంటున్న దిగజారుడు ధోరణులపట్ల ఆవేదన కూడా ఆయన కథల్లో కనబడతాయి కీట్స్, షెల్లీవంటి ఆంగ్లకవుల కవితల్లోని ఏదో ఒక భావాన్ని ప్రేరణగా తీసుకుని కూడా కొన్ని కథలు రాశారాయన

అంతేకాదు - ఈ దేశాన్ని చిరకాలంగా పీడిస్తున్న దారిద్ర్య సమస్యను అందుకు గల మూలకారణాల గురించి మనల్ని ఆలోచింపజేసే కథలు కూడా రాశారు రెడ్డి శాస్త్రిగారు నానాటికీ మనుషుల్లో పెరిగిపోతున్న వాణిజ్య ప్రవృత్తి, పీడనా ప్రవృత్తి, వికృతరూపాన్ని దాల్చి ఈ దేశంలోని సన్నకారు వ్యవసాయ దారులను, గిరిజనులను ఆవేదనకు గురి చేస్తున్న తీరుగురించి చెప్పే కథలు కూడా వీరికథల్లో కనబడతాయి.

యిలా బహుముఖంగా మానవ జీవితాల్ని ఆవిష్కరించిన శాస్త్రిగారి కథల్లో కొన్నింటిని ప్రస్తావించుకుందాం.

ముందుగా - "లైబ్రరీలో", "స్టాఫ్ రూమ్‌లో", "నాగావళి నవ్వింది" కథల గురించి, కళాశాల నేపథ్యంలో రాయబడిన ఈ మూడు కథల్లోనూ లోకంలోని అసంబద్ధతకు అక్షర రూపం యివ్వడం జరిగింది

నిజానికి - 'లైబ్రరీలో" కథలో చెప్పుకోదగ్గ కథ ఏదీలేదు. కథ వెనుకగల భావమే ప్రధానం.

అదొక కాలేజీ లైబ్రరీ, ఆ లైబ్రరీలో ఇద్దరు పుస్తకాల పురుగులు. ఒకరు - మన కథానాయకుడు. మరొకరు ప్రొఫెసర్ - 'జస్ట్ హాట్', లైబ్రరీ తలుపులు తెరిచే సరికల్లా హాజరై పుస్తకాలు తిరగేసే వీళ్ళిద్దరినీ చూస్తే లైబ్రరీ అధికారులకు వళ్ళుమంట వీళ్లు కూర్చునే దగ్గిర లైటు తీసెయ్యడం, వారు దేనిమీద పరిశోధన చేస్తున్నారో తెలుసుకుని తాఖీదులివ్వడం, యిలాంటివి చాలా చేశారు గానీ వాళ్ళు లొంగలేదు.

కథ మొదలయ్యేసరికి, మన కథానాయకుడు అతడి ప్రియురాలు రజనికోసం ('రజని' అంటే చీకటి అని అర్థం వుంది కదా) ఎదురు చూస్తూ లైబ్రరీలో వుంటాడు. కాని, ఆమె రాదు. వీధిలో ఏ మొగలో చూచినా అసంబద్ధత దర్శనమిస్తుందని Camus చెప్పాడని తెలిసినా పిచ్చి కల కన్నాను యిక, దీనిని భరించలేను వెళ్తున్నాను - అంటూ ఆమె రాసిన చీటీ మాత్రమే అతనికి అందుతుంది

ఈ స్థితిలో అతడికి రెండు మార్గాలు కనబడతాయి.

1. రజని వెళ్ళిన మార్గాన్నే తానూ వెళ్ళడం 2. ఎప్పటికీ ఏదీ జరగదని తెలిసినా నిరీక్షిస్తు గడపడం. మేధావి అయిన Dust Coat సలహా అడుగుదామని కథానాయకుడు అనుకొనడంతో కథ ముగుస్తుంది.

మామూలు కథలు చదవడం అలవాటున్న పాఠకులకు ఈ కథ కొంత గాభరా పెట్టేటప్పటికీ - జీవితానికి అర్థం వుందనీ, ఏదో జరుగుతుందనీ అనుకోవడంకన్నా అసంబద్ధమైన విషయం మరొకటి లేదనీ, అలా అని నిరాశ చెంది ఆత్మహత్య చేసుకోవడం కంటే, salvation గురించి (వ్యర్థ) నిరీక్షణ చెయ్యడమే మంచిదని చెప్పే కథ యిది సేమ్యూల్ బెకెట్ "Waiting for Godot" త్రిపుర "భగవంతంకోసం జ్ఞాపకం వస్తాయి ఈ కథను చదివినప్పుడు

యిలాంటిదే "స్టాఫ్ రూమ్" కథ కూడా అసంబద్ధతతో నిండిన ఈ ప్రపంచానికి ఉపన్యాసకులు ఉండే (ఈ కథలోని) "స్టాఫ్ రూమ్" ను ప్రతీకగా చెప్పుకొనవచ్చు. ఆ "స్టాఫ్ రూమ్"లో వుండే, అవధాని,రెడ్డి, కృష్ణమూర్తి, చైతన్య, వీళ్ళందరికీ రకరకాల సమస్యలున్నాయి. ఒకరిది కూతురు మరణించిందన్న బాధ - మరొకరిది కొడుకు రౌడీ కింద తయారయాడన్న వ్యధ - ఇంకొకరిది భార్య అనారోగ్యం సమస్య ఇక, - ప్రిన్సిపాల్ గారి విషయానికి వస్తే అతడు కాలేజీకి చేసిన సేవలకు గుర్తింపుగా ప్రమోషన్ రావడానికి బదులు - కొండ ప్రాంతానికి బదిలీ ఉత్తర్వులు అందటం - అనే సమస్య అయితే - ఈ సమస్యలన్నింటికీ పరిష్కారం ఎలా?, - ఈ జీవితంలోని అసంబద్ధత, చికాకు వీటిని మనం తప్పించుకోలేం వీటిని ఎదిరించడానికి ఎవరి పోరాటం వారు చెయ్యా"లన్నదే సారాంశం.

"నాగావళి నవ్వింది" కథ -"నేను తిక్క వెధవనని అందరూ అనుకుంటారు" అనే కథానాయకుడి స్వగతంతో ప్రారంభమవుతుంది అందరూ అతడి గురించి అలా అనుకోడానికి చాలా కారణాలున్నాయి. యితరుల వలన కష్టం వచ్చినప్పుడు అందరిలాగా అతడు ఆనందించలేడు ఎదుటివారు అసందర్భంగా మాట్లాడుతూ వుంటే చాలామందిలాగా అతడు మనకెందుకు వచ్చిన గొడవ యిది అని మాట్లాడకుండా ఊరుకోలేడు. చాలామంది లెక్చరర్లు క్లాసులకు వెళ్ళి మొక్కుబడిగా పాఠాలు చెబితే, - పిల్లలకు బోధపడేలా పాఠం చెప్పాలని అతడు తాపత్రయ పడతాడు. అలా చెప్పడంలో ఆనందాన్ని పొందుతాడు. యిలాంటి వాళ్ళు 'తిక్క వెధవలు" కాక మరేమవుతారు? ఈ అసంబద్ధ ప్రపంచంలో.

నిజానికి ఈ కథలో చాలా అసంబద్ధతలున్నాయి రెండో టరమ్ కూడా పూర్తికాకుండానే విద్యాధికారులు సిలబస్ పూర్తి అయిందా అని ఉపన్యాసకులను అడగడం - పాఠాలు చెప్పడం పూర్తి కాకపోయినా ఎప్పుడో అయిపోయిందని చాలామంది ఉపన్యాసకులు సమాధానం చెప్పడం

వేలకొద్దీ జీతాలు యిచ్చే మాతృసంస్థలో పాఠాలు చెప్పడం ఎగగొట్టి గంటకు యింత మొత్తం అని కూలీ యిచ్చే ట్యుటోరియల్ కాలేజీల్లో మాష్టర్లు కష్టపడి పాఠాలు చెప్పడం

కాలేజీల్లో పని గంటలు తగ్గించి ఏదో దిక్కుమాలిన పరీక్షలు పెడుతూ బోధనాసమయాన్ని విద్యాధికారులే తగ్గించి, బోధనా ప్రమాణాలు పెరగాలని గోలపెట్టడం-

యిలా - ఉన్నత విద్యారంగానికి సంబంధించిన ఎన్నో అసంబద్ధతలు ఈ కథలో కనబడతాయి

అంతేకాదు - "నాన్నా మనం ఎందుకు యిలా బతుకుతున్నాము, మనం ఎందుకు యిలా బతకాలో సమాధానం చెప్పగలరా?-" అని బాధ్యతలేని తాగుబోతు తండ్రిని కొడుకు నిలదీస్తే తన జీవితం చుట్టూ పెనవేసుకుని వున్న అసంబద్ధత నుండి బయటపడలేక ఆత్మహత్య చేసుకున్న ఒక కళాశాల ఉపన్యాసకుడి కథ కూడా యిందులోని మరొక ముఖ్యమైన విషయం.

యిక, "దివ్యభూషణుడు", 'ఆఖరిన్యాయం, కథలు కూడా ఈ విధమైన దృక్పథంతో రాయబడిన కథలే. ఆస్తి, అందం, బుద్ధికుశలత అన్నీ వున్నా - ఏదో తెలియని లోటుతో, చుట్టూ వున్న సమాజంలో తానూ ఒకడుగా ఇమడలేని ఒంటరితనంతో మార్పులేని దినచర్యవలన కలిగిన విసుగుతో, ఓ 'శుభ ముహూర్తా'న పిస్తోలుతో కాల్చుకుని చచ్చిపోయిన కథానాయకుడి కథను "దివ్య భూషణుడు" కథ చెబుతుంది.

మానవులందరూ బతుకనే రొంపిలో కూరుకుపోయి, అన్యాయం జరిగిందనే స్పృహ కూడా లేకుండా దిక్కుతోచక బతుకుతున్నందుకు ఆవేదనచెంది - ఈ విషయం న్యాయదేవత ముందు వుంచి, న్యాయం అడుగుదామని బయలు దేరిన వ్యక్తి - అనేక సంవత్సరాలు ఆమె భవంతి ముందు నిరీక్షించిన తర్వాత లోపలికి వెళ్లేముందే మృత్యువుపాలయిన ఉదంతం "ఆఖరి న్యాయం" కథలో వుంది

వీటిల్లో మొదటి కథ (దివ్య భూషణుడు) రాబిన్సన్ రాసిన "రిచర్డ్ కేరీ" అనే కవిత స్ఫూర్తితో రాసింది అయితే - రెండోదానికి కాఫ్కా రాసిన "Before the Law" కథ ఆధారం మానవ జీవితంలోని అసంబద్ధతను మనముందు వుంచే కథలు యివి.

ప్రత్యేకించి ఈ తరహా దృక్పథంతో రాయబడిన కథలు కాకపోయినప్పటికీ శాస్త్రిగారు రాసిన కథల్లో "పాముకాటు", "సందిగ్ధ సంధ్య" అనే కథలు కూడా పేర్కొనదగ్గవి.

ఈ దేశంలో బీదవారికీ, ధనికులకూ మధ్యన వున్న ఆర్థిక వ్యత్యాసం గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు ఒకవైపు పూరిపాకలు, మరొకవైపు దివ్య భవంతులు, ఒక వేపు ఒక పూటకూడా తిండి దొరకని దారిద్ర్యం, మరొకవేపు పంచభక్ష్య పరమాన్నాలతో విందులు - ఈ కథ మనదేశంలో "అతి సాధారణ" మైన విషయమే! ఈ సాధారణ విషయాన్ని నేపథ్యంగా తీసుకుని భయంకరమైన పాముల్నికూడా లొంగదియ్యగల సాహసి బీదవాడయిన కారణంగా ఒక ధనికుడి కాటుకు ఎలా బలి అయ్యాడో చక్కటి కథనంతో చెబుతాడు రచయిత, "పాముకాటు" కథలో అయితే కథను చదివిన తర్వాత పాఠకులకు ఈ కథలో "కుష్టుడి" ని (కృష్ణుడు) కాటువేసింది పెదబాబుగారు యిచ్చిన విదేశీ మద్యం మాత్రమే కాదనీ, దారిద్ర్యం, ఆకలి, కృష్ణుడిని కాటువేశాయనీ అనిపిస్తుంది

నిజమే - అంతకన్నా భయంకరమైన పాములు ఎక్కడ మాత్రం ఉంటాయి! చదివిన తర్వాత చాలాకాలం గుర్తుండే కథ యిది ఈ కథలో సారా సిండికేటు సమావేశంలో ఉన్న ఇంగ్లీషు లెక్చరర్ Milton జ్ఞాపకం చేసుకుంటూ పేలిన తాగుడు పేలాపన కథకొక ప్రత్యేకతను సమకూర్చింది

ఉపాధ్యాయ వృత్తితో ఏ మాత్రం సంబంధంవున్న వారినయినా "సందిగ్ధ సంధ్య" కథ బాగా ఆకట్టుకుంటుంది వీధికొకటి చొప్పున నేడు పుట్టుకొస్తున్న విద్యాలయాల్లో విద్యా బోధన అనేది పూర్తిగా 'వ్యాపార వస్తువు' అయిపోయిందన్న విషయం అందరూ అంగీకరించేదే ఒకప్పుడు కళాశాలల్లో విద్యార్థులకు పాఠాలు చెప్పడం అనేదాన్ని ఉపన్యాసకులు ఒక పవిత్రమైన బాధ్యతగా భావించేవారు తాము చెప్పే సబ్జెక్టుల్లో విద్యార్థులకు సమగ్రమైన అవగాహన కల్పించేందుకు నిరంతరం పరిశ్రమించేవారు ఆ విధంగా నేర్చుకొనడం తమ బాధ్యత అని భావించిన విద్యార్థులు - విషయపరిజ్ఞానం అంకితభావం గల ఉపాధ్యాయులను అత్యంత గౌరవంతో ఆరాధించేవారు

కాని - ఈనాటి 'విద్యావిపణి' పరిస్థితి వేరు ఉపాధ్యాయుడు విద్యార్థులకు విషయాన్ని ఎంత లోతుగా బోధించాలన్నది ముఖ్యం కాదు వాళ్ళకు నచ్చే విధంగా "పాస్ ఈజీ' పద్ధతిలో బోధపరిచి - వాళ్ళకు ఎన్నిమార్కులు పరీక్షల్లో వచ్చేలా చెయ్యగలిగాడు, ఎన్ని రాంకులు సంపాదించి పెట్టగలిగాడు అన్నది ముఖ్యం. ఎందుకంటే యిలాంటి ఫలితాన్ని బట్టే ఆ కళాశాలకు వచ్చే రాబడి, ఉపాధ్యాయుడికి యిచ్చే జీతం ఆధారపడి ఉంటాయి

యిలాంటి స్థితిలో - ఇంగ్లీషు పాఠం చెప్పడాన్ని ఒక కళగా, ఒక తపస్సుగా భావించి - విద్యార్థులకు తాను షేక్స్‌పియర్, కీట్స్, మిల్టన్ ఎవరి గురించి చెప్పినా మహోన్నతమైన సాహిత్య లోకాలకు విద్యార్థులను తీసుకుపోయి కవిహృదయాన్ని అద్భుతంగా ఆవిష్కరించగల ఒక ఉత్తమ ఉపాధ్యాయుడు రెసిడెన్షియల్ కాలేజీ విద్యార్థులచేత బోర్ అనిపించుకున్న ఉదంతం "సందిగ్ధ సంధ్య" కథలో ఉంది ఈ వాతావరణంలో అట్లాంటి రిటైర్డ్ ఉపాధ్యాయుడికి ఉద్యోగం యివ్వగలవారు ఎవరు? ఈ కథ చదువుతున్నప్పుడు కథలోని రామకృష్ణ పాత్రలో బహుభాషావేత్త, మేధావి, మహోపన్యాసకుడు ఆచార్య రోణంకి అప్పలస్వామిగారి బొమ్మ పాఠకుల హృదయ నేత్రాలకు దర్శనమిస్తుంది

శాస్త్రి గారి కథల గురించి చెప్పేటప్పుడు "అంత్యారంభాల అంచున", "అస్తమయం" కథల గురించి కూడ చెప్పాలి. ఈ దేశ జనాభాలో సగానికి పైగా ప్రజలకు వ్యవసాయమే ప్రధాన వ్యాపకం అయినప్పటికీ వ్యవసాయం వలన బడుగు రైతులు లబ్దిపొందుతున్నది నామమాత్రమే వర్షాధార భూములు అధికంగా ఉన్న ఈ దేశంలో చాలామంది రైతులు పెట్టిన మదుపులు కూడా దక్కించుకోలేక అప్పులు పాలవుతున్న సందర్భాలు, చివరకు ఆత్మ హత్యలతో బతుకులను ముగించుకున్న సందర్భాలు లెక్కకు మీరినన్ని కనబడతాయి "భారతదేశంలోని రైతు అప్పుల్లో పుట్టి అప్పులో మరణిస్తా" డనే చిరకాల ఆర్థిక సూక్తికి కాలం చెల్లుతుందనే ఆశ కనుచూపు మేరలో కనబడడం లేదు

మరి యిలాంటి పరిస్థితుల్లో ఆదాయం రాని వ్యవసాయ భూముల్ని అవకాశం వున్నప్పుడు ఇళ్ళ స్థలాలకు అమ్మి నాలుగు రాళ్ళు చేసుకోవడం మంచిదా? - లేక భూమి మీది మమకారంతో వ్యవసాయాన్నే పట్టుకుని వేళ్ళాడడం మంచిదా? అనేది వ్యక్తికీ, భూమికీ మధ్య వున్న మానసిక సంబంధాన్ని బట్టి అధారపడి ఉంటుంది

వెనుకటితరం వారి 'సెంటిమెంటాలిటీ'కి కొత్త తరంవారి రూపాయిల లెక్కలతో నిండిన ఆలోచనలకు మధ్య చాలా తేడా ఉన్నది దీనినే శాస్త్రిగారు తమ "అంత్యారంభాల అంచున" కథకు నేపథ్యంగా తీసుకున్నారు

ఈ కథలోని 'అసిరన్న' వ్యవసాయం అనేది డబ్బును తెచ్చే ఒక వ్యాపకం మాత్రమే కాదు అది ఒక పవిత్రమైన బాధ్యత భూమి తల్లితో తనకు గల తరతరాల అనుబంధానికి అదొక మరువలేని గుర్తు

యిల్లాంటి స్థితిలో "మనం ఎవసాయం ఎందుకు సేస్తున్నాం కడుపు కింత తిండికోసం..భూముల్ని అమ్మి డబ్బు సేస్కో! డబ్బొచ్చివాళ్ళో పడతూంటే వద్దని కూకునేవోరు వొట్టి జడ్డోడయి వుండాల - " అంటూ అసిరన్నకు పారన్న హితవు చెప్పబోతాడు గానీ,

"- మనిషి బతకనీకి తిండి కావాలి దేవుడు పుట్టిచ్చిన ఈ కోటాన్నక్క జీవుల్లోనూ మనిషొక్కడే పంటలు పండించి తిండిని తయారు సేస్కుంటున్నాడు యియాల సంచులకొద్దీ డబ్బు కనబడుతున్నాదని కామధేనువు లాంటి ఈ భూమిని ముక్కలు కొట్టేసియిళ్ల జాగాల క్రింద అమ్మి పారేస్తే రేపు జనాలల్ల ఏటి తిని బతుకుతార్రా - " అంటూ అతడు తనకొడుకుల్లాగా భూమిని అమ్మడానికి యిష్టపడడు.

అసిరన్నలాంటి ఒక బడుగు రైతు వ్యవసాయం చేసినంత మాత్రాన ఈ దేశంలోని ఆహార సమస్య తీరదు. అసిరన్నే కాదు – చాలామంది వ్యవసాయ భూముల్ని మరొక విధంగా ఉపయోగించి, వ్యవసాయం చెయ్యకపోయినా- మనుషులకు కావలసిన తిండిగింజలు మరొక దేశంనుండో, మరొక ప్రాంతంనుండో దిగుమతి అయి - మనుషుల ఆకలి తీరుస్తాయి. యిలాంటి ఫుడ్ ఎకానమిక్స్ అసిరన్నకు అనవసరం. మట్టిపై అతడికి ఉన్న ప్రేమ ఈ లెక్కలన్నింటికీ అతీతమైంది. వ్యవసాయ రంగానికి సంబంధించి - మనకు తెలిసి కూడా పట్టించుకోని సమస్యను మనసుకు హత్తుకునేలా మనముందు వుంచే కథ యిది (అంత్యారంభాల అంచున) ఇలాగే "అస్తమయం" కథలో కూడా వ్యవసాయ భూమికి సంబంధించి కొత్తతరం ఆలోచనలకు - వెనుకటి తరం వారి అనుబంధాలకు మధ్యన ఉండే సంఘర్షణకు చక్కటి కథారూపం ఇచ్చారు రచయిత ఈ కథలోని ఇద్దరు వృద్ధులు జీవయాత్రను ముగించు కున్నప్పుడు ఊళ్ళోవారు "- మరి ముదర బుర్రలు లేకుండా పోనయి - " అని బాధపడ్డారుగానీ, ఆ'ముదర బుర్రలు' చెప్పే హితవు గురించి పట్టించుకున్న వారు లేరు!

"అంత్యారంభాల అంచున", "అస్తమయం" వంటి కథల్లో లాభసాటి కాకపోయినా వ్యవసాయం చెయ్యటం ఏకైక కర్తవ్యం అని భావించే వెనుకటితరం వృద్ధుల కథ వుంటే "సాలెగూడు", వంటి కథల్లో - అప్పు చెయ్యకుండా వుందామని ఎంత ప్రయత్నించినా చివరన వడ్డీ వ్యాపారి సాలెగూడుల్లో చిక్కి సర్వాన్నీ కోల్పోయిన సన్నకారు యువరైతు కథ వుంది.

శతాబ్దాలు మారినా, తరాలు మారినా ప్రణాళికల పేరుతో ఎన్నెన్ని ఆర్థిక విన్యాసాలు జరిగినా వీసమెత్తు కూడా ప్రగతిని నోచుకొని కష్టజీవుల కథలకు బహుముఖమైన అక్షర రూపాలు యివన్నీ!

ఈవిధంగా చూచినప్పుడు ఏ తరహా యితివృత్తంతో కథను రాసినా నిండైన కథాశిల్పంతో సొగసైన శ్రీకాకుళం మాండలికంలో అవసరానుగుణంగా రవ్వంత హాస్య, వ్యంగ్య చమత్కృతితో మనసును హత్తుకునే కథలు చెప్పుకోదగ్గ సంఖ్యలో రాసిన శాస్త్రిగారు తెలుగు కథాసీమకు ఉత్తరాంధ్ర యిచ్చిన మరొక వరం అనిపించక మానదు.

# వివిన మూర్తి

♦ వల్లంపాటి వెంకట సుబ్బయ్య ♦

తెలుగు కథా సాహిత్యానికి నాలుగు స్తంభాలలా ఉండిన కొడవగంటి, చాసో, రావిశాస్త్రి, కా.రా 1970 దశకంలో కథా రచన మానేశారు. కొడవటిగంటి కథల్ని వదిలి సైన్సు, సామాజిక వ్యాసాలను చేపట్టాడు చాసో అనిర్వచనీయమైన నిశ్శబ్దాన్ని వరించాడు. రావిశాస్త్రి నవలా రచనలోకి వెళ్ళిపోయాడు. కా.రా. యువ రచయితలకు దారిచూపించే వ్యాసాలు (కథాకథనం) రాయటంలో నిమగ్న మయ్యాడు 1993 వరకూ అతడు మళ్ళీ కథ రాయలేదు ఈ దశకం ప్రారంభానికి అటూ ఇటూ వేలూరి శివరామశాస్త్రి, బుచ్చిబాబు, కొనకళ్ళ వెంకటరత్నం, మునిమాణిక్యం కనుమరుగైపోయారు. అంతవరకూ నిర్విరామంగా కథలు రాస్తున్న కొందరు సీనియర్ రచయితలు ఈ దశకంలో రచన తగ్గించారు. మరికొందరు దారి మార్చి వ్యాపార నవలా సాహిత్యంలోకి వెళ్ళటానికి ప్రయత్నించారు

ఈ దశకంలో తెలుగు కథ పతనమైపోయిందనీ, దాన్ని పునరుద్ధరించాలనీ కొంతకాలం తరువాత వేదికలూ, సదస్సులూ, వర్క్‌షాప్‌లూ ప్రారంభమయ్యాయి ఈ భయానికి కారణం భ్రాంతి మాత్రమే. ఈ దశకంలోనే తెలుగు కథా సాహిత్యంలో కొత్త కెరటం ప్రారంభమైంది. అంతకు పూర్వమే కథలు రాయటం ప్రారంభించిన కొందరు యువరచయితలు 1970 దశకంలో స్థిరపడ్డారు. ఈ దశకంలో రచన ప్రారంభించిన మరికొందరు ఆ తరువాత మంచి రచయితలుగా స్థిరపడ్డారు. అలాంటి వారిలో వివిన మూర్తి ఒకడు.

వివిన మూర్తి తూర్పుగోదావరి జిల్లా రామాపురంలో జన్మించాడు. పాలిటెక్నిక్ కోర్సు చదువుకొని కొంతకాలం శరీర కష్టం అవసరమైన ఉద్యోగం చేసి, ఇప్పుడు భారతీయ నౌకాదళానికి చెందిన క్వాలిటీ కంట్రోల్ విభాగంలో ఆఫీసరుగా బెంగుళూరులో ఉద్యోగం చేస్తున్నాడు. వివిన మూర్తికి రెండు రకాల ప్రత్యేక సౌకర్యాలు (Advantages) జీవితంలో లభించాయి. మొదటిది చిన్న పల్లెలో పుట్టి పెరిగి మహానగరంలో జీవించటం. రెండవది అంతర్జాతీయ వ్యాపార లావాదేవీలూ, ప్రపంచీకరణ ప్రభావాలూ స్పష్టంగా అర్థమయ్యే రంగంలో ఉద్యోగం చేస్తూ ఉండటం, తనకు లభించిన ఈ రెండు ప్రత్యేక సౌకర్యాలనూ నిజాయితీతో, చాతుర్యంతో ఉపయోగించుకొని వివిన మూర్తి కథా వస్తువుల్ని ఎన్నుకొన్నాడు.

వివిన మూర్తి ఛందోబద్ధమైన కవిత్వంతో రచన ప్రారంభించాడు ఎన్నో ఖండికలతోపాటు ఒక పద్య కావ్యాన్ని కూడా రాశాడు. వచనంలోకీ, కల్పనా

సాహిత్యంలోకీ ఆలస్యంగానే వచ్చాడు కథలు రాయటం ప్రారంభించిన ఎంతో కాలానికి తన మొదటి కథను ప్రచురించాడు వివిన మూర్తి మొదటి కథ "రొట్టెముక్క" 1976లో ప్రచురితమైంది ఆలోచనా పరుల్ని ఆకర్షించిన అతని మొదటి నవల "వ్యాపార బంధాలు" (1986) రచనా విధానంలోని సౌకుమార్యంతో చాలామందిని ఆకట్టుకున్న నవలిక "విమానం వచ్చింది" (1989) ఎంతో శ్రమకోర్చి, ఎంతో కాలాన్ని వెచ్చించి, కొత్త చూపుతో రాసిన నవల "హంసగీతం" ఇది మహాకవి శ్రీనాధుని కాలాన్నీ జీవితాన్నీ చారిత్రక స్పృహతో అక్షరబద్ధం చేసిన నవల. దురదృష్టవశాత్తు ఈ నవలకు రావలసినంత గుర్తింపు రాలేదు అలాగే అతడు రాసిన "బుక్కులు" కథలక్కూడా నిరాదరణే దక్కింది వాటిని రావిశాస్త్రి "బుక్కులు"తో పోల్చి అధ్యయనం చేసే ప్రయత్నం కూడా జరగలేదు.

పద్యకావ్యాలూ, నవలలూ, నవలికలూ సాహిత్య విమర్శా వ్యాసాలూ రాసినా వివిన మూర్తి పేరు ఎక్కువగా కథతోనే ముడిపడి ఉంది అతడు గత పాతికేళ్ళలో ఆలోచనా పరుడుగా, ఆలోచనాపరుడైన కథా రచయితగా ఎంతో ఎదిగాడు సామాజిక జీవితంలోని మార్పులకు కారణభూతమైన అంశాలను కథా వస్తువులుగా గుర్తించి కథలుగా మలిచిన కొద్దిమంది మంచి రచయితల్లో వివిన మూర్తి కూడా ఉన్నారు.

సాహిత్య ప్రతిభ ఉన్న వివిన మూర్తి సాహిత్యంలోకి రావటం సహజంగానే జరిగినా అతనికి సాహిత్య ప్రయోజనాన్ని గురించి చాలా సందేహాలుండేవి. నిజ జీవితంలో ధైర్యం ప్రదర్శించలేని వాళ్ళు సాహిత్యంలోకి వస్తారనీ, రచనకు ప్రధానమైన ప్రేరణ కీర్తి కాంక్షేననీ చాలాకాలం భావించాడు.

సాహిత్యం అక్షరాల
మహాత్మ్యం కార్యహీన మాన్యతముల పౌ
రోహిత్యం సత్యధైర్య
రాహిత్యం కీర్తికి సుఖరాజపథంబే

అని ఎంతో వ్యంగ్య వైభవంతో రాసుకున్నాడు కూడా జీవితం అర్థమైనకొద్దీ అతని అభిప్రాయాలు మారటం ప్రారంభించాయి సామాజిక పరిణామాలకు సాహిత్యం కారణ భూతమౌతుందన్న నమ్మకం అతనికి కలగలేదు కానీ రచయితగా తనకొక బాధ్యత ఉందన్న సంగతి బోధపడింది. జీవితం తనలో కలిగిస్తున్న అలజడినీ, ఆలోచననూ తన సోదర మానవులతో పంచుకోవటం, అవాంఛనీయ పరిణామాలను అరికట్టటానికి అవసరమైన చైతన్యానికి దోహదం చేయటం రచయితగా తన సామాజిక బాధ్యత అన్న ఎరుక కలిగాక అతని రచనలో ఒక దృక్పథమూ, పరిణతీ చోటుచేసుకోవటం ప్రారంభించాయి. ఒకే భావజాలానికి చెందిన కథా వస్తువులను తీసుకొని విభిన్నమైన పద్ధతుల్లో కథలు రాస్తూ ఉన్న రావిశాస్త్రి, కా.రా గార్లను దగ్గరగా పరిశీలించే అవకాశం వివిన మూర్తికి లభించింది. వారిద్దరి చేతా ప్రభావితుడైనా వారిని ఎప్పుడూ గుడ్డిగా అనుకరించలేదు ఒక సొంత దారిని ఏర్పరచుకొని నిరంతరంగా కృషి చేయటం ప్రారంభించాడు. తాను రాసిన కథల్లో మెరుగైన వాటిని ఎన్నిక చేసి 1994లో "ప్రవాహం" అన్న సంపుటాన్నీ 2002లో "దిశ" అన్న సంపుటాన్నీ ప్రచురించాడు ఈ రెండు

సంపుటాల్లోనూ మొత్తం ఇరవై నాలుగు కథలున్నాయి సంపుటాల రూపంలో రాని కథలు ఇంకా వందవరకూ ఉండవచ్చు.

వివిన మూర్తికి "సమాజంతో సంబంధంలేని వ్యక్తి"(Pure individual) మీద నమ్మకం లేదు వ్యక్తుల అస్తిత్వాన్వేషణ సమాజం పరిధికి వెలుపల జరగటానికి వీలు లేదన్నది అతని గట్టి నమ్మకం దీనితోపాటు మానవ సంబంధాలు ప్రధానంగా ఆర్థిక సంబంధాలేనన్న నమ్మకం కూడా అతనికి గట్టిగానే ఉంది వివిన మూర్తి అభిప్రాయం ప్రకారం సమాజంలో మార్పులు రావటమంటే సమాజంలోని మనుషుల మధ్య ఆర్థిక సంబంధాలలో మార్పులు రావటమే. ఆర్థిక సంబంధాలు మారటాన్ని వివరించగల భావజాలాలనూ, జాతీయ, అంతర్జాతీయ కారణాలనూ అర్థం చేసుకోవటంకోసం వివిన మూర్తి ప్రయత్నిస్తూనే ఉన్నాడు ఇందుకు ఉదాహరణంగా తొలిదశనుంచీ "వంకర చూపులు", "ముంజలు" అన్న రెండు కథల్ని విశ్లేషించుకొని, భవిష్యత్తులో ఆ కథావస్తువుల పరిణామాన్ని పరిశీలించవచ్చు.

ఎవరి శ్రమ ఫలితాన్ని వారే అనుభవించటం న్యాయం అన్న కథా వస్తువుతో రాసిన కథ "వంకర చూపులు". ఈ కథకు నేపథ్యం దిగువ మధ్యతరగతి కుటుంబ జీవనం. వారిది పల్లె బతుకూ కాదు, పట్నపు బతుకూ కాదు. వారిది ఉమ్మడి కుటుంబమూ కాదు. కాకనూపోదు ఇచ్చి పుచ్చుకోవటంలో ఉన్న వాళ్ళు ప్రదర్శించగల ఔదార్యానికి వాళ్ళ బతుకులో స్థానం లేదు. కడుపుతో ఉన్న ఇల్లాలు రాబోయే శీతాకాలాన్నీ దృష్టిలో ఉంచుకొని ఒక పాతగుడ్డల బొంతను కుడుతుంది దాన్ని సొంతం చేసుకోవడం కోసం ఆ కుటుంబ సభ్యులు పడే తాపత్రయమే ఇందులోని కథ. కోడలు ఆ బొంత తన శ్రమ ఫలితమంటుంది. అత్తగారు అందులో తన గట్టి పాతచీర - అంటే పెట్టుబడి - ఉందంటుంది ఇంటి ఆడపడుచుకు అన్నీ శ్రమ లేకుండా, ఉచితంగా కావాలి. శ్రమ చేయటం నేర్చుకోమంటే నేర్చుకోదు ఇలా సాగుతాయి వాదనలు. చిట్ట చివరికి కోడలు పట్టుపట్టి, మొహమాటాలను పక్కనపెట్టి తాను కుట్టిన బొంత తానే దక్కించుకుంటుంది ఈ కథలో బొంతను ప్రతీకను చేసి శ్రమదోపిడీవిధానాలను చిత్రించిన విధానం ప్రతిభావంతంగా కుదిరింది పెట్టుబడికీ, ఉత్పత్తికీ సంబంధించిన అనేక సమస్యల్ని చిత్రిస్తూ కా.రా. రాసిన "తీర్పు" కథలో దాదాపు సరిసమానమైన కథ ఇది.

ఆర్థిక సంబంధాలను గురించి, తొలినాళ్ళలోనే వివిన మూర్తి రాసిన మరొక ఆలోచనాత్మకమైన కథ "ముంజలు". భారతీయ సమాజంలోకి స్వాతంత్ర్యానంతరం ప్రవేశించిన ఒక నూతన ఆర్థిక పరిణామాన్ని ఎలాంటి కృత్రిమత్వమూ లేకుండా రచయిత ఈ కథలోకి తీసుకొని వచ్చాడు. స్వాతంత్ర్యానికి పూర్వం మన పల్లెల్లో ఫ్యూడల్ మనస్తత్వమే ఉండేది. స్వాతంత్ర్యానంతరం పట్టణాల్లో, నగరాల్లో స్థిరపడ్డ మలితరంవారు పెట్టుబడిదారీ మనస్తత్వాన్ని పల్లెలకు దిగుమతి చేశారు. ఈ మలితరానికి ద్రవ్య ఆర్థిక విధానాన్ని గురించీ పెట్టుబడి రూపాలను గురించీ బాగా తెలుసు. ఫ్యూడల్, పెట్టుబడిదారీ తత్వాల సమ్మేళనంతో గ్రామీణ జీవితంలో మానవ సంబంధాలు మారిపోయిన విధానాన్ని ఈ కథ చిత్రిస్తుంది.

పోరంబోకు భూముల్లో కాచే తాటి ముంజలు వ్యాపార సరుకుగా మారి పెట్టుబడిదారుడుగా మారిన ఫ్యూడల్ భూస్వామి చేతిలోకి వెళ్ళటం, చిన్న వ్యాపారిగా మారిన వ్యవసాయ కూలీ సత్తెయ్య చితికిపోవటం ఇందులోని కధ

ఈ కథల్ని వివిన మూర్తి 1979-80 సంవత్సరాల్లో రాశాడు వీటిలోని కథా వస్తువులు మరింత విస్తృతినీ, లోతునూ సంతరించుకుంటూ మళ్ళీమళ్ళీ కనిపిస్తూనే ఉన్నాయి ఇదే వివిన మూర్తి కథా రచనకున్న ప్రధానమైన బలం అతని ప్రాపంచిక దృక్పథం మారలేదు. కాని దానికున్న పార్శ్వాలను గురించిన రచయిత ఎరుక మాత్రం నిరంతరంగా ఎదుగుతూనే ఉంది

1970 దశకంలో సరళంగా ఉన్న పెట్టుబడిదారీ తత్వం 1990 దశకం వచ్చేసరికి సంక్లిష్టమైపోయింది దౌర్జన్యానికీ, దోపిడీకి చట్టబద్ధతను కల్పించింది ప్రపంచీకరణా, ప్రైవేటీకరణా దావాగ్నిలా ప్రపంచాన్ని కబళించాయి ఆర్థిక సామ్రాజ్యవాదానికి భారతదేశం ఒక ముఖ్యమైన వలసగా మారిపోయింది అది మన సామాజిక, వ్యక్తిగత జీవితాల్లోని అన్ని అంశాలనూ తీవ్రంగా ప్రభావితం చేయటం ప్రారంభించింది ప్రపంచీకరణనూ, ప్రైవేటీకరణనూ తమ ప్రయోజనాలకు ఉపయోగించుకోగల అవకాశం ఉన్నవారి సంఖ్య పెరిగింది వారు వీటిని గట్టిగా సమర్థించటం ప్రారంభించారు వాటిని మనం ఆపలేం కాబట్టి అవి సక్రమమేనన్న వాదన కూడా ప్రారంభమైంది వీటితోపాటు, వీటిలో భాగంగా వచ్చిన సాంస్కృతిక సామ్రాజ్య వాదం మనం ప్రేమించే అన్ని విలువలనూ ధ్వంసం చేయటం ప్రారంభించింది

ఈ విధ్వంసాన్ని గుర్తించిన తొలి తెలుగు రచయితల్లో వివిన మూర్తి ఒకడు ఈ విధ్వంస దృశ్యాలను కథాంశాలుగా గ్రహించి అతడు చాలా కథలు రాశాడు. వాటిని అర్థం చేసుకోవటానికి భూమికగా అతడు రాసిన "కృష్ణస్వప్నం" అన్న ఊహాకల్పనను పరిశీలించవచ్చు. నిద్రపట్టని ఒక రాత్రిపూట అమెరికా అధ్యక్షుడికి గీతాప్రవక్త కృష్ణుడు దర్శనమిచ్చి తన స్వప్నాన్ని సాకారం చేసినందుకు అతణ్ణి అభినందిస్తాడు. అధ్యక్షుడు "ఏమిటి నీ స్వప్నం" అని ప్రశ్నిస్తాడు. తనది నాగరికతా స్వప్నమనీ, విజేతల స్వప్నమనీ చెబుతూ కృష్ణుడు కొన్ని దృశ్యాలను అమెరికా అధ్యక్షుడికి చూపుతాడు. వాటిలో మొదటి దృశ్యం ఇంద్రప్రస్థాన్ని నిర్మించటంకోసం ఖాండవవనాన్ని దగ్ధంచేసి, నాగజాతివారిని ఊచకోత కోయటం అందులోని నాగరికతా సూత్రం ఏమిటో కూడా అతడే చెబుతాడు. నాగరికతకు చిహ్నం ఆయుధం. అది మన చేతిలో ఉన్నంతవరకే మనం ఎదుటివాళ్ళ నాగరికతకు కొలబద్దలు కాగలం ఎంత దూరంనుంచీ మనం శత్రువు మీదికి ఆయుధాన్ని విసరగలిగితే మన నాగరికత అంత గొప్పది ఇదీ కృష్ణుని సామ్రాజ్యవాదతత్వం. రెండవ దృశ్యం పచ్చటి శరీర వర్ణం ఉన్న పసిపాపను చంపటానికి అర్జునునికి చేతులు రాకపోతే స్వయంగా కృష్ణుడే ఆ పని చేయటం దానికి కూడా కృష్ణుడే వివరణ ఇస్తాడు నేతలు కావాలనుకున్న వారికి తమ జాతిని రక్షించాలన్న కోరిక మాత్రమే ఉంటుందట. అందుచేత పరజాతులను సంహరించక తప్పదట ప్రపంచమంతా ఒకే జాతి, ఒకే నాగరికత ఏర్పడేవరకూ అలా చంపుతూపోవటం అనివార్యమట ఈ దృశ్యాలను చూసిన అమెరికా అధ్యక్షుడు తాను కృష్ణుని వారసుడైనందుకు ఆనందిస్తూ, అతని అభినందనల్ని స్వీకరిస్తాడు.

ఇంతలో ఉదయం ఆరుగంటలౌతుంది ఇతర దేశాలలో మానవ హక్కుల మీదా, ప్రజాస్వామ్యం మీదా తాను ఇవ్వవలసిన ఉపన్యాసాలను తీసుకొని అమెరికా అధ్యక్షుడు టాయ్‌లెట్‌లోకి వెళ్తాడు వాటిని చదువుతుంటే అతనికి నవ్వు వస్తుంది ఆ నవ్వులో నుంచీ ఒక ఆకారం ప్రభవిస్తుంది. అది క్రమ క్రమంగా భూనభోంతరాళాలకు వ్యాపిస్తుంది దానికింద మానవులు నలిగి పోతుంటారు నలిగిపోతున్న మానవులలోంచీ తేనె స్రవిస్తూ ఉంటుంది దాన్ని అందరూ జుర్రుకుంటూ ఉంటారు. విజ్ఞాన శాస్త్రాలు చదువుకున్న మేధావులు ఆ ఆకారం చుట్టూ చేరి భజన చేస్తూ ఉంటారు ఆ ఆకారానికి హృదయం ఉండవలసిన చోట ఒక మహారంధ్రం ఉంటుంది అందులోనుంచీ రకరకాల మారణాయుధాలూ, ప్రయాణ సౌకర్యాలూ, వినోద సమాచార సాధనాలూ స్వేచ్ఛగా అటూ ఇటూ తిరుగుతుంటాయి జనం వాటి కోసం ఎగబడుతుంటారు. చివరకు ఆ రూపం చిన్న మాత్రగా మారి అధ్యక్షుడి కడుపులోకి ప్రవేశిస్తుంది. అతనికి హాయి కలుగుతుంది.

సామ్రాజ్యవాదం యొక్క భావాజాలాన్నీ, భారతీయ పాశ్చాత్య సంస్కృతుల్లో దాని చరిత్రనూ, దాని భవిష్యత్ పరిణామాలనూ చిత్రించిన ఈ కథ తెలుగులో ఉన్న ఉత్తమ ఊహాకల్పనల్లో ఒకటి

ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ భారతీయ సమాజంలోకి తీసుకువచ్చిన పరిణామాలను గురించి వివిన మూర్తి మరికొన్ని మంచి కథలు రాశాడు. అలాంటి వాటిలో మొదటిది "పయనం పలాయనం". తల్లిదండ్రుల తరానికి, కొడుకూ కోడళ్ళ తరానికీ మధ్య భారతదేశంలో ఆర్థిక సామ్రాజ్యవాదం ప్రవేశించింది. అది మింగుడుపడని వారు పై తరం దాన్ని కౌగలించుకున్నవారు కింది తరం. కింది తరం వారికి ప్రపంచమంతా విస్తరిస్తున్న వస్తు సంస్కృతిలో తాము కూడా కలిసిపోవటానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు. పై తరానికి స్థిరమైన విశ్వాసాలూ, ఓర్పు, క్షమాగుణం, ఇతరుల క్షణికోద్రేకాలను దాటి వెళ్ళగల ప్రేమానురాగాలు, జీవిత మంటే గౌరవం ఉన్నాయి కింది తరానికి ఇవేవీ లేవు తమను తాము అమ్ముకోవటానికీ, తమ లాభం కోసం ఇతరులను అమ్మటానికీ వారికి ఎలాంటి సంకోచమూ లేదు "ఈనాటి జీవన విపణిలో ఈ పలాయనం అనివార్యమా?" అన్నది ఈ కథ గూఢంగా వేసే ప్రశ్న ఆ ప్రశ్నకు సమాధానం ఇంకా మనకు లభించలేదు.

ప్రపంచీకరణలో భాగంగా వచ్చిన నూతన యాజమాన్య పద్ధతులను గురించిన పెద్ద కథ (లేదా నవలిక) "పాడుకాలం". పనికీ, పనివాడికీ మధ్య ఉన్న అనుబంధాన్ని తెంచెయ్యటం ఈ యాజమాన్య పద్ధతిలోని ప్రధాన సూత్రం. విశాఖపట్నంలోని మీనాంబికా ఇండస్ట్రీస్‌కు కొత్తగా వచ్చిన మేనేజర్ ఆనంద్ కుమార్ గంగూలీ ఇలా అనుకుంటాడు, "పనివాడితనం కలవాడికి పనిమీద ఉన్న కంట్రోల్‌ను పూర్తిగా తొలగించటం సాధ్యపడదు. చెయ్యాల్సిందల్లా వాడికి ఆ కంట్రోల్ ఉందని ప్రదర్శించే వీలు యివ్వకపోవటమే". మరి కొంతకాలం తరువాత తాను అనుకున్నది సాధించటానికి ఆటంకం కార్మికుల ఐక్యతేనని గ్రహిస్తాడు. "వీరి ఐక్యతను చిటికెలో పోగొడతాను" అని నిర్ణయించుకుంటాడు.

దాన్ని సాధించటానికి అతను అనుసరించే విధానం ఓవర్‌టైం ద్వారా కాస్త పై రాబడి కల్పించటం "పై రాబడి అసలు రాబడి కన్నా మనిషిని ఎక్కువ బానిసను చేస్తుంది", అని గంగూలీకి తెలుసు ఇలాంటి యాజమాన్య పద్ధతులు మొదట కార్మికవర్గాన్ని కార్మికవర్గ భావజాలంనుంచీ దూరం చేస్తాయి వాళ్ళు క్రమ క్రమంగా వ్యక్తులుగా, సమూహాలుగా శిధిలమైపోతారు చిట్టచివరికి ప్రైవేట్ పరిశ్రమల కింద మాత్రమే బతకగలమని తెలుసుకుంటారు చైతన్యాన్ని వదిలించుకొని ప్రాణం ఉన్న యంత్రాలుగా మారిపోతారు గంగూలీ మాటల్లో చెప్పాలంటే "కార్మిక చైతన్యం అన్న అభిప్రాయం ఫూలిష్ సెంటిమెంటు", అని నిరూపితమై పోతుంది

కొత్త మార్కెట్ విధానాలను గురించి వివిన మూర్తి రాసిన వ్యంగ్య కథ "మాయ - మహామాయ", వైద్యరంగాన్ని కబళించిన అమానుషమైన దోపిడీని గురించి రాసిన ఊహాకల్పన "దిశ" వివిన మూర్తి మాత్రమే రాయగలిగిన కథలు

మనసు లోతుల్లో ఉండి, అదృశ్యంగా మానవ జీవితాన్ని ప్రభావితం చేసే సహజాతాలను గురించి మొట్టమొదట తెలుగులో కథలు రాయటం ప్రారంభించింది ఎవరో చెప్పటం చాలా కష్టం కానీ ఆ పద్ధతిని శిఖరాగ్రాలకు తీసుకుపోయిన రచయిత కా రా యే అతడు ఆర్తి, భయం, శాంతి, హింస మొదలైన సహజాతాలకున్న సామాజిక పార్శ్వాలను (Social dimensions) గురించి గొప్ప కథలు రాశాడు కా రా. సాంగత్యం వల్ల కాబోలు వివిన మూర్తికి కూడా ఈ విధానం మీద అభిరుచి కలిగింది. తాను కూడా అలాంటి కథలు చాలా రాశాడు వాటిలో స్వేచ్ఛను గురించి రాసిన "అద్వైతం", వాంఛను గురించి రాసిన "యయాతి", భద్రతను గురించి రాసిన "స్పర్శ" ముఖ్యమైనవి ఈ మూడు కథల్లోనూ "స్పర్శ" ఉత్తమ కథ కథానేపథ్యం, కథాంశం, కథ ఒక దానితో ఒకటి ఈ కథలో కుదిరినంత పొందికగా కుదిరిన కథలు అరుదుగా మాత్రమే ఉంటాయి.

ఇంతవరకూ మనం అనుకున్నట్లుగా వివిన కథల్లో కొత్త కథా వస్తువుల కోసం అన్వేషణ ఉంది అతడు సహజాతాలను గురించి రాసినప్పుడు కూడా అతని చూపు కొత్తది, ఆవిష్కరణా కొత్తది

వస్తువుకు తగిన శిల్పాన్ని ఎన్నుకోవటంలో కూడా వివిన మూర్తికి చాలా శ్రద్ధ, అన్వేషణ ఉన్నాయి అతని సాధారణ కథన పద్ధతి వాస్తవిక చిత్రణే అతడు రాసిన చాలా ఎక్కువ కథలు ఈ కథన శిల్పంలోనే ఉన్నాయి కానీ కథన పద్ధతిని మార్చటం చేత కథనం మరింత శక్తివంతంగా రూపొంది, కథా వస్తువు మరింత బలంగా అభివ్యక్తమౌతుందని అనిపించిన సందర్భాలలో అతడు ఇతర కథన పద్ధతుల్ని అనుసరించాడు

ఉదాహరణగా 'ప్రవాహం' అన్న కథను తీసుకోవచ్చు. ప్రకృతికీ మానవునికీ మధ్య ఉన్న (లేదా ఉండవలసిన) అనిర్వచనీయమైన అనుబంధాన్ని చిత్రించటం ఇందులోని కథా వస్తువు ఈ కథను వివిన మూర్తి అంతరార్థకథనం అలిగరీ-లో చెప్పాడు ప్రకృతికి గోదారి, ప్రకృతిని ప్రేమించే మానవునికి గోదారిగాడు రూపకాలు

అంటే మెటఫర్లు   గోదారిగాడికి గోదారిలో దొరికిన కొయ్యదుంగ వారి అనుబంధానికీ, ఆ అనుబంధాన్ని చెడగొట్టిన వ్యాపారదృష్టికి వడ్రంగి బ్రహ్మం కూడా రూపకాలే బ్రహ్మం కొయ్య దుంగను అంగడి సరుకు చేసి గోదారిగాడిని గోదారి నుంచే వేరు చేశాక ఆ ఎడబాటును సహించలేక వాడు ఆత్మహత్య చేసుకుంటాడు

ఆధునిక సామాజిక పరిణామాలను చిత్రించటం కోసం ప్రాచీన గాథలను పునఃసృష్టి చేయటం గొప్ప శిల్ప విన్యాసం ఈ పద్ధతిని కొడవటిగంటి "బకాసుర" వంటి రచనల్లో విజయవంతంగా ఉపయోగించాడు వివిన మూర్తి  కూడా "దళిత సత్యం" వంటి కథల్లో ఈకథన శిల్పాన్ని ఉపయోగించాడు మహారాజుగా ఉండి కాటి కాపరిగా, దళితుడుగా మారిన హరిశ్చంద్రుని పాత్రను కొత్త పద్ధతిలో, కొత్త భావజాలంతో ఆవిష్కరించిన విధానం ఈ కథలో చక్కగా కుదిరింది. "ఇతరులు మనల్ని అప్పుల్లోకి నెట్టితే అది రుణం కాదు దాన్ని తీర్చటానికి మిమ్మల్ని మీరు అమ్ముకోరాదు", అప్పుకు సంబంధించిన ఈ సూత్రీకరణ హరిశ్చంద్రుని ఆలోచనలోకి రావటం ఈ కథలోని కొత్తదనం విశ్వామిత్రుడు ఎంత మోసపూరితంగా హరిశ్చంద్రుణ్ణి అప్పులోకి నెట్టాడో ఆలోచించుకుంటే అది తీర్చవలసిన అప్పేనా అన్న అనుమానం కలగాలి. కా.రా. "యజ్ఞం"లో అప్పల్రాముడిది అప్పు అవునా, కాదా అన్న ప్రశ్నలను చాలా గూఢంగా వేశాడు. అదే ప్రశ్నను మనం హరిశ్చంద్రుని అప్పును గురించి కూడా వేసుకోవాలి ఆ అవకాశాన్ని పురాణ గాథను పునఃసృష్టి చేసిన కథనశిల్పమే పాఠకునికి ఇస్తుంది.

వివిన మూర్తి ప్రతీకల్ని కూడా తన కథల్లో చాలా చోట్ల ఉపయోగించుకున్నాడు అలాంటి కథల్లో ప్రముఖమైంది "చేటపెయ్య" పాలు తాగే లేగదూడ చనిపోతే దాని లోపలి భాగాన్ని శుభ్రం చేసి, గడ్డి కూరి పాడి ఆవు ముందర పెడతారు. దాన్ని చేటపెయ్య అంటారు. తన దూడ బతికే ఉందనుకొని ఆవు దాన్ని నాకుతూ చేపుతుంది. ఆ చేపిన పాలను మనం పిండుకుంటాం మృత ప్రాయమైన దేన్ని మనం స్వప్రయోజనానికి ఉపయోగించుకున్నా దాన్ని చేట పెయ్య అనవచ్చు. అది బతికి లేదని తనకు తెలిసినా దాన్ని స్వప్రయోజనానికి ఉపయోగించుకునేవాడు అది బతికే ఉందన్న భ్రాంతిని ఇతరుల్లో కల్పిస్తాడు భారతీయ సమాజంలో చేటపెయ్యలకు కొదవలేదు. ఉపయోగించుకునేవాడి నేర్పరితనాన్ని బట్టి అవి అనంతంగా ఉన్నాయి. ఈ కథలో జగన్నాథం అన్న పాత్ర ఉపయోగించుకున్న  చేటపెయ్య 'కులం'.

రచయితగా వివిన మూర్తికున్న రెండు ప్రత్యేక శక్తుల్ని (Talents) గురించి ఈ సందర్భంలోనే చెప్పుకోవాలి. వాటిలో మొదటిది సంక్లిష్టమైన తన అభివ్యక్తికి తెలుగు భాషను సమర్థంగా ఉపయోగించగల శక్తి. రెండవది సంభాషణలు రాయటంలో ఉన్న అసాధారణ చాతుర్యం.  మొదటి దానికి "పయనం - పలాయనం", "స్పృహ" మొదలైన  కథల్నీ, రెండవదానికి "ప్రపంచ మొక పద్మవ్యూహం", "పాడుకాలం" లాంటి కథల్నీ ఉదాహరణలుగా చూపించవచ్చు.

దాదాపు పదిహేనేళ్ళుగా వివిన మూర్తి కథల్ని శ్రద్ధగా చదువుతున్న నాకు కొంతకాలంగా అతని రచనలో వస్తున్న  మార్పుల్ని గురించి కొంత ఆందోళన

కలుగుతోంది. ఈ వ్యాసానికి నామమాత్రపు సమగ్రతైనా రావాలంటే వాటిని గురించి సంక్షిప్తంగానైనా ప్రస్తావించక తప్పదు.

వివిన మూర్తి సమాజాన్ని గురించి రాసే రచయితే కానీ, "వ్యక్తి"ని గురించి రాసే రచయిత కాదని ఈ వ్యాసం ప్రారంభంలో చెప్పాను సిద్ధాంతపరంగా చెప్పాలంటే అతడు సామాజిక నిర్మాణాలను (Social formations) గురించీ, అందులో భాగమైన మనుషులను గురించీ రాసే రచయిత ఈలోగా అతనిలో వస్తున్న పరిణామం వ్యక్తి వైపుకు - మానసికంగా అనారోగ్యకరమైన వ్యక్తి వైపుకు జరుగుతూ వుండటం మనస్తత్వశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే అతని కథల్లో, కథా వస్తువుల్లో (morbidity) చోటు చేసుకుంటోంది మార్బిడిటీని అసహ్యాకరమైన, అనారోగ్యకరమైన ఆలోచనలు చేసే జబ్బు మనస్సు యొక్క స్వభావంగా నిర్వచించవచ్చు. ఈ మొత్తం పరిణామాన్ని మనం "స్పృహ" (1999) అన్న పెద్ద కథలో స్పష్టంగా చూడవచ్చు స్త్రీ పురుషుల మధ్య వాంఛకు అతీతమైన స్నేహం సాధ్యమా అన్నది (బహుశా) ఈ కథలోని వస్తువు స్త్రీ పురుషులు తాము స్త్రీ పురుషులమన్న భావాన్ని దాటి వెళ్ళగలిగితే స్నేహం సాధ్యమేనన్నది లోకజ్ఞానం (Common sense) లోనుంచీ వచ్చే సమాధానం. కానీ సమాధానం కోసం వెదికే వ్యక్తి పేరు (శేఖరం - కవి, సంపాదకుడు) కి ఆరోగ్యకరమైన మనస్సు లేదు అతని వదిన, మరొక స్త్రీ అతడికి నపుంసకుడున్న ముద్ర వేశారు. అతడు ఒక స్త్రీ ఉద్యమ కార్యకర్తతో తన్ను తాను ఫరీక్షించుకోవాలనుకుంటాడు కారణం చెబుతూ ఆమె "వ్యక్తి"గా మారిన స్త్రీ అనీ, 'అలాంటి స్త్రీ మాత్రమే - ఏ ప్రయోజనాలూ ఆశించకుండా - నా మీద కరుణతో - నా లైంగిక శక్తిమీద సత్యం చెప్పగలదు" అనీ బతిమాలుతాడు. ఆవిడ "నేను లైంగికానుభవమే లేనిదాన్ని, పరీక్షలు ఎలా నిర్వహించగలను" అంటుంది. రాజశేఖరం ఆశ్చర్యపోతాడు "మగవాడిననే స్పృహ నుంచీ వ్యక్తిగా, "అతడు మారలేదు కాబట్టి అతనికి ఆశ్చర్యం కలిగిందని ఆవిడ చెబుతుంది. ఆ తరువాతైనా వారు "వ్యక్తులు"గా మారారో లేదో మనకు అర్థం కాదు. అర్థం కావాలసిన అవసరమూ లేదు.

శేఖరం తన పరీక్షకు ఒక స్త్రీవాదిని ఎందుకు ఎన్నుకున్నాడు? అందమూ, వయసూ, ఆరోగ్యమూ, సామాజిక సంబంధాలూ ఉన్నా ప్రేమించి, ప్రేమించబడాలన్న సహజమైన, ఆరోగ్యకరమైన వాంఛకు ఆవిడ ఎందుకు దూరంగా వుంటోంది. మానవ సహజమైన భావోద్రేకాన్ని అంత అసహజంగా చంపుకోవాల్సిన అవసరం ఏమిటి? ఆ హేతువులోనుంచి ఆవిడ స్త్రీవాదం పుట్టిందా? లేక స్త్రీవాదంలోనుంచి ఆ హేతువు పుట్టిందా? మొత్తంమీద ఇద్దరివీ ఆరోగ్యకరమైన మనస్సులు కావు. ఇలాంటి పాత్రలు కథా వస్తు పాత్రలు (thematic characters)గా రూపొందటం వివిన మూర్తి కథా రచనలో ఇటీవలి పరిణామం - నా వరకు నాకు ఆందోళనకరమైన పరిణామం పాత్రల, కథా వస్తువుల ఎన్నికలో మాత్రమే గాకుండా కథనంలో కూడా అనవసరంగా - కథా వస్తువుతో సంబంధం లేకున్నా - జబ్బు ఆలోచనల ఆవిష్కరణ చాలా కథల్లో ఎదురౌతోంది.

నా పరిశీలనలో ఎంత సత్యం ఉందో కచ్చితంగా చెప్పలేను. కానీ వివిన

మూర్తి రచయితగా తన(intentions) ను వెనక్కి తిరిగి చూచి సింహావలోకనం చేసుకోవాల్సిన అవసరం ఉందని మాత్రం చెప్పగలను

నేను చెప్పదలుచుకున్న రెండవ అంశం కథన శిల్పానికి సంబంధించింది సర్వసాక్షి దృష్టికోణంలో కథ చెబుతున్నప్పుడు తన వస్తువు పాఠకునికి అందిందో లేదోనన్న ఆందోళనతో రచయితగా జోక్యం చేసుకొని కీలకమైన సూచనలు చేయటం, కథా వస్తువును గురించి కథ చివర వ్యాఖ్యానించటం మొదలైన అలవాట్లు వివిన మూర్తికి మొదటినించీ వున్నాయి. ఉదాహరణకు శ్రమ ఫలితాన్ని గురించి రాసిన "వంకర చూపులు" అన్న కథలో కథా వస్తువును సూచించటం కోసం మాధవుడు అన్న పాత్ర "ఆస్తి - దాని స్వరూపాలు" అన్న పుస్తకాన్ని చదువుతున్నట్లుగా వర్ణించటం అలాంటి ప్రయత్నమే. అలాగే "ప్రవాహం" అన్న కథలో గోదారిగాని ఆత్మహత్యను వర్ణించి "ఆ చావు ఒక స్మృతే అయింది కానీ ఒక నీటి కాలేదు" అని వ్యాఖ్యానించటంకూడా రచయిత జోక్యమే నా అభిప్రాయం కథ సాధించిన ఇఫెక్ట్‌ను ఈ వ్యాఖ్య పరాస్తం చేసింది. దీనికంటే గోదారిగాడు ఆత్మహత్యను చూచి గోదారి ఎలా స్పందించిందో సూచించి వుంటే ఈ కథకు మరింత కవితాత్మకత అబ్బేది.

గత ఐదారు సంవత్సరాలుగా వివిన మూర్తి కథా వస్తువులు సంక్లిష్టమౌతూ వచ్చాయి. వాటిని నాటకీయత ఉన్న కథలుగా అల్లుకోవటం చాలా శ్రమతో కూడిన కార్యవిధానం. అందుచేత కొన్ని కథల్లో కథా వస్తువులు, సంఘటనల ద్వారా కాకుండా చర్చల ద్వారా, అంతరంగ మథనాల ద్వారా వ్యక్తం కావలసి వచ్చింది. వాటిలో కొన్ని కథలు ఆర్గ్యుమెంట్లుగా మారిపోయి, పరిమాణంలో పెరిగిపోయాయి. అందుచేత కథా వస్తువులు మరింత క్లిష్టమైపోయి ఈ కథలకు చదివించే శక్తి తగ్గిపోయింది. కీలకమైన ఈ కథన సమస్యను గురించి కూడా వివిన మూర్తి ఆలోచించవలసిన అవసరం ఉంది కథా వస్తువును కథగా మార్చి, వాస్తవ జీవితంలో సహజంగా అనుసంధించగల (objective correlatives) కోసం అతడు తీవ్రంగా అన్వేషించవలసిన అవసరం ఉంది.

వివిన మూర్తి ఈనాడు మనకున్న అరుదైన రచయిత, కొత్త చూపు కలిగిన ఆలోచనాపరుడు జీవితం పట్ల గౌరవమూ, సాహిత్యం పట్ల నిబద్ధతా ఉన్నవాడు. ఇంకా ఎన్నో మంచి కథలు రాయగలిగిన సమర్థత కలిగినవాడు. వాటికోసం ఎదురు చూడటం పాఠకులుగా మన బాధ్యత.

# అల్లం రాజయ్య

♦ ఎన్. వేణుగోపాల్ ♦

అల్లం రాజయ్య మొదటి కథ 'ఎదురు తిరిగితే ' ఆధునిక సాహిత్యవేదిక సృజనలో 1977 ఆగస్ట్ , సెప్టెంబర్ సంచికలలో అచ్చయింది ఆ తర్వాత ఈ ఇరవైఐదు సంవత్సరాలలో రాజయ్య తన పేరుతోనూ, కలం పేర్లతోనూ రాసిన కథలు మొత్తం నూటయాభై పైనే వుంటాయి ఈ కథలలో ప్రధానమైన ముప్పై, నలభై కథలను ఒకేచోట పెట్టుకుని చదివితే ఈ విస్తృతమైన రాశికి తగిన వాసి, వస్తు వైవిధ్యం, శిల్ప, నిర్మాణ భాషా ప్రయోగాలు విస్తారంగా కనపడతాయి మొత్తంగా రాజయ్య కథల వస్తు శిల్పాల సమగ్ర విశ్లేషణ ఇక్కడ సాధ్యంకాదు గాని స్థూలమైన పరిశీలనాంశాలు, భవిష్యత్ పరిశోధనకు ఉపయోగపడగల ప్రాతిపదికలు ప్రతిపాదించడమే ఈ వ్యాస లక్ష్యం

'ఎదురు తిరిగితే ..' అచ్చుకాగానే దానిలోని వస్తువు వల్ల, భాష వల్ల కూడ సృజనలో పెద్ద ఎత్తున చర్చ జరిగింది ఆ చర్చ సందర్భంగా 'ఆయా పాత్రలను సృష్టించిన తీరు, ఆ కథా గమనం అంతా ఆయా పాత్రలను బాగా స్టడీ చేసి రాసినట్లుంది' అని ఒక పాఠకుడు రాశారు మొదటి కథ గురించిన ఈ వ్యాఖ్య ఆ తర్వాతి కథలకు ఇంకా ఎక్కువగా వర్తిస్తుంది. రాజయ్య కథలలోని పాత్రలలో దాదాపు మొత్తం గ్రామీణ పాత్రలే. అందువల్ల గ్రామీణ జీవిత, భౌతిక, మానసిక ప్రపంచాల వైవిధ్యాన్ని చిత్రించడానికి చేసిన కృషిగా అల్లం రాజయ్య కథలను మొత్తంగా విశ్లేషించవచ్చు

ఈ గ్రామీణ భౌతిక, మానసిక ప్రపంచాల చిత్రణ రాజయ్య కథల వస్తువుకూ, శిల్పానికీ కూడ వర్తిస్తుంది నిజానికి చాల కథలలో వస్తు శిల్పాల విభజన కూడ సాధ్యం కాదు రాజయ్య ఎంచుకున్నలాంటి వస్తువులను రాజయ్య చెప్పిన శిల్ప నిర్మాణ పద్ధతులలో, భాషలో కాకుండా మరొక రకంగా చెప్పడం సాధ్యమవుతుందా అని ఆలోచిస్తే ఈ కథల వస్తు శిల్పాల మమేకత ఎంత సహజమైనదో, ఎంత దృఢమైనదో అర్థమవుతుంది

రాజయ్య కథలలో వస్తువు చాల వైవిధ్య భరితమైనది స్థూలంగా చూస్తే ఆ కథలన్నీ పోరాటం అనే ఒక వస్తువును ఆశ్రయించినట్లు కనబడతాయి ఈ స్థూల దృష్టి నుంచి మాత్రమే చూసినందువల్లనే రాజయ్య కేవలం పోరాట ప్రచార కథలు మాత్రమే రాశాడని, ప్రజాజీవిత నిర్దిష్టతను గమనించలేదని ఆయన మీద విమర్శలు వచ్చాయి. కానీ ఆ కథలను జాగ్రత్తగా ఏ దురభిప్రాయాలు లేకుండా చదివితే పోరాట జీవితం అనే ఒకే వస్తువునే రాజయ్య ఎన్నివేల కోణాలనుంచి దర్శించాడో, ఆ ఒకే వస్తువు ఎన్ని ముఖాలలో

వ్యక్తీకరణ పొందుతుందని గుర్తించాడో, ఆ వస్తువును వందల కథాంశాలలో ఎంత మౌలికంగా, సృజనాత్మకంగా అన్వయించాడో అర్థమవు తుంది ఈ దృష్టితో చూసినప్పుడు రాజయ్య రాసిన ప్రతి కథకూ ఒక ప్రత్యేకత, నిర్దిష్ట వస్తువు ఉందని, ఏ కథా మరో కథను అనుకరించలేదని అర్థమవుతుంది

అదే సమయంలో ఆ విభిన్న వస్తువులన్నిటికీ కూడా 1970ల తర్వాతి తెలంగాణ పల్లెసీమల అట్టడుగు ప్రజల జీవితం అనే నిర్దిష్ట స్థలకాలాల ఏకసూత్రత ఉంది ఆ వైవిధ్యమూ, ఈ ఏక సూత్రతా కూడా రాజయ్య కథల విశిష్టతలు. వైవిధ్యాన్ని విస్మరించి, ఏకసూత్రతను మాత్రమే పైకెత్తి చూపి ఒకే రకమైన కథలు రాస్తాడని విమర్శించడమైనా, వైవిధ్యాన్ని మాత్రమే గుర్తించి దృక్పథాన్ని కోల్పోతున్నాడని విమర్శించడమైనా రాజయ్య కథల విశిష్టతను గుర్తించని వ్యాఖ్యలే

అయితే రాజయ్య కథల విశిష్టత అప్రజ్ఞాతమో, యాదృచ్ఛికమో కాదు రాజయ్య కథా వస్తువులకు స్పష్టమైన, చాలాసార్లు వాచ్యంగా కూడ వెలువడిన స్థల, కాల సామాజిక నేపథ్యం ఉంది. అది 1973-74 నుండి మొదలయి కరీంనగర్ పల్లెటూళ్ళ జన చైతన్యం కొలిమంటుకున్న జాడ 'ఎదురు తిరిగితే..' కథ గురించి రాజయ్యే ఆ తర్వాత చెప్పుకున్నట్లు, 1974లో కరీంనగర్ ఉద్యమ సాహితి వెలువరించిన 'బద్‌లా' కథా సంకలనం కోసం అప్పటికింకా కథా రచనలో ప్రవేశించని అల్లం రాజయ్యను కథ అడిగారు "ఉక్కిరిబిక్కిరయి ఏది రాయాలో తేల్చుకోకుండానే మిత్రుల ప్రోత్సాహంతో ఒక యధార్థంగా జరిగిన సంఘటనను అట్లాగే రాసిన, సాహిత్యమంటే ఉన్న పిరికితో అది సంవత్సరం దాకా ఎవరికీ చూపలేదు" అని రాజయ్య 1981లో రాశాడు. ఆ కథ ఆ రూపంలోనే సృజనకు చేరింది. అప్పుడే ఎమర్జెన్సీ వచ్చి సృజన ఆగిపోయింది. ఎమర్జెన్సీ 19 నెలల కాలంలో, 'ఎదురు తిరిగితే....' లో చిత్రితమైన జీవితం ఇంకా అనేక పరిమాణాత్మక, గుణాత్మక మార్పులు పొందింది ఆ మార్పులతో, సృజన సాహితీ మిత్రులకూ రాజయ్యకూ మధ్య చర్చలతో, కరీంనగర్ - ఆదిలాబాద్ రైతాంగ పోరాట ప్రజ్వలనంలో భాగంగా ఆ కథ సృజనలో అచ్చయ్యింది.

ఆ తర్వాత గడిచిన ఏడెనిమిది సంవత్సరాలు ఉత్తర తెలంగాణ జిల్లాలన్నీ అనేక సమస్యలపై వెల్లువెత్తిన ప్రజా ఆందోళన రంగస్థలమయ్యాయి అల్లం రాజయ్య కథలకు ముడి సరుకును అందించినవి ఈ ప్రజా పోరాటాలే పోరాటం అనగానే రెండు ఎదురు బొదురు వర్గాలు, ఒక వర్గం మంచి, మరొక వర్గం చెడు అనే సరళరేఖలో సాహిత్య సృజన సాగడం ఆనవాయితీ గనుక అల్లం రాజయ్య కథ ఈ సరళరేఖను అధిగమించి సాధించిన వస్తు విస్తృతి ఆశ్చర్యం కలిగిస్తుంది

వర్గపోరాట చిత్రణలో రెండు ప్రత్యర్థివర్గాల చిత్రణ, ఘర్షణ చిత్రణ ఎంత అవసరమైనదీ, ప్రాముఖ్యత గలదీ అయినప్పటికీ, అటువంటి చిత్రణతో రెండు సమస్యలున్నాయి. ఒకటి, అది మూసకు దారి తీసి ఒక వైపు సకల సద్గుణ సంపన్నులు, మరోవైపు అవగుణాల కుప్పలు ఉండే అవాస్తవికత వైపు

కొట్టుకుపోతుంది. నిజజీవిత పాత్రల స్థానంలో అత్యుక్తులతో ఒకవైపు మంచిని, మరోవైపు చెడును వర్ణించే శైలికి దారితీసి విశ్వసనీయతను కోల్పోతుంది రెండు - సైద్ధాంతికంగా ఒకే వర్గంలో ఉన్నప్పటికీ, కార్యాచరణలో, నిజజీవితంలో తమ వర్గంలోని వారికీ తమకూ మధ్య భిన్నాభిప్రాయాలు, విభేదాలు, వైమనస్యాలు, భిన్న ఆలోచనా ధోరణులు ఉన్నాయనే ఒక వాస్తవికత కన బడుతూ ప్రజలను ఆ సాహిత్యం పట్ల అవిశ్వాసంలోకి, కలవరంలోకి నెడుతుంది

రాజయ్య కథల విశిష్టత ఎక్కడ ఉన్నదంటే ఆయన కథల్లో వర్గపోరాటం గురించి, వర్గపోరాట ప్రతిఫలనాల గురించి రాస్తూనే వాటితో సమానంగానో, హెచ్చుగానో ప్రజల మధ్య వైరుధ్యాల గురించీ రాశాడు. 'ఎదురు తిరిగితే ...' కథపై చర్చలో ఒక విమర్శకుడు "భూస్వామ్య వర్గాలు పేద ప్రజలను ఎలా హింసిస్తున్నాయో కథలో ప్రధానంగా చెప్పాల్సిందిపోయి, పేద ప్రజల మధ్య జరిగే చిన్న చిన్న తగువులకు ప్రాధాన్యత ఇచ్చి, వాళ్ళలో ఐక్యత లేదని" రాజయ్య రాశాడని విమర్శించాడు కాని రాజయ్య మొదటి కథతోనే ఎంచుకున్న ఈ వైఖరి కథకుడుగా రాజయ్యకు మేలు చేసింది. వస్తు విస్తృతికి ఉపయోగ పడింది. ఇంకా ఎక్కువ జీవిత కోణాల్ని అర్థం చేసుకుని, జీవిత దృక్పథాన్ని ఉన్నతీకరించుకోవడంలో పాఠకులకు సహాయపడింది. తమ రాజకీయార్థిక విధానాలు ప్రజాజీవితంలో ఎటువంటి వ్యక్తీకరణలు పొందుతాయో సృజనాత్మక రూపం ద్వారా గ్రహించడానికి ఉద్యమానికి ఉపయోగపడింది.

స్థూలంగా వస్తువు ఒకటే అయినప్పటికీ కథాంశం, ఇతివృత్తం, కథాంగాలు, వాతావరణం, స్థలకాలాలు, సమస్యలు, వైఖరులు వంటి అనేక అంశాలలో ఈ విశాలదృష్టిని చేపట్టడం వల్ల రాజయ్య కథలు అపారమైన వస్తు విస్తృతిని సాధించాయి. దొరల ఆక్రమణలోని బంజరు భూమిని స్వాధీనం చేసుకోవడానికి భూమిలేని నిరుపేద దళితులు జరిపిన పోరాటం నుంచి, ఉద్యమ క్రమంలో చేపట్టిన వేరు వేరు భూ సమస్యలనుంచి, వివిధ నిర్బంధ రూపాల నుంచి, నిర్బంధాన్ని ప్రతిఘటించడానికి ప్రజలు అన్వేషించిన అనేక పోరాట రూపాల నుంచి, ఉద్యమ నిర్మాణ నాయకత్వం వేసిన ఎత్తుగడల నుంచి, ఆదివాసుల పోరాటాలనుంచి, జీవితం నుంచి, గని కార్మికుల సమర శీలతనుంచి, పోరాట ప్రాంతంలో మధ్యతరగతి మానసికాందోళన నుంచి, వేర్వేరు జీవితాల స్త్రీల ప్రతి స్పందనలనుంచి, అమరుల పోరాట సంస్మరణ నుంచి, ప్రజాశత్రువు మానసిక కల్లోలం దాకా రాజయ్య స్పృశించని జీవిత శకలం లేదంటే అతిశయోక్తి కాదు.

రాజయ్య కథల వస్తు విశిష్టతను గుర్తించడానికి ఐదు ప్రధాన ప్రాతి పదికలున్నాయి అవి

ఒకటి - ప్రజల మధ్య వైరుధ్యాలు

రెండు - కథాంశపు చరిత్ర, భూగోళాల గురించిన స్పష్టత

మూడు - కథాంశపు నిర్దిష్టత

నాలుగు - పాత్రల పరిణామానికిగాన్ని, కథలో ఇతివృత్త పరిణామానికి

గాని మూలాలను బాహిర పాత్రల నుంచో, బాహ్య పరిణామాల నుంచో కాక అంతర్గత చలనం ద్వారా చూపగలగడం

ఐదు - ఇరవై ఐదేళ్ళ కథా రచనా ప్రయాణంలో వస్తువుల ఎంపికలో సాధారణత్వం నుంచి ప్రత్యేకత్వానికి, మామూలు అంశాల నుంచి క్లిష్టమైన అంశాలకు ప్రయాణం చేయడం

అసలు సమస్యనుంచి దృష్టి మళ్ళిస్తుందనీ, పక్కదారి పట్టిస్తుందనీ ఎవరు ఏమన్నప్పటికీ ప్రజా ఉద్యమాల అభివృద్ధి పట్ల శ్రద్ధ ఉన్న వాళ్ళందరూ తప్పనిసరిగా పరిగణనలోకి తీసుకోవలసిన అంశం ప్రజల మధ్య వైరుధ్యాలు. మరీ ముఖ్యంగా వర్గ అంతరాలతో పాటు కుల, మత, భాషా, ప్రాంత, స్త్రీ - పురుష అంతరాలు, విభేదాలు విస్తృతంగా ఉన్న మన సమాజంలో సామాజిక పరివర్తన కోసం చేసే ఏ ప్రయత్నం మీదనయినా ఈ అంతరాల ప్రభావం ఉంటుంది ఈ అంతరాలు, విభేదాలు కూడా ఒకేసారి సరళరేఖలాగ అర్థమైపోయే సార్వకాలిక, సార్వజనీన, మార్పులేని అంశాలు కావు. ఆయా సమూహాల మధ్య, ఆయా సమూహాలలోని విడివిడి వ్యక్తుల మధ్య కూడ నిరంతర ఐక్యత, ఘర్షణ కొనసాగుతుంటాయి. ఒక విషయంలో ఏకీభవించిన వాళ్ళే మరొక అంశంలో భిన్న ధృవాలవుతారు. ఈ సామాజిక వాస్తవికతను కథా రూపంలోకి అనువదించడంలో అల్లం రాజయ్య అపారమైన కృషి చేశాడు. ఒక దొరకూ ఒక కూలీకీ మధ్యన వచ్చే ఘర్షణను అర్థం చేసుకోవడమూ, చిత్రించడమూ, అర్థం చేయించడమూ చాల సులభం కాని ఇద్దరు కూలీల మధ్య తలెత్తే ఘర్షణను అర్థం చేసుకోవడమెట్లా? వారిలో ఎవరు ఒప్పో, ఎవరు తప్పో నిర్ధారించడమెట్లా? ఈ ఘర్షణ శత్రుపూరితమైనదా? మరొకరు ఎగసన తోయడం వల్ల రగుల్కొన్నదా? దాని పరిష్కారం ఇరుపక్షాలకు సమ్మతమైన రీతిలో సాధించడమెట్లా? సామాజిక ఉద్యమ కార్యకర్తల ముందర ఇవి చాల క్లిష్టమైన ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు అల్లం రాజయ్య జీవిత సన్నివేశాల చిత్రణ నుంచి జవాబు చెప్పదలిచాడు

తొలి కథలోనే నిరుపేదలు, ఆర్థిక, సామాజిక స్థితిలో ఒకే చోట ఉన్న దళితులు (అప్పటికింకా తెలుగులో ఆ మాట ప్రాచుర్యంలోకి రాలేదు. వాళ్ళు మాదిగలు) బొత్త కొంరయ్య ఒక వైపునా, తొంట కొంరని కొడుకు లింగడు, కర్రెలింగడు మరోవైపునా ఉన్న ఘర్షణ దగ్గర రాజయ్య ప్రారంభమయ్యాడు. ఈ ఘర్షణ దొరల వల్ల, పటేళ్ళ వల్ల ఏయే మలుపులు తిరిగిందో చిత్రించాడు. ఆ తర్వాత 1985లో రాసిన 'గురువులు'లో గాని, 1995లో రాసిన 'అతడు' లోగాని ఎన్నో కథల్లో రాజయ్య ప్రజల మధ్య వైరుధ్యాల విశ్వరూపాన్ని, వేరు వేరు వ్యక్తీకరణ రూపాలను చిత్రించాడు. ప్రజల మధ్య, ఒక శిబిరంలోనే ఉండవలసిన ప్రజల మధ్య ఘర్షణలు ఎందుకు తలెత్తుతాయో, ఆ ఘర్షణలను ఎట్లా నివారించవచ్చునో, ఎట్లా పరిష్కరించవచ్చునో, ప్రజల మధ్య ఐక్యత ఎట్లా సాధ్యమవుతుందో, పోరాట ఆచరణలో ఆ ఐక్యత ఎట్లా బలపడుతుందో, ఆ ఐక్యతను చీల్చడానికి పెత్తందారీ వర్గాలు ఎటువంటి ప్రయత్నాలు చేస్తాయో, ఆ ప్రయత్నాలను భగ్నం చేయడానికి పోరాట నాయకత్వం ఎటువంటి

మెలకువలను, సమయస్ఫూర్తిని ప్రదర్శించవలసి వుంటుందో రాజయ్య కథలు వివరిస్తాయి

ఈ విషయాలను శాస్త్రస్థాయిలో విశ్లేషించిన సిద్ధాంతకర్తలున్నారు ఆచరణ స్థాయిలో అన్వయించి చూపిన పోరాట నాయకులున్నారు కాని రాజయ్య విశిష్టత ఆ అవగాహనను సజీవ పాత్రలతో విశ్వసనీయంగా కళారూపంలో వ్యక్తీకరించడం

విశ్వసనీయ వ్యక్తీకరణ అన్నప్పుడే వస్తువుకు మరొక బాధ్యత వచ్చి పడుతుంది ఆ వస్తువు నిర్దిష్ట స్థల, కాలాల్లో ఉండవలసి వస్తుంది విశ్వసనీయంగా ఉండాలంటే పాత్రలు కల్పిత పాత్రలే అయినప్పటికీ సజీవ పాత్రలు కావలసి వస్తుంది అంటే కథకు ఒక స్థలం, ఆ స్థలానికి అన్ని భౌగోళిక లక్షణాలు, ఆ కథాగమనానికి ఒక కాలం, ఆ కాలానికి దారి తీసిన చారిత్రక ఘటనలు, ఆ కాలగమనం ముందుకు సాగి పొందిన పరిణామాలు - ఇవన్నీ నమ్మదగిన, పాఠకులు పోల్చుకోగలిగిన ప్రమాణంలో ఉండాలి

రాజయ్య కథల్లో భూగోళం, చరిత్ర విస్తారంగా చిత్రణ పొందాయి రష్యన్ కథా, నవలా సాహిత్య ప్రభావం నుంచి జరిగిందో, తన కథల ఇతివృత్తాలను పాఠకుల ముందర దృశ్యం కట్టడానికి తానే స్వయంగా ఆ చిత్రణ శైలిని ఎంచుకున్నాడో గాని, రాజయ్య కథలు ఎన్నిటిలోనో ఆ కథా స్థలపు లాండ్ స్కేప్ పెయింటింగ్ ఉంటుంది కథ ఎత్తుగడలోనో, మధ్యలో అవసరమయిన దగ్గరో మొత్తంమీద ఎక్కడో ఒకచోట కథ జరుగుతున్న ప్రాంతంలోని నేల, చెట్లు, కొండలు, వాగులు, పక్షులు - ఈ అన్ని ప్రాకృతిక అంశాల సమన్వయంలో మనుషులు పాఠకుల ముందు రూపుకడతారు.

ఈ నిర్దిష్ట భూగోళంలో, చరిత్రలో పాత్రలు కూడా అనివార్యంగా నిర్దిష్టంగా ఉండక తప్పదు సాధారణంగా విప్లవ కథకుల గురించి ఉన్న విమర్శలలో వాళ్ళు అనిర్దిష్ట 'పీడితుల' ను చిత్రించారని, మన సమాజంలోని ప్రత్యేకతలు అయిన కుల, మత, స్త్రీ - పురుష, ప్రాంతీయ అసమానతలను, వివక్షను పట్టించుకోలేదని ఒక విమర్శ రాజ్యమేలుతోంది అస్తిత్వ ఉద్యమాల పేరుతో స్వప్రయోజనపరులయిన కొందరు నాయకులు విప్లవోద్యమం మీద, విప్లవ సాహిత్యోద్యమం మీద ఈ విమర్శను నిందస్థాయిలో ప్రచారం చేశారు. కొందరయినా అమాయక పాఠకులు ఈ నిందా ప్రచారంలో ఎంతో కొంత వాస్తవముందేమోనని అభిప్రాయపడ్డారు. కాని ఈ విమర్శల నేపథ్యంలో రాజయ్య కథలను చదివితే ఆశ్చర్యకరమైన వాస్తవాలు వెలికి వస్తాయి.

మొదటి కథ 'ఎదురు తిరిగితే ' నుంచి ఇటీవలి కథలవరకు కూడా రాజయ్య కథలలో కుల, మత, ప్రాంత, భాషా, స్త్రీ - పురుష వివక్ష చిత్రణ చాలా ఎక్కువగా సామాజిక వాస్తవికతను యథాతథంగా చిత్రించేలా సాగింది ప్రతి కథలోనూ దాదాపు అన్ని పాత్రలకూ వాటి కులాల ప్రస్తావన, అందువల్ల ఒనగూడే సామాజిక స్థితి చిత్రణ పొందాయి. 'ఎదురు తిరిగితే ' లో మాదిగలు, సత్యం, చేపలు, అడివి మనిషి, మార్పు, శత్రువు నేర్పిన పాఠంల నుంచి

గురువులు, తుపాను, బురద నేల, కమల, మధ్యవర్తులుదాకా దాదాపు ప్రతి కథలోనూ ఆయా కులాలకు చెందిన పాత్రలు, ఆయా కులాల ప్రత్యేక ఆచార వ్యవహారాలతో సహా, మాట తీరుతోసహా చిత్రణ పొందాయి. రాజయ్య కథల్లో దేనిలోనూ అనిర్దిష్ట పీడితులు గాని, సాధారణీకరించిన విప్లవకారులు గాని లేరంటే అతిశయోక్తి కాదు ఆ కథలనిండా పీడితులు, విప్లవకారులు ఉన్నమాట నిజమే కాని వాళ్ళు రాజయ్య మాటల్లోనే చెప్పాలంటే "సబ్బండ వర్గాలలో" స్పష్టంగా ఏదో ఒక కులానికి చెందినవాళ్ళే స్త్రీలుగా అదనపు సమస్యలు అనుభవిస్తున్న వారే ముస్లింలుగా వివక్షకు గురవుతున్న వాళ్ళే. చివరకి విప్లవకారులను చిత్రించేటప్పుడు కూడా రాజయ్య ఎంచుకున్నది సర్వనామాలయిన పాత్రలను కాదు 'అతడు' వంటి కథలో ఒక నిర్దిష్ట నామ వాచకాన్ని కళాత్మకంగా ఉన్నతీకరించి సర్వనామంగా మార్చడానికి ప్రయత్నం జరిగింది గాని అక్కడకూడ కథా వస్తువుకు పునాది నిర్దిష్ట వ్యక్తి సాగించిన నిర్దిష్ట కార్యాచరణే

ఈ నిర్దిష్టత అనే విశిష్ట అంశం నుంచే రాజయ్య కథల్లోని మరొక విశిష్టత, పరివర్తనా నిర్వాహకులు ఎవరనే విషయలో ఉంది పాశ్చాత్య సాహిత్య, సైద్ధాంతిక లోకంలో పోస్ట్ మాడర్నిస్ట్, సబాల్టర్న్ ఆలోచనా ధోరణులు వెలువడిన తర్వాత, ఒక సమాజంలో పరివర్తనా నిర్వాహకులు, బాధ్యులు, నాయకులు, వాహికలు ఎవరనే విషయంలో విస్తృతమైన చర్చ జరిగింది పరివర్తనకు కారకులు సమాజానికి బాహిరంగంగా ఉంటారా, అంతర్గతంగా అభివృద్ధి చెందుతారా అనే ప్రశ్నమీద సంక్లిష్టమైన వివాదం చెలరేగింది. ఈ వివాదాన్ని అల్లం రాజయ్య ఎంతవరకు పరిగణనలోకి తీసుకున్నాడో తెలియదుగాని చాలా ఆశ్చర్యకరంగా పరివర్తన అంతర్గత పరిణామాల నుంచే వస్తుందని, పరివర్తనా వాహికలు, నాయకులు సమాజపు అట్టడుగు పొరల నుంచి లేచి నిలుస్తారని రాజయ్య గొప్ప కళాత్మకతతో ప్రదర్శించాడు. 'ఎదురు తిరిగితే.....' లో బొత్త కొంరని నుంచి 'అతడు' లో రమాకాంత్ దాకా ప్రతి ముఖ్యపాత్ర ప్రవేశం, పెరుగుదల, ముగింపు చాల ఎక్కువగా ఆ ఇతివృత్తపు అంతర్గత పరిణామాల నుంచే జరిగిందని రాజయ్య చూపించాడు. ఈ పాత్రల గుణాత్మక పరిణామం చాల సహజమైన, అనివార్యమైన తార్కికమైన గెంతు అని, అదేదో నాటకీయ పరిణామం కాదని రాజ్యయ్య కథలు నిరూపించాయి

రాజయ్య కథా వస్తువులోని మరొక విశిష్టత ఇరవై ఐదేళ్ళ క్రమ పరిణామంలో అవి మారుతూ, అభివృద్ధి చెందుతూ వచ్చిన తీరు వస్తు వైవిధ్యం గురించి పైన చేసిన వివరణ ఇతివృత్తాల వైశాల్యానికి సంబంధించినదయితే, ఇక్కడ ప్రస్తావిస్తున్న విశిష్టత ఆ ఇతివృత్తాల లోతుకు సంబంధించినది. 'ఎధురు తిరిగితే.....'' కాన్వాస్ పెద్దదయినప్పటికీ, కథ కూడ నిడివిలో పెద్ద కథే అయినప్పటికీ ఇతివృత్తం సులభమైనది తొలి రోజుల కథల్లో చాల భాగం నిడివిలో చిన్నవి. ఇతివృత్తాలు సరళమైనవి కాని క్రమక్రమంగా తానురాస్తున్న ఇతివృత్తాలు సరళమయినవి కావని, ఆ పాత్రల మధ్య సంబంధాలు, ఆ పాత్రల ప్రవర్తనలు, ఆ కథాంశాల వివరణలు సంక్లిష్టమైనవని రాజయ్య

గుర్తించినట్టున్నాడు. మహాదేవుని కల, నీల, కమల, మనిషిలోపలి విధ్వంసం, మధ్యవర్తులు, గురువులు, అతడు వంటి కథలు పొరలు పొరలుగా అనేక కోణాలను, అనేక ముఖాలను, మొత్తంగా ఒక సంక్లిష్ట, సంకీర్ణ దృశ్యాన్ని ప్రదర్శిస్తాయి. ఇది ఒక రకంగా సామాజిక సంక్లిష్టత పట్ల మొత్తంగా విప్లవోద్యమానికి, విప్లవ సాహిత్యోద్యమానికి, ప్రత్యేకంగా రాజయ్యకు పెరుగుతూ వచ్చిన అవగాహనకు చిహ్నం అయితే సంక్లిష్టత చిత్రణలో రచయితలు సాధారణంగా తమ కళాకృతిని కూడ సంక్లిష్టంగా మార్చి పాఠకులకు కొరుకుడు పడని స్థితిని సృష్టిస్తారు. రాజయ్య వస్తువులలోని విశిష్టత ఎంత సంక్లిష్టమైన సందర్భాన్ని ఎంచుకున్నప్పటికీ పాఠకులను గందరగోళ పరచకపోవడం.

ఈ విశిష్టతను అర్థం చేసుకోవాలంటే రాజయ్య ఎంచుకున్న కథన శైలిని, శిల్ప నిర్మాణ పద్ధతులను విశ్లేషించుకోవాలి. రాజయ్య కథన శైలిలో తెలంగాణ భాషకు ఉన్న స్థానం గురించి ఇప్పటికే చాల వివరమైన చర్చ జరిగింది రాజయ్య కథల్లోని భాషా ప్రయోగాలగురించి, భాషా సౌందర్యం గురించి వివరించడానికి ఒక ప్రత్యేకమైన వ్యాసమే రాయవలసి ఉంటుంది. ఇక్కడ భాషను మించిన ఇతర కథా నిర్మాణ పరికరాలను కూడ పరిగణనలోకి తీసుకుని రాజయ్య కథన రీతులను విశ్లేషించవచ్చు

రాజయ్య శిల్పాన్ని ఆయన కథల్లో తరచూ కనబడే ఒక నుడికారాన్ని ఉపయోగించి "చెయ్యెత్తితే కనిపించే కార్జం శైలి లేదా సగం కాలిన మనుషుల వాసన" అని వి.వి. విశ్లేషించారు. రాజయ్య కథల్లో చాలసార్లు ఏదో ఒక పాత్ర "చంక లేబడ్తె కార్జం కనబడ్తది" అని అంటుంది ఈ అచ్చ తెలుగు తెలంగాణ నుడికారానికి మూడు స్థాయిల అర్థాలున్నాయి.

మొదటిది: పేదరికం వల్ల ఎముకలు తేలి అస్థిపంజరాల వంటి ఆకారాలతో ఉన్న మనుషులు చెయ్యి పైకి లేపితే డొక్క లోపలికి పోయి కార్జం కనబడు తుంది రెండు· ఆ మనుషులు ఎప్పుడూ ఏ మతలబులూ లేకుండా అతి సాధారణంగా గుండె లోతుల నుంచి, కార్జం బయటపెట్టి మాట్లాడతారు మూడు· కార్జం మనిషిలోని ఒక సారభూతమైన వ్యక్తీకరణ అనుకుంటే ఈ పల్లె మనుషుల పారదర్శక వ్యక్తీకరణలకు ఈ నుడికారం చిహ్నం. అల్లం రాజయ్య కథలలోని శైలిని ఈ మూడో అర్థంలో పారదర్శకశైలిగా గుర్తించాల్సి ఉంటుంది

ఈ పారదర్శక శిల్పం రాజయ్యకు ఎక్కడి నుంచి వచ్చి ఉంటుంది? రాజయ్య ఆయన కుటుంబంలో తొలి లిఖిత రచయిత. బహుశా తొలి విద్యావంతుడు. ఆయన సృజనాత్మకత, వ్యక్తీకరణ పూర్తిగా ఆయన పరిసరాలనుంచి, గ్రామీణ జీవితంనుంచి పల్లెల్లో విన్న, చూసిన అనుభవించిన అనేకానేక జానపద, మౌఖిక కళా రూపాలనుంచి వికసించినది మౌఖిక కళా రూపాలన్నీ కూడ వాటి పారదర్శక శిల్పం వల్లనే భాసిస్తాయి రాజయ్యకు బహుశా అప్రయత్నంగానే ఆ శిల్పం అంది ఉంటుంది. తొలిరోజుల్లో రాసిన 'మార్పు' కథలో గంగయ్య ఒక పాటలాగ తమ ఊరి కథ చెపుతాడు. ఇరవై రెండు పేజీలు నడిచిన ఈ కథలోని కథ పల్లెల్లో, వెన్నెల రాత్రుల్లో,

ఎడతెగకుండా సాగే మౌఖిక కళారూపాలను పోలి ఉంటుంది. ఈ శిల్పమే రాజయ్య కథలన్నిటిలోనూ వేరు వేరు స్థాయిలలో కనబడుతుంది. ఇది గ్రామీణ జీవిత నేపథ్యం నుంచి సహజంగా, అనివార్యంగా, నైసర్గికంగా రూపొందిన కథన పద్ధతి

అయితే రాజయ్య శిల్పం అక్కడే ఆగిపోలేదు. ముందే ప్రస్తావించినట్టు రాజయ్య శిల్పంలో రష్యన్, చైనీస్ సాహిత్యాలలోని వర్ణనాత్మక, వివరణాత్మక శైలికూడ వచ్చి చేరింది గ్రామీణ నేపథ్యంలోని కవితాత్మక, నాటకీయ శైలికీ ఈ వర్ణనా శైలికీ సమ్మేళనం సరిగా కుదిరింది ఆ తరువాత క్రమంలో బహుశా సంక్లిష్టతను చిత్రించడానికి చేసిన అన్వేషణలో రాజయ్య కొత్త కథన పద్ధతులను, ముఖ్యంగా యూరోపియన్, లాటిన్ అమెరికన్ కథా రచయితలు అభివృద్ధి చేసిన పద్ధతులను కూడ ఉపయోగించుకోవడం ప్రారంభించాడు. ('మనిషి లోపలి విధ్వంసం' పై చేసిన విశ్లేషణలో నేను ఈ విషయం వివరించాను ) మనిషి లోపలి విధ్వంసం, మహదేవుని కల, మధ్యవర్తులు, అతడు, ప్రత్యర్థి వంటి కథల్లో ముఖ్యంగా అంతరంగ చిత్రణలో ఈ అంశం గుర్తించవచ్చు.

రాజయ్య శిల్ప విశిష్టతలలో అవసరమైన వివరణలు, ఇతివృత్తానికి సంబంధించి చిన్న చిన్న అంశాలను కూడా వదలకపోవడం, కథకు దృశ్య, శ్రవ్య లక్షణాలు కల్పించడం, కథ చెప్పడంలో సరళత్వం వంటి ఎన్నో అంశాలున్నాయి. గ్రామీణ సంస్కృతితో రాజయ్య తాదాత్మ్యం కథలలోకి ఎంత విస్తరించిందంటే గ్రామీణ జీవితంలోని ఆచారవ్యవహారాలను మామూలుగా మూఢనమ్మకాలుగా కనబడేవి కూడ ప్రజాజీవితంలో అంతర్భాగమై ఉండడాన్ని ఆయన అలవోకగా చిత్రించాడు తొలి కథల్లో ఒకదానిలో "మూఢ విశ్వాసాల" పట్ల తీవ్రమైన వ్యతిరేకత ఉండిన రోజుల్లోనే, ఎర్ర జెండాలు కట్టి దున్ను కునేటప్పుడు ఆ నాగళ్ళకూ, భూమికీ రైతు కూలీలు మొక్కడాన్ని రాజయ్య ప్రస్తావించాడు

రాజయ్య కథాశిల్పంలో కొట్టవచ్చినట్టు కనిపించే మరొక అంశం సామెతలను, పల్లె సీమల నుడికారాన్ని ఆయన వాడిన తీరు. కనీసం అరడజను సామెతలు లేకుండా ఆయన కథ ఒక్కటి కూడ లేదు. అంతేకాదు. ప్రజలు తమ నిత్యజీవితంలో ఒకే సామెతను వేరు వేరు సందర్భాలలో, వేరు వేరు కోణాలనుంచి, వేరు వేరు అవసరాల కోసం వాడుతూ వుంటారనే విషయాన్ని రాజయ్య అద్భుతంగా పట్టుకున్నాడు చాల సహజమైనదీ, చాల ముఖ్యమైనదీ అయిన ఈ అంశాన్ని గ్రామీణ జీవితాన్ని రాజయ్య కన్న నిశితంగా పరిశీలించిన రచయితలు కూడ పట్టుకోలేకోయారు. ఈ అంశాన్ని రాజయ్య యధాలాపంగా గుర్తించలేదని, దాని ప్రాముఖ్యతను అవగాహన చేసుకుంటూ గుర్తించాడని చెప్పడానికి ఆయా కథల్లో ఆయా సామెతలు వాడిన తీరును వివరించవలసి ఉంటుంది.

మొత్తంగా ఇరవై ఐదు సంవత్సరాల సుదీర్ఘ కథా రచనా ప్రయాణంలో అల్లం రాజయ్య వస్తువుల్లోనూ, శిల్పంలోనూ, కథన పద్ధతులలోనూ, భాషా

సంప్రదాయంలోనూ, జీవిత చిత్రణలోనూ సున్నితత్వంలోనూ అద్భుతమైన, అసాధారణమైన విజయాలెన్నో సాధించాడు తొమ్మిది దశాబ్దాల తెలుగు కథా చరిత్రలో, మరీ ముఖ్యంగా ఉద్యమ కథా చరిత్రలో, తెలంగాణా కథా చరిత్రలో వస్తు శిల్పాల పరిణతికి ఒక కొండ గుర్తు అల్లం రాజయ్య కథలు.


ఉపకరించిన పుస్తకాలు :

| | |
|---|---|
| అల్లం రాజయ్య | భూమి, కరీంనగర్ బుక్ ట్రస్ట్, కరీంనగర్, 1982 |
| " . | సృష్టికర్తలు, యుగ ప్రచురణలు, హైదరాబాద్, 1982. |
| | అతడు, చరిత ప్రచురణలు, హైదరాబాద్, 1995 |
| | గురుపులు, చరిత ప్రచురణలు, హైదరాబాద్ 1996 |
| అబంపి ప్రచురణలు . | భూమిక, అబంపి ప్రచురణలు, గోదావరిఖని 1991. (సం) |
| కాళీపట్నం రామారావు | శ్వేతరాత్రులు, ఆర్.కె. పబ్లికేషన్స్, విశాఖపట్నం, 1993 (సం) |
| " | రుతుపవనాలు, ఆర్ కె పబ్లికేషన్స్, విశాఖపట్నం, 1996 |
| ఎన్ వేణుగోపాల్ : | కథా సందర్భం, స్వేచ్ఛా సాహితి, హైదరాబాద్ 2000 |
| సంచికలు : | సృజన, అరుణతార, నూతన, ప్రజాసాహితి |

# వుప్పల నరసింహం

♦ డా॥ కాలువ మల్లయ్య ♦

తెలంగాణా ప్రాంతాన్ని నిజాం రాష్ట్రమని, తెలంగాణా ప్రజలను నైజామాంధ్ర ప్రజలని చెప్పేవారు తెలంగాణ కథకు ఆద్యులైన సురవరం ప్రతాపరెడ్డిగారు తీరక్యాంధ్రమని చెప్పబడే తెలంగాణా భాష మాట్లాడే లష్కర్ (సికిందరాబాద్) ప్రాంతానికి దగ్గర గల 'దేవర యాంజీల' గ్రామంలో 1954లో జన్మించారు వుప్పల నరసింహం అక్కడి భాషను స్వంతం చేసుకున్నారు. అక్కడి జీవితాన్ని స్వంతం చేసుకున్నారు అక్కడి యాసను తనది చేసుకున్నారు. అక్కడి సంస్కృతిలో మమేకమై కథలు రాయడం మొదలుపెట్టారు. అతని హృదయం నిండా తనకు జన్మనిచ్చిన తన ఊరే. ఏ కథ చదివినా రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లాల ప్రాంతీయ భాష, సంస్కృతి, జీవితం మన కళ్ళముందు నిలుస్తుంది. అక్కడి జానపదుల యాస అతని కథల్నిండా దర్శనమిస్తుంది. దళిత, వెనుకబడిన కులాల్లో పుట్టినవాళ్ళు చదువుకోవడమే కష్టంగా ఉన్న కాలంలో పుట్టి, చదువుకొని తనకున్న వెనుకబడిన కులాలవారి ఎరుకతో రచయితగా, జర్నలిస్టుగా ఎదిగిన వాడు వుప్పల నరసింహం.

చిన్నతనం నుంచే సాహిత్యంపట్ల అభిరుచిని పెంచుకొని కథలు, కవితలు రాశారు. విద్యార్థి యువజన ఉద్యమాల్లో, సాహిత్య సాంస్కృతిక ఉద్యమాల్లో క్రియాశీలకంగా పనిచేశారు. సమాజ పరివర్తనకు సాహిత్యం ఉపయోగపడ్తుందని నమ్మాడు సమాజంపై బలమైన ప్రభావాన్ని చూపే సమాంతర సినిమా రంగంలో పనిచేశారు సికిందరాబాద్ ఫిలిం సొసైటీ వ్యవస్థాపక సభ్యునిగా కృషి చేశారు. అల్లం రాజయ్యతో కలిసి నాగేటి చాళ్ళలో నాటకం రచించారు వివిధ పత్రికల్లో నలభై వరకు కథలతోపాటు స్వగతాలు, ముద్ర, దృశ్యం, ధ్వని లాంటి శీర్షికలను నిర్వహించాడు

తెలంగాణానుంచి సాహిత్యకారులుగా ఎదగడం సులభమైన పనేంకాదు. ఇతర ప్రాంతాలవారికున్నట్టుగా ఇక్కడి వాళ్ళకు గాడ్‌ఫాదర్ లాంటి వాళ్ళు లేరు పత్రికలు, అవకాశాలు చాలా తక్కువే. మొదటి తరంలో సురవరం ప్రతాపరెడ్డి, దాశరథి, కాళోజీ, వట్టికోట, సి.నా.రె., సురమౌళిలాంటి వాళ్ళు ఎన్నో కష్టనష్టాలకోర్చి ఎదిగారు స్వాతంత్ర్యానంతరం పుట్టి విద్యాబుద్ధులు నేర్చి చదువులలోని మర్మాలు చదివి తమ చరిత్రను తాము రాసుకుంటూ రచయితలుగా ఎదిగిన వారిలో వుప్పల నరసింహం ఒకరు. 'నా తెలంగాణా కోటి రతనాల వీణ' అన్నాడు దాశరథి తెలంగాణా రైతాంగ పోరాటం చాలామంది మొదటి తరం రచయితలతో కలం పట్టిస్తే 1970 దశకంలో

ప్రారంభమైన భూపోరాటాలు తెలంగాణలో చాలామంది రచయితలతో కలం పట్టించాయి. గద్దర్, జననాట్యమండలి వాళ్ళ స్నేహంతో విప్లవ పోరాటాల స్ఫూర్తితో మొదట్లో కలం పట్టారు వుప్పల సాహిత్యం సమాజానికి చోదక శక్తిగా కొంత మేరకైనా పనిచేస్తుందని, చేయాలని కోరుకునే వాళ్ళలో ఈ రచయిత ఒకరు తెలంగాణ గ్రామాల్లోని భూస్వామ్యశక్తుల దాష్టీకాన్ని, ఫ్యూడల్ భావాల దుర్మార్గాన్ని కళ్ళారా చూసిన అనుభవంతో కథలు రాయడం మొదలు పెట్టాడు.

ముద్ర సంపుటిలో ఉన్న కథలు ప్రయోగాత్మకమైనవి. తెలంగాణా రచయితలు ఆశు సాంప్రదాయాన్ని స్వంతం చేసుకున్నారనడానికి నరసింహం కథలు సజీవ ఉదాహరణలుగా నిలుస్తాయి. ముద్ర కథలను 'కథాజల' అని చెప్పుకున్నారు రచయిత. అవును. అది కథా జలే . భూగర్భం నుండి పై కుబికి వచ్చి దాహార్తుల దూపనార్పే తీయని నీళ్ళు జల. అలాంటి చెలిమ నీళ్ళలాంటివే ఈ కథలు . ఇందులో జానపద కళా రూపాల్లో ఒకటియైన శారద కాళ్ళ కథా కథనం ఇడిమి ఉంది. తమ ఊరికి వచ్చే శారద కాళ్ళ కథనాన్ని ఒంటపట్టించుకొని అందులో జీవించాడు నరసింహం. కథారూప మిచ్చాడు ముద్ర కథాజలకు ముందు మాట రాస్తూ ప్రముఖ రచయిత మునిపల్లె రాజుగారన్న ఈ మాటల్ని గుర్తు చేసుకోవాల్సి ఉంది. " బీభత్స రస ప్రధానమైన తాండవ నృత్యానికీ, సరళ సలిల వాహినియైన లాస్య భంగిమలకూ పదరూప కల్పన చేసి వాక్చిత్రాలలో బంధించిన అధునిక సాహిత్య ప్రక్రియ ఈ ముద్ర. భూమి నుండి జన్మించింది. ప్రకృతిలో పెరిగింది దాని గీతాలే ఆలాపించింది.

రానున్న కొద్ది దశాబ్దాలలో నామరూపాలు లేకుండా మరుగున పడనున్న జానపద కథాకథన గాన రూపాల్ని, అవి భావితరాల భావుకుల కళ్ళు చెమర్చు కునేందుకు, ఒరిజనల్ గొంతుతోనే ఎరువు దరువులు లేకుండా, భద్రపరచ డానికి పూనుకొని సఫలుడు కావటం ఈ రచయిత నిజాయితీకి నిదర్శనం. అందువల్ల యీ రూపాలు ఒక చారిత్రక అవసరాన్ని పూర్ణం చేస్తున్నవని నా అభిప్రాయం ..."

ముద్ర కథలు జానపదుల శైలిని తీసుకొని వర్తమానకాలంలోని వస్తువును మౌఖిక సాంప్రదాయానికి దగ్గరగా మలచబడిన కథాజల ..ముద్ర కథలలో, అక్షర విన్యాసం, అభివ్యక్తి, శబ్దం పొందిక రచయిత చెప్పినట్టు పూర్తిగా ప్రజలదే. తరతరాలుగా ఎన్నో శతాబ్దాలుగా యదార్థ కథలు, పౌరాణిక గాధలు, జానపద కళాకారుల నాలుకలపై అశువుగా పల్లవించి హావభావాల తోడుగా వాయిద్యాల ఆసరాతో ప్రజలను అలరిస్తున్నాయి. ఆ కళాకారులు తమ పాటలోని భావాన్ని తిరిగి వచనంగా తమదైన బాణీలో వివరిస్తూ ఉంటారు. ఆ బాణీయే ముద్ర కథలకు ప్రధాన ఆలంబనం

"నిండుగుండెల కవి మన దాశరధి సాబ్ ఏ నేలను గురించయితే 'నా తెలంగాణా కోటి రతనాల వీణ' అన్నాడో ఆ గెడ్డపైన పుట్టి పెరిగినోడు నరసింహం దేవర యాంజీల డొంకల్లో, దొరువుల్లో అడుకున్నాడు తెలంగాణా

పల్లెపల్లె తిరిగినోడు  జనంతో కలిసిమెలిసి వాళ్ళిచ్చిన కలో అంబలో తాగి వాళ్ళ బతుకుల్లోని మేలు కీళ్ళన్నీ తెలుసుకున్నోడు ఆ మాటల తేటలు, ఆ నుడికారాల సొంపులు, ఆ సామెతల యింపులు బాగా గ్రహించినాడు

గోలకొండపైన తెలుగు జెండా ఎగరేసిన సురవరం ప్రతాపరెడ్డన్న ఎక్కడైతే వుంటాడో, పదునెక్కిన కలంతో  ప్రజల పోరాటాల్ని చిత్రించిన ప్రజల మనిషి వట్టికోట ఆళ్వారుస్వామి ఎక్కడైతే వుంటాడో,  గడిల్లోని దొరల దురాగతాల్ని చీల్చి ఎండగట్టిన దాశరథి రంగాచారి ఎక్కడైతే వుంటాడో, చదువర్లకు తెనుగు తియ్యదనాలు అయోతలో పెట్టిన యశోదారెడ్డి ఎక్కడైతే వుంటుందో, సెగలు గక్కుతా రవ్వలు చిమ్ముతా కొలమంటుకున్నదని చెప్పిన అల్లం రాజయ్య ఎక్కడైతే వుంటాడో అక్కడ ఆ సాహిత్య చరిత్రలో వుంటాడు నరసింహం ."

ఇవీ ఈ రచయిత గూర్చి మధురాంతకం రాజారాం గారన్న మాటలు. ముద్ర సంపుటిలోని కథలకు జీవద్భాష, మౌఖిక సాంప్రదాయ కథనం ప్రత్యేకతను సమకూర్చిపెట్టాయి ఇదొక కొత్త ప్రయోగం ఈ కథలు రాయడానికి నరసింహం ఎంతో శ్రమించాల్సి వచ్చింది పాటలు పాడుకుంటూ కతలు చెబుతూ ఊరూరా తిరిగేవాళ్ళ కతలు చెప్పే పద్ధతిని పట్టుకున్నాడు శారదాకాళ్ళ కతలు విన్నాడు గొల్లసుద్దులు, బైరాగుల పాటలు, ఫకీరు పాటలు విన్నాడు దండాగానం, పిట్టల దొరలు, గంగిరెద్దురోళ్ళు, వీరముషోళ్ళు పిచ్చుకుంట్లోళ్ళు చెప్పే కతలన్నీ విని అవగాహన చేసుకున్నాడు భాషకు ఆయువు పట్టయిన నుడికారాల్ని పట్టుకున్నాడు. మంచి స్నేహితానికి మారుపేరయిన భోగం పాపయ్య కత, పెద్దపులి మాదిరిగా గడీ పైకి  ఎగవడ్డ పహిల్వాన్ లసుమయ్య కత, రధము పోయిన చందంగా శాంతమ్మ తల్లి పైలోకానికి వెళ్ళిన కత, కురుస బొమ్మల సందున కుంకుమ బొట్టు కరిగి పోయిన కత, దండుకు దల్వ చేతిమీద డ్యాగ, జంగల్‌కీ బాద్షా సిద్ధయ్య కత, తల పండు పగిలింది తగాదా తీరింది కత, అద్దమోలె కొప్పు అమిరిచ్చు కొన్నది.. ఇలాంటి ఎన్నో ఎన్నెన్నో మరుగున పడిపోయిన కథల్ని వెలికితీసి ముద్రగా ఆంధ్రప్రభలో ప్రచురించాడు. పుస్తక రూపంలోకి తెచ్చాడు ఈ కథల ద్వారా చరిత్ర, సాంప్రదాయాలు, పౌరుషాలు, పగలు, రోగాలు రొష్టులు, ఆప్యాయతలు, అనురాగాలు, పల్లె జీవితం, అందచందాలు, రైతుల కడగండ్లు, అమాయకుల జాలి బతుకులు, రాజకీయాలు, రగడలు, దోపిడీలు, దొమ్మీలు, కరువులు, కన్నీళ్ళు యిట్లా ఎన్నో సంగతులు, అక్షర రూపంలో చిత్రిక పట్టాడు. ఎంతో సామాజిక వృత్తాంతం, సాంఘిక చైతన్యం ఈ కతల్లో పొందుపరచబడింది ఇలాంటి కథలు రాసే రచయితలు అరుదు. అలాంటి రచయితల్లో నరసింహం ఒకరు  నామినే పచ్చనాకు సాక్షిగా, పి. రామకృష్ణారెడ్డి, పెన్నేటి కథలు, కాలువ మల్లయ్య 'అవ్వతోడు గిది తెలింగాణా', కైతుకాల పోశెట్టి బండ కింది బతుకులు లాంటి రచనలు ఈ ముద్ర కోవలోకి వస్తాయి జానపద కళారూప బాణీల్లో తెలంగాణా జనజీవన సంస్కృతిని అక్షరీకరించిన కథాజల ముద్ర.

తెలంగాణా స్వగతాలు కథలు కేతు గాని కథనాలు ఇవీ తెలంగాణా జనజీవన దృశ్యాలే. నిండా నూరేండ్లు బతుకనీ,  కండ్లల మిరుగులు చిల్లినయ్,

పదిమంది తలల నాల్కె, ఒకని సుతిల ఒకడు లేడు, ఫాయిద లేనిపని, సస్తే భూమికి ఎల్తి ఐతమా? వీళ్ళ పోరల ముక్కుల తొక్కు, దొంగోనికి చెప్పే లాభం, జిందగీ అంత బర్బాద్ అయింది, నా అంత తీస్మార్ కాడు లాంటి శీర్షికలతో తెలంగాణా మాండలిక భాషా గుభాళింపుతో సాగిన స్వగతాలివి వీట్ని చదువుతుంటే తెలంగాణా భాషా నుడికారం, హైదరాబాద్ ప్రాంత మాండలికంపై ఈ రచయితకున్న పట్టు, అధికారం స్పష్టమవుతాయి ఈ స్వగతాలు చదువుతుంటే తెలంగాణా గ్రామాల్లో తిరుగుతున్నట్లు, రచ్చ బండలమీద కూచొని మాట్లాడుతున్నట్టు, గుట్టల వెంట, నదుల పొంట తిరిగినట్టుంటుంది మారుమూల పల్లెపదాలు, మరుగునపడిపోతున్న పదాలను పయోగించి ఆ పదాలకు శాశ్వతత్వం కల్పించాడు నరసింహం ఊరితో, ఊరి భాషతో సజీవ సంబంధాలుంచుకుంటే తప్ప ఇలాంటి భాషను వాడటం సాధ్యం కాదు

"గంత ఉచ్చిలికి ఎగవడ్డది గంత అంకారం ఒల్కబోసుకుంటంది ఈ ఉర్కులాట ఇంకెన్ని రోజులుంటదో ఉండనీ "

"నీ ఇంట్ల ఎంతవున్నా ఏమి వున్నా గదే గంజిమెతుకులు తింటవ్ నీయింట్ల లేకున్నా ఒకపూట ఉపవాసమున్నా యింకో పూటకు గదే గంజిమెతుకులు తింట . అది ఇది వున్నదని నువ్వేం బంగారం మెతుకులు తినవ్ కదా !"

తెలంగాణా జనజీవన వ్యవహారంలో సామెతలు, జాతీయాలు సందర్భోచితంగా ఉపయోగించుకున్నాడు రచనల్లో గడియ పుర్సత్ లేదు గవ్వ రావట్లేదు, గొంగడి ఉన్నంతనే కాల్లు సాపుకోవాలె, రామ సక్కదనాల మొగడు, అడవిల పొద్దు గూకినట్టయింది లాంటి నుడికారాలు, ప్రయోగాలు ఈ రచనల కెంతో వన్నె తెచ్చాయి తెలంగాణా గ్రామాల గూర్చిన నిజాయితీతో కూడిన సమాచారం ఈ స్వగతాల్లో కనబడుతుంది

కథలు రాయడం, జర్నలిస్టుగా విధులు నిర్వహించటం మాత్రమే కాకుండా తెలుగు కథా వికాసం కోసం అందరికంటే ముందుగానే కథా వేదిక స్థాపించి ఉత్తమ గ్రంథాలనదగిన పుస్తకాలను ప్రచురించిన ఘనత నరసింహం గారికే దక్కుతుంది 'కథ కళలకు కేంద్ర బిందువు ఉత్తమ కథా సాహిత్యం ఉత్తమ సమాజాన్ని నిర్మిస్తుంది ' అనే ఆశయంతో అవిశ్రాంత కృషి సల్పి కథా వేదిక ద్వారా అనేక కార్యక్రమాలు చేపట్టి తెలుగునాట కథా వికాసానికి తోడ్పడ్డాడు కథా వేదిక ప్రథమ, చతుర్థ వార్షిక సంచికలతోపాటు తెలుగు కథా వెలుగులు అనే పుస్తకాన్ని వెలువరించారు తెలుగు కథకు సంబంధించిన వివిధ పార్శ్వాంశాలను ప్రసిద్ధ రచయితల వ్యాసాలద్వారా ఈ పుస్తకంలో పొందు పరిచారు

"నేను తెలంగాణా గడ్డపై పుట్టాను నా మాయముంత ఈ గడ్డపైనే పాడుబడిన గోడల్లో పాతిపెట్టి ఉంది ." అని తనగూర్చి తాను చెప్పుకున్నాడు వుప్పల నరసింహం పొత్తూరి వెంకటేశ్వరరావుగారి మాటల్లో చెప్పాలంటే "తెలంగాణా జన జీవితం తెలంగాణా నుడికారం నరసింహం గారికి కరతలామలకం. . ఆయనకు తెలంగాణా

పట్ల గాఢమైన అభిమానం, భక్తి తెలంగాణలో సంక్షోభానికి తెరపడాలని కోరుకునే వారిలో ఒకరు వుప్పల నరసింహం"

అమ్మా తెలంగాణా న్యూవేవ్ సినిమా వ్యాసాలు, కంప్యూటర్ వ్యాసాల సంపుటి విధ్వంసమే విప్లవమా? అని తెలంగాణలో జరుగుతున్న నక్సలైట్ పోరాటాల గూర్చి రాసిన వ్యాససంపుటి వివాదాన్ని లేవదీసింది విప్లవ పోరాటాల ప్రభావంతో కలంపట్టిన నరసింహంగారు తెలంగాణా గడ్డపై పుట్టి, పోరాటాల ఆటుపోట్లను చూస్తూ, ఫలితాలను గమనిస్తూ ఇలాంటి వ్యాసాలు రాయడం ప్రశ్నార్థకమైంది

నగర గ్రామీణ వాతావరణ నేపథ్యంలో ఉన్న కథల సంపుటి ఎర్రలైటు "శవ్వా ఈ సంసారంతోని ఎంతకాలం పాకులాడుదు ? ఒక్క రోజన్నా ఇగో గిదిలేదు అనకుంట నిమ్మలంగ వొండుకుని తిని పండింది లేదు ఎప్పటికీ ఇదే కొల్లపురమాయే ఉప్పు ఉంటే తొక్కులేకపాయే తొక్కు ఉంటే ఉప్పు లేకపాయే ఏది సర్రాసుగ లేని సంసారంతోని ఎన్ని ఏండ్లు తిప్పల పడాలే తల్లీ ! ఏం బతుకు ఇది వయినాల బతుకు ఈ బతుకుమీద మన్నువడ" బియ్యం కథలో ఓ పాత్ర మాటలివి.

ఇలాంటి నిరుపేద జీవితాలనే తీసుకొని కథలుగా మలిచారు వుప్పల నరసింహం తానుంటున్నది నగరంలోనయినా ఆ వెలుగు జిలుగుల జోలికి పోలేదు వుప్పల కథలన్నీ నేలవిడిచి సాము చేయని గ్రామీణ, గ్రామాల్నుండి బతకడానికొచ్చిన నగర కూలీల బతుకు వెతలే తానే జీవితం నుంచయితే వచ్చాడో ఆ జీవితాలను అక్షర బద్ధం చేసిన నిబద్ధ కథకుడు వుప్పల.

ఓ పేదస్త్రీ ఆ పూట తిండి కోసం బియ్యం కోసం పడ్డపాట్లే బియ్యం కథ 'చేతల బుడ్డ పైసలేదు. ఇంట్ల గింజలు లేవు. మరి ఎట్ల సంసారం ఎల్లదని అయ్యి కల్లు దుకాండ్లకు .పోయిండో ఏమో తెలువది ఇప్పుడు ఎవరింటికిబోతే ఎవరు పెడ్తరు .? ఈ సంసారంతోని నాకయితే పిచ్చి లేచినట్టుంది .

అంటూ గుడిసెలో మూలకు 'కుదురు' పక్కనున్న చేటను తీసుకొని బయటకు అడుగేసింది ఎసుల, కుదురు లాంటి మరుగున పడిపోయిన పదాలెన్నో నరసింహం కథల్లో కనపడ్తాయి

'ఎర్రలైటు' కథా సంపుటిలో ఎర్రలైటు, బియ్యం, అనామకురాలు, ఊబి, నా రక్తమే నా రిక్షాకు పెట్రోలు, పిండం లాంటి పదిహేను కథలున్నాయి ఈ కథలన్నీ కూటికిలేని నిరుపేద పల్లెజనాలగూర్చి రాసినవే లేదా పట్నంలోకి వలసవచ్చి అష్టకష్టాలు పడుతున్నవాళ్ళవే తిరుగబడ్డ భూమి కథల సంపుటిలోని కథలు విప్లవ పోరాటాల స్ఫూర్తితో గ్రామాలను కళ్ళకద్దుకుంటే, అదే గ్రామ ప్రజలు పొట్టలు చేతబట్టుకొని పట్టణాలకొచ్చి బతుకుతున్న వెతలను ఎర్రలైటు కథలు తెలుపుతాయి

సంతానం కోసం పరితపించిన నాగమల్లయ్య తన భార్య చనిపోయిన

పిండానికి జన్మనివ్వడం చూసి స్తంభించిపోతాడు అదీ మగబిడ్డ పిండం అని తెలిసి ఆతని గుండె చెరువవుతుంది

వెన్నెల తోమిన రాతెండి గిన్నెలా వుంది చందమామ సగం కాలిన జొన్న రొట్టెలా వున్నాడు చుక్కలు మల్లెపువ్వుల్లా మెరుస్తూ వున్నాయి

వెన్నెల ఏమయింది? కథలోని ప్రారంభ వాక్యాలివి వ్యావసాయిక కుటుంబాల నుంచి వచ్చిన రచయితలు తప్ప ఇలాంటి ఉపమానాలు వాడలేరు

రక్తమే పెట్రోలుగా బతుకుతున్న రిక్షావాడి బతుకు వెతలను తెలిపే కథ "నా రక్తమే నా రిక్షకు పెట్రోలు" విలాసాలకు , ఇతరత్రా పెద్దరికాల కోసం విపరీతంగా ఖర్చు చేసేవాళ్ళు రిక్షావాడి దగ్గర కొసరి కొసరి బేరం చేస్తారు రిక్షావాడు ప్యాసింజరుతో అన్న మాటలు మన హృదయాలను కదిలిస్తాయి

"పెట్రోలు రేటు పెరిగిందని ఎక్కేవోలు ఆటోవాడికి నాలుగైదు రూపాయలు ఇచ్చుగుంతారు. మరి మా రిచ్చాకు మా రత్తమే పెట్రోలు గదండి మరి దాని సంగతేంటండి? ఇంతవరకు ఎవరూ మా గురించి పట్టించుకోలేదు బాబుగోరు బస్సు చార్జీలు పెరిగినా, మార్కెట్లో అన్నింటికి ధరలు పెరిగినా మా రిచ్చావాళ్ళకు ఇంత దూరానికి ఇంత డబ్బు అని లేదు బాబు రిచ్చ ఎక్కేవాళ్ళ దయాగుణం మీద మా నరాలని గుడ్డ పేల్కలయినా, .గుక్కపట్టి నెత్తురొడ్డినా మమ్మల్ని ఆదుకునేవారు యెవరు లేరు బాబు

వుప్పల నరసింహంను ఉత్తమ కథా రచయితగా నిలబెట్టే చక్కని కథా సంపుటి తిరుగబడ్డ భూమి. తెలంగాణా గ్రామాల్లోని భూస్వాముల దౌర్జన్యాలను, పేద ప్రజల కడగండ్లను, ప్యూడల్ భావజాల దుర్మార్గాన్ని, ఉవ్వెత్తున లేచిన విప్లవ పోరాటాలను ఈ కథల్నిండా పొందుపరిచాడు రచయిత. రచయితగా వుప్పల స్థానాన్ని సుస్థిరం చేసిన సంపుటిది రచయిత కలంపట్టిన మొదట్లో విప్లవోద్యమ పోరాటాల ప్రభావంతో తెలంగాణలో విప్లవ కథ ఆవిర్భావ సమయంలో వచ్చిన కథలివి సృజన, అరుణతార, నూతన, ప్రజాసాహితిలాంటి పత్రికల్లో వచ్చిన ఈ కథలు విప్లవ కథకు మంచి కాంట్రిబ్యూషన్ ఈ కథలు గ్రామాల్లోని మార్పులను పోరాటాలను గ్రామాల స్వరూప స్వభావాలను మన కళ్ళముందుంచుతాయి ఈ సంపుటికి ముందుమాట రాసిన ప్రఖ్యాత రచయిత అల్లం రాజయ్యగారి మాటల్లో చెప్పాలంటే జనం గుండె చప్పుళ్ళనే కాదు, జనం ఎత్తిన తుపాకీ మోతలను కూడా వినిపించే తెలుగు కథల సంపుటి ఇది నక్సల్ బరీ పోరాట ఉత్తేజంతో కలంపట్టి జనం నుండి వచ్చిన రచయిత రాసిన కథలివి ఈ కథల్నిండా ఉన్న ప్రజలు వివిధ వృత్తుల వాళ్ళు భూస్వాముల ఉక్కు పిడికిళ్ళలో గిలగిలా తన్నుకునే నిరుపేదలైన అమాయకులు

'ఊళ్ళేకు గిర్దావరి వొస్తే వాని సుట్టు దిర్గాలే అమీన్ సాబొస్తే ఆని ఎనుక దిర్గాలే తహసీల్దారొస్తే సంకల కట్టె యిరికిచ్చుకొని సాకలిండ్లు, సాలిండ్లు, ఎర్కలిండ్లు, ఏనాదులిండ్లు తర్వాయన తిర్గాలే ఈల్లు గాక యెవడొచ్చినా

ముందుగాల నా పంగ పలుగుతది నీల్లు దెచ్చుడు కాడ్నుంచి కట్టెలు కొట్టెదాక యిరాం లేకుంట రెక్కకు శైన్ లేకుంట గాడ్దిలెక్క ఒకటే పనాయె నీ యవ్వ. పనికున్నా వారేత్తు.

ఇవీ తిరుగుబడ్డ భూమి కథలోని సుంకరి ముత్యాలు కష్టాలు ఇంత పనిచేస్తే ముత్యాలుకు లభించేదేమిటి? తిట్లు భూస్వాముల చివాట్లు. అతి స్వల్పంగా ఇచ్చే జీతం కూడా రాదు. మూడు నెలల జీతం రాకున్నా గుడ్లనీళ్ళు గుడ్లలో కుక్కుకుంటూ కడుపు కట్టుకొని? ఇల్లిల్లూ తిరిగి శిస్తులు వసూలు చేస్తూ పట్వారి చేత చావుదెబ్బలు తింటాడు ఇక భరించలేక బరిసె మర్లేస్తాడు భూదేవి కంటె ఎక్కువ సహనం చూపిన ముత్యాలు తిరగబడటం భూమి తిరగబడటం లాంటిదే

'కన్నీటిపడవ' కథలోని నాయకుడు బాగయ్య. సొన్నాయి వాయించడం, శావ దీసెటప్పుడు చప్పుడు చేయడం ఊళ్ళో దొరలకు వెట్టి చేయడం లాంటి పనులు చేస్తూ బతుకుతుంటాడు సొన్నాయిల బాగయ్య ఊళ్ళలో దిక్కులేని పక్షుల్లా పెళ్ళీ పెటాకులు లేకుండా దొరల సేవలో గడిపేవాళ్ళలో బాగయ్య ఒకడు మాన్యం భూమికోసం తన జీవితమంతా వెట్టి చేస్తూ బతికిన బాగయ్య దొర అకారణ కోపానికి గురవుతాడు చావుదెబ్బలు తిని చనిపోతాడు. తమ్ముని మరణవార్త విన్న ఎంకయ్య చేపపిల్లలా కొట్టుకుంటు గుండెలు అలసి పోయేట్టుగా ఏడుస్తాడు. తల పగిలేట్టు గుద్దుకొని ప్రాణం వదులుతాడు. నక్సలైట్ పోరాటాలకు ముందు ఇలాంటి సంఘటనలు తెలంగాణాలోని ప్రతి గ్రామంలోనూ జరిగేవి ఉద్యమాల ప్రభావంతో చైతన్యవంతులైన ప్రజలు బాగయ్య వెంకయ్య చావులకు కారణమైన దొరమీదికి కోపంగా చూస్తారు. అది తిరుగుబాటుకు నాంది తూర్పును ఎరుపు చేయడానికి రాత్రి సన్నద్ధ మవుతుంది అన్న మాటలతో కథ ముగుస్తుంది.

అయిలయ్య దొరదగ్గర పాలేరుంటాడు తెలంగాణలో పాలేర్లెంత దుర్భర జీవితం గడిపారో పాతికేళ్ళ వెనక్కి వెళ్ళి చూస్తే అర్థమవుతుంది. ఎంత పనిచేసినా ఎంత తక్కువ జీతం తీసుకున్నా పాలేర్ల మీద దొరలు దొంగతనం నేరాలు మోపుతూనే ఉండేవారు. అయిలయ్య మీదా అదే నేరం మోపాడు దొర దొర దగ్గర జీతం మానుకుంటాడు అయిలయ్య చేయని అప్పు తీర్చడానికి సంపాదనామార్గం కోసం తిరుగుతాడు బట్టి ఫైర్‌లో ఇత్తడి, సీసం, రాగిముక్కలేరడం వృత్తిగా ఎంచుకుంటాడు ముక్కలేరుకుంటూన్న సమయంలో సైనికుల ట్రైనింగ్ కాల్పుల్లో మరణిస్తాడు. పొట్టకూటి కోసం, చేయని అప్పు తీర్చడం కోసం చావు నెదుర్కొన్న దీనుడైన అయిలయ్య కథే 'బువ్వ.'

సాపలు అల్లుకొని అమ్ముకోవడం వృత్తిగా బతుకుతుంది బిచ్చగత్తె ముత్తవ్వ తానేస్థితిలో ఉన్నా తన కష్టార్జితమైన సాపలు, దొరలకు, భూస్వాములకు ఉచితంగానే ఇవ్వాలి. లేదా వాళ్ళడిగిన ధరకివ్వాలి ఇవ్వకుంటే జరిగే పరిణామాలు అందరికెరికే కడుపులో మలమలమాడుతున్నా ఆకలిని కడుపులోనే ఉంచుకొని దొర అడిగిన ధరకే అల్లిన సాపలు ఇచ్చేసి కనుగుడ్ల నిండా నీళ్ళతో వెనుదిరిగే ముత్తవ్వ కథే 'సాపలు.'

వుప్పల నరసింహం కథలన్నీ ఆకలితో అలమటించే దీనహీన మానవుల కన్నీటి చరిత్రలకు అక్షర రూపాలు

"ఇత్తనపు కోడె" ఈతడు రాసిన కథలన్నింటిలోకీ ఉత్తమోత్తమ కథగా చెప్పుకోవచ్చు బాలమ్మ, పోశయ్య ఆవును పెంచుకుంటారు ఆ ఆవంటే వాళ్ళకు పంచప్రాణాలు దాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటారు ఆ ఆవుకో దూడ పుడ్తుంది అది తన ఇత్తనపు కోడె పొరడం వల్ల పుట్టిందని ల్యాగను లాక్కెళ్ళుతారు దొర మనుషులు అది చూసి నిర్ఘాంతపోతాడు పోశయ్య లబలబా మొత్తుకుంటుంది బాలమ్మ వాళ్ళు తమ దూడను తెచ్చుకుంటానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవుతాయి పోశయ్య కుటుంబం అల్లాడి పోతుంటారు గడీలో లేగదూడ పోశయ్య ఇంట్లో ఆవు ఒకదాని కొకటి గింజు కుంటుంటాయి దొర దుర్మార్గం వల్ల అవి కలుసుకోలేవు పోశయ్యకెంత కోపంగా, దుఃఖంగా ఉన్నా దొరనేం చేయలేని పరిస్థితి దూడకోసం తాడు తెంపుకొని పరుగెత్తుకొస్తున్న ఆవును దొర తుపాకీ పేల్చి చంపేస్తాడు. ఆవు మరణించిన రోజున పోశయ్య కొడుకు వెంకటేశు ఇల్లు వదిలి వెళ్ళిపోతాడు అజ్ఞాతంలోకి వెళ్ళి అన్నల్లో కలిసిపోతాడని రచయిత అన్యాపదేశంగా చెబుతాడు.

ఆకలిబాధతో అలమటించే జానపద బిచ్చగాల్లు శారదకాళ్ళ గూర్చి రాయ బడిన కథ మృత్యుగానం గానం తనకు కడుపునింపకున్నా ఇతరులను ఆనందపరుస్తూ తాను ఆకలితో అలమటిస్తాడు కళాకారుడి ఆకలి కన్న తన కళే ముఖ్యం . చావు బతుకుల మధ్య విలవిలలాడుతున్న పసిదాన్ని ఒళ్ళో వేసుకొని తన పాటలో నవరసాలు పండిస్తాడు శారదకాడు దుర్గయ్య కాని ఆ కుటుంబం కడుపైతే నిండదు "పోరికి మందులేదు మాకు తిండిలేదు ఇంట్ల ఇత్తులేదు ఉపాసం తోటి పొద్దు గడుపుతున్న కడుపులో బట్ట కట్టుకోని బల్లూరి కొండయ్య కథ చెప్పినందుకు కండ్లకు నెత్తురొస్తుంది ఇంకో పది రూపాయలు ఇయ్యిండ్రి దొరా " అని వేడుకున్నా ఎవరూ వినరు

ఆరాటం నిలువెల్లా దహించి వేస్తుంటే సూర్యారెడ్డి గడపలో కాలుపెడ్తాడు దుర్గయ్య. అంతే - గేటుముందు మనిషి పడిపోయిన చప్పుడు శారద తీగెలు తెగిన శబ్దం గాలిలో సుడులు తిరుగుతోంది అందెలు దొర్లుకుంటూ పోయి దూరంగా పడ్డాయి.

పోశమ్మ దుర్గయ్య మీద పడి కట్టలు తెగిన ప్రవాహంలా ఏడుస్తుంది అతని పాటే మృత్యుగానంగా మారిన శారదకాని కథ మృత్యుగానం.

ఊరుమనదే - వాడమనదే - పనిమనదే- కాని ఫలితం మనది కాదు. ఇదీ పాలేర్ల వ్యవసాయ కూలీల దుస్థితి పాలేరున్న కర్మానికి తనకు కొడుకు పుట్టినా చూడటానికి పోవడానికి వీల్లేదు ఇచ్చే జీతం సగం కడుపుకే సరిపోతున్నా అడగడానికి లేదు పొరుగూరుకి వెళ్ళి తన కూతురును చూసి తిరిగొస్తుంటాడు పాలేరు మధునయ్య తానుపెద్ద చేసిన కొత్త వంగడాల రక్షణకు చుట్టూ ముళ్ళ తీగనమరుస్తారు. తొరిగొచ్చేపుడు చేను చూడాలని వస్తాడు ముళ్ళతీగ కమర్చిన కరెంటు మధునయ్యను బలి తీసుకుంటుంది ఇలా జరగడం తెలంగాణా

గ్రామాల్లో మామూలే దొతు ఫిర్యాదంటూ ఉండేదికాదు ఉద్యమాల ప్రభావంతో మధునయ్య చావుకు పాలేర్లంతా తిరగబడతారు హనుమంతరెడ్డి పోలీసుస్టేషన్లో తలదాచుకుంటాడు లేకుంటే తలతెగిపోయేదేమో

ఊరును కావలి కాసే రాములు కథే దండాపి దొంగలను పట్టుకునే దండాపి రాములు చెయ్యని దొంగతనానికి పోయిన సొమ్ములో సగం కట్టాలన్న దొర తీర్మానాన్ని వినక తప్పదు పత్రం మీద నెత్తురుతో వేలిముద్ర వేస్తాడు తత్ఫలితం వెట్టి

ఇలా ప్రతికథా ఓ ప్రత్యేక విషయాన్ని తెలిపేదే ఎనిమిది కథల విలువైన సంపుటి 'తిరుగబడ్డ భూమి'

వుప్పల నరసింహం కథలు చదువుతుంటే తెలంగాణ గ్రామాల స్థితిగతులు కళ్ళముందు దృశ్యమానమవుతాయి. తెలంగాణ గ్రామవీధుల్లో తిరిగినట్ట నిపిస్తుంది గ్రామాల స్వరూప స్వభావాలు కళ్ళెదుట నిలుస్తాయి. పట్వార్లు, పటేండ్లు, దొరలు, పోలీసు పటేలు లాంటి గ్రామాల్లోని చిల్లర దేవుళ్ళ దౌర్జన్యాలు, కళ్ళెదురు కనబడతాయి పండ్లు, ఫలాలు, ఆటలు, పాటలు, కోపాలు, తాపాలు, కష్టాలు, కాస్తంత సుఖాలు అన్నీ మన కళ్ళ ముందుంటాయి ప్రతి కథా అతి మామూలుగానే ప్రారంభమవుతుంది. కథ నడుస్తున్న కొద్దీ కడుపులో పేగులను మెలికలు తిప్పి గుండెను కోత పెడుతుంది. ప్రతి మాటా ఈటెలా నాటుకుంటుంది కన్నీళ్ళు తెప్పిస్తాయి కన్నీళ్ళతోపాటు ఆగ్రహమూ తెప్పిస్తాయి మన పిడికిల్లు బిగుసుకునేట్టు చేస్తాయి. వుప్పల నరసింహం కథల్నిండా సజీవమైన పలుకుబల్లు, జనం వాడుకలో ఉన్న సామెతలు సందర్భోచితంగా వాడబడ్డాయి తెలుగు కథను పోరాట ఆయుధంగా మార్చిన తెలంగాణా రచయితల్లో ఈతనొకరు.

ప్రారంభంలో అద్భుతమైన కథలు రాసి తెలంగాణా - తెలుగు కథా వికాసానికి తోడ్పడిన నరసింహం వృత్తి వెసులుబాటు లేకనో ఇతరే కారణాల వల్లనో గత కొన్నేళ్ళుగా సాగుతున్న తెలుగు కథా స్వర్ణయుగ కాలంలో వ్యాసాలవీ రాశాడు తప్ప, మొదటి కథలకు పొడగింపుగా కథా రచన అంతగాచేయలేదు ఈ పని చేసుంటే ఆతని లేఖిని నుండి మరిన్ని మంచి కథలొచ్చుండేవి పాతిక, ముప్ఫయి ఏళ్ళ కితం నాటి తెలంగాణా గ్రామాల స్థితిగతులు, ఫ్యూథల్ సంస్కృతి, భూస్వామ్య పోకడలు, అట్టడుగు కులాలవారి దుస్థితి గూర్చి తెలుసుకోవడానికి నరసింహం కథలు ఉపయోగపడతాయి ఈ పది పన్నెండేండ్లుగా తెలంగాణా గ్రామాల్లో వచ్చిన మార్పులను స్త్రీవాద, దళితవాద, బహుజనవాద, మైనారిటీ, ప్రాంతీయవాద దృక్పథాలను, ఉద్యమాలను పట్టించుకొని మరిన్ని కథలు వుప్పలనుండి రావాల్సిన అవసరముంది తెలంగాణా నుంచి వస్తున్న కొత్తతరం రచయితలతో పోటీపడి రాయాల్సిన అగత్యమూ ఉంది రాస్తాడన్న నమ్మకమూ ఉంది



# సి. సుజాత

♦ కల్పన రెంటాల ♦

స్త్రీ జీవితానికి అనేకానేక పార్శ్వాలున్నట్టే స్త్రీల కథలకూ అనేకానేక కోణాలుంటాయి సుజాత కథల్ని మొత్తాన్ని విశ్లేషించి చూసుకున్నప్పుడు ఈ విషయం మరింత సుస్పష్టమవుతుంది చాలామంది స్త్రీవాద రచయిత్రుల కథల్ని విమర్శించేటప్పుడు అవన్నీ నేలవిడిచి సాము చేస్తున్నాయని, దిగుమతి చేసుకున్న స్త్రీవాదాన్ని ప్రోత్సహించే కథలని కువిమర్శలు చేస్తుంటారు నిజానికి ఈ రకం ఏకపక్ష విమర్శలకు ధీటైన జవాబు సుజాత కథలు. కళ్లెదురుగుండా కనపడుతున్న వాస్తవాల్ని కథలుగా మలచడంలో సుజాత సిద్ధహస్తురాలు తన కథలు వాస్తవాలకు భిన్నంగా ఎక్కడో ఆకాశంలో కలల ప్రపంచంలో విహరిస్తున్నట్టు వుండవు తన కథల్లో కనిపించే పాత్రలు నిత్యం మనతో మాట్లాడే మనకు పరిచితమైన మనుష్యులే

రచయిత ఎప్పుడూ తన మూలాల్ని మర్చిపోకూడదన్న జీవనపాఠం సుజాత తానెక్కడి నుంచి బయలుదేరిందో ఏ దిశగా తన జీవన ప్రయాణం కొన సాగుతుందో వివేచనతో ఎప్పటికప్పుడు తన కథలద్వారా చెపుతూనే వస్తోంది అలా అని సుజాత కథలన్నీ వైయక్తికం కాదు. అవి సమాజంలోను, రచయిత్రుల్లోనూ వస్తున్న ఆలోచనాధారకు సంకేతాలు. గుంటూరు జిల్లా తెనాలి సుజాత స్వస్థలం. డిసెంబర్ 12, 1955 న జన్మించిన సుజాత ఎం.ఏ వరకు చదివారు జర్నలిస్టు కెరియర్ 1985లో ప్రారంభించిన సుజాత వివిధ పత్రికల్లో పనిచేశారు. వందకు పైగా కథలు, 124 నాటికలు, ఒక నవల రాశారు హైదరాబాదు దూరదర్శన్ కోసం ప్రముఖ నవలా రచయిత మహీధర రామ్మోహనరావుగారి "కొల్లాయిగట్టితేనేమి?"నవలను 13 ఎపిసోడ్ల ధారావాహికగా మలిచారు

'సుప్త భుజంగాలు' నవల ద్వారా తన రచనా వ్యాసంగాన్ని ప్రారంభించింది సుజాత. అది నవలగా 1986లో అచ్చయ్యింది. కుప్పలుతెప్పలుగా నవలా సాహిత్యం వస్తున్న రోజులవి ఆ సమయంలో సుజాత రాసిన తొలి నవల 'సుప్త భుజంగాలు' ఆంధ్రజ్యోతి దినపత్రికలో ప్రచురితమై అందరి ప్రశంసలు అందుకుంది. పల్లెటూళ్లల్లో సజీవంగా కనిపించే పాత్రల్ని తన నవలలోకి తెచ్చి తద్వారా మొత్తం సమాజ స్వరూపాన్ని వివరించింది సుజాత ఈ నవల ద్వారా ఘన కళ్లముందు నిత్యం జరిగే అన్యాయాలు, ఆకలి బాధలు, భూస్వాముల దోపిడీలు, కూలీల వేదనలు, వారంతా సంఘటితమై తిరగబడాల్సిన అవసరం ఈ నవలలో చర్చిస్తుంది సుజాత తెలుగునాట వున్న ఆర్థిక రాజకీయ సామాజిక

పరిస్థితుల్ని సిద్ధాంతం పేరెత్తకుండా, ఊకదంపుడు ఉపన్యాసాలు చెప్పకుండా కాంతాసమ్మితంగా మన ముందుంచిన రచన ఇది ఈ నవల తరువాత సుజాత తన రచనా వ్యాసంగాన్ని కథలవైపు మళ్లించింది అప్పటినుంచి ఇప్పటి దాకా సుజాత కలంనుండి వందకు పైగా కథలు వచ్చాయి

ఈ కథలన్నింటిని చదివితే ధ్వంసమైపోతున్న మానవవిలువల పట్ల, డబ్బు చుట్టూ అల్లుకుంటున్న సమాజ సంబంధాల పట్ల, రకరకాల స్థాయిల్లో స్త్రీలు ఎదుర్కొంటున్న బహిరంతర సంఘర్షణల పట్ల ఓ రచయితగా తనకున్న సామాజిక బాధ్యత ఏమిటో గుర్తెరిగి రాసిన కథలన్న సంగతి అర్థమవుతుంది

సుజాత రాసిన కథలు రెండు సంపుటాలుగా వెలువడ్డాయి 'సుజాత కథలు' 1996లో, 'రెప్పచాటు ఉప్పెన' 1999లో విడుదలైనాయి

'సుజాత కథలు' లో సుజాత తీసుకున్న ఇతివృత్తానికి, 'రెప్పచాటు ఉప్పెన' లో కథల ఇతివృత్తానికి, ఆ తరువాత నుంచి 2002 వరకు వివిధ పత్రికల్లో ప్రచురితమైన సుజాత కథలకు వున్న తేడాను గమనిస్తే మనకు తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా రచయిత్రుల ఆలోచనా విధానంలో వచ్చిన మార్పు, స్త్రీవాద దృక్పథం తెచ్చిన ప్రభావం స్పష్టంగా అర్థమవుతుంది ఈ రెండూ కాక సుజాత జీవితంలో వచ్చిన మార్పు ఆమె కథల్లో కూడా ప్రతిఫలించటాన్ని మనం గమనించవచ్చు సుజాత పేదరికంలో పుట్టి పెరిగినా మట్టి మారాజు కథలో చెప్పుకున్నట్లు ఆకలిని కూడా గౌరవంతో చూడాలన్న సంస్కారపు చదువు ఆమెకు లోకాన్ని నిశితంగా చూడటం, చుట్టూ వున్న సమాజాన్ని పరిశీలించడం నేర్పింది పెళ్లితో డబ్బున్న మరో సంప్రదాయ కుటుంబంలోకి వచ్చినా వాణీ రంగారావు, మహీధర రామ్మోహనరావులాంటి మంచి స్నేహితులవల్ల జీవితంపట్ల తన అవగాహనను సమాజంపట్ల తన అభిప్రాయాల్ని మరింత విస్తృత పరుచుకున్నారు. 80వ దశకంలో రచయిత్రులు రాస్తున్న నవలలకంటే భిన్నమైన ఇతివృత్తంతో సుజాత తొలి నవల సుప్తభుజంగాలు రాసి అందరి ప్రశంసలు అందుకున్నారు పత్తిపంట చేసిన విధ్వంసంతో కడుపు చేతపట్టుకుని విజయవాడ వచ్చి జర్నలిస్టుగా ఉద్యోగం ప్రారంభించడం సుజాత జీవితంలో పెద్ద మలుపు. అప్పటినుంచి ఆమె జీవితంలోనూ, సాహిత్యంలోనూ కొత్త దృక్కోణాన్ని చూశారు జీవనపోరాటంలో అనివార్యమైన మార్పుల్ని ఆమె లోతుగా గమనించారు కేవలం గమనించో అర్థం చేసుకునో వదిలేయకుండా తనకు అర్థమైన అంశాల్ని మార్పుల వెనుకవున్న నేపథ్యాన్ని ఆమె కథలుగా మలిచారు. విశేష జనాదరణ పొందిన నవల రాసిన తరువాత కథారచనలోకి మళ్లడం గురించి రచయిత్రిని ప్రశ్నించినప్పుడు "నవల అనేది పెద్ద కాన్వాస్. అందులో చాలా విషయాలు సమగ్రంగా చర్చించవచ్చు కానీ కథ అంతకంటే బలమైన ఆయుధం అనుకుంటాను నేను మనం చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా, బలంగా క్లుప్తంగా చెప్పటం వల్ల అది మరింత శక్తివంతమవుతుంది అందుకే నేను కథలు రాయడం మొదలు పెట్టాను" అంటారు సుజాత సుజాత కథ అనే కాన్వాస్ ఎందుకు ఎన్నుకున్నదో అందుకు తగినట్టుగానే ఆమె కథన రీతి

కూడా సూటిగా క్లుప్తంగా వుంటుంది కథల్లోని సన్నివేశ చిత్రణ పాఠకుల కంటిముందు ఓ దృశ్యాన్ని నిలుపుతుంది చాలా చోట్ల ఆమె కవిత్వ శైలిని అనుకరిస్తారు అదే ఆమె కథల్లోని బలం, బలహీనత కూడా అలాంటి శైలి కథల్నిసులభంగా చదివించగలిగినా కొన్ని కొన్నిచోట్ల పాఠకుల్ని అయోమయంలోకి నెట్టేస్తుంటుంది సీరియస్ కథల్లో కూడా హాస్యం, వ్యంగ్యం చొప్పించి పాత్రౌచిత్యం దెబ్బతినకుండా కథను నడిపించడం సుజాత కథనరీతి

సుజాత కథలనగానే అందరికీ గుర్తుకు వచ్చేది 'మట్టిమారాజు' కథ డబ్బు అంటే క్రేజ్, అందం అంటే క్రేజ్, కెరియర్ అంటే క్రేజ్, అధికారం అంటే క్రేజ్ అని చెపితే అందరికీ సులభంగా అర్థం అవుతుంది అన్నం పరబ్రహ్మ స్వరూపం అంటే అర్థమవుతుంది కానీ అన్నం అంటే క్రేజ్ అని చెపితే ఒకింత ఆశ్చర్యంగా చూస్తాం అన్నం అంటే క్రేజ్ ఏమిటి? అని వింతగా చూస్తాం కానీ అన్నం అంటే ఎవరికి క్రేజో, ఆకలిని కూడా ఎవరు గౌరవంగా అభిమానంగా చూస్తారో సుజాత కథ 'మట్టి మారాజు' చదివితే అర్థమవుతుంది

తెనాలి మారీస్ పేటలోని మసోడి షెడ్డులో పనిచేసే ఓ కారు మెకానిక్కు కొడుకు ఆ దరిద్రంలోంచే కష్టపడి చదువుకుని గోల్డ్‌మెడల్ సాధించి పెద్ద ఉద్యోగస్థుడైనా తన కుటుంబ జీవిత నేపధ్యాన్ని మరిచిపోలేకపోవడమే ఈ 'మట్టిమారాజు' కథ ఆకలి అంటే ఆత్రంగా తినడమంటే అదేదో దరిద్రపు గొట్టుతనమో, వెకిలితనమో కాదు దరిద్రుడికైనా, ధనికుడికైనా ఆకలి ఒక్కటే ఆ ఆకలే లేకపోతే జీవితానికి అర్థమేలేదు "ఈ ఆకలే మనిషి బతుకుదారిని నిర్దేశిస్తుంది తన కుటుంబం ఆకలి తీర్చేందుకు మా నాన్నని గులాముని చేసింది ఈ గుప్పెడు అన్నమే అధికారానికీ, డబ్బుకీ తలవంచిన నాన్నను గుర్తుకు తెచ్చేది ఈ అన్నమే ఆకలి తీర్చేవిషయంలోనే దరిద్రుడినీ, ధనికుడినీ ఒకటి చేసిన అన్నం అంటే నాకు క్రేజ్" అంటూ ముగుస్తుంది ఈ కథ అన్నం అంటే నాకు క్రేజ్ అని మొదలైన ఈ కథ అన్నం అంటే ఇందువల్ల నాకు క్రేజ్ అని చెపుతూ ముగుస్తుంది నాన్న చెమటోడ్చి మురికిలో దుమ్ములో పనిచేసి తన శ్రమ శక్తిని రూపాయలుగా, వడ్ల గింజలుగా మారిస్తే చదువుకుని పైకొచ్చిన వెంకటేశం కొడుకు ఇవాళ కొత్తగా వచ్చిన డబ్బు, అంతస్తు, హోదా వీటన్నింటి మాయాజాలంలో పడిపోయి తాను నడిచి వచ్చిన దారి మరిచిపోలేదు తన పిల్లల్ని కూడా తీసుకెళ్లి ఆ శ్రమశక్తి ఎలాంటిదో చూపించాలని తాపత్రయ పడేవాడు ఆ మురికి షెడ్డులో చనిపోయిన తన నాన్న జ్ఞాపకాల్ని గుర్తుచేసుకునేవాడు అందుకే అతనికి ఆ మురికి సంస్కారం అంటే ఇష్టం తనను మనిషిగా నిలబెట్టిన ఆకలి అంటే అభిమానం గౌరవం క్రేజ్ తనకు, తన తమ్ముడికి కడుపునిండా తిండి పెట్టలేకపోయినందుకు తన తల్లి పడిన బాధ అతనింకా మరిచిపోలేదు ఆకలిని, దరిద్రాన్ని చిన్న చూపు చూడకండి అది మనల్ని మనుష్యులుగా మానవీయంగా నిలబెట్టే పదునైన ఆయుధం అని చెప్పే కథ 'మట్టిమారాజు' తెలుగు కథాసాహిత్యంలో వచ్చిన ఉత్తమమైన కథల్లో ఒకటిగా చెప్పవచ్చు ఆకలి మీద అనేక కథలు వచ్చినప్పటికీ సుజాత చెప్పిన ఈ కథ మాత్రం కథా ప్రియులందరికీ ఎప్పటికీ గుర్తుండిపోయే

కథ ఇది రచయిత్రి స్వానుభవంనుంచి వచ్చిన కథ 'మట్టిమారాజు కథ నా కథే అంటూ రచయిత్రి ఓ సందర్భంలో చెప్పుకుంది బతుకు నేపథ్యాన్ని గొప్పగా ఆవిష్కరించిన కథ ఇది

21వ శతాబ్దంలోకి వచ్చేశామని, స్త్రీలు అంతరిక్షంలోకి కూడా ఎగరగలుగుతున్నారని ఒక పక్క గర్వపడుతున్నా మరొక పక్క మధ్యతరగతి జీవిత చట్రాల్లో ఇరుక్కుపోయిన కుహనా విలువలు, మేడిపండులా పైకి చక్కగా కనిపిస్తూ లోపల్లోపల డొల్లగా, కుళ్లినట్లు కనిపించే కుటుంబ సంబంధాలు స్త్రీలను ఎలా శారీరకంగా, మానసికంగా సంఘర్షణకు, అణచివేతకు గురిచేస్తున్నాయో సుజాత కథలు చర్చకు తెస్తాయి బాగా చదువుకుని కూడా కేవలం కుటుంబ చట్రంలో ఇరుక్కుపోయి భర్తకు అనుకూలవతియైన భార్యగా మిగిలిపోయే క్రమంలో తన ఉనికిని ఎలా పోగొట్టుకుంటున్నామో తెలివితో తెలుసుకుని అందులోంచి బైటపడేందుకు 'నెచ్చెలి', 'పంజరం', 'ఏది వదిలేది', 'విముక్తి', 'వలజారిన చేప', 'కొత్తమ్మ' లాంటి కథల్లోని స్త్రీ పాత్రలు ప్రయత్నించడం కనిపిస్తుంది విభిన్న రంగాల్లో పనిచేసే స్త్రీలు కొలీగ్స్‌తో సోషల్‌గా మూవ్ అవ్వాల్సి వచ్చినప్పుడు తమను తాము శారీరకంగా మానసికంగా కోల్పోవాల్సిన పరిస్థితుల్లోకి నెట్టబడటం ఒక్కోసారి ఎలా అనివార్యమవుతుందో, దీని వెనక పురుషాహంకార కుట్రని, అందులోని అసలు కోణాన్ని రచయిత్రి నీడ, బొరుసు, త్రి ఇన్ వన్, రిమోట్, కండిషన్డ్ ప్లాంట్, మండే వెన్నెల, అల, సముద్రం లాంటి కథల్లో రచయిత్రి సమర్థంగా చర్చిస్తుంది సింగిల్ ఉమెన్, లివింగ్ టుగెదర్ లాంటి కాన్సెప్ట్‌లను నాదారిలోనే, బీటెన్ ట్రాక్ లాంటి కథల ద్వారా సుజాత సిద్ధాంతచర్చకు తీసుకువచ్చింది కేవలం స్త్రీ జీవితాలకు సంబంధించినవే కాకుండా భిన్నమైన ఇతివృత్తాల్ని తీసుకుని కూడా శిల్పసమన్వితంచేసి సుజాత మెప్పించగలదనటానికి మనిషి కాటు, అమ్మా నువ్వూ నవ్వొచ్చే, కోపమొస్తోంది బాబూ, వంకర లాంటి కథలు నిదర్శనం

సుజాత రాసిన 'నీడ' చాలా మంచి కథ. గొప్ప కథ. మంచి కథ ఎందుకంటే ఉద్యోగం చేసే స్త్రీలు ఇంటా బయటా బాస్‌ల మధ్య ఎట్లా నలిగిపోతున్నారో సమర్థంగా చిత్రించినందుకు. గొప్ప కథ ఎందుకంటే శిల్పసమన్వితంగా చేసినందుకు ఆధునిక యువతుల జీవితాల్లో ఇంకా వెలుగు ప్రసరించని మరో చీకటి కోణానికి అక్షర రూపం 'నీడ' అంటారు చేరా మాస్టారు ఓ చోట సుజాత కథల గురించి రాస్తూ. చదువుకుని ఇంటా బైట పనిచేస్తూ బతికే ఆడవాళ్లు బతుకులు పైకి కనిపించినంత అందంగా సౌకర్యవంతంగా వుండవు బతకడం కోసం, కుటుంబాన్ని నిలబెట్టుకోవడంకోసం, కార్యేషు దాసి, కరణేషు మంత్రి, శయనేషు రంభలా మొగుడ్ని మెప్పించడం కోసం రకరకాల ముసుగులు వేసుకుని నటించాల్సి వస్తుంది. అన్నిటికంటే ముఖ్యమైంది, స్త్రీల దగ్గర నుండి అందరూ తప్పనిసరిగా ఆశించేది పాతివ్రత్యపు ముసుగు ఆ ఒక్క ముసుగుకోసం అనేకానేక ముసుగులు ఎందుకు వేసుకోవాల్సి వస్తుందో, అలా ముసుగువేసుకుని బతకడం మనసునెంత క్షోభ పెడుతుందో

రచయిత్రి ఈ కథద్వారా చాలా శక్తివంతంగా చెప్పారు ఇల్లనే నాలుగు గోడల కోసం, సమాజం మెప్పు పొందాలనే బలహీనతతో భర్త దగ్గర భద్రమైన బతుకు కోసం స్త్రీలు తమ నవ్వుల్ని ఎలా పెట్టుబడిగా పెట్టాల్సి వస్తుంద రచయిత్రి ఈ కథ ద్వారా చెపుతుంది భర్తకు ఎలా కావాలంటే అలా ప్రవర్తించినా చివరకు స్త్రీలు పాతివ్రత్యపు ముసుగు వేసుకుంటేనే భర్తల దగ్గర భద్రత దొరుకుతుందని ఎత్తి పొడుపుతో చెప్పే కథ నీడ నీడ కథలో ఉద్యోగినిగా గృహిణిగా రెండురకాల జీవితాల మధ్య కొన్ని సందర్భాల్లో ఆధునిక స్త్రీ ఎలా ముసుగులు వేసుకుని బతకాల్సివస్తుందో చెపితే అడ్వర్‌టైజింగ్, మల్టీ మీడియా, మార్కెటింగ్, జర్నలిజం వంటి కొ॰ కొత్త రంగాల్లో పనిచేసే స్త్రీలు సోషల్‌గా కొలీగ్స్‌తో మూవ్ అవ్వాల్సిన పరిస్థితుల్లో ఇంట్లో బైటా ఎదురయ్యే సమస్యల్ని కండిషన్డ్ ప్లాంట్, అలలాంటి కథలు చర్చిస్తాయి

స్త్రీని మాతృస్వరూపంగా కీర్తించడం సమాజరీతి మాతృత్వాన్ని గ్లోరిఫై చేస్తూ వచ్చిన కథలు తెలుగు సాహిత్యంలో లెక్కకు మించినన్ని వున్నాయి అయితే ఆ మాతృత్వాన్ని ఒక స్త్రీ మోయాలంటే దాని తాలూకు సుఖదుఃఖాల్ని అనుభవించాలంటే అందుకు చుట్టూ వున్న పరిస్థితులు కూడా అనుకూలించాలి మారిన సమాజ పరిస్థితుల్లో న్యూక్లియర్ కుటుంబాల్లో భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్థులైనప్పుడు మాతృత్వం అనేది ఒక్కోసారి ఓ చాకిరీలా మిగిలిపోయి మనల్ని ఎలా భయపెడుతుందో చెప్పే కథ 'నేనొక్కదాన్నే' స్త్రీవాద భావజాలం నేపథ్యంలో మాతృత్వాన్ని నిరాకరిస్తున్న కథ కాదు ఇది అమ్మ అవడం అంటే అహో, ఓహో అని కాకుండా అమ్మకావడం అంటే దాని చుట్టూ అల్లుకుని వుండే శారీరక మానసిక చాకిరీ ఒత్తిడి వీటన్నింటి కారణంగా చాలామంది తల్లులు దాన్ని విసుక్కునే పరిస్థితి కూడా ఒకటుందని చెపుతుంది సుజాత ఈ కథలో. పాప పొట్టలో కదులుతుంటే తానుమాత్రం ఎక్కడికీ ఫ్రీగా కదల లేకపోవడం, అదనపు అసౌకర్యాలు ఇవన్నీ కాస్తంత చిరాకుగా అనిపించడం అమానుషం, అమానవత్వమేమీ కాదు, ఒక్కోసారి అదంతా చికాకుగా వుండవచ్చు అర్థం చేసుకోండి అని చెప్పే కథ ఇది ఇద్దరు కలిసి బతకాలని నిర్ణయించు కున్నప్పుడు అన్నింటిని ఇద్దరూ కలిసి పంచుకుంటున్నప్పుడు ఈ పురిటి కందు చాకిరి, దాని పనులు అన్నీ కేవలం తల్లి మాత్రమే చేసుకోవాల్సి రావడంలో వచ్చే చికాకు మాత్రమే అంతేకానీ పుట్టిన పాపాయిమీద తల్లి ప్రేమ లేకపోవడం కాదు లేదా పిల్లల్ని తామే ఎందుకు కనాలని ప్రకృతిని ప్రశ్నించడమో కాదు అన్నింట్లో భార్య తమతో సమానం అంటూ చెప్పే మొగుళ్ల పిల్లల చాకిరీని ఎంతో తెలివిగా తల్లివికదా అంటూ తమ మీదే నెట్టేయటాన్ని ప్రశ్నించే కథ ఇది ఆడపిల్లలకు మాతృగర్వం లాంటిదేమీ వుండదని, చాలామంది తల్లులు ఇష్టంతో కాక తప్పనిసరై పిల్లల చాకిరీ చేసి తమకంటూ జీవితాలు లేకుండా చేసుకుంటారని చెపుతుంది రచయిత్రి "పిల్లతో అతనికి ఎలాంటి బాధ్యత లేదు ఈ పిల్ల నాకు లంకె నా ఉద్యోగం, నా స్వేచ్ఛ, నా సాయంత్రాలు అన్నీ లాగేసిన పిల్ల మీద నాకు అనుబంధం వుండాలట ఎట్లా వుంటుందో నాకు అర్థంకాదు డిప్రెషన్ వచ్చేస్తోంది మనసు దిగులు దిగులుగా

అయిపోతోంది పిల్ల మనమీద డిపెండయి వుంటుంది దాన్ని ఎలా తోసేస్తాం అలాగని ఎంతకని భరిస్తాం ఎంత పెద్ద బాధ్యత"

డెలివరీ అయిన తరువాత రక్తహీనత వల్లో, ఇతర పోస్టు డెలివరీ సమస్యల వల్లో చాలామంది ఆడవాళ్లు తీవ్రమైన డిప్రెషన్‌లోకి వెళ్లిపోతుంటారు. ఇంకా అనేక అనారోగ్యాలకు గురవుతుంటారు ముఖ్యంగా చాలామంది తల్లుల్ని ఇబ్బంది పెట్టేది డిప్రెషన్ పిల్లల్ని ఎలా పెంచాలో తెలియకపోవడం, ఆ పనులన్నీ చేసే ఓపిక ఒంట్లో లేకపోవడం వీటన్నింటి వల్ల వచ్చే చికాకు అతి సహజం అలాంటి ఓ సన్నివేశాన్ని ఓ కథగా మలిచింది సుజాత

"నిద్రతూలిపోతూ, నిద్రపోవాలని తపించిపోతూ, నిద్రలేని కళ్లతో నేను తల్లి ప్రేమ అంటే నేను పిల్ల వంక చూసే వెర్రి చూపులేనని ఎవరైనా అంటే వాళ్లకి వేలవేల నమస్కారాలు నిద్రలో కూడా కళ్లనిండా నిద్రపోలేని తల్లులు కనిపిస్తున్నారు భయం భయంగా పిల్లల వైపు చూస్తూ ఉంటారనిపిస్తుంది.

అదేంటో అయిపోతోంది ఒళ్లు స్వాధీనం తప్పుతున్నట్టుగా మరి పాపాయీ, నీకెలాగే, నేన్నీకు అమ్మని అయినా నువ్వంటే నాకు భయమెందుకే కలొస్తోంది నేను రాసినట్టుగానే చుట్టూ సముద్రం అన్నీ ముంచెత్తే అలలే. నేనొక్కదాన్నే ఎంతకని నెట్టివేయను ఓపిక తగ్గుతోందమ్మా, నన్నెవరైనా ఆదుకోరూ"

పురిటి నొప్పులు ఎలా వుంటాయో కవిత్వీకరిస్తే ఇదేంటి ఇందులో అసహజమేముంది అంటూ సన్నాయి నొక్కులు నొక్కిన విమర్శకుల్లాంటివారే ఈ కథ వచ్చినప్పుడు కూడా స్త్రీవాదులకు మాతృత్వాన్ని నిరాకరించడం తప్ప మరేమీ పనిలేదు పిల్లల్ని కనకుండా వుండటం కోసం ఇలాంటి కథలు రాస్తారని విమర్శించారు అయితే ఇందులో మాతృత్వాన్ని వదులుకోవాలని, కానీ, తిరస్కరించాలన్న ప్రతిపాదన కానీ ఏదీ చేయలేదు పిల్లను చూసుకునే ఓపికలేదు తగ్గిపోతోంది, ఎవరన్నా ఆదుకోరూ అంటూ ఓ ఫీలింగ్‌ను మలచిన కథ ఇది

పిల్లల చాకిరీ ఎంత భయపెడుతుందో ఈ కథ ద్వారా చెప్పిన సుజాత చాలీచాలని జీతాల మధ్య ఇరుకిరుకు గదుల్లో సాగిపోయే పట్నవాసపు జీవితంలో పసిపాపాయిని వదిలివుండాల్సిన తల్లిదండ్రుల ఆవేదనను తూకం బతుకు కథ ద్వారా చెపుతుంది చదువుకున్న చదువు ఆత్మాభిమానం, ఆత్మ విశ్వాసం వేటినీ ఇవ్వకపోగా భర్తకు కార్యేషు దాసి టైపులో సేవలు చేయడంలో మునిగిన జానకి పనిమనిషి అమృతం యాక్సిడెంట్‌లో చనిపోతే ఆమె పిల్లవాడిని ఆదుకోవడం తన బాధ్యతగా గుర్తించి ఆ పిల్లవాడికి కొత్తమ్మ అవుతుంది. ఇలా తల్లి అంటే పిల్లలను కనే యంత్రంగానో లేదా కుటుంబం మొత్తానికి అన్ని పనులు చేసేసే సూపర్ వుమెన్‌గానో కాకుండా మాతృత్వానికి సంబంధించిన భిన్నమైన కోణాన్ని సుజాత తన కథల ద్వారా చెప్పే ప్రయత్నం చేశారు

స్త్రీలు చదువుకుంటే విజ్ఞానవంతులైతే వాటికి తోడు చైతన్యవంతులైతే జీవితం ఎంత విశాలంగా ఆనందదాయకంగా మారుతుందో చెప్పే కథ

'వెలుగుపూలు' ఇంటిపనులకు స్త్రీలను అంకితం చేయడం వెనుక దాగివున్న మగవారి కుట్రను బైటపెట్టే కథ ఇది. ఆడపిల్లలు స్వయం ప్రకాశాలైతే వాళ్లు ఎలా వెలుగుపూలుగా మారుతారో పొయిటిక్‌గా చెప్పిన తీరు సుజాతకు రచనా శిల్పం పట్ల వున్న పట్టును తెలియచేస్తుంది.

"నా యజమాని నన్నెంత ఆరాధించేవాడంటే పగలూ, రాత్రి తేడాలేని ఆనందలహరిలో నేనూ మునిగితేలి సముద్రాన్నయ్యేదాన్ని. నా అనుభవాలే జ్ఞాపకాలుగా నా వొడిలో బుల్లి బుల్లి పాపాయిలు, వాళ్లల్లో కొన్ని స్వయం ప్రకాశాలు. నా యజమానిలాగే ఆ పాపాయిలు ధీమాగా చూస్తారు. గట్టిగా మాట్లాడతారు. ఆ పాపాయిలకు పుట్టుకతోనే చేతుల్లో, కళ్లల్లో కత్తులున్నాయి. ఆ పాపాయిలు ఆకలేస్తే ఎంతయినా తినగలరు. దర్జాగా తిరగగలరు. ఇక నా వొడిలో మిగిలిన మొగ్గల్లాంటి పాపాయిలు. ఇవి నాలాగా చాలా సుకుమారంగా ఉన్నాయి. ఏం చెప్పినా వింటాయి. ఏం నేర్పినా ఇట్టే నేర్చుకుంటాయి. గాలి గట్టిగా వీచినా భయపడతాయి. ఎంత వినయంగా ఉన్నాయంటే నా యజమాని, అవన్నీ అచ్చం నా అంత బాగున్నాయని, నేను అదృష్టవంతురాలినని మెచ్చుకున్నాడు కూడా."

స్త్రీలకు చదువు అవసరం, చదువుతోనే వాళ్ల అభివృద్ధి సాధ్యమవుతుంది అన్నది సీరియస్ ఇతివృత్తం. అయితే ఈ విషయాన్ని ఓ సందేశంగానో ఓ సీరియస్ అంశంగానో చర్చించకుండా కవితాత్మకమైన ప్రతీకల్తో శైలితో చెప్పటం వల్ల కథకు ఓ నిండుదనం వచ్చింది. చివరికొచ్చేసరికి స్త్రీల జీవితాలకు నిజమైన వెలుగునిచ్చేది, వాళ్లు ప్రకాశించేది వెలుగుపూలలాంటి చదువుతోనేనని అన్యాపదేశంగా వివరిస్తుంది.

చదువుతోపాటు అందివచ్చే విజ్ఞానం, చైతన్యం లాంటివాటిని అందుకోవడానికి మొదట్లో స్త్రీలు ఎంత అవస్థలు పడినా రాబోయే తరం అమ్మాయిలకు తాము పరిచిన దారిలో నలుగురు నడిచి ఎలా సులువుగా వుంటుందో కూడా వివరిస్తుంది.

బొమ్మ వెనుక వుండేది బొరుసు. నాణానికి ఒక వైపు బొమ్మ, మరోవైపు బొరుసు. బొమ్మ, బొరుసు ఒకే నాణెనికి రెండు వైపులా వున్నా ఒకరికొకరు ఎంతో దూరం. కొందరు భార్యాభర్తల మధ్యకూడా అనుబంధం అంతే. భార్య అంటే కేవలం భరించేది. తన పనులన్నీ టైం ప్రకారం ఠంచనుగా చేసిపెట్టే ఒక యంత్రం అనుకుంటారు కొందరు పురుషపుంగవులు. అంతేకానీ భార్యకు మనసుంటుంది, మమతలుంటాయి, ఆశలుంటాయి, ఆవేదనలుంటాయని అర్థం చేసుకోలేని భర్తలకు ప్రతీక బొరుసు కథలోని రావు. భార్య ఆశయాలను అర్థం చేసుకోలేక కేవలం తన పనులు చేసిపెట్టి తన కెరియర్‌కు, తన అభిరుచులకు అడ్డం రాకుండా వుండాలని కోరుకునే సాధారణ వ్యక్తి. యశోద భర్త రావు. భార్య మరణం అతన్ని బాధిస్తుంది. అదెక్కడంటే తన జీవన సహచరిని కోల్పోయినప్పుడు కాదు. భార్య లేకపోవడంతో తన పనులేవీ జరగకుండా తన టైంటేబుల్ తప్పినప్పుడు. తన పనులు జరగలేని ఒక లోటుగా మాత్రమే అతను బాధపడతాడు. ఇలాంటి బొరుసు భర్తలెందరో ఈ

సమాజంలో భార్యల మరణం భర్తల్ని ఎక్కడ బాధిస్తుందో చనిపోయిన భార్యల గురించి భర్తలు ఎప్పుడు గుర్తుతెచ్చుకుని బాధపడతారో వ్యంగ్యంగా చెప్పిన కథ ఇది

ఒక్కోసారి కుటుంబంలో భార్యాభర్తల మధ్య అనుబంధం ఎలా యాంత్రికమైపోతుందో, వాటికి కేవలం డబ్బే ఆధారభూతమై ఎలా నిలుస్తుందో మరో కథ క్రోటన్స్‌లో కూడా వివరిస్తుంది రచయిత్రి

1980వ దశకం స్త్రీవాద ఉద్యమం బలంగా వేళ్లూనుకున్న సమయం స్త్రీవాద సాహిత్యం కవిత్వం, కథ రూపంలో విస్తృతంగా చర్చకు వచ్చిన చారిత్రక సందర్భం అది ఆ సమయంలో సుజాత రాసిన కథల్లో కూడా స్త్రీవాదం చర్చకు పెట్టిన ఇంటి చాకిరీ పీడన, అణచివేత, లైంగిక స్వేచ్ఛ లాంటి అనేకానేక అంశాల ఛాయలు కనిపిస్తాయి ఈ ఛాయలు తర్వాత వచ్చిన కథా సంపుటి 'రెప్పచాటు ఉప్పెన' లోనూ ఆ తరువాత నుండి 2003 వరకు వచ్చిన అనేక కథల్లోనూ కూడా మరింత స్పష్టంగా బలంగా కనిపిస్తాయి సంక్లిష్ట సందర్భాల్లో కూడా సుజాత కథల్లోని పాత్రలు నిరాశలో మునిగిపోవు పరిస్థితిని అర్థం చేసుకుని చైతన్యవంతమై ప్రవర్తిస్తాయి అసలు తమ జీవితాలకు కావాల్సిన స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు ఎలా సంపాదించుకోవాలో పంజరాల నుంచి సంకెళ్ళనుండి ఎలా బైటపడాలో ఆమె తన కథానాయికల ద్వారా శక్తివంతంగా చెప్పిస్తారు.

'నాకు శబ్దం కావాలి, నాకు చైతన్యం కావాలి, స్నేహం కావాలి. జీవ చైతన్యం కోసం, మనుష్యుల మధ్య నా ఉనికి గుర్తింపు కోసం నాకు బతికే అవకాశం ఇవ్వు' అంటుంది పంజరం కథలో అరుణ ఓ ఆడపిల్ల జీవితంలో తనకంటూ ఏమీ వుండదు. బాల్యంనుండి వృద్ధాప్యందాకా అన్నీ ఎవరి కోసమో ఎవరిలాగానో బతకటం 'ఏది వదిలేది?' లో భర్త చనిపోయిన విమల కాశీకెళ్ళి గంగస్నానంచేసి ఇష్టమైనవి వదిలెయ్యమంటే తనకంటూ ఇష్టమైన వేమున్నాయో, తనకంటూ ఏం మిగిలాయో ఏవి వదలాలో విచికిత్స చేసుకుంటుంది. తన ఆలోచనలు, అలవాట్ల దగ్గర నుంచి, అన్నీ ఇతరుల కోసం మౌల్డ్ చేసుకున్నవే తప్ప తనకంటూ ఏమి లేనప్పుడు ఆ గంగా ప్రవాహంలో ఏది వదలాలి? అని తన లోపలి మనసును తానే ప్రశ్నించు కుంటుంది

ఉద్యోగరీత్యా అనేకసార్లు అందంగా నవ్వుతూ అందర్ని మెప్పించే కొందరు స్త్రీలకు తమ వ్యక్తిగత జీవితంలో మాత్రం తన సొంతానికి ఎందుకు నవ్వులు వుండవో విషాదంగా చెప్పే కథ 'స్మైల్స్ ఫర్ సేల్' తూకపు రాళ్ల లాంటి మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి బతుకుల్లో చిన్న చిన్న ఏకాంతాలు కూడా ఎందుకు లేకుండాపోతాయో, కన్న ప్రేమను కూడా కొన్నిసార్లు ఎలా దిగమింగు కోవాల్సి వస్తుందో చెప్పే కథ 'తూకంబతుకు'

సుజాత స్త్రీ పాత్రలు మనకు బాగా పరిచితమైన స్త్రీలే సిద్ధాంతాల కోసం సృష్టించిన పాత్రల్లా కాకుండా మధ్య తరగతి, దిగువ తరగతి జీవన

నేపథ్యాల్లోంచి మన కళ్లముందుకు వచ్చి నిలుస్తాయి సుజాత కథలు మొత్తం చదివినప్పుడు ఆమె ఎన్నుకునే భిన్నమైన ఇతివృత్తాల ద్వారా మనకు భిన్నమైన స్త్రీ పాత్రలు పరిచితమవుతాయి పనిమనిషి అమృతమైనా, కండిషన్డ్ ప్లాంట్ లోని వసంత అయినా, 'అల' కథలోని పార్వతైనా ఆత్మాభిమానం వున్న స్త్రీలు సమస్యల నుంచి మొక్కవోని విశ్వాసంతో తలెత్తుకుని పైకి లేచి నిలబడి కొత్త దిశగా అడుగులు వేయడం సుజాతపాత్రల్లో మనకు స్పష్టంగా కనిపిస్తుంది సమస్యను మూలాలనుండి చర్చించడం రచయిత్రికున్న సునిశిత పరిశీలనా దృష్టిని తెలియచేస్తుంది

పడుపు వృత్తి చేసుకుని బతికే వేశ్యల జీవితాల మీద రాసిన 'నివురు' కథ చదువుతున్నప్పుడు అలెగ్జాండర్ కుప్రిన్ రాసిన 'యమకూపం' తప్పక గుర్తుకు వచ్చి తీరుతుంది అందులోని ఒక వేశ్యపాత్ర తనకు వచ్చిన 'కొరుకు సవాయి' వ్యాధికి మందు తీసుకోకుండా తన దగ్గరకు వచ్చే మగవాళ్ళందరికి ఆ జబ్బు అంటించి ప్రతీకారం తీర్చుకుంటానని ప్రతిజ్ఞ చేస్తుంది నివురు కథలోని కుమారి కథానాయిక కూడా తమను తయారుచేసిన సమాజం పట్ల తిరుగుబాటును అదే రకంగా ప్రకటిస్తుంది

స్త్రీవాద ఉద్యమ ప్రభావం తెలుగు సాహిత్యంపై చూపిన ప్రభావానికి నిదర్శనం సింగిల్ ఉమెన్, లివింగ్ టుగెదర్ లాంటి కాన్సెప్ట్‌లు సుజాత కలం నుండి కూడా ఈ ఇతివృత్తాలతో నా దారిలోనే, బీటెన్ ట్రాక్ కథలు వచ్చాయి పెళ్లి వద్దనుకుని ఓ స్నేహితుడితో గడిపిన జీవితానికి గుర్తుగా ఓ పాపను కని పెంచాలని నిర్ణయించుకుంటుంది నా దారిలోనే కథలోని పరిమళ ఏడాదిగా సాగుతున్న స్నేహం, పెళ్ళి ప్రపోజల్స్ మధ్య ఓ రొమాంటిక్ మూడ్‌లో అతనికి పరిమళ శారీరకంగా దగ్గరవుతుంది గర్భవతి అయిన పరిమళ అతనితో పెళ్లిని ఎందుకు నిరాకరించిందో రచయిత్రి స్పష్టం చేయకపోవడం ఈ కథలోని ప్రధాన లోపం అతను ఉద్యోగం మానెయ్యమన్నాడన్న ఒక్క వాక్య కారణం తప్ప ఎక్కడా వారిద్దరి మధ్య పెళ్ళికి సంబంధించిన ఇతరత్రా అభిప్రాయ భేదాల్ని రచయిత్రి ప్రస్తావించదు. సింగిల్ ఉమెన్‌గా అయిదారేళ్లుగా హాయిగా గడిపే ఓ అమ్మాయితో ఏడాదిగా స్నేహంగా వుంటూ శారీరక అనుబంధం దాకా వచ్చిన ఏ అబ్బాయైనా పెళ్లికోసం ఉద్యోగం మానమని చెప్పాడన్న కారణం సహేతుకంగా కనిపించదు దీనివల్ల అసలు పురుష పాత్ర ఎలాంటిదో అవగాహనకు రాలేరు పాఠకులు ఏ బలమైన కారణం లేకుండానే పరిమళ పెళ్లిని నిరాకరిస్తూ అతనితో నాకు సంబంధం లేదు. అతనితో దోస్తి ఓ గతం అంతే ఈ పాపాయినిమాత్రం నేను కనిపెంచుతాను అని తన నిర్ణయం ప్రకటిస్తుంది

బీటెన్‌ట్రాక్‌లో విమల - పెళ్లికి బద్ధ వ్యతిరేకం కుటుంబం ఆడవారి జవజీవాల్ని ఎలా లాగేస్తుందో అర్థమైన విమల ప్రకాష్‌తో సహజీవనానికి తప్ప పెళ్లిని అంగీకరించదు అయితే ప్రకాష్‌కి కుటుంబం అనే ఓ భద్రమైన జీవితం కావాలని వుంటుంది ఇద్దరి దారులు వేర్వేరు కావడంతో కంపానియన్‌షిప్ కావాలని ఉన్నా కొత్తదారిలో ప్రయాణానికి ఒంటరి బతుకుకు సిద్ధపడుతుంది

విమల అంటే సహజీవనంలో కూడా పురుషుడి ఆధిపత్య దోరణి కొనసాగటాన్ని ప్రశ్నిస్తూ ఆ శృంఖలాలనుండి కూడా బైటకు వచ్చి ఒంటరిగా బతకాలనుకోవడాన్ని ఈ కథలో రచయిత్రి ప్రతిపాదిస్తారు సహజీవనంలో స్త్రీలకు బోలెడంత స్వేచ్ఛ వుంటుందనుకోవడం ఓ పెద్ద భ్రమ. అక్కడ కూడా పురుషుడు తన ఇష్టా ఇష్టాల్ని, పిల్లల బాధ్యతల్ని తెలివిగా తలకెక్కిస్తాడన్న హెచ్చరిక సుజాత ఈ కథ ద్వారా చెపుతారు భద్రత కోరుకుంటే కుటుంబంలోనైనా, సహజీవనం లోనైనా అశాంతి తప్పదని, ఎవరి ఆధిపత్యం లేకుండా ఎలాంటి భద్రత ఆశించకుండా ఉన్నప్పుడే మనం నిజమైన సంతోషాన్ని పొందుతామంటుంది రచయిత్రి. సుజాత కథలన్నింటిలో కూడా స్త్రీల పట్ల బోలెడంత సహానుభూతి కనిపిస్తుంది ఈ రెండు కథల్లో కూడా సుజాతకు వారి పట్ల వున్నది సానుభూతే సహజీవనం అనేది కూడా ఒక్కోసారి ఓ అందమైన వలలా వుంటుందని, అందులోంచి బైటపడకపోతే కుటుంబం పేరు, రూపం మార్చుకున్న మరో ఊబిలోకి దిగబడిపోతామని సుజాత బీటెన్ ట్రాక్ కథద్వారా హెచ్చరిస్తుంది సహజీవనంలో ఎదురయ్యే ఇబ్బందుల్ని ఒక కోణంనుంచి చర్చకు పెట్టిన మొదటి కథ ఇదే కావచ్చు అయితే నాదారిలోనే, బీటెన్ ట్రాక్ కథలు రెండింటిలో కూడా సుజాత పురుష పాత్రల నిజస్వరూపాన్ని సరిగ్గా ఎస్టాబ్లిష్ చేయకపోవడం వల్ల స్త్రీ పాత్రల ఆలోచనా విధానం పట్ల కూడా పాఠకులకు సరైన అవగాహన రాదు పరిమళ, విమల ఇద్దరూ కూడా పెద్దగా బలమైన కారణాలేమీ లేకుండానే పెళ్లిని, సహజీవనాన్ని కూడా నిరాకరిస్తున్నారన్న అభిప్రాయం కలుగుతుంది

లివింగ్ టుగెదర్ అంటే సహజీవనం ప్రతిపాదన తెలుగు కథానిక సాహిత్యంలో కొత్తకాదు అయితే దాదాపుగా ఈ ప్రతిపాదన తాలూకు కథలన్నీ కూడా ఎక్కువగా రచయిత్రులు రాసినవే కావడం గమనార్హం ఈ కాన్సెప్ట్ మీద, ఇందులోని సాధ్యాసాధ్యాల మీద కష్టనష్టాల మీద,ఇందులో వచ్చే ఇబ్బందుల మీద, ఈ ప్రతిపాదనలో వచ్చే ప్రాక్టికల్ ప్రాబ్లమ్స్ మీద తెలుగు సాహిత్యంలో నిర్మాణాత్మకమైన సమగ్రమైన చర్చ జరగలేదనే చెప్పాలి కథల ఇతివృత్తాలకు వాస్తవ జీవితానికి మధ్య బోలెడంత అంతరం వుంటుందనేది నిజం. కుటుంబంలో అసమానతలు, పురుషాధిపత్యం, స్త్రీలపై అణచివేత వున్నాయన్నది అందరూ అంగీకరించిన సత్యాలే. ఈ సహజీవనం కథల్లో స్త్రీ పాత్రలు బాగా చదువుకుని ఆర్థికంగా మంచి ఉన్నత స్థితిలో వున్నవాళ్లు. విలాసవంతమైన అమ్మాయి ఇంటికి అబ్బాయి వచ్చి ఓ రోజో, రెండురోజులో గడిపి వెళ్లిపోతాడు. ఇంటికి సబంధించిన బాధ్యతలు కానీ, పనులు కానీ అతను షేర్ చేసుకున్నట్టు కనిపించదు అంటే పెళ్లి, కుటుంబం లాంటి వాటిల్లో వున్నపాటి బాధ్యత కూడా మగవాడికి ఈ లివింగ్ టుగెదర్ కుటుంబాల్లో లేవన్న మాట. పెళ్లి రూపం మార్చుకుని లివింగ్ టుగెదర్ అయింది తప్ప స్త్రీ పరిస్థితి అక్కడా ఇక్కడా ఒకటే. మగవాడి పనులన్నీ స్త్రీనే చేసి పెట్టాల్సి రావడం సహజీవనంలో యాక్సెప్టబులిటీ అయినప్పుడు అదే కుటుంబంలో మాత్రం రాజీపడి బతకడంగా మారడమేమిటో అర్థంకాదు

ఒకరితో స్నేహంగా వుండటానికి, శరీరం పంచుకోవడానికి రాని అభ్యంతరాలు పెళ్లి దగ్గరకు వచ్చేటప్పటికి ఎందుకు వస్తున్నాయి అది కూడా చదువుకుని జీవితంలో మంచి ఉద్యోగాల్లో స్థిరపడి స్వేచ్ఛగా సింగిల్ వుమెన్‌గా బతికే ఆడవాళ్ళకు మాత్రమే అన్నది ప్రశ్నార్థకమవుతుంది పెళ్లి అంటే మన రిమోట్ వాళ్ల చేతుల్లోకి ఇవ్వడం ఒక్కటే కాదు, ఇంకా చాలా వుంటుంది అతనితో సెక్స్ జీవితం, తెల్లారి లేవగానే అతని గురించిన ఆలోచనలు, కలిసి వండుకోవడాలు, బైటతిరగటాలు అన్నీ బావుండి హఠాత్తుగా అతనిలో ఏ అంశం నచ్చక ఏ అభిప్రాయ భేదంతో పెళ్లి లేదా సహజీవనం కూడా వద్దనుకుంటుందో సరిగ్గా ఎస్టాబ్లిష్ చేయకపోవడం వల్ల నాదారిలోనే కథలో పరిమళ పాత్ర ఓ ఆదర్శవంతమైన పాత్రగా నిలబడలేకపోయింది

అలాగే బీటెన్ ట్రాక్ కథలో కూడా విమల ప్రకాష్‌తో ఓ కంపానియన్ షిప్ కోరుకుంది అతనితో శరీరాన్ని మనసును పంచుకుంది అతని పనులు సగం ఆమె చేస్తుంది అతని బట్టలు వుతికించి, అతనికోసం వంట చేసి అన్నీ కూడా పెళ్లి అంటే వంటే కదా అని విమల అంటే పెళ్లి అంటే సెక్సే కదా అని ప్రకాష్ అంటాడు ఈ రెండు అభిప్రాయాలు కూడా ఆ పాత్రల అవగాహనా రాహిత్యాన్ని వెల్లడి చేస్తాయి పెళ్లి చేసుకుని మనకంటూ ఓ కుటుంబాన్ని ఏర్పరచుకుందాం, అన్ని పనులూ సమానంగా షేర్ చేసుకుందాం అన్నా సరే విమల పెళ్లి వద్దంటుంది పెళ్లి లేకుండానే సహజీవనం పేరుతో విమల, ప్రకాష్‌లు చేసేది వాళ్ల మాటల ప్రకారం సంసారమే అయినప్పుడు, విమల అచ్చం కుటుంబంలో భార్యలాగానే అతని పనులన్నీ చేసి పెడుతున్నప్పుడు ఇక ఆమె దేనివల్ల పెళ్లిని వ్యతిరేకిస్తోందో అర్థం కాదు. ప్రేమ సాహచర్యం కావాలి, పిల్లల్ని మాత్రం కనాలనుకోలేదు కెరియర్ ముఖ్యం తప్ప మామూలు గృహిణిగా ఇంటికి పరిమితం కాలేను అంటుంది విమల పెళ్లి చేసుకుని కెరియర్ వదిలేయమని ప్రకాష్ పాత్ర చేత ఎక్కడా చెప్పించ లేదు పెళ్లి చేసుకున్నంత మాత్రాన కెరియర్ వదిలిపెట్టాలని ఎలాంటి మగవాళ్లు కూడా ఇప్పుడు ఒత్తిడి చేయడం లేదు ఇద్దరూ పెళ్లి చేసుకోకూడదు, తాను పిల్లల్ని కనకూడదు, ప్రకాష్ తనను వదిలివెళ్లకూడదు, అతనితో శారీరక మానసిక అనుబంధం మాత్రం కావాలని విమల కోరుకున్నట్టు కథలో రచయిత్రి చిత్రీకరించింది కుటుంబం అందరికీ ఊబి కాదు కుటుంబం ఊబిలా మారినప్పుడు దాన్ని ఊబి అని గుర్తించినప్పుడు అందులోంచి బైటకు రావచ్చు అంతేకానీ ఊబి అని ముందే ఊహించి అసలు కుటుంబాన్నే నిరాకరించడం అవగాహనా రాహిత్యం అర్థరహితమూ అవుతుంది తప్ప మరేమీ కాదు కుటుంబం లేకపోవడమంటే అమ్మ, నాన్న, అన్నా, అక్క, చెల్లెలు, ప్రేమలు, ఆప్యాయతలు ఏవీ లేకపోవడమే కదా కుటుంబం వద్దు అంటే మిగతా అనుబంధాలన్నీ కావాలని కానీ మొగుడు మాత్రం వద్దని అన్నట్టు వుంటోంది ఈ కథల్లో. ఉద్యోగం, స్వేచ్ఛ పేరు ప్రతిష్ఠలు మాత్రమే జీవితం కాదు వీటన్నింటికి మించిన అనుబంధం ఆత్మీయత కుటుంబంలో వుంది కుటుంబంలో ఉందని చెపుతున్న అభద్రత సహజీవనంలో మరింత ఎక్కువగా

వుంది సహజీవనం కథలన్నింటిలో కూడా కథానాయిక ఇంటికి అవసరమైనప్పుడు పని పడినప్పుడు ఓ సత్రంలాగా హీరోలు వచ్చి వెళుతుంటారు ఇది మాత్రం ఏ రకంగా భద్రతో ఏ రచయిత్రి కూడా ఇంత వరకూ చెప్పే ప్రయత్నం చేయలేదు పెళ్లి వద్దనుకున్నా, పిల్లలు వద్దనుకున్నా, లేదా పెళ్లి లేకుండా పిల్లల్ని కనాలనుకున్నా, కుటుంబం లేకుండా సహజీవనం చేయాలన్నా అందులో రకరకాల ప్రాక్టికల్ ప్రాబ్లమ్స్ ఉన్నాయి రచయిత్రులు తమ కథల్లో వాటిని చర్చించడం వల్ల ఆ ప్రతిపాదనకు ఓ సమగ్రత చేకూరుతుంది కేవలం సహజీవనం అన్న ప్రతిపాదన కథ కాబోదు. అది వాస్తవాన్ని చూడనిరాకరించే పాక్షిక దృష్టి మాత్రమే

ఏమైనా తెలుగు కథానికా సాహిత్యంలో సుజాత భిన్నమైన ఇతివృత్తాలతో, చదివించే శైలి, వాస్తవానికి దగ్గరగా సహజంగా ప్రవర్తించే పాత్రలతో సృజించిన కథల ద్వారా బలమైన ముద్రతో వర్ధమాన రచయిత్రులకు మార్గదర్శకం కాగలిగారు

# చిలుకూరి దేవపుత్ర

♦ *మధురాంతకం నరేంద్ర* ♦

**1975** తరువాత రాయడం ప్రారంభించిన రాయలసీమలోని మూడవ తరం తెలుగు కథకులలో చిలుకూరి దేవపుత్రగారొకరు తొలినుంచీ సాహిత్య సాధన పైనే తన దృష్టినంతా కేంద్రీకరించడం చేత, రాయడం మొదలు పెట్టినప్పటినుంచీ తన సాహిత్య సాధనను, మంచిని పెంచడం కోసమూ, చెడును వ్యతిరేకించడం కోసమూ వుపయోగించడం చేత ఆంధ్ర దేశంలోని ప్రముఖ కథకులలో ఆయనకు సముచితమైన స్థానం లభించింది

చలం తన అభిమాన రచయిత అని చెప్పుకునే దేవపుత్ర రచనల వస్తువుపైన గానీ, శైలీ శిల్పాలపైనగానీ చలం ప్రభావం కనిపించదు అనంతపురంలోని లిటరరీ మీట్ సింగమనేని నారాయణగారి నేతృత్వంలో వో ఆరోగ్యకరమైన ప్రజాస్వామిక వాతావరణాన్ని రూపొందించింది అక్కడ తయారైన కథకులందరూ ప్రాచీన, ఆధునిక తెలుగు కథా సాహిత్యాన్ని గౌరవాభిమానాలతో అధ్యయనం చేసిన వాళ్ళు తమ తమ జీవితపు మూలాలను నిర్భయంగా, ఆసక్తితో అన్వేషించిన వాళ్ళు. తమదైన ప్రత్యేక వ్యక్తిత్వంలాగే తమ తమ విలక్షణమైన సాహితీమార్గాలను వెతికి పట్టుకున్న వాళ్ళు. జీవితమే భూమికగా, మానవాభ్యుదయమే గమ్యంగా, సాహిత్యమే జీవనమార్గంగా, మరే యితర ప్రలోభాలకూ లొంగకుండా, తమదైన మార్గంలో గతి తప్పకుండా పయనిస్తున్నవాళ్ళు వీరిలో దేవపుత్రగారొకరు

దళితుడు నిస్సంకోచంగా తాను దళితుణ్ణని చెప్పుకోవడం దళిత వుద్యమం లోని మొదటి ముందడుగు. దళిత వుద్యమం ప్రారంభంగాక మునుపే తన ఐడెంటిటీని నిర్భయంగా చాటి చెప్తూ కథలు రాసి, దళిత ఉద్యమ స్పృహను ఆధునిక తెలుగు సాహిత్యంలోకి ప్రవేశపెట్టిన తొలి కథకులలో ఆయనొకడు. బహుశా దళితుణ్ణే కథకుడుగా అనేక కథల్లో ప్రవేశపెట్టి, దళిత ప్రపంచాన్ని సవివరంగా తెలుగు పాఠకులకు పరిచయం చేసిన తొలి కథకుడు గూడా దేవపుత్రేగావచ్చు

ఆధునిక సమాజంలో ఆర్థికబలమూ, రాజకీయాధికారమూ యెప్పుడూ అగ్రకులస్తులదే! అగ్రకులాలవారి ఉక్కుపాదాల కింద దళితుడెప్పుడూ అణగారి పోతున్నాడు 1979లో రాసిన 'సమిధలు' కథలో దేవపుత్ర దళితులు అగ్రకులాల వారి రాజకీయ జూదంలో పావులుగా మారుతున్న వైనాన్ని స్పష్టంగా చూపెడతారు 2000 సంవత్సరంలో రాసిన 'ఆయుధం' అన్న కథలో దళితుల్ని తెలివిగా తమకు రక్షకదళంగా మార్చుకున్న అగ్రకులాలవారి టక్కరితనాన్ని చిత్రీకరించాడు

యీ రెండు కథల మధ్యలో వ్యాపించిన ఆయన దళిత సాహిత్యం, దళిత జీవనానికున్న అనేక పార్శ్వాలను పాఠకులకు పరిచయం చేస్తుంది

దాదాపుగా దేవపుత్ర కథా సాహిత్యానికంతా దళిత జీవనమే కేంద్రం. పాత్రల కులమేమిటో పేర్కొన్న అయిదారు కథలలో మాత్రమేగాకుండా మిగిలిన కథలలో గూడా ప్రధాన పాత్రలు దళితులేనన్న విషయం నిర్వివాదాంశం ఆయన కథలలోని పాత్రల సామాజిక జీవనమూ, వాళ్ళ మానవ సంబంధాలు, ఆచార వ్యవహారాలు, వాళ్ళకూ అగ్రకులాల వాళ్ళకూ మధ్య యేర్పడే విభేదాలూ, వాళ్ళ ఆచూకీని పాఠకుడికి పట్టిచూపుతాయి

రచయిత పాత్రల కులాన్ని స్పష్టంగా పేర్కొన్న కథలలో 'సమిధలు' మొదటిది. పల్లెటూళ్ళల్లో జరిగే పంచాయితీ ఎలక్షన్లలో అగ్రకులాలవాళ్ళు మాలమాదిగలనెంత క్రూరంగా వాడుకుంటారో యీ కథ చిత్రీకరిస్తుంది కేశవరెడ్డికి అనుచరుడైపోయి, అతడ్ని ఎన్నికలలో గెలిపించడానికి పాటుపడిన పోతప్పపైన ప్రత్యర్థి తిప్పారెడ్డి పగబడతాడు తన పాలేరు - మరో దళితుడైన ఓబులేసు సాయంతో పోతప్పను తిప్పారెడ్డి ఖూనీ చేస్తాడు. తిప్పారెడ్డిని కోర్టుకులాగి, అతడికెలాగైనా ఉరిశిక్షపడేలా చూస్తానని పోతప్ప తండ్రి కొల్లప్పకు హామీ యిస్తాడు కేశవరెడ్డి అయితే అసెంబ్లీ ఎన్నికలు రాగానే ప్రత్యర్థి వర్గానికి చెందిన నాయుడిని వోడించేందుకు రెడ్లందరూ చేతులు కలుపుతారు అంతవరకూ బద్ధ విరోధులుగా వున్న కేశవరెడ్డీ , తిప్పారెడ్డీ చివరకు వియ్యంకు లవడానికి సిద్ధమవుతారు. న్యాయం అడగబోయిన కొల్లప్పతో "రేయ్! ముసిలోడా! తల తిరుగుతాందా? తక్కువ కులానికి ఎక్కువ కూడు పెడితే తల తిక్కట! మీ మాదిగ నాయాళ్ళకాడ గవురంగా మాట్లాడగూడదురా! ఇట్లే మాట్లాన్నేవంటే నీరగతం కండ్ల చూస్తా!" అంటూ పేట్రేగిపోతాడు న్యాయం దొరక్కపోతే తిరిగెళ్ళనని మొరాయించిన కొల్లప్పాడు చావ చితక చంపుతాడు పోలీసురాజ్యం కేశవరెడ్డిని కాపాడుతుంది. వెర్రికుక్క కరవరంతో పిచ్చివాడైన కొల్లప్పను ఆత్మ రక్షణార్థం కేశవరెడ్డి చంపడంలో తప్పులేదని తేల్చి పారేస్తుంది కొల్లప్పకు జరిగిన అన్యాయం తమకూ జరగడానికి అట్టే దూరంలేదని గ్రహించిన దళితులందరూ ఏకం కావాలనుకోడంతో కథ ముగుస్తుంది.

వర్ణవ్యవస్థ అనే యజ్ఞంలో సమిధలుగా మారుతున్న దళితులకు సంఘటితంగా తిరగబడడమొకటే మార్గంగా సూచించడం సహేతుకమైన పరిష్కారమే! అయితే సంఘటితమైన దళితుల్ని విభజించి పాలించడమెలాగో రాజ్యాధికారానికి తెలుసు. యీలోగా మరికొన్ని సాంఘిక రాజకీయ పరిణామాలు సంభవించడంతో దళిత సమస్య రానూరానూ సంక్లిష్టమవుతూ వస్తోంది క్రమంగా దుర్భరంగా తయారవుతున్న ఆర్థిక కేంద్రీకరణవల్ల అనుక్షణమూ దళితులు చితికిపోతూనే వున్నారు నిలబడ్డానికీ చోటు దొరక్కపోవడంతో నిస్సహాయంగా అణగారిపోతున్న వాళ్ళకు తిరగబడ్డానికి కావాల్సినంత త్రాణ యెక్కడినుంచీ వస్తుంది? ధనవంతులకు జీవిత మొక విలాసయాత్ర బీదవాళ్ళకు బతుకే నరకం యవ్వనంలో మాలమాదిగ యువకులనంతా తన అందంతో వూరించిన సౌందర్యవతి సుబ్బులుకు పెళ్ళయిన మూడేళ్ళకే మొగుడు చెట్టుపైన్నుంచిపడి

చనిపోతాడు. సరయిన ఆర్థిక వనరులు లేక ఆమెకు జీవితం దుర్భరమైపోతుంది సమయానికి వైద్య సదుపాయాన్ని అందించలేకపోవడంతో ఆమె బిడ్డ ఆస్పత్రిలో మరణిస్తాడు డాక్టర్లు తిడతారన్న భయంతో ఆమె ఆస్పత్రిలో యేడవలేకపోతుంది. బస్సులో యేడిస్తే కండెక్టరు బిడ్డ శవాన్ని పసిగట్టి కిందికి దిగ్గొలికేస్తారన్న భయంతో కిక్కురుమనకుండా వుండిపోతుంది తీరా బస్సుదిగి, తన వూరి పొలిమేర్లలో కొచ్చాక, వో చెట్టు కింద ఆగి తనివితీరా యేడుస్తుంది మాల సుబ్బులుకు యేడ్చేందుకు గూడా వీల్లేనంత యిరుకు ప్రపంచమై పోయిందీ లోకం అంటాడు రచయిత (ఇరుకు).

భారతదేశంలో ప్రజాస్వామ్యం అపహాస్యమైపోతోందన్న విషయం దేవపుత్రకు తెలుసు అర్థికంగా పైకి రానంత కాలం రిజర్వేషన్లు కేవలం కంటి తుడుపులేననీ, అవి దళితుల కేవిధంగానూ వుపయోగపడడం లేదనీ "ఊడలమర్రి" అనే కథలో నిరూపిస్తాడాయన వీరాపురం పంచాయతీని యస్ సి రిజర్వేషను కిందకు చేర్చడంతో ముప్పయిదేళ్ళుగా పెత్తనం చెలాయిస్తున్న భీమప్పకు యెన్నికల్లో నిలబడే అవకాశం దొరకదు తప్పనిసరి పరిస్థితుల్లో తన జీతగాడు ఓబులుగాడిని అభ్యర్థిగా నిలబెడతాడు. యెన్నికల్లో గెలిచిన ఓబులు గాడు తనముందే కుర్చీలో కూర్చోవడం, తాను కింద చాపపైన కూర్చోవడం అతడు సహించలేడు చివరకు దళితుడైన తలారివాడు గూడా "భీమప్ప అయ్యంటే ఏందనుకుంటివి? ఈ సుట్టుపక్కల పల్లెల్లో ఆయనంటే ఎంత పేరూ ఏం కతా? అట్లా అయ్యముందరే కుర్చీలో కుచ్చుంటాడా వాడు? ఆయన పానం ఓర్చుగుంటుందా? అందుకే చెలుకోలు తీసుకోని వాయించి పారేసినాడు అట్ల గొట్టకపోతే ఈడికి కండ్లు నెత్తి మీదికి రావా? మీరు ఏందో చెప్పినారే అనుకోండి. ఆనా కొడుక్కన్నా బుద్ధుండమన్లేదా?" అంటాడు డా॥ కేశవరెడ్డి నవల "ఇన్ క్రెడిబుల్ గొరెస్"లోని ముగింపును జ్ఞాపకం చేసే కథ యిది. ఊడల మర్రిలా బలంగా పాతుకుపోయిన యీ బూర్జువా వ్యవస్థలో విప్లవ బీజమన్నది మొలకెత్తే అవకాశమే లేదేమోనన్న నిర్వేదంలోకి దిగిపోతాడు కథకుడు గూడా!

సమకాలీన సమాజంలో యెటువంటి పరిణామం సంభవించినా దళితులకే దెబ్బలు తగులుతాయి ధనవంతుల్ని మరింత పెద్ద ధనవంతులుగా మారుస్తాయి అనంతపురంవంటి కరువు కాటకాల జిల్లాలో నదులకు ఆనకట్టలు గట్టి భూముల్ని సాగులోకి తేవడం అభిలషణీయమైన విషయమే! అయితే, ఆనకట్ట కట్టిన తరువాత ముంపులో భూముల్ని పోగొట్టుకునే రైతుల సంగతేమిటి? గవర్మెంటు చెట్టు చెట్టుకీ నష్టపరిహారం చెల్లిస్తుందని తెలుసుకున్న ధనవంతులైన అగ్రకులస్తులు మునగబోయే భూముల్లో చీనీ చెట్లు నాటి యెక్కువ డబ్బును సంపాదించు కుంటారు తమ భూముల రేట్లు పెరిగేందుకు తమ బంధువులకే వాటిని అమ్మినట్లుగా తప్పుడు పత్రాలు తయారు చేస్తారు. పైగా భూసంపాదన అధికార్లకు లంచాలిచ్చి యెక్కువ రేటు వేయించుకుంటారు అక్కడితో ఆగకుండా తగినంత రేటు దక్కలేదని గవర్నమెంటు పైన కోర్టుకెళ్తారు న్యాయాన్ని సైతం కొనుక్కుంటారు. 'అలగా జనానికి అంత తెలివీ, భూమీ, డబ్బూ వుండవుగదా!' అంటాడో వ్యక్తి 'ముంపు' కథలో

1995లో రాసిన 'విలోమం' కథలో రిజర్వేషన్ల వ్యవహారాన్ని మరింత లోతుగా చర్చించారు దేవపుత్ర రాధ అనే షెడ్యూల్ కాస్ట్ అమ్మాయి క్లరికల్ గ్రేడు గ్రూపు ఫోర్ పరీక్షలు రాసి రిజర్వేషను కేటగిరీలో యిరిగేషను డిపార్టుమెంటులో టైపిస్టుగా వుద్యోగం సంపాదించుకుంటుంది అంతవరకూ ఆమె చుట్టూ తిరుగుతూ వుండిన జీవన్ అనే అగ్రకులస్తుడైన యువకుడు తానామెను పెళ్ళి చేసుకోవాలను కుంటున్నట్లు చెప్పేసరికి ఆమె అవాక్కయిపోతుంది హేతువాది అయిన రాధ తండ్రి "జీవన్ నిన్ను పెళ్ళి చేసుకోవడంలో తన ఆర్థిక స్థితిని దృష్టిలో ఉంచుకున్నాడేమో! నీకే ఉద్యోగం రాకుంటే నిన్ను పెళ్ళి చేసుకునే వాడా? ఆలోచించుకో!" అంటాడు. చుండూరు హరిజనుల వూచకోత సంఘటన జరిగినప్పుడు "యీ తక్కువ కులం నాయాండ్లు అట్ల నిక్కీ నీలుగుతుంటే, సంఘాలు పెట్టుకోని మిడిసి పడతావుంటే నరికెయ్యకుండా వుంటారా?" అంటున్న జీవన్‌లోని దళిత ద్వేషాన్ని చూసి అవాక్కయిపోతుంది రాధ అదే జీవన్ తనకొడుకును స్కూల్లో చేర్పించినప్పుడు అతడ్ని యెస్సీగా నమోదు చేస్తాడు యెస్సీ కోటా కింద వచ్చే లాభాలన్నీ తనకొడుక్కు గూడా దక్కాలని ఆశిస్తాడు 'గవర్నమెంటు వోట్ల వేట నాటకంలోని అంతర్భాగమే రిజర్వేషన్లనీ, అంటరాని వాళ్ళకి అది నిజంగా కంటి తుడుపేననీ" రాధ వాదిస్తుంది. యెస్సీ రిజర్వేషన్లు సంపాదించుకోవడం కోసం దళిత స్త్రీపైన ప్రేమ నటించి, పెళ్ళాడి, ఆ రిజర్వేషన్లని తన సంతానానికి గూడా అందించాలనుకునే అగ్రకులస్తుల దుర్మార్గాన్ని యెండ గట్టడమే రచయిత ఆంతర్యమని తెలిసిపోతుంది. అయితే జీవన్ తన ఆర్థిక దుస్థితి వల్లే రాధను భార్యగా చేసుకున్నా, ఆమెను సక్రమంగానే చూసుకుంటూ వున్నాడు. బిడ్డలపట్ల తండ్రిగా బాధ్యతాయుతంగానే వున్నాడు తన ఆర్థికా వసరాలు, కులాభిమానం అనే రెండు వైరుధ్యాల మధ్య వూగిసలాడుతూ అతను 'పాతటిక్' (అబిశినీలిశిరిబీ) గానూ, మరో రకంగా గమనించినప్పుడు బఫూన్ లాగానూ కనిపిస్తాడు. రచయిత యెంత యేవగించుకుంటున్నా ఆ పాత్రపట్ల - అందుకు గూడా రిజర్వేషన్ల వ్యవహారంలోని డొల్లతనమే కారణం

క్రమంగా వస్తున్న సామాజిక మార్పుల వల్ల దళితుల అస్తిత్వానికి కూడా కొంత విలువ చేకూరసాగింది ఎన్నికల బరిలో దిగిన అగ్రకులాలవారికి దళితులవోట్లు తప్పనిసరి అయిపోయింది. యీ పరిణామాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకున్న అగ్రకులాలవాళ్ళు దళితులపట్ల కపట ప్రేమను నటించ సాగారు. ఆ మాయలో మళ్ళీ దళితులు మోసపోసాగారు అమాయకులైన దళితుల్ని రాయలసీమలోని ఫ్యాక్షన్ నాయకులు తమ రక్షక కవచాలుగా మార్చుకున్నారు. కొట్లాటలు, దొమ్మీలు జరిగినప్పుడు ప్రాణాలు కోల్పోయేది దళితులే! దళితులు రక్షణలో జీవించే నాయకులు తమ ప్రాణాలు కాపాడుకుంటారు. అందుకే 'ఆయుధం' అన్న కథలో వో పాత్ర బలిపశువుగా మారబోయే దళితుడితో "నీకీ స్వామి భక్తి ఎక్కువైందిరా! కొత్త పెండ్లాం మొగమన్నా చూడకుండా రాజన్న వెంబడి వచ్చినావు. ఏం పనిరా ఇది! నువ్వు మనిషివి కావురా! ప్రాణమున్న ఏకే 47వి" అంటాడు

అయితే దళితేతరులైన అగ్రకులస్తుందరిపైనా అనవసరపు ఆగ్రహం లేకపోవడమూ, మంచిచెడ్డలన్నవి మాత్రమే నిజమైన జాతులన్న విషయం అవగాహనలో వుండడమూ, దేవపుత్రను అరుదైన కథకుల కోవలోకి చేరుస్తాయి అందుకు ఆయనరాసిన "తోక తెగిన ఎలుక" అన్న కథే ఉదాహరణ! జందెం లేకపోవడమూ, మాంసాహారాన్ని తినడమూ తన అభ్యుదయ భావాలకు చిహ్నాలని భావించే విశ్వనాథశాస్త్రి తాను సనాతనుడనీ, చాందసుడనీ భావించే నారాయణ రావు యింటికి అతిథిగా వెళ్తాడు. అతడి యింట్లోంచీ మసాలావాసన వచ్చినప్పుడు ఆశ్చర్యపడిపోతాడు నారాయణరావు భార్య మాంసాహారాన్ని వడ్డించినప్పుడు సంభ్రమంలో మునిగిపోతాడు కానీ నిజమైన షాక్ ఆ తరువాతే వేచివుంది "ఆమె బ్రాహ్మణ స్త్రీ అని యెవరు చెప్పారు? ఆమె హరిజన అమ్మాయి." అంటాడు నారాయణరావు ఓహెన్రీ కథలా కొసమెరుపుతో పాఠకుడ్ని గూడా ఆశ్చర్యచకితుణ్ణి గావించే కథ యిది సనాతనుడైన బ్రాహ్మణుడు హరిజన అమ్మాయిని పెళ్ళాడడం, ఆవిడ మాంసాహారాన్ని తయారు చెయ్యడానికి అభ్యంతర పెట్టకపోవడం, అసంగతమైన విషయాలుగా కనిపిస్తాయి అయితే నిజాన్ని కలగనడంలాగే, కలలాంటి నిజాన్ని వూహించడం గూడా రచయితలకు తప్పదు. తప్పుగాదు గూడా!

తోటి మనుషుల పట్ల మమకారం, తమ సంస్కృతిపైన భాష పట్ల యిష్టం, సహృదయత, సౌజన్యం మొదలైన మంచి గుణాలను వ్యాపార ప్రపంచం, ఆర్థిక దౌష్ట్యం విస్మరిస్తుంది. అందుకే యీ అరుదైన గుణాలు అణచివేయబడుతున్న వర్గమైన దళితులు, స్త్రీలలోనే మనం వెతుక్కోగలం 'విలోమం' కథలో రాధ "ప్రాథమిక విద్య మాతృభాషలోనే వుండాలనీ, ఆరేళ్ళవరకూ స్కూలుకు పంపగూడదనీ, తెలుగు బళ్లలోనే చదివించాలనీ నేను జీవన్‌తో పెద్ద పోరాటమే చేయవలసి వచ్చింది" అంటుంది. 'ముంపు' కథలోని కథకుడు "ఉన్న భూములకూ, ఇళ్ళకూ, చెట్లకూ నష్టపరిహారం చెల్లించే మీ గవర్నమెంటు మా అనుభూతులకూ, అనుభవాలకూ, మా జ్ఞాపకాలకూ నష్టపరిహారం చెల్లించగలదా? పరిహారం డబ్బుతో నా ఊరిని కొనుక్కోగలనా, నా స్మృతుల్ని కొనుక్కోగలనా?" అంటూ ఆవేదన చెందుతాడు మారుతున్న కాలంతో బాటూ మారలేకపోవడమూ, వ్యాపార ప్రపంచంలో సైతం సెంటిమెంటల్‌గా జీవించడమూ దళితులలోని మంచిని మాత్రమే గాదు, లోపాన్ని గూడా వెల్లడిస్తుంది 'సమిధలు' కథలో యిరు రాజకీయ పక్షాల చేతుల్లోనూ కీలుబొమ్మలైపోయి, మూర్ఖంగా ప్రవర్తించే దళితుల్ని చూపెడతాడు రచయిత నాయకులు పన్నాగాలు తెలుసుకోలేని దళితులు తమను తామే చంపుకుంటారు 'ఇరుకు' కథలో సుబ్బులు మేనమామ నర్సింహులు పంచాయితీలోని పెద్ద మనుషులందరికీ సారా తాగించి తన వైపుకు తిప్పుకుంటాడు. యిలా సత్యానికుండే బొమ్మా బొరుసులు రెండింటినీ చిత్రించడం చేత దేవపుత్ర కథలకు విశిష్టత చేకూరింది

దళిత సమస్య తరువాత దేవపుత్రను యెక్కువగా ఆకర్షించినవి వివిధ రకాల వుద్యోగాల్లో తానెదుర్కొన్న అనుభవాలే! జైలు వార్డరుగానూ, కలెక్టరాఫీసు గుమస్తాగానూ ఆయన రాజ్యహింస చేసే బీభత్సాన్ని గమనించాడు 'విడుదల'

కథలో కేసుల కోసమంటూ పోలీసులు అమాయకులనెలా జైలుకు లాక్కెళ్తారో చూపెడతాడు రచయిత 'ఆర్డర్లీ' కథలో సూపర్నింటెండెంట్లు జైలు వార్డర్లని తమ యింటి బానిసలుగా వాడుకుంటారు 'ఆరుగ్లాసులు' కథలో 'కేసులు దొరక్క పోతే పోలీసుల గతేంకాను?' అని జాలిపడే సబ్ జైలు గార్డు అమాయకుడైన టీ కుర్రాడికి జైలు శిక్ష పడ్డందుకు కించిత్తయినా బాధపడడు 'ఐడెంటిఫికేషన్' కథ జైళ్ళలో జరిగే ఐడెంటిఫికేషన్ పెరేడ్ల మతలబులన్నింటినీ విప్పి చూపుతుంది 'మీసాలు' అనే కథలో వీరయ్య అనే పోలీసు పెంచిన గుబురు మీసాలు చూసి మెచ్చుకుని వో యస్.పి అతడికి బహుమానం యిస్తాడు అవే మీసాలు చూసి మరో యస్.పి ఆగ్రహోదగ్రుడైపోయి వాటిని వెంటనే తీసేయకపోతే పనిష్మెంటిస్తానంటాడు అయితే చివరకు మీసాలకోసం యింక్రిమెంటునైనా వదిలేస్తానని చెప్పే వీరయ్య పాత్ర అంత సహజంగా కనిపించదు అదిగూడా దళితులు తిరగబడడంలాగే వో అందమైన కలలాగా కనిపిస్తుంది.

గుమస్తాల స్వభావం గురించీ, వాళ్ళ పరిస్థితులను గురించీ దేవపుత్ర చాలా కథలు రాశారు. భార్య గర్భిణీగా వున్నప్పుడు రాసిన వుత్తరానికి అలవాటు ప్రకారం పిల్లలు పుట్టిన తర్వాత జవాబు రాసే శంకరరావు(ప్రేమలేఖ) పైకి మాత్రం నీతులు వల్లిస్తూ చివరకు పొట్ట కూటికోసం పడుపుకత్తెలుగా మారిన అభాగినుల దగ్గర కూడా లంచాలు వసూలు చేసే రామారావు (జుల్మానా), మరో ఆలోచన లేకుండా వుద్యోగానికి మాత్రమే అంకితమైపోయి చివరికి తన పిల్లల్నే గుర్తుపట్టలేకపోయిన రామనాథం (జ్ఞాపికలు), యింటిని మరచిపోయి ఆఫీసులోనే వుండిపోవడంచేత తన కూతురి కళ్ళకు దొంగాడిలా కనబడ్డ తండ్రి (దొంగాడొచ్చాడు) అపస్మారక పరిస్థితిలో పడ్డప్పుడు గూడా ఆఫీసరుగారి పేరు వినబడగానే పైకిలేచి నమస్కారం చేసే గుర్నాథం (ఇట్లు తమ విశ్వాసపాత్రుడు) వీళ్ళందరూ, 'తండ్రి గుమస్తా, తాత గుమస్తా', అన్నకవీ వాక్కుకు ప్రతినిధులు యివన్నీ చెకోవ్ 'గుమస్తామరణం' కథను జ్ఞాపకం చేస్తూ, మధ్యతరగతి మనిషిని యిలా వో విచిత్రమైన జీవిగా మార్చే రెడ్-టేపిజంను హాస్యంగా వ్యంగ్యంగా యెద్దేవా చేస్తాయి

దేవపుత్ర రాసిన మరికొన్ని రాజ్యహింస కథలు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి సారా కథల్ని జ్ఞాపకం చేస్తాయి. రూ 94.40 పైసల నష్టపరిహారం కోసం నూరు రూపాయలకుపైగా ఖర్చుపెడుతుంది మల్లెల మల్లమ్మలు యింకో వందరూపాయల ఖర్చు చేసినా తనకు రావలసిన సొమ్ము దక్కదని ఆమెకర్థమైపోతుంది ఆఫీసుల చుట్టూ తిరిగీ తిరిగీ ఆమె అలసిపోతుంది. చివరకు తనకు రావలసిన సొమ్మును ప్రభుత్వ ఖజానాకు కట్టేయమని ఆఫీసరుగారికి విన్నవించుకోడమొక్కటే ఆమెకు గత్యంతరంగా తోస్తుంది. (కాంపెన్షేషన్) మరో కథలో నీతిగా బతకలేని భర్తకు అవినీతితో గవర్నమెంటునెలా బుట్టలో వేసుకోవాలో రుజువు చేసి చూపెడుతుంది భార్య (పులికి పిలకలేదు) అర్థరాత్రిపూట రోడ్డులో తనను అటకాయించిన వ్యక్తి పోలీసుగాకపోతే చాలునని మొరబెట్టుకుంటాడో మధ్యతరగతి వ్యక్తి (దొంగయితే బావుణ్ణు) గవర్నమెంటు బ్యాంకులు ధనవంతుల అడుగులకు మడుగులొత్తుతో

అప్పులు దయచేస్తాయి పేదవారి కోపం యెప్పుడూ అతడి పెదవికే చేటు (ఇది ఇక్కడి న్యాయం)

సమకాలీన సమాజంలో జరుగుతున్న మార్పులన్నింటికీ చలిస్తూ, తనను కదిలించిన విషయాన్నల్లా కథగా మలచటం దేవపుత్ర కలవాటు చదువుకోవడ మన్నదే అనర్హతగా తయారై అటు వ్యవసాయానికీ, యిటు వుద్యోగానికీ పనికి రాకుండా పోయిన యువకులు (అవిటివాడు) తనను, తన వాళ్ళను రకరకాల వైద్య పరిశోధనలకు గురిచేసే అనుమాన ప్రాణులు (వంకర టింకరి ఓ) పెళ్ళయితే కూతురి సంపాదన పోగొట్టుకుని తాను దిక్కులేని వాడనవుతానన్న భయంతో చేజేతులా తన కూతురి పెళ్ళిని చెడగొట్టే తండ్రులు(ఆపద్ధర్మం) వైద్య సదుపాయం ఖరీదైనదయినప్పుడు చావునే యెంచుకునే బడుగు జీవులు (మునకే సుఖం) ఉద్యోగం చేస్తున్న తండ్రి చనిపోవడం వల్ల తనకు ఉద్యోగం దొరికే మార్గం దొరికిందని తెలుసుకుని భయవిహ్వలుడై పోయే దౌర్భాగ్యుడూ (రాక్షసనీడ) యిలా ఆయన కథల ప్రపంచంలో సమకాలీన బాధాతప్త హృదయులంతా నడుచుకొచ్చేశారు.

సమకాలీన రచయితలలో దేవపుత్ర విలక్షణమైన కథకుడు అనంతపురం జిల్లాలో వుంటూ గూడా, ఆ ప్రాంతంలో ప్రాజెక్టు గడితే సంభవించే ముంపు వల్ల రాబోయే ప్రమాదాల్నిగురించి ఆలోచించడమూ, దక్షిణ భారతదేశంలో వుంటూ అస్సాంలోని వుల్ఫా తీవ్రవాదులచేత జిక్కి చిక్కి బిక్కరించే తెలుగు యువకుడి కథ రాయడమూ, యిరవైవొకటో శతాబ్దంలో వుంటూ భారతదేశ విభజన సందర్భంలో సరిహద్దుల్లో జరిగిన దురన్యాయాల్ని చిత్రించడమూ - యివన్నీ పాఠకుడ్ని ఆశ్చర్య చకితుల్ని గావించే అంశాలు యిలాంటి విషయాల్ని గురించి ఆలోచించడానికి రచయితకు సమకాలీన సాంఘిక పరిస్థితుల్ని అధిగమించి వో సార్వజనీనమైన సత్యాన్ని ఆవిష్కరించాలనే తపన వుండడం ముఖ్యం అటువంటి విలక్షణమైన చూపుకు దాఖలా - 'బందీ' అన్న కథ

కమ్యూనిజం ప్రభావంలో పడ్డ క్రిష్టియన్ యువకుడొకడు తనను తాను నాస్తికుడిగా ప్రకటించుకుంటాడు అయితే తన తండ్రి మరణించినప్పుడు శవాన్ని ఖననం చేయడం కోసం స్థలం యిప్పించమంటూ వూళ్ళోని పాస్టర్ల వెంట తిరుగుతాడు రకరకాల, మురాలు గట్టుకుని, యెవరి కుంపటిని వాళ్ళు రగిలించుకున్న పాస్టర్లు అతణ్ణి రకరకాలుగా యెద్దేవా చేస్తారే తప్ప సహాయం చేయరు, చివరికో పెద్ద మనిషి మెత్తగా మందలించి సహాయం చేయడంతో అతడికా గండం తప్పుతుంది అయితే యింటికి తానే పెద్దవాడు కావడం వల్ల, యింకా పెళ్ళి కావలసిన చెల్లెళ్ళుండడంచేత అతడికి క్రిష్టియన్ సమాజంలోని సభ్యత్వాన్ని కొనితెచ్చుకోక తప్పని పరిస్థితి యేర్పడుతుంది చివరకు అతను జీసస్ ఫోటోను కొనుక్కొచ్చి యింటి వరండాలో తగిలించుకోవడంతో యీ కథ ముగుస్తుంది మతం అన్నది వ్యక్తిగతమైన నమ్మకం స్థాయినుంచీ సామాజిక దౌష్ట్యంగా మారే ఘోరమైన పరిణామాన్ని యీ కథలో దేవపుత్ర అద్భుతంగా చిత్రిస్తారు

కథా రచయితగా దేవపుత్రలోని పరిణతిని చూపే మరో కథ "మన్ను తిన్న

మనిషి' రైతుకూ, భూమికీ మధ్య వుండే అవినాభావ సంబంధాన్ని యీ కథలో కరుణ రసాత్మకంగా చిత్రిస్తాడు రచయిత వూళ్ళో యెందుకూ పనికిరాకుండా వున్న చేనును అమ్మి బళ్ళారిలో యిల్లు కట్టుకోవాలన్నది రామచంద్రుడి వుద్దేశం పండినా, పండకపోయినా భూమి తల్లి లాంటిదనీ, దాన్ని అమ్మడమన్నది కృతజ్ఞత తెలియని మనుషులు చేసే పననీ రామచంద్రుడి తండ్రి చెన్నప్ప విశ్వాసం యెంతకూ తన మాట వినని తండ్రితో తనకు రావలసిన భాగం తనకివ్వమని తెగేసి చెబుతాడు రామచంద్రుడు తన మాట యెప్పుడూ జవదాటని కొడుకు అంతమాట అడిగేసరికి చెన్నప్ప నిలువునా కూలిపోతాడు మరునాటి ఉదయానికల్లా వాడిపోయిన వేరుశనగ చేన్లో, తల్లి యెదమీద ఆదమరిచి నిద్రిస్తున్న పసివాడిలా నిర్విచారంగా, నిర్మలంగా పడివున్న చెన్నప్ప శవం కనిపిస్తుంది యీ కథలో రచయిత యేవొక్క వ్యక్తి పక్షానా నిలబడడు పరిస్థితుల చేతుల్లో బానిసలై పోయిన పాత్రల వాదనల్లోని సామంజస్యాన్ని స్పష్టంగా విశదీకరిస్తాడు. రచయిత తాటస్థ్యాన్ని వహించడం చేత యీ కథ గొప్పగా రూపొందింది డా॥ కేశవరెడ్డి నవలిక 'మూగవాని పిల్లనగ్రోవి' ని తలపించే మంచి కథ యిది.

దేవపుత్ర 'ఏకాకినౌక చప్పుడు' అన్న మరో కథలో గూడా పరిణితిచెందిన తాటస్థ్యాన్ని వహిస్తూ కథ చెబుతాడు చావు బ్రతుకుల్లో వున్న తండ్రిని చూడ్డం కోసం ఉద్యోగాల మీద దేశాలు పట్టిపోయిన పిల్లలందరూ యెక్కడ పనులక్కడ వదిలిపెట్టి స్వగ్రామానికి వస్తారు తీరా అందరూ వచ్చిన తర్వాత తండ్రియెంతకూ కోమాలోంచీ బయటపడడు చావనూ చావడు. పిల్లలు యెన్నాళ్ళని అలా ఉద్యోగాలు వదలిపెట్టి వేచిచూడగలరు? ప్రేమానుబంధాల్ని మించిన జీవన పోరాటాల్ని విస్మరించడం యెవరిచేతనవుతుంది? చివరకు పిల్లలందరూ తిరిగి వెళ్ళిపోయిన తర్వాత ముసలాయనకు సపర్యలు చేసే బాధ్యత వొంటరిదైన ముసలి భార్యపైన పడుతుంది. వొంటరి తనాన్నీ, నిస్సహాయతనూ భరించలేని ముసలావిడ కోమాలోవున్న భర్త శరీరంపైన పడి కళ్ళు మూసేస్తుంది. ఆమె చావును పట్టించుకునే దిక్కోవరూ వుండరు. దారుణమైన ఆధునిక మానవ జీవితం ప్రేమాభిమానాలకూ, సక్రమమైన మానవ సంబంధాలకూ ఆస్కార మివ్వదు. యీ ఆర్థిక వలయంలో ప్రతివ్యక్తిదీ 'ఏకాకినౌక చప్పుడే!'

బందీ, ఏకాకినౌక చప్పుడు, మన్నుతిన్న మనిషి - అనే మూడు కథలూ దేవపుత్రలోని కథా రచయిత వాడినీ వేడినీ పాఠకులకు స్పష్టంగా రుచి చూపిస్తాయి. కథను కళాస్వరూపంగా "మార్చగల నైపుణ్యం దేవపుత్రకు తెలుసునన్న సంగతిని నిరూపిస్తాయి. అయితే యెందుకాయన చాలా కథలని గబగబా ముక్తసరిగా ముగించేస్తారో అర్థంగాదు. కథా రచయిత యెప్పుడూ ఎఫెక్టు మీద దృష్టిని కేంద్రీకరించాలని ప్రఖ్యాత అమెరికన్ కథకుడు యెడ్గార్ యెలాన్ పో అంటాడు. కథకుడు తనపైన ప్రభావం చూపెట్టిన అంశాన్ని, అదే విధమైన ప్రభావం పాఠకుడికి కలిగేలా, యేమాత్రం ప్రభావాన్నీ చేజార నివ్వకుండా పాఠకుడికి బట్వాడా చేయడం అత్యవసరమని ఆయన భావిస్తాడు. యీ విధమైన ఎఫెక్టు సాధించడమైన దేవపుత్ర శ్రద్ధవహిస్తే బావుండునని ప్రతి పాఠకుడు ఆకాంక్షిస్తాడు. 'అరుగ్లాసులు' కథా సంపుటికి ముందుమాట రాసిన వల్లంపాటి వెంకటసుబ్బయ్య

గారు గూడా "కధకు క్లుప్తత ప్రాణప్రదమైన అంశమే ననటానికి సందేహం లేదు కానీ అనుభూతి రూపొందటానికి అవసరమైన అన్ని వివరాలూ కథలో ఉండి తీరాలి కథకు అవసరమైన నేపధ్యాన్ని మరింత లోతుగా, వివరంగా పాత్రల ప్రవర్తనను చిత్రించివుంటే ఈ కథలు నిండుగా రూపొంది ఉండేవని నేను భావిస్తున్నాను" అంటారు

రచయితగా దేవపుత్ర దృష్టి నిశితమైంది స్వచ్ఛమైంది అదెప్పుడూ మంచిని గుర్తిస్తుంది. చెడును వెంటనే పట్టుకుని చెండాడుతుంది 'అరుగ్లాసులు' సంపుటానికి రాసిన ముందుమాటలో వల్లంపాటిగారు "జీవితం ఎలాఉందో తెలుసుకున్న దేవపుత్ర అలా ఎందుకుందో ఆలోచించవలసి ఉంది జీవితం ఎందుకు మారాలో, ఎలా మారాలో తేల్చుకోవల్సిన అవసరం కూడా ఉంది" అంటారు 'ఏకాకి నౌక చప్పుడు' సంపుటంలోని కొన్ని కథలలో దేవపుత్ర అటువంటి పరిణితిని అందుకున్నారు అయితే ఆయన రావలసిన అనివార్యమైన మార్పును సూచన మాత్రంగా తెలుపుతాడు ప్రతీకాత్మకంగా తెలియజేస్తాడు కళాత్మకమైన కథను ప్రచార సాధనంగా మార్చుకోవడం ప్రమాదమని దేవపుత్ర సక్రమంగానే గ్రహించారు

యేయే కథను యెవరి దృక్కోణంలోంచి చెబితే బావుంటుందో దేవపుత్రకు బాగా తెలుసు "అరుగ్లాసులు' కథను జైలుగార్డు దృష్టికోణం లోంచి చెప్పడం వల్లనే కథ వుద్దేశం నెరవేరుతుంది ఆయన స్త్రీ దృక్కణంనుంచే గాకుండా, ప్రథమ పురుష దృక్కోణంలోంచి, సర్వసాక్షి దృక్కోణంలోంచీ గూడా కథలు రాయగలడు యే పద్ధతిలో కథ చెప్పినా సహజంగా చెప్పగలగడం ఆయన విశిష్టత. అయితే ప్రథమ పురుష దృక్కోణంలోంచి కథ చెబుతున్నప్పుడు రచయిత ఆదమరచి కథకుడితో ఐడెంటిఫై అయిపోతున్నట్టూ కథకు అనవసరమైన అనేక విషయాలు చెబుతున్నట్లూ పాఠకుడు పసిగట్టే ప్రమాద మొకటి మాత్రం యెదురవుతుంది

దేవపుత్ర కథలన్నీ చెప్పే కథలే (Feeling Stories)! చూపే కథలు గావు (showing Stories) చెప్పే పద్ధతి అనూచానంగా వస్తున్న సంప్రదాయకమైన పద్ధతి. చెబుతున్న విషయం పట్లపాఠకునిలో వో రకమైన నమ్మకాన్ని కలిగించే శక్తి యీ పద్ధతి కుంది యీ పద్ధతిలో యే విషయాన్నయినా కథగా మలచడం రచయితకు గూడా అనుకూలంగా వుంటుంది కానీ, ఆధునిక మాధ్యమాలైన సినిమా, టీవీలు వచ్చాక చూపే పద్ధతి బలమైన పద్ధతిగా అవతరించింది యీ పద్ధతిలో రచయిత వీలనయింతవరకూ కథకు బయటే వుండి కథను పాఠకుడి మనోనేత్రం ముందు ప్రదర్శిస్తాడు యీ పద్ధతిలో రాసిన కథను చదివిన పాఠకుడిలో బలమైన అనుభూతి కలుగుతుంది దేవపుత్ర రాసిన చాలా కథల్లో పాఠకుడికి రావలసినంత అనుభూతి కలగకపోవడానికి ఆయన యెన్నుకున్న చెప్పే పద్ధతిగూడా కొంతవరకూ కారణమే! పైగా యీ పద్ధతిలో శిల్ప విషయంగా ప్రయోగాలు చేయవలసిన అవసరమూ, ఆస్కారమూ పెద్దగా వుండవు రకరకాల శిల్పవిన్యాసాలు చేయడమన్న ధోరణిపైన దేవపుత్రకు మక్కువ లేదు. ఆయన అనుసరించినదంతా 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' మాత్రమే!

కథను యెక్కడ ప్రారంభించాలో, యెలా ముగించాలో దేవపుత్రకు తెలుసు. 'సమిధలు', 'ఏకాకినౌక చప్పుడు', 'మన్నుతిన్న మనిషి' మొదలైన కథలు అందుకు వుదాహరణలు అయితే కథతో సంబంధంలేని వృత్తాంతంతో మొదలయ్యే కథలు కూడా కొన్ని రాశారాయన 'ఇరుకు', 'బందీ'వంటి కథలలో యిటువంటి ధోరణి కనిపిస్తుంది పాఠకుడిలో కథా ప్రారంభంనుంచీ వొకే రకమైన మూడ్‌ను పెంపొందించడం అవసరం అయితే పనిగట్టుకుని మూడ్‌ను చెడపడమూ, సీరియస్ కథలను కావాలని హాస్యరసంతో ప్రారంభించడమూ గూడా విలక్షణతే ననుకుంటే దేవపుత్రలో అటువంటి విలక్షణత చాలాచోట్ల కనబడుతుంది.

అనంతపురం మాండలిక భాషను అత్యద్భుతంగా గ్రంథస్థం చేసిన కొద్దిమందిలో దేవపుత్రవొకరు ఆయన కథల్లో ఆయన పాత్రల మాటల్లో అనంతపురం మట్టివాసన స్పష్టంగా కనబడుతుంది ఆయా పాత్రలు మాట్లాడు తుంటే ఆ ప్రాంతపు వ్యక్తులతో కలసినట్టే అనిపిస్తుంది దేవపుత్ర రాసిన కథలన్నింటిలోనూ కృత్రిమమైన పాత్రలెక్కడా కనిపించవు. రచయితకు పాత్రను గురించిన పూర్వాపరాలన్నీ స్పష్టంగా, సక్రమంగా తెలిసినప్పుడు నిజమైన పాత్రలు (Real characters) రూపొందుతాయని E M Forster అంటాడు. దేవపుత్ర కథల్లోని పాత్రలన్నీ నిజమైన పాత్రలే!

దళిత రచనలు గావించినా దేవపుత్ర కేవలం దళిత రచయిత మాత్రమే గాదు రాజ్యహింస గురించి చాలా కథల్లో చిత్రించినా ఆయన కేవలం కమ్యూనిస్టు రచయిత మాత్రమే కాదు గుమాస్తాల జీవితం గురించి అనేకానేక వ్యంగ్య రచనలు చేసినా ఆయన కేవలం హాస్య రచయిత మాత్రమే కాదు. రచయితపైన ప్రత్యేకించి యేదో వొకముద్ర వేయడం పొరబాటని ఆధునిక విమర్శకులంటారు. అయితే అన్ని రకాల కథలనూ - అన్నీ అభ్యుదయాన్ని కాంక్షించేవే అయినా - రాయడంవల్ల రచయిత అంతరంగమేమిటో అర్థం గాకుండా పాఠకుడు చీకాకుపడే అవకాశం ఉంది. రచయిత నిజమైన వ్యక్తిత్వమేమిటో పాఠకుడికి స్పష్టంగా, తేలికగా అర్థమయినప్పుడు యీ ప్రమాదముండదు. అయితే రకరకాల పరిస్థితులనూ, రకరకాల దృక్కోణాలనూ చూపెట్టినప్పుడు పాఠకుడు అయోమయానికి గురికావచ్చు యీ కథలను పత్రికల్లో వేరువేరుగా చదివినప్పుడు యీ ప్రమాదం వుండదు అయితే రచయిత కథల సంపుటం వెలువడినప్పుడు, అతను రాసిన కథలన్నింటినీ వొకేసారి చదువుతున్నప్పుడు, పాఠకుడీ రకమైన గజిబిజికి గురయ్యే అవకాశం వుంటుంది

సమకాలీన సమాజపు అన్ని పార్శ్వాలనూ తన కథల్లో నిక్షిప్తం చేయడం వల్ల చిలుకూరి దేవపుత్రకు ఆధునిక యువరచయితలలో ప్రముఖ స్థానం యేర్పడింది కథాశిల్పం పైన ఆయన మరికొంత శ్రద్ధ వహించి 'ఏకాకి నౌక చప్పుడు', 'మన్నుతిన్న మనిషి', 'బందీ' వంటి మంచి కథలు మరి పెక్కింటిని రాస్తారని సహృదయ పాఠకలోకం ఆశిస్తోంది

# తోలేటి జగన్మోహనరావు

♦ రెంటాల జయదేవ ♦

రచన అనేది రచయిత మనోవ్యాపార ఫలమే కాబట్టి, అది సమాజాన్ని ఎంత బాగా ప్రతిబింబించినా, రచయిత మానసిక స్థితిగతులకు పూర్తిగా దూరంగా మాత్రం జరగదు అందుకే, రచయితనూ, అతని మానసిక బల, దౌర్బల్యాలనూ అంచనా వేయడానికి అతని రచనలే ఆధారం కథకుడిగా తోలేటి జగన్మోహనరావు స్థాయిని అంచనా కట్టి, స్థానాన్ని ఖరారు చేస్తున్నప్పుడు సమకాలికుల్లో సమవయస్కులైన చాలా మంది కన్నా ఆయన విలక్షణ రచయిత అని అర్థమవుతుంది ఇప్పటి వరకు వెలువడ్డ ఆయన రెండు కథా సంపుటాలు (తోలేటి జగన్మోహనరావు కథలు, లక్ష్మీ కటాక్షం) ఇందుకు సాక్ష్యాలు 1995 మార్చిలో తొలిసారిగా ముద్రణ జరుపుకొన్న తోలేటి జగన్మోహనరావు కథలు సంపుటిలో పది కథలుంటే, 2002 జూన్‌లో జనం ముందుకు వచ్చిన లక్ష్మీ కటాక్షంలో 14 కథలు చోటు చేసుకున్నాయి రాయడం మొదలు పెట్టిన 12 ఏళ్ళ తరువాత, ఆఖరికి 1976లో తొలికథ మనుషులు చేసిన దేవుళ్ళారా! ప్రచురితం కావడంతో కథకుడిగా లోకానికి తెలిసిన తోలేటి రచయితగా రజతోత్సవం జరుపుకొన్నారు

అయితే, ఈ పాతికేళ్ళలో ప్రచురితమైన ఆయన కథలు ఓ అర్ధశతం మాత్రమే మొదట కొన్నాళ్ళు కవిత్వం రాయడానికి ప్రయత్నించి, ఆ తరువాత కథల వైపు మళ్ళిన తోలేటి తన రచనా జీవితపు పూర్వ సంధ్యలో కథా రచయిత "రావిశాస్త్రి" అభిమానిగా "రాస్తే ఆయన లాగానే రాయాలి" అనుకొని, కొన్నాళ్ళు ఆ ట్రాన్స్‌లో గడిపారు తెలిసిన జీవితం గురించే తప్ప తెలియని జీవితం గరించి రాయలేమని తరువాతి కాలంలో గ్రహించి, రావిశాస్త్రి ప్రభావం నుంచి బయటపడ్డారు "1967 -71 ప్రాంతంలో నక్సల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రభావంతో అతివాద రాజకీయాలవైపు" ఆకర్షితుడైన తోలేటి ఆ తరువాత "హాస్య రచనలు చెయ్యడం వర్గద్రోహం" అనుకొన్న దశ నుంచి "వయసుతో, అనుభవంతో" అతివాద భావాల తీవ్రత తగ్గిన దశకు ప్రయాణించారు అలాంటి సమయంలో ఆయన యాదృచ్ఛికంగా పి జి. ఓడ్ హౌస్ రచనలు చదవడం, వాటితో ప్రభావితం కావడం తటస్థించింది ఆ ప్రభావం ఆయన మీద అపరిమితంగా పడిందనడానికి ఆయనకంటూ ఇప్పుడు ఓ ప్రత్యేకమైన పేరు తెచ్చిపెట్టిన హాస్య, వ్యంగ్య కథలే సాక్ష్యం 1995లో వచ్చిన తోలేటి తొలి కథల సంపుటి తోలేటి జగన్మోహనరావు కథలులో కన్నా 2002 జూన్‌లో వచ్చిన లక్ష్మీ కటాక్షం సంపుటిలో ఆ విషయం మనకు స్పష్టమవుతుంది

## 1. సమకాలీన సమాజం - రాజకీయాలు

కాలంతోపాటు క్రమంగా తోలేటి కలమూ పదును దేరిందన్నది ఈ రెండు సంపుటాల్లోని కథలను చదువుతున్నప్పుడు అర్థమవుతుంది. సమయానికి తగ్గట్లు పార్టీలు మార్చి, 'ఛీ' అన్న జనంతోనే 'జై' కొట్టించుకొనే రాజకీయ ఊసరవెల్లుల్నీ, వారి చేతుల్లో సదా మోసపోయే జనాన్నీ చూపే కథ 'జనం' (ప్రచురణ 2 మే, 1984) ఇక అవినీతి అన్యాయం, అక్రమాలు పెరిగిపోయిన నేటి స్వతంత్ర భారతావనిని చూస్తే, ఆఖరికి సత్యాహింసలను ప్రవచించిన ఆ జాతిపిత సైతం సాయుధుడై సంచరిస్తాడనే ఊహకు కథారూపం 'సత్యాగ్రహి' (ఆగస్టు 1989) ప్రజలొక గొర్రెలమంద అని చెప్పడానికి రాశారన్నట్లున్న 'జనం' కథ రచయితగా తొలి రోజుల్లో తోలేటి రచనా నైపుణ్యానికి ఉన్న పరిమితుల్ని తెలియజేస్తుంది అలాగే, ఓ ఫ్యాంటసీ మాత్రమే అయిన 'సత్యాగ్రహి' కథలో చెప్పదలుచుకున్న అంశం మంచిదే అయితే, అది ఓ డిటెక్టివ్ కథ స్థాయిని మించి ఎదగలేకపోవడం అప్పటికింకా మెరుగుపడని తోలేటి కథన నైపుణ్యాన్ని గుర్తుచేస్తుంది చెప్ప దలుచుకున్న అంశాన్ని రచయిత మోటుగా, వాచ్యం చేసి చెప్పేయడం ఈ రెండు కథల్లోనూ ఎదురయ్యే ప్రధాన లోపం

అయితే, సమకాలీన వ్యవస్థనూ, రాజకీయ అంశాలనే కేంద్రంగా తీసుకున్నప్పటికీ, 'నర్తనశాల (అను) బామ్మర్దిగారి అంతిమయాత్ర' (28 మార్చి, 1990) దగ్గరకొచ్చేసరికి కొత్త తోలేటి కనిపిస్తాడు నవ్వులు విరబూయిస్తూనే, అంతర్లీనంగా అసలు విషయాన్ని ఎంత అద్భుతంగా చెప్పవచ్చో తోలేటి తొలి కథా సంపుటలోని చివరి కథ అయిన ఈ 'నర్తనశాల....' స్పష్టం చేస్తుంది. మన రాజకీయ నాయకుల కుతంత్రాలనూ, ఎన్నికల రాజకీయాలనూ హాస్య స్ఫోరకంగానే నగ్నంగా ఆవిష్కరిస్తుంది. తొలినాటి రాజకీయ కథల కన్నా రచనలో తోలేటి చేయి తిరిగిందని ఈ కథ స్పష్టం చేస్తుంది. వయసులో ఉన్న ఆడపిల్లతో సరసమాడ బోయి చావుదెబ్బలు తిన్న బావమరిది పిచ్చయ్య మూలంగా, మరో మూడు రోజుల్లో ఎన్నికల్లో డిపాజిట్ దక్కదని కోటయ్య మంత్రికి మాచెడ్డ దిగులు పట్టుకుంటుంది రాజకీయాల్లో వృద్ధ జంబుకమైన అప్పాజీ అప్పుడు చెప్పిన ఉపాయం, చేసిన తంత్రమే ఈ కథ మంచివాడైన ప్రత్యర్థి డాక్టర్ రావును ఎన్నికల్లో ఓడించడం కోసం 'కోడికూత' పత్రికలో నానా అవాకులూ చెవాకులూ రాయిస్తారు బావమరిదిని అతనే చంపించ బోయాడని జనాన్ని నమ్మిస్తారు అలా ఆఖరికి ఎన్నికల్లో కోటయ్యను భారీ మెజారిటీతో గెలిపిస్తాడు - అప్పాజీ.

"సీకట్లో ఎలుగు చూసేవోడే పొలిటీషియను" (పేజీ 126) అని ఈ కథలో అప్పాజీ నోటి వెంట ఓ అక్షరసత్యాన్ని పలికిస్తాడు రచయిత. ఇక ఇదే కథ చివరలో అప్పాజీ నోటే రాజకీయాల గురించి రచయిత చేయించిన వ్యాఖ్యలు నిత్యసత్యాలు. ఆ వ్యాఖ్యలు ఇవీ

" కుడి చేత్తో వోటడిగితే 'చీ ఎధవా' అని వోటరు సీపురు తిరగస్తే, ప్లేటు ఫిరాయించి పార్టీ మార్చి ఎడం చేత్తో అడగాలి. ఆడు వోటు ఏ పార్టీకేసినా పవర్లో ఉండేది మనవే౯ కదా! ఎర్రిమొుకం వోటరు, ఆడి కాగితం

ముక్కకి గవర్నమెంటడిపోయిందనుకుంటాడు గాని యాక్టర్లు మారినా నాటకం అదేనని ఆడికి తెలీదు

ఇంక యాక్టర్లెల్లాంటోళ్ళు? నవరసాలు ఏకకాలంలో కురిపించగల నట సార్వభౌములూ, నట చక్రవర్తులూనూ

ఒకడు అమ్మా, బాబూ అని చేతులట్టుకుంటే, ఇంకోడు తమ్ముడూ, సెల్లీ అని కాళ్ళట్టుకుంటాడు ఒకడు బారతమాతంటే, ఇంకోడు తెలుగుతల్లంటాడు. ఆడు డెవలెప్మెంటంటే ఈడు కరప్షనంటాడు ఈడు డెమోక్రసీ అంటే ఆడు సోషలిజం అంటాడు ఆడు గరీబీ హటావో అంటే ఈడు గాడిద గుడ్డంటాడు

ఈపు మీదక్కే వో డొకడు, అణ్ణి దింపేసి నెత్తికెక్కుతా ననేవోడు ఇంకొకడు! ఒకడు డాకూ, ఇంకోడు మహా డాకూ! ఇంక వోటరుగాడి బుర్ర పోకెంజేస్తది?" (పేజీ 143)

ఇలా సమకాలీన సామాజిక అంశాలను కథలో జొప్పిస్తూ, వాటిపై తన వ్యాఖ్యానాన్ని పాత్రలతోనే పలికింపజేయడం తోలేటి రచనలు చాలా వాటిల్లో కనిపిస్తుంది.

## 2. రచనలు - రచయితలు

సమకాలీన సామాజిక అంశాలతో పాటు రచనా వ్యాసంగం మీద కూడా తోలేటికి కొన్ని కచ్చితమైన అభిప్రాయాలు, ఆదర్శాలు ఉన్నాయి తోలేటి తొలి కథల సంపుటిలోని 'మనసును మలిచే శిల్పి'లో ఆ సంగతి స్పష్టంగానూ, 'ప్రశ్న'లో ప్రస్తావరీత్యానూ, రెండో కథల సంపుటిలోని 'సీరియల్ చేసిన పెళ్ళి'లో హాస్యం మాటున అంతర్గంతంగానూ అవి కనిపిస్తాయి పేరు ప్రతిష్ఠలు, పైసలే పరమావధిగా సంచలనాత్మక రచనలు చేస్తే, వాటి దుష్ప్రభావం ఎలా వుంటుందో తెలుపుతుంది - 'మనసును మలిచే శిల్పి' (16 ఏప్రిల్ 1987) "కళ కళ కోసమా, కళ ప్రజల కోసమా అని చర్చించే వారి మొహం మీద ఓ గుద్దు గుద్ది, కళ కూడా వ్యాపారమేనని చాటిచెప్పి" (పేజీ 61) పాఠకుల బలహీనతలతో ఆడుకొంటూ రచనలు చేయడం మురళీధర్ లాంటి రచయితలకు అలవాటు ఆ రచనలు వారికి పేరు, డబ్బు అందించడం ఖాయం. కానీ, సెక్సు, హింసల మేళవింపుతో తయారైన ఆ క్షుద్ర రచనల ప్రభావంలో చివరకు మురళీధర్ పదిహేనేళ్ళ కొడుకు చిరంజీవి హంతకుడుగా మారినప్పుడు ఆ తప్పెవరిది? "పాఠకుడి మనసును మంచి వైపు తిప్పడానికి ప్రయత్నించాలే తప్ప, చెడును ఆకర్షణీయంగా చిత్రించకూడ"దని (పేజీ 70) మనసును మలిచే శిల్పులైన రచయితలు గ్రహించాలి. లేదంటే, పసి వయసులోనే మనసు చెడి చిరంజీవి లాంటివారు పెడదోవ పట్టిన పాపం - ఆ రచయితలదీ, రచనలదేనని తోలేటి తేల్చి చెబుతారు

నిజానికి, రచనా జీవితారంభంలో 'ఆరు సారా కథల' ప్రభావంతో "రాస్తే రావిశాస్త్రిగారి లాగే రాయాలని" అనుకొన్న తోలేటి తరువాత ఆయనలాగే రాయడానికీ, అదీ - తనకు తెలియని విషయాల గురించి రాయడానికీ ప్రయత్నించి విఫలమయ్యారు. ఆ మాట ఆయనే నిజాయితీగా చెప్పుకొన్నారు

"నేను, మంచో, చెడో నేను రాసినట్లుగానో రాయగలను నేనెప్పటికీ రావిశాస్త్రి గారిలా రాయలేనని స్పష్టమైంది దానితో, రావిశాస్త్రిగారి ప్రభావం నుంచి తప్పించుకున్నాను ఒక గొప్ప రచయిత, తన అద్భుత రచనాశక్తితో పాఠకుల్ని ఉక్కిరిబిక్కిరి చేసి, ఇలా తప్ప మరోలా రాయడానికి వీలు లేదనే భావం కలిగిస్తాడు వారిని అనుకరించడం కాక, వారి వల్ల ఉత్తేజితులై ఎవరికివారు తమకు వచ్చిన రీతిలో రచనలు చెయ్యడమే మంచిదన్న అభిప్రాయాని కొచ్చాను" అని తోలేటి పేర్కొన్నారు సరిగ్గా, 'మనసును మలిచే శిల్పి'తో రచయిత అయిన మురళీధర్ పాత్ర గురించి వివరణలో తోలేటి స్వీయ అనుభవాల కంఠస్వరం వినిపిస్తుంది. ఆ వర్ణన ఇలా సాగుతుంది

" కొంతకాలం అతను 'సారా', 'సారో' కథల్ని - ఆ రకం కథల్ని ప్రజలు బాగా ఆదరిస్తున్న కాలంలో - అనుకరిస్తూ కథలు రాశాడు కానీ, అతను కీర్తి కోసమే కాని ఆర్తితో రచనలు చెయ్యకపోవడం వలన నిజాయితీ లోపించి, కృత్రిమంగా, పేలవంగా కనపించేవి అతని రచనలు. అటువంటి రచనలు సమాజాన్ని నిశితంగా పరిశీలించేవారే చెయ్యగలరు కాని కేవలం గుర్తింపు కోసం తహతహలాడే రచయితలు చెయ్యలేరు" (పేజీ 61)

ఆ మధ్య కొన్నేళ్ళ కితం దాకా సాగిన పరిశోధనాత్మక రచనల ధోరణి మీద కూడా 'ప్రశ్న' కథలో తోలేటి బాణం సంధించారు మనలో అధిక శాతం మందికి వున్న నమ్మకాల తార్కికతను ప్రశ్నించే కథ 'ప్రశ్న'. సీరియస్‌గా సాగే ఈ కథలో మనం నమ్మే కొన్ని మౌలిక అంశాల మీద పాత్రల మధ్య చర్చపెట్టి, పాఠకులను సైతం ఆలోచనలోకి నెడతారు తోలేటి. 'అడుగడుక్కీ ఒళ్ళు జలదరించే బ్రహ్మాండమైన సస్పెన్సు" తో, తలా తోకా లేని క్షుద్ర రచనలతో, "ప్రస్తుతం తెలుగుయువ రచయితల్లో" పెద్ద పేరు సంపాదించుకొన్న డీ.వీ.పీ. (పాఠకులు అభిమానంతో అలా పిలుచుకొనే దేవీ వరప్రసాద్) పరిశోధనాత్మక కథల్లోని డొల్లతనాన్ని ఎత్తి చూపుతుందీ కథ. నిజానికి,.. "దేవుడు, దయ్యం, ఆత్మ, పరమాత్మ, స్వర్గం, నరకం - ఇవన్నీ కేవలం విశ్వాసం మీదే ఆధారపడి ఉన్నాయా? వేల సంవత్సరాల సంస్కృతి మనల్ని నమ్మడానికి కండిషన్ చెయ్యడం వలన మనం ప్రశ్నించకుండా నమ్ముతున్నామే కాని, అంతకు మించి ఏమీ లేదా?" (పేజీ 97) - తేలికగా జవాబు దొరకని ఇలాంటి ప్రశ్నలే ఈ కథకు అంతఃసూత్రాలు అయితే, అంతర్లీనంగా మాత్రం ఆంధ్రుల అభిమాన సంచలన రచయితలు "అనేక వ్యయప్రయాసలకు లోనై, అనేక పరిశోధనలు (?) చేసి," మాస్ స్టుపిడిటీని సాకుగా తీసుకొని రాసే కథలపైన తిరస్కార భావం కనిపిస్తుంది.

తోలేటి రెండో కథా సంపుటిలోని 'సీరియల్ చేసిన పెళ్ళి' (29 ఆగస్టు 1990) రచనల పిచ్చి, పిచ్చి రచనల పర్యవసానాల్ని హాస్యభరితంగా చెబుతుంది. "టెన్త్ రెండు సార్లు తన్ని" ఇంట్లో కూర్చున్న కొత్తపేట - కె వరలక్ష్మి "ఆంధ్రుల అభిమాన రచయితల అభిమాన పాఠకురాలు. సస్పెన్స్ సీరియల్స్‌కు మహారాణి పోషకురాలు" సస్పెన్స్ కింగ్ డీ.వీ.పీ పత్రికల్లో రాసే సీరియలంటే "కళ్ళు కాకరకాయలు" చేసుకొని ఎదురు చూసే మేనమామ కూతురు వరలక్ష్మిని

పెళ్ళాడటం చిట్టిబాబుకు అస్సలు ఇష్టం లేదు అలాంటి చిట్టిబాబు, ఆఖరికి ఆ వరాహలక్ష్మినే (అతను ఆమె గురించి చెప్పేది అలానే!) పెళ్ళి చేసుకోవడానికి ఓ వెధవ సస్పెన్స్ సీరియల్ కారణమవుతుంది "స్టీరియోఫోనిక్ సౌండ్‌తో స్కోపు సినిమా చూసినట్టు కళ్ళకు కట్టినట్లుండే ఆడియో - విజువల్ సీరియల్స్ తెగ చదివిన వరలక్ష్మి "పాఠకురాలు ముదిరితే రచయిత్రి అవుతుం"దనే కొత్త సామెతను నిజం చేస్తుంది ఎక్కడా అచ్చుకు నోచుకోని సైంటిఫిక్, హార్రర్, సస్పెన్స్ మిస్టరీ నవలలు రాస్తూ, చిట్టిబాబు జీవితాన్ని "మూడు కథలూ, ఆరు సీరియల్స్" గా చిన్నాభిన్నం చేయడంతో కథ ముగుస్తుంది ఆద్యంతం హాస్యరస ప్రధానంగా సాగినా, తోలేటి ఈ వ్యంగ్యాస్త్రాన్ని సంధించింది - సస్పెన్స్ కింగులుగా పేరు తెచ్చుకున్న కొందరు క్షుద్ర సాహిత్య స్రష్టల మీదే!

3 మూఢభక్తి - భక్తి వ్యాపారం

మొత్తానికి, 1990 లకి వచ్చే సరికల్లా రచయితగా శైశవావస్థ నుంచి బయటపడ్డారు - తోలేటి కథలో చెబుతున్న విషయంతో పాటు, చెప్పే విధానం మీద కూడా ఆయన శ్రద్ధ మరింత పెరిగింది ఇందుకు ఆయనకథలే సాక్ష్యం. గంభీరమైన విషయాల్ని కూడా చేదుగా కాక, తీయగా వ్యంగ్యంగా చెప్పే శైలి ఆయనలో బలపడింది మూఢ విశ్వాసాలు, దొంగబాబాలు, పూనకాలు, వాటిని అడ్డం పెట్టుకొని కొందరాడే నాటకాల విషయంలో జనాన్ని చైతన్య వంతుల్ని చేయడానికి తోలేటి రాసిన 'మనవడి కోసం (అను) భక్త బండెంకట రెడ్డి కథ', శ్రీ వేంకటేశ్వరాంజనేయ యుద్ధం' లాంటి తొలి సంపుటిలోని కథల నుంచి ఆ ఛాయలు ప్రస్ఫుటంగా కనబడతాయి 'మనవడికోసం. ' కథ దొంగబాబాలమీద సెటైర్ "ఆరడుగుల పొడవు, అయిదడుగుల వెడల్పు, టన్ను బరువు - గున్న ఏనుగులా ఉండే" వెంకటరెడ్డి ఉరఫ్ బండెకంట రెడ్డికి లేక లేక కలిగిన ఇద్దరు ఆడ సంతానం - అనంత లక్ష్మీ, అచ్యుత లక్ష్మి ఎదిగిన పెద్దమ్మాయి అనంత లక్ష్మికీ, చెల్లెలి కొడుకు సత్తిరెడ్డికీ పెళ్ళి చేస్తాడు వెంకటరెడ్డి పెళ్ళయి పదేళ్ళయినా తను తాతను కాలేకపోయాననే అన్న బెంగ వెంకటరెడ్డిని పట్టి పీడిస్తుంటుంది అదే సమయంలో ఊళ్ళో వెలుస్తాడు భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యనాథ బాబా ఆయన అనుగ్రహంతోనైనా తనకు మనవడు పుట్టాలని వెంకటరెడ్డి వెంపర్లాడతాడు ఆఖరికి, ఆ దొంగబాబాకు వెంకటరెడ్డి బడితె పూజ చేయడం, ప్రేమలో తొందరపడ్డ రెండో కూతురికి ఆమె ప్రేమించినవాడితోనే పెళ్ళి చేసి, అయిదు నెలలకే పండంటి మనవణ్ణి ఎత్తుకోవడంతో కథ ముగుస్తుంది. ఈ కథలో నిజానికి చెప్పదలచుకున్నది సీరియస్ విషయమైనా, దాన్ని ప్రబోధాలతోనో ఉపన్యాసాలతోనో కాకుండా వ్యంగ్య శైలిలో నడపడం తోలేటి కథన రీతి.

'శ్రీ వేంకటేశ్వరాంజనేయ యుద్ధం' మూఢభక్తి, భక్తి వ్యాపారం, వాటిని ఆశ్రయించి ఎదగాలనుకొనే కుత్సిత రాజకీయ నాయకులకు వ్యంగ్యపు కొరడా దెబ్బ ఇందులో తోలేటి కథన రీతి తన మిగిలిన కథల కన్నా విలక్షణంగా కనిపిస్తుంది. ఉత్తమ పురుషలో, ఎదురుగా ఉన్న పాఠకుణ్ణి ఉద్దేశిస్తూ, జరిగిన సంగతేందో చెబుతున్నట్లుగా సాగుతుంది రచన ఎక్కడా మరే పాత్రా కథలోకి

తొంగి చూడడమో, తన గొంతు వినిపించడమో ఉండదు తోలేటి శిల్ప నైపుణ్యానికి తార్కాణంగా నిలిచే ఈ రచన ఆయన మేలిమి కథల్లో ఒకటి చివరికి దేవుడి పేరును కూడా మన రాజకీయ నాయకమ్మన్యులు తమ స్వార్థానికి ఎలా వాడుకుంటారో చెబుతుంది కథ

తమ స్వలాభానికి దేవుళ్ళను వెలిసేలా చేసి, యుద్ధానికి దిగిన ఇద్దరు రాజకీయవాదులూ ఆఖరికి రాజీపడి ఒకటైపోతారు దాంతో, ఒకరు తాను సృష్టించిన శ్రీవేంకటేశ్వర స్వామిని లేపేస్తే, రెండోవ్యక్తి నిలిపిన ఆంజనేయ స్వామి వారి కళ కూడా మెల్లిమెల్లిగా తగ్గిపోతుంది . "మనిషి దేవుళ్ళని చల్లగా చూసినంత కాలం దేవుడి ప్రభ వెలిగిపోతుంది ఆడు దేవుడి మీద శీతకన్నేస్తే, దేవుడి కళ తగ్గిపోక ఏమవుతుందండీ!" (పేజీ 123) అంటూ చివరలో రచయిత అన్న మాటలు ఆలోచింపచేస్తాయి

## 4. వామపక్ష భావజాలం

ఉపాధ్యాయ ఉద్యమంలో పనిచేసి, కమ్యూనిస్టు పార్టీ సానుభూతిపరుడిగా జైలుశిక్ష అనుభవించిన, పుస్తకాల పురుగైన తండ్రి సుబ్బారావు ప్రభావం తోలేటి మీద ప్రగాఢంగానే పడింది "నాలో వామపక్ష భావాలు బలపడడానికి మా నాన్నగారి రాజకీయ జీవితం, నేను చదివిన పుస్తకాలు కారణం" అని తోలేటే చెప్పుకొన్నారు. ఒకానొక సమయంలో అతివాద రాజకీయాల వైపు మొగ్గినా, కాలక్రమంలో వాటికి దూరం జరిగారాయన. అయితే, ఇప్పటికీ ఆయన "నా దృక్పథం మార్క్సిస్టు దృక్పథం" అని నీళ్ళు నమలకుండా చెప్పేస్తారు. తోలేటి రచనలు చదువుతున్నప్పుడు ఆయన మీద కమ్యూనిజం ప్రభావం ప్రబలంగానే ఉందని అర్థమవుతుంది అయితే, ఆయన కథల్లో కొన్ని చోట్ల అది బాహాటంగా కనిపించినా, ఎక్కువ రచనల్లో మాత్రం అంతర్లీనంగా ఉంటూ, ఏదో ఒక చోట తళుక్కున మెరిసి మాయమవుతుంది తరచి చూసినప్పుడు దాన్ని మనం పట్టుకోగలుగుతాం 'పేడియా మావయ్య పొదుపు పథకం' (5 అక్టోబర్, 1984) లో అలాంటి సందర్భం చూడవచ్చు

చూడడానికి ఇది మామూలు హాస్య రచనగా, జీతానికీ జీవితానికీ లంకె కుదరని మధ్యతరగతి కుటుంబ కథా చిత్రణగా కనిపిస్తుంది జీతాలు ఇంటి కప్పు దాకా ఎదిగితే, ధరలు ఆకాశానికి ఎగురుతుంటాయి ఫలితంగా మధ్య తరగతి మానవుడి ఖాతాపుస్తకంలో జమ, ఖర్చుల పద్దులు ఎన్నటికీ తేలవు అందుకే, (వాకింగ్ ఎన్‌సైక్లో) పేడియా మావయ్య రూపొందించిన పొదుపు పథకం కాస్తా చివరకు చతికిలబడుతుంది. కడుపు కట్టుకొని పైసా పైసా పొదుపు చేసినా, ఆ దాస్తున్న డబ్బు సంచీకి అడుగు లేదని అర్థమవుతుంది ఇంత గంభీరమైన విషయాన్నీ తోలేటి ఎక్కడా పట్టు సడలకుండానే హాస్యంగా చెబుతారు ఉత్తమ పురుషలో సాగుతూ, అతిశయించిన వ్యంగ్యంతో నిండిన ఈ కథ పైపై చూపులకు హాస్య కథగానే తోస్తుంది కానీ, పంచదార పూత పూసిన ఈ చేదు మాత్రలో చివరన రచయిత ఇలా ప్రశ్నిస్తాడు "అడ్డు లేకుండా ధరలు పెరుగుతుంటే అందరూ నష్టపోవడంలేదని కొత్తగా లేస్తున్న

సినిమా సెట్టింగుల లాంటి మేడలు చూస్తే తెలుస్తోంది కానీ ఇంతవరకు స్పష్టంగా తెలియనిది ఒక్కటే దేశం అందిరిదీ అయినప్పుడు కొందరు అగాధాల్లోకి ఎలా దిగజారిపోతున్నారో, కొందరు తారాజువ్వల్లా పైపైకి ఎలాఎగర గలుగుతున్నారో నాకు అర్థం కావడం లేదు మీరు మా కంటే బాగా చదువుకున్నవారు లోకం తెలిసిన మేధావులు కదా! మీకేమైనా తెలుస్తోందా? మీకు తెలిస్తే నిజాయితీతో మాకు నిజం చెబుతారా?'' (పేజీ 59) నిజ రూపం దాల్చని సమ సమాజ భావనను అన్యాపదేశంగా ప్రస్తావిస్తున్న ఈ ప్రశ్నకు ఎప్పటికైనా సరైన జవాబు దొరుకుతుందా అన్నది చెప్పడం కష్టమే!

తోలేటి వామపక్ష భావజాలానికి ఆయన తొలి రెండు కథా సంపుటాల్లో సంకలనం కాని 'మహాప్రస్థానం' (జూలై 2001) ఓ చక్కటి ఉదాహరణ సోవియట్ యూనియన్ పతనాంతర పరిస్థితుల మధ్య ఆవేదనకు లోనై ఆయన రాసిన కథ ఇది ఒకప్పుడు కమ్యూనిజాన్ని అభిమానించి, ఆరాధించి, క్రమంగా దూరం జరిగిన తోలేటి - మార్పును ఆహ్వానించేదే మార్క్సిజం అంటూ, దాని పట్ల అచంచల విశ్వాసం ప్రకటిస్తూ, ఆ దిశగా ముందుకు సాగాలంటారు అదే ఈ 'మహాప్రస్థానం' వామపక్షవాదులు రష్యా పాలకులు ప్రవచించిన సామ్యవాదం, దానికి అనుసరించిన దారిలోని తప్పొప్పుల్ని ఈ కథలో వివరించేందుకు రచయిత ప్రయత్నించారు అయితే, సైద్ధాంతిక చర్చతో ముడిపడిన ఈ కథ పాఠకుల మనసుకు ఏ మేరకు ఎక్కింది, ఎంతమంది దృష్టిని ఆకర్షించిందన్నది సందేహమే

## 5. కెమేరాగా కలం

మొదటి కథల సంపుటితో పోలిస్తే, రెండో కథల సంపుటి 'లక్ష్మీ కటాక్షం' దగ్గరకు వచ్చేసరికి రచయితగా తోలేటి సాధించిన పరిణతి, శిల్పంలో, కథన రీతిలో ఆయన సాధించిన స్పష్టత కనిపిస్తాయి. ఒక దృశ్యాన్నో, సంఘటననో వర్ణిస్తున్నప్పుడు కలం కెమేరాగా మారడం తోలేటి రచనల్లో చూడవచ్చు 'ఫాల్' (1994) లో పాత్రల ప్రవేశం, పరితకు వాటిని పరిచయం చేసిన తీరు, 'అన్వేషి' (12 మార్చి, 1997) కొండల్లో బస్సు ప్రయాణం - లాంటివి అందుకు ఉదాహరణ. అసలు సంగతిని అతిశయింపజేసి, వ్యంగ్యమైన టోన్‌లో వినిపించడం కథలో హాస్యం పండించేందుకు చక్కటి సాధనం. "అతిశయోక్తి హాస్యానికి, వ్యంగ్యానికి ప్రాణం'' అని అంగీకరించిన తోలేటి, ఆ సాధనాన్ని తన రచనల్లో చక్కగా ఉపయోగించుకున్నారు అందులో ఆయన నైపుణ్యం 'ఫాల్', 'లక్ష్మీ కటాక్షం' (అక్టోబర్, 1994) తదితర కథల్లో కనిపిస్తుంది 'అలారం గణగణా ఫైరింజన్లా'' మోగుతోందనడం, ఆగని మాటల ప్రవాహాన్ని ప్రస్తావిస్తూ, "ఆయనకు ఆన్ స్విచ్చే కానీ, ఆఫ్ స్విచ్ ఉన్నట్లు లేదు'' అనడం లాంటి వ్యక్తీకరణలు అందులో మచ్చుకు కొన్ని.

సమకాలీన అంశాలమీద తోలేటి విసుర్లు ఎక్కువే! కథలో సందు దొరికినప్పుడల్లా అలాంటివి విసరడానికి ఆయన వెనకాడరు "ప్రేమలో, యుద్ధంలో ఏం చేసినా అది సరైనదే!'' అన్న సూత్రంతో ఎం.కె రావు, తన

స్నేహితుణ్ణి తెలివిగా పక్కకు తప్పించి, తానే సరళను పెళ్లాడిన హాస్య కథనం - 'ఫౌల్' అలాంటి కథలో కూడా రచయిత వీలు చూసుకొని, ఇటీవల పెచ్చు మీరిన 'రన్ ఫర్ పీస్' లాంటి వాటిమీద వ్యంగ్య బాణాలు విసురుతారు దేశం కోసం త్యాగాలు చెయ్యడమో, కష్టపడి పనిచెయ్యడమో కాక, "విశ్వ శాంతికనీ, బాలల దినం అనీ, స్త్రీ విముక్తి అనీ, వాతావరణం కాలుష్యం అనీ" - ప్రతిదానికీ "దేశం కోసం పరిగెట్టడమేమిటో, "పరిగెడితే దేశం ముందుకు ఎలా పోతుందో" అర్థంకాని విషయమని తోలేటి చురక వేస్తారు.

## 6 వస్తు వైవిధ్యం - వ్యంగ్య వైభవం

తోలేటి రచనల్లో, ముఖ్యంగా లక్ష్మీ కటాక్షం సంపుటిలో వస్తు వైవిధ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది బహుళజాతి సంస్థలు, వర్ణవిచక్షణ, అధికార రాజకీయాలు, అవినీతి కుంభకోణాలు, స్త్రీ వాదం, సమకాలీన అంశాలు - ఇలా భిన్నమైన కథా వస్తువులు ఈ సంపుటిలో చోటు చేసుకున్నాయి సరళీకృత ఆర్థిక విధానాల పుణ్యమో, హర్షద్ మోహతా ప్రభావమో కానీ, ఒకానొక దశలో పెచ్చుమీరిన స్టాక్‌మార్కెట్ వేలంవెర్రిని వ్యంగ్యంగా, మనసుకు నాటుకొనేలా చెబుతుంది లక్ష్మీ కటాక్షం (అక్టోబర్, 1994). ఇది ఉత్తమ కథగా జ్యేష్ఠ లిటరరీ ట్రస్టు అవార్డు అందుకుంది కప్పడాలు (జనవరి, 2001) బహుళజాతి సంస్థల దుష్ప్రభావాన్ని వ్యంగ్యంగా ఆవిష్కరించే రచన పైకి చూడడానికి ఇది మామూలు వ్యంగ్య ధోరణి ప్రేమకథ అనిపిస్తుంది. మాలతిని ప్రేమించిన గన్ అలియాస్ గణేశ్ అనే భగ్న ప్రేమికుడి విషాదాన్ని తెలిపే హాస్య కథలా కనిపిస్తుంది కానీ, అంతరాంతరాళాల్లో ఈ కథ ప్రతిపాదన వేరు బహుళజాతి సంస్థల మత్తులో పడి మనలో అత్యధికులం మన దేశీయ ఉత్పత్తుల్ని ఎంత చులకనగా చూస్తున్నామో, దానివల్ల ఎన్ని కుటీర పరిశ్రమలు కునారిల్లు తున్నాయో, ఎన్ని వేలమంది ఉపాధి కోల్పోతున్నారో, మరెన్ని విపరిణామాలు చోటు చేసుకుంటున్నాయో అంతర్లీనంగా చెప్పడం ఈ కథలోని గొప్పదనం ఎంతో సీరియస్ అంశాన్ని పంచదార పూసిన చేదు మాత్రగా రచయిత చెప్పారని అర్థమవుతుంది. కాలే కడుపుకీ, కంప్యూటర్‌కీ లింకు పెట్టాలని చూసే హైటెక్ ముఖ్యమంత్రుల తెలివితేటల్నీ, చరిత్ర చదవడం వృథా అని నమ్మే పాలకుల అమోఘమైన అవగాహననూ సందర్భోచితంగా ప్రస్తావిస్తారు తోలేటి ప్రపంచీకరణ అంటే ఏమిటో, దాని ప్రభావమేమిటో చదువుకున్న వాళ్ళలో సైతం చాలామంది సరళంగా, వివరంగా చెప్పలేకపోవచ్చు. కానీ, ప్రపంచీకరణ విపరిణామాలు మన ఊళ్ళోని అప్పడాల కంపెనీ మీద సైతం ఉంటాయని కప్పడాలు (2001, జనవరి) కథ తెలియజెబుతుంది.

ఇక, వర్ణవిచక్షణ అంశంతో సాగుతుంది వర్ణక్రమాలు (మే, 1997) వర్ణ విచక్షణను ఎత్తి చూపుతూ, తమకు అన్యాయం జరుగుతోందని వెనుకబడిన వర్గాలవారు వాపోతుంటారు. అగ్రవర్ణ దురహంకారాన్ని సమిష్టిగా నిలదీసి, పురోభివృద్ధి దిశగా పయనించాల్సిన ఆ వెనుకబడిన వర్గాలు సైతం తీరా తమదాకా వచ్చినప్పుడు మాత్రం తమలో తాము కూడా ఎక్కువ, తక్కువ కులాలమంటూ తేడా చూపిస్తున్నాయన్నది వాస్తవం. వారిలో వారికి మళ్ళీ

ఇలా వర్ణ విచక్షణ ఉండడాన్ని ఈ కథ ప్రశ్నిస్తుంది "వాళ్ళూ మేమూ ఒకటెలా అవుతాం? వాళ్ళు యండీస్ - మాదిగలు" అంటూ దయామణి నోట వచ్చిన మాట చురుక్కున తగులుతుంది ఈ కథలోనే ఒకచోట, " మీరు చదువు చెప్పకపోయినా ఫరవాలేదు కానీ, మీ కేస్ట్ పాలిటిక్స్ పిల్లల బుర్రలకి ఎక్కించి, వాళ్ళని పాడు చేయకండి ." అంటూ హెడ్మాస్టర్ నోటి వెంట వచ్చేమాట ఇంట్లో తల్లిదండ్రులు, కార్యాలయాల్లో ఉద్యోగులు పాటిస్తే ఎంత బాగుంటుందో కదూ!

చారిత్రక కట్టడాల చారిత్రకత మాటెలా ఉన్నా, వాటి మాటున సాగుతున్న మత విద్వేషాల నర మేధాన్ని ప్రశ్నిస్తుంది 'గోడ' అయోధ్యలోని వివాదాస్పద కట్టడ విధ్వసం నేపథ్యంలో తోలేటి ఈ కథ రాసినట్లు కనిపిస్తుంది ఆత్మకథనాత్మక శైలిలో, ఉత్తమ పురుషలో నడిచే ఈ కథ హిందూ - ముస్లిమ్‌ల మధ్య ఒక అగాథం సృష్టించిన మత శక్తులనూ, మత ప్రాతిపదికపై ప్రజల్ని చీల్చి కొందరికి ప్రత్యేక హక్కులూ సదుపాయాలూ ప్రసాదిస్తున్న లౌకిక రాజ్యాంగాన్నీ, మత విద్వేషాలు రెచ్చగొడుతూ ప్రజల్ని వోటు బ్యాంకుగా వాడుకుంటున్న రాజకీయ నాయకులు - ఇలా ఈ పరిస్థితికి కారణాలనూ, కారకులనూ చర్చలో నిలబెట్టింది మాజీ సైనికుడు జెన్నీ జాక్సన్ తను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన పెంపుడు కుక్క జిమ్మీ కోసం తన బంగ్లా పక్కనే పర్షియన్, హిందూ, యూరోపియన్ వాస్తు శైలుల సమ్మేళనంగా సమాధి కట్టిస్తాడు ఎన్నో ఏళ్ళ కితం నాటి ఆ కట్టడాలే చివరకు మందిర, మసీదుల అలంకరణతో వివాదానికి కేంద్రబిందువయ్యాయని కథ చివరలో సూచన ప్రాయంగా చెప్పడం రచనా శిల్పంలోని చమక్కు అలాగే, సీరియస్ కథా రచనలో (కల్కి, అన్వేషి, అంతం), శిల్పనైపుణ్యం చూపడంలో (విజ్ఞప్తి) రాజకీయాలపై ఆలోచన రేపడంలో 'బహుఛత్రాధిపతి, నారాయణ , నారాయణ) రచయితగా తోలేటి తన ప్రత్యేక ముద్ర చూపారు

## 7. 'మగ' వాద వివాదాలు

అయితే, గంభీరమైన విషయాలను సైతం వ్యంగ్య పద్ధతిలో వ్యాఖ్యానిస్తూ తీయగా చెప్పే తోలేటి శైలి ఒక్కోసారి అందరికీ రుచించకపోవచ్చు అది ఆయన మీద విమర్శలకూ కారణమైంది స్త్రీ వాదం లాంటి సీరియస్ చర్చను సైతం సిల్లీగా మార్చి హాస్యభరిత శైలిలో, కొందరు స్త్రీవాదులకు గట్టిగా తాకేలా రాయడం 'గంగా గౌరీ సంవాదం' (25 ఫిబ్రవరి, 1999)తోపాటు లక్ష్మీ కటాక్షం సంపుటిలో సంకలనం, కానీ మ'గోడు' (జూన్, 1995), జీవిత బంధం (జనవరి, 1997) లాంటి కథల్లో కనిపిస్తుంది 'గంగా గౌరీ సంవాదం' కథే తీసుకుంటే - స్త్రీ వాదంలోని కొన్ని అవాంఛనీయ వైఖరుల్నీ, స్త్రీవాదం అసలుతత్వాన్నీ అర్థం చేసుకోకుండా స్త్రీ వాదులమనుకొనే కొందరు అనుసరిస్తున్న జీవన విధానాన్నీ ఈ కథలో ఎత్తి చూపడం రచయిత లక్ష్యం ఇందుకోసం తెలుగు వారి జానపద గేయాల్లో సుప్రసిద్ధ 'గంగా గౌరీ సంవా'దాన్నే కథకు శీర్షికగా ఎంచుకోవడం ద్వారా తోలేటి ముందుగా పాఠకుడి దృష్టిని ఆకర్షిస్తారు ఫెమినిస్టులమనుకొనే గంగ, గౌరీ, - అనే ఇద్దరు స్త్రీలు పరస్పరం రాసుకున్న

రెండే రెండు ఉత్తరాలుగా ఈ కథ మొత్తం నడుస్తుంది మామూలు ధోరణికి భిన్నమైన ఈ శిల్పంతో కథ రాయడం ఒక ఎత్తైతే, కథలోని మాటలు, అభిప్రాయ వ్యక్తీకరణలతో అసలు విషయాన్ని పరితకు అర్థం చేయించడం మరో ఎత్తు అయితే, శిల్ప నిర్మాణ రీత్యా ఈ కథ విలక్షణంగా నిలిచినా, మితిమీరిన అతిశయోక్తులు అసలు విషయాన్ని పక్కకునెట్టి, మొత్తం స్త్రీ వాదాన్నే పెడధోరణిగా పాఠకులు భావించే పరిస్థితి తెచ్చిందన్నది విమర్శ

స్త్రీవాదంలోని తప్పొప్పుల బేరీజుగా కాక, నిజజీవితంలోని ఇద్దరు తెలుగు స్త్రీవాద రచయిత్రులను దృష్టిలో పెట్టుకునే తోలేటి ఈ కథ రాశారని ఈ కథా ప్రచురణ కాలంలో ఓ వివాదం రేగింది వ్యక్తుల వాదాలమీద కాక, ఆ వాదాలకు ప్రతినిధులుగా నిలిచిన ఒకరిద్దరిని మాత్రం లక్ష్యంగా ఎంచుకొని, ఒకటి రెండు ఘటనల్ని సార్వత్రీకరించి, మొత్తం స్త్రీవాదాన్నే ఒంటి చేత్తో నెట్టేయడం, సీరియస్ వ్యవహారాన్ని నవ్వులాటగా మార్చేయడం రచయితలో స్త్రీవాదం పట్లకానీ, స్త్రీల పట్లకానీ సానుభూతి లేవనే భావన కలిగిస్తాయి. ఆ మాటే కొందరు స్త్రీలు, స్త్రీవాదులు అన్నారు

కాగా, తోలేటి రచించిన మ'గోడు' కథ కూడా ఈ చర్చకు మరికొంత ముడి సరుకును చేర్చింది మగవాడు అనే అర్థంలోనే కాక, మగవాడు చెప్పుకుంటున్న గోడు - మగోడు అనే రెండో అర్థం కూడా వచ్చేలా 'మగోడు' అన్న శీర్షికలోని 'గోడు'ను సింగిల్ కొటేషన్ చిహ్నాలతో రచయిత చిలిపిగా వేరు చేసి చూపారు అలా టైటిలే చర్చనీయాంశమైంది. దానికి తోడు కథారంభంలోనే బ్రాకెట్లలో "మగవాద కథ" అని రచయిత పేర్కొన్నారు. ఈ ఉపశీర్షిక ఫెమినిస్టులను మరింత ఎగదోసిన అంశం ఈ కథ మీద ఎన్నో వాద వివాదాలు చెలరేగి, చివరకు తోలేటే స్వయంగా ఈ కథా నేపథ్యం గురించి వ్యాసరూపంలో ('ఆంధ్రజ్యోతి' దినపత్రిక ఆదివారం అనుబంధం, 21 డిసెంబర్, 1997) వివరించాల్సి వచ్చింది తోలేటి మాటల్లోనే చెప్పాలంటే, " అరిచేతుల్లో స్వర్గం చూపించే భావన 'స్వేచ్ఛ. ఈ జీవితం నా సొంతం. నా స్వేచ్ఛ మీద పరిమితులు విధించే అధికారం కుటుంబానికి కానీ, సమాజానికి కానీ లేదు - అంటూ 'వ్యక్తి స్వేచ్ఛ' వాదాన్ని ప్రచారం చేస్తున్నారు స్త్రీవాదులు అటువంటి స్వేచ్ఛ పురుషుడు కోరితే ఎలా వుంటుందో చూపించిన కథ - మ'గోడు' "

క్లుప్తంగా 'మగోడు' కథ కూడా తోలేటి మాటల్లోనే: "ఇది ముగ్గురు మగవాళ్ళ కథ అయిదు పదులు నిండిన మన హీరోగారు, ఓ రోజు ఉదయం తీరిగ్గా పడక కుర్చీలో వాలి, తన చిన్నతనం గుర్తు తెచ్చుకుంటాడు చిన్నప్పుడు స్కూల్లో, ఎనిమిదో క్లాసులో అతను ఓ ప్రేమలేఖ రాయగా, గయ్యాళి పెళ్ళాంతో దుర్భర జీవితం గడుపుతున్న తెలుగు మాష్టారు, 'వెధవా! చక్కగా చదువుకొని, హాయిగా ఉద్యోగం చేసుకు బ్రతకక, ప్రేమా, పెళ్ళీ అంటూ ఈ ఊబిలోకి దిగుతావేంరా' అని మొట్టికాయలతో పాఠం చెప్పాడు. వయసొచ్చిన తరువాత పెళ్ళి చేసుకోబోతుంటే, స్నేహితుడు అడ్డుపడి, 'పెళ్ళి చేసుకొని నీ స్వేచ్ఛ కోల్పోతున్నావు రోయ్ - ఫుట్‌బాల్ ఛాంపియన్ని అని రొమ్ములు

విరుచుకు తిరిగేవాడివి నిన్ను ఇప్పుడు అందరూ ఫుట్‌బాల్ తన్నినట్లు తంతారురోయ్' అని కళ్ళనీళ్ళు పెట్టుకొని (స్త్రీవాదుల కథల్లో స్వేచ్ఛా పథంలో నడుస్తున్న స్త్రీ, పెళ్ళి చేసుకోబోతున్న స్నేహితురాల్ని హెచ్చరించినట్లు) హెచ్చరించినా వినడు ఎవడి మాటా వినకుండా పెళ్ళి చేసుకొని 'కష్టాల ఊబి'లో దిగబడిపోయి, జీవితం వృథా అయిపోయిందని విచారిస్తుంటే, పెళ్ళి చేసుకోవద్దని సలహా ఇచ్చిన స్నేహితుడు ఎదురవుతాడు పెళ్ళీ పెటాకులూ, పిల్లా మేకా ఏవీ లేకుండా, మనసైనప్పుడు మనసైన స్త్రీని అనుభవిస్తూ, స్త్రీవాదులు ఉవ్విళ్ళూరించేట్లు వర్ణించే 'స్వేచ్ఛా జీవితం' అనుభవిస్తున్నాడు అతను. అతనితో పోల్చి చూసుకొని, 'నేనూ పెళ్లి చేసుకోకుండా ఉంటే హాయిగా ఉండేవాడిని కదా అని చింతిస్తాడు హీరో వాళ్ళ కబుర్లలో మూడో స్నేహితుడి ప్రసక్తి వస్తుంది. అతను ఒక అమ్మాయిని ప్రేమించి, ఆ అమ్మాయితో పెళ్ళి కాకపోతే సన్యసిస్తానంటుండేవాడు. కబుర్లయ్యాక ఎల్లీ ఇంగువ సంచీ, అరిటాకుల కట్టా తీసుకొని ఇంటికి తిరిగి వెళుతుంటే మన హీరోగారికి 'జ్ఞానోదయం' అవుతుంది 'నేను బంగారమ్మ మొగుడిలా, పిల్ల పిశాచాల తండ్రిగా నా జీవితం నాశనం చేసుకోను ఈ జీవితం నాది. నా బ్రతుకు నేను స్వేచ్ఛగా బ్రతుకుతాను' అని (స్త్రీవాదులు హీరోయిన్ లాగానే) అనుకుంటాడు 'స్వేచ్ఛ' నిషా తలకెక్కి, తూలుతూ, పాతరోజులు గుర్తుకు తెచ్చుకుంటూ హుషారుగా బీచీకి దారితీస్తాడు. అక్కడ తత్త్వాలు పాడుకుంటున్న స్వామీజీని తన రెండో స్నేహితుడిగా గుర్తిస్తాడు 'విశాలను పెళ్ళిచేసుకోలేక వీడు చివరికి సన్న్యాసి అయిపోయాడన్న మాట' అని బాధపడి, ఆ అమ్మాయి అందం, తెలివితేటలు అన్నీ గుర్తుకు తెచ్చుకొని, 'విశాలను పెళ్ళి చేసుకున్న అదృష్టవంతుడెవరో' అంటాడు స్వామీజీ కళ్ళల్లో నీళ్ళు చిమ్ముతాయి గద్గద కంఠంతో 'ఆ అదృష్టవంతుడిని నేనే వత్సా' అంటాడు"

ఈ కథ గురించి చెబుతూ, "స్త్రీవాదులు డిమాండుచేసే బాధ్యతా రహితమైన 'స్వేచ్ఛ' మీద సెటైర్ - సంసారంలో మగవాడి గోడు, మ'గోడు' " అని తోలేటి పేర్కొన్నారు. అంతేకాకుండా, "సెటైర్ రాయడంలో ఓ టెక్నిక్ ఉంది - రచయిత దేనిని అపహాస్యం చెయ్యాలనుకుంటున్నాడో, అదే వాదనను దానికి వ్యతిరేక కోణం నుంచి వినిపించి, ఆ వాదనలోని అసంబద్ధతను ఎత్తి చూపడం. ఈ కథలో పాత్రలు నావి కావు ఈ భాష నాది కాదు స్వేచ్ఛ నా సిద్ధాంతం కాదు. ఈ వాదనను నేను అలాంటి పాత్రలే తీసుకొని, మగాడి వైపు నుంచి వినిపించాను ఇదంతా స్త్రీవాదులు చెబుతున్నదే. దీనిలో అశ్లీలత కనిపిస్తే అది స్త్రీవాదంలో ఉన్నదే ఇది 'వెధవ కథ' అని అందరూ దీవిస్తే - క్షమించాలి - ఆ దీవెనలు కూడా స్త్రీవాదులకే" అంటారు తోలేటి

పెళ్ళామంటే మొగుణ్ణి రాచి రంపాన పెట్టేదే అన్నట్లు సాగే ఈ కథ, ఇందులోని వ్యంగ్యం సహజంగానే స్త్రీవాద వ్యతిరేకులకూ, మరీ ముఖ్యంగా 'మగవాదు'లకూ నచ్చుతుంది "స్త్రీవాదాన్ని అవహాస్యం చేస్తూ, వేళాకోళంగా 'మగోడు'ను మగవాద కథ" అన్న తోలేటి ఉద్దేశం - అతిశయాలతో కూడిన ఈ కథ ద్వారా అంతర్లీనంగా స్త్రీవాదులనూ, వారి సిద్ధాంతాలనూ ఎండగట్టడమే!

కథను శిల్ప రీత్యా చక్కగా మలచడానికి ఆయన అనుభవం, నేర్పు దోహదపడి, రచనలో ఆయనకు విజయం సాధించి పెట్టాయి కానీ, రచన ద్వారా మొత్తం స్త్రీవాదాన్ని ఒకేగాటన కట్టినట్లయి, స్త్రీల సమస్యల పట్ల సానుభూతి లేని రచయితగా ఆయన ముద్ర వేయించుకున్నారు

'మగోడు' తరువాత స్త్రీవాదం మీద తోలేటి విసిరిన మరో వ్యంగ్య బాణం - 'జీవిత బంధం' (జనవరి, 1997) సర్వసాధారణంగా సంసార జీవితంలో భార్యాభర్తల మధ్య వచ్చే అభిప్రాయభేదాలనూ, ఈగో క్లాషలనూ నేపథ్యంగా చేసుకొని - ఆధునిక స్త్రీవాదం మీద, మరీ ముఖ్యంగా అకారణ పురుష ద్వేషంమీద రచయిత ఎక్కుపెట్టిన కథ ఇది తాగాల్సి వచ్చే ఉప్మా, చంద్రశిల లాంటి మైసూర్‌పాక్ ముక్కలు, అభాసం - అనబడే అఖిల భారత భార్యా పీడితుల సంఘం, కవి చౌడప్ప గురువులా అనిపించే మన్మథరావు లాంటి మగవాద కవుల అభిప్రాయాలు - ఇలా ఎన్నో వ్యంగ్యాలతో హాస్యం పంచుతూ, ఈ కథనూ తోలేటి సక్సెస్ చేశారు అయితే, ఇందులో స్త్రీవాదం, కుటుంబ వ్యవస్థ లాంటి అంశాలపై పాత్రల మధ్య సంభాషణల రూపంలో సుదీర్ఘ చర్చలే ఉన్నాయి. కథలోని బామ్మగారి మాటల్లో ఎక్కువగా రచయిత భావాలు స్పష్టమవుతాయి. ఒకరకంగా ఇది 'మగోడు' తరువాత తన మీద రేగిన దుమారం నేపథ్యంలో మరింత స్పష్టంగా తన అభిప్రాయాల్ని వెలిబుచ్చేందుకు తోలేటి రాసిన కథగా కనిపిస్తుంది

ఈ కథలో ఒకచోట ఆయన, "ఎంత ఆదర్శవంతమైన సమాజంలో అయినా సరే, ఎవరికి తోచినట్లు వాళ్ళు ప్రవర్తించే స్వేచ్ఛ కానీ, ఎవరికి ఇష్టమైన పని వాళ్ళుచేసే స్వేచ్ఛ కానీ ఎవరికీ ఉండదు అలాగే కుటుంబంలో కూడా ఇష్టం వచ్చినట్లు జీవించే స్వేచ్ఛ ఆడదానికీ లేదు, మగవాడికీ లేదు. కుటుంబం ఇద్దరి స్వేచ్ఛకు పరిమితులు విధిస్తుంది. అవధులు లేని స్వేచ్ఛ జీవిత పరమావధి అని భావించేవారు నిరభ్యంతరంగా, ఒంటరిగా ఆ స్వేచ్ఛ అనుభవించవచ్చు, కానీ, భార్యభర్తలు స్వేచ్ఛ పేరుతో ఎవరికి తోచిన దారిలో వారు పోతుంటే ఆ సంసారం నిలబడదు . దీనిలోని లోపాలు ఎలా నివారించాలా అని ఆలోచించాలి కానీ, అసలు వివాహ వ్యవస్థనే తిరస్కరించడం తలనొప్పికి మందు తల తీసెయ్యడమే అని వాదించడం లాంటిదే" అని ఓ పాత్రతో అనిపిస్తారు. అలాగే, వ్యక్తులుగా స్త్రీ పురుషులు ఇద్దరూ "ఒకలాంటి వారే అయినా, సమాజంలో ఒక వర్గంగా మాత్రం స్త్రీ జాతికి చాలా అన్యాయం జరుగుతోంది దానికి నువ్వనుకుంటున్నట్లు పురుషాధిపత్యం అసలు కారణం కాదు రాజకీయార్థిక, సామాజిక కారణాలు, సంస్కృతి, మతపరమైన విశ్వాసాల్లాంటి కారణాలు అనేకం ఉన్నాయి" అని చెబుతారు. ఇక్కడే స్త్రీవాదుల మీద తన ఫిర్యాదును కూడా రచయిత వినిపిస్తారు. ఆర్థిక వ్యవస్థకూ, స్త్రీ స్థితికీ దగ్గర సంబంధం ఉందని అర్థం చేసుకోకపోగా, గుర్తింపు కోసం నేటి స్త్రీవాద నాయకురాళ్ళు తేలికమార్గం ఎంచుకున్నారన్నది ఆయన ఆరోపణ "వీళ్ళ స్త్రీవాదం, మొగుణ్ణి డ్రాయింగ్ రూమ్‌లో నుంచి జుట్టు పట్టుకొని వంటింట్లోకి ఈడ్చుకొచ్చి, తాను వంటింటి నుంచి విముక్తి పొందాలన్న సగటు

మధ్య తరగతి స్త్రీ ఆకాంక్షలకు రూపం వీళ్ళ ఉద్యమం వంటింటికీ, పడకటింటికీ పరిమితం ఈ పెర్వర్టెడ్ మైండ్సుకి భార్యాత్వం బానిసత్వంగానూ, సంసారం లైంగిక హింసగానూ, మాతృత్వం స్త్రీపై మోపమబడిన శిలువలాగానూ కనిపిస్తుంది ఈ కూపస్థ మండూకాలకు విశాల ప్రపంచం కనిపించదు వీళ్ళ పరిధి సంకుచితం వీళ్ళ దృష్టి సంకుచితం వీళ్ళ ఆలోచనలు సంకుచితం వీళ్ళ యుద్ధం నీడలతో ! వీళ్ళు సెమినార్లలో, వర్క్‌షాపుల్లో, టీ కప్పుల్లో సృష్టించే విప్లవాలూ, మీడియాలో తీసుకొచ్చే తుపానులూ సామాన్య స్త్రీకి ఒరగబెట్టేదేమీ లేదు" అని బామ్మ పాత్ర ద్వారా తీవ్ర స్వరంలో నిందించారు తోలేటి 'ఈ ఉష్ట్రపక్షుల సంగతి మర్చిపోయి, నీచుట్టూ ఉన్న ప్రపంచాన్ని నీ కళ్ళతో చూడు" అని సంధ్యలాంటి - స్త్రీలకు ఉపదేశించారు

కొన్ని విషయాల్లో తోలేటి వెలిబుచ్చిన అభిప్రాయాలు సమంజసమైనవే కానీ, ఈ రకమైన తీవ్ర స్వరంతో చేసిన మోతాదు మించిన ఆరోపణలు స్త్రీవాదులకు మింగుడుపడలేదు దాంతో, తోలేటిని స్త్రీవాద వ్యతిరేకిగానే కాక, స్త్రీవాద ప్రగతి నిరోధకుడిగా భావించే పరిస్థితి సహజంగానే వచ్చింది

ఇలా కొన్ని కథల మీద వచ్చే విమర్శల మాట అటుంచితే, ఇటీవలి కాలపు ఉత్తమ వ్యంగ్య కథకుడిగా తోలేటికి దక్కే ప్రశంసలే ఎక్కువ అయితే, ఆయనను కేవలం వ్యంగ్యంతో హాస్యం పండించే కథకుడిగానే పేర్కొనడం సరికాదు నిశితంగా గమనించినప్పుడు ఆ వ్యంగ్యం వెనుక ఓ సామాజిక పరిశీలన, సమాజంలోని స్థితిగతుల పట్ల అక్కర, ఆవేదన కనిపిస్తాయి. అందుకే కథల కోటపై వ్యంగ్య ధ్వజం ఎగరేసినప్పటికీ, నిజానికి హాస్యం మేళవించి, సీరియస్ అంశాలను చర్చించడంలో మేటి తోలేటి ఆయనలోని ఆ పార్శ్వం అవిస్మరణీయం ఆయన కథలను పాఠకులతో పాటు సాహిత్య లోకమూ ఆసక్తిగా గమనిస్తున్నది అందుకే!

# నామిని సుబ్రహ్మణ్యం నాయుడు

♦ స్వామి ♦

'నామిని సుబ్రహ్మణ్యం నాయుడు బాగా రాస్తాడు గానీ అవి కథలుకావు'

'కథలు కాకపోతే మరేమవుతాయి? కథారేఖలా? స్కెచ్‌లను తెలుగులో ఏమంటాం? నామిని కథలకూ ఇతర్ల కథలకూ లక్షణాల్లో తేడా ఏమిటి?

మన వర్తమాన తెలుగు విమర్శకులకు ఆయాని గురించో, పనిపిల్లగురించో సంచలనాలు లేవదీసి భావజాలపు యుద్ధాలు జరపడంలో ఉత్సాహంగానీ, జీవితాన్ని కళ్ళముందు పరిచే నామిని కథా ప్రక్రియ గురించి ఆలోచించే తీరికా, ఓపికా ఎక్కడుంటుంది?

కథా సంకలనాలకు సంపాదకత్వం వహించే సందర్భంలో ఆయా సంకలన కర్తలు నామిని కతని కథగా గుర్తింప నిరాకరించినా తెలుగు పారకుడికి తెలుసు - ఒక చలం మ్యూజింగ్స్ లాగో, శంకరమంచి అమరావతి కథల్లాగో, నామిని పచ్చనాకు సాక్షిగా, మిట్టూరోడి కతలు నిశ్చయంగా తెలుగు జాతి సంపద అని!

ఒకానొక కాలంతోనో, స్థలంతోనో, సామాజిక వర్గం తోనో మొత్తంగా మమేకమైపోయిన సాహిత్యకారులు ఏ భాషలోనైనా కొంతమందే ఉంటారు వీరు తమ రచనలకు మించిన వైశాల్యంతో తమ జాతి భాషనీ, సంస్కృతినీ, సామాజిక జీవితాన్నీ, దాని భవిష్యత్తునీ ఆవిష్కరిస్తారు అట్లాంటి అరుదైన రచయిత నామిని!

సమాజం తనకు అవసరమైన మేధావుల్నీ, ప్రవక్తల్నీ, నాయకుల్నీ తానే తయారు చేసుకుంటుంది సమాజం తనకు అవసరమైన రచయితల్ని కూడా తానే సృష్టించుకుంటుంది అట్లాంటి అపురూపమైన రచయిత నామిని!

అప్పటికి కథ పురుడు పోసుకుని డెబ్బై ఏండ్లు పైన దాటినా, వివిధ ప్రాంతాల మాండలికాల్ని ఈదుకుంటూ వచ్చి పత్రికల కెక్కినా, శ్రీ సభా, మధురాంతకం, కేతు, సొదుం, సింగమనేనిలాంటి సీనియర్ రచయితలు రాయలసీమ మాండలికాన్ని సంపూర్ణ వ్యక్తీకరణగా స్వీకరించడానికి సంకోచించిన నేపథ్యంలోనే రచయిత భాషా కర్తవ్యాన్ని పరిపూర్ణంగా, కళాత్మకంగా నిర్వహించిన ప్రాథమికుడు నామిని! మట్టినుంచీ వేర్లను విడదీయరానట్లే, అతని సృజన కళనుంచీ సీమ మాండలికం విడదీయరానిది

విప్లవ వాదులూ, స్త్రీవాదులూ జీవితాన్ని మినహాయించిన భావ చైతన్యంతో కథా రచనను మేధోపరంచేసి, విశ్లేషణల్తోనింపి, కథలోని రసాన్నీ, అనుభూతినీ

తమ మూస పరిష్కారాలతోనూ తర్కంతోనూ చావగొట్టి తెలుగు కథను గొడ్డుగా పిప్పిగా మారుస్తున్న నేపథ్యంలో తన రచనల నిండా రసం చిప్పిల్లే చెలిమల తవ్వుకుంటూ పోయినవాడు నామిని నామిని కథలు చదివే భాగ్యం భవభూతికి లేదు

కేతు విశ్వనాథరెడ్డి, సింగమనేని లాంటి రచయితల పుణ్యమా అని, ఆర్థికకోణం గడప వరకూ వచ్చి ఆగిపోయిన రాయలసీమ రైతు జీవితాన్ని సామాజిక సాంస్కృతిక వైశాల్యాలకు విస్తరింపజేసినవాడు నామిని రాయలసీమ సాహిత్యానికి అతడు ప్రత్యేకమైన మలుపు

మధ్యతరగతి వారి పట్టణీకరదృష్టీ, బ్రాహ్మణకుల సంస్కృతీ తెలుగు కథను దశాబ్దాలుగా పరిపాలించిన నేపథ్యంలో - భారతీయ పల్లె సమాజంలో అధికాధిక జనసమూహాలకు ప్రాతినిధ్యం వహించే శూద్ర సంస్కృతినీ, శూద్ర సంస్కృతిలోని పనివేదాన్నీ, శూద్రుల కుటుంబ సామాజిక జీవితాన్నీ, మతానికి సంబంధించిన శూద్రుల భావప్రపంచాన్నీ యథాతథంగా ఆవిష్కరించిన అద్భుత కథకుడు నామిని!

నామిని ఇంత గొప్ప శూద్ర కథకుడు కావడానికి కారణాలు - అతని మేధావితనమా? అతని సామాజిక స్పృహా? లేక మరొకటి మరొకటా? వీటిలో ఏదైనా కావచ్చు, కాకపోవచ్చుగానీ ఒక్కకారణం మాత్రం స్పష్టం అది రచయితకూ రచనకూ మధ్య ఉండే పేగుసంబంధం!! ఈ సంబంధాన్ని కళానియమాల్లో ఒకటిగా గుర్తింప నిరాకరించే ఎంతటి సామాజిక స్పృహ కలిగిన రచయిత కూడా ఇంత కళాత్మకమైన రచనలు రాయలేదు.

గుజరాత్ మారణకాండ గురించి కథలెందుకు రాయరు అని ఒక విమర్శకుడు అడుగుతాడు ఉపన్యాసాలకు అలవాటుపడిన మరొక విమర్శకుడు - ఇరాక్ యుద్ధం గురించి కథలెందకు రాయరు అని అడుగుతారు. కవిత్వ ప్రక్రియకు ఉన్నంత వస్తు విస్తృతి, కథా ప్రక్రియకు ఉండదని చాలామంది విమర్శకులకే కాదు, కొంతమంది కథకులక్కూడా తెలీదు. కవిత్వం లాగా కథా రచనకు భావోద్వేగం మాత్రం ఉంటే చాలదు దాని వెనకాల రచయితకు ఏదో భౌతిక స్పర్శకూడా అందుతూ ఉండాలి. ఈ భౌతిక స్పర్శానుభవమే కథాప్రక్రియకు గరిమనాభి అని గుర్తించిన అసలైన కథకుడు నామిని

అనుభవంలో లేని అంశాన్ని కూడా ఒక కొత్త కళారూపంలో కథగా రాసి మెప్పించడం కూడా కొన్నిసార్లు సాధ్యపడవచ్చు ఇలా కొన్ని మినహాయింపులు ఉన్నప్పటికీ గుజరాత్ అల్లర్ల గురించిన కథని తెలుగు కథకుడి కంటె గుజరాత్ కథకుడే గొప్పగా రాయగలడని మనం అర్థం చేసుకున్న పక్షంలో - అనుభవించింది రాయడమనే ప్రాథమిక కళాసూత్రాన్ని మనం కథా ప్రక్రియకు అన్వయించాల్సి ఉంటుంది కూడా! అనుభవాన్ని సాహిత్యపరంగా నిర్వచించుకోవలసి వస్తే, అది వ్యక్తిగత యదార్థానుభవం కంటే విస్తృతమైనది ఉదాహరణకు ఒక విషయం - ఒక స్త్రీవాద రచయిత్రి తన సమస్య గురించి కాకుండా మరొక స్త్రీ

సమస్య గురించి కథరాస్తే, దీనిని జెండర్ ప్రాతిపదిక మీద రచయిత్రి సమీపాను భవంగానే పరిగణించాల్సి ఉంటుంది

జీవితంలోకి కలం అద్ది రాయమని చలంలాంటి మహానుభావులు చెబుతూనే వచ్చారు నామిని జీవితమే నామిని లాంటి రచయితను సృష్టించు కుంది రెండు దశాబ్దాలుగా కథలు రాస్తున్న స్త్రీవాద రచయిత్రి ఒకరు - నేను రాసిన కథలేవీ నా అనుభవాలుకాదు అన్నప్పుడు నేను ఆశ్చర్యపోయాను తన రచనకు తన జీవితాన్నే ముడి సరుకుగా మార్చుకునే విద్య నామిని లాంటి ఆత్మదర్శనం గల రచయితకు తప్ప, రచనను రాజకీయం చేసుకున్న రచయితలకు తెలిసే అవకాశం లేదు

నామిని రచనల్లో - పచ్చనాకు సాక్షిగా కతలకు అమ్మ కేంద్రం! సినబ్బకతలకు హైస్కూలు కేంద్రం! మిట్టూరోడి కతలకు ఊరు కేంద్రం నామినికి పూర్వం కాంతం కథలూ, అమరావతి కథలూ, పెన్నేటి కతలూ, మా గోఖలే కథలూ లాంటివీ, నామిని తరువాత దర్గామిట్ట కతలూ, మాదిగోడూ, కాకుళయ్య కథలూ, మొదలైనవీ, పూర్తిగానో దాదాపుగానో ఒక వ్యక్తినో, స్థలాన్నో సామాజిక వర్గాన్నో బొడ్డురాయిగా చేసుకుని విస్తరించిన కథా సాహిత్యమే! ఈ కోవలో వచ్చిన తెలుగు కథా వైశిష్ట్యానికి నామిని రచనలు నిలువెత్తుటద్దాలు! ఆర్.కె నారాయణ్‌గారి మాల్గుడీడేస్, స్వామి అండ్ హిజ్ ఫ్రెండ్స్ లాంటి రచనలు కూడా మనకు ఈ సందర్భంలో గుర్తురాక మానవు

శంకరమంచి సత్యం కథలు పాఠకుడిలో తాత్విక దృష్టి కలిగిస్తే, నామిని కతలు జీవితం బైట వున్న మేధో శక్తులను నిరాకరించి ఎక్కడికక్కడే ఒక కళానుభవంతో మడుగుకడతాయి. శంకరమంచి సత్యం కథల్లో వివిధ పాత్రలు వివిధ స్వభావాల్తో కన్పిస్తే; నామిని కథలన్నిట్లో అవే పాత్రలు అవే స్వభావాల్తో వచ్చిపోతూ పాఠకులకు కళ అనే భ్రాంతికి మారుగా జీవితం అనే భ్రాంతిని కలిగిస్తాయి కథకుడిగా శంకరమంచిది వస్తు దృష్టి. నామినిది ప్రధానంగా ఆత్మాశ్రయ దృష్టి

నామిని కథల్లోని రసానుభూతికి మూలకం యదార్థత యదార్థతలో వైయక్తిక అనుభవం ఉంటుంది. వైయక్తిక అనుభవాన్ని సామాన్యీకరించి వాస్తవికతగా రూపొందించడం కథాకళ! కానీ, వాస్తవికతగా రూపాంతరం చెందించకుండానే యదార్థతనుంచీ నేరుగా రసానుభూతినీ, కళాత్మక చిత్రణల్నీ పిండడం నామినికి ప్రత్యేకంగా తెలిసిన కథావిద్య. ఒక వ్యక్తి కాగితమూ, కలమూ పట్టుకుని రాయడం అనే క్రియలోనే సామాజిక స్వభావముంది రచనా ధర్మంలోని ఈ సామాజికతే ఏ వ్యక్తిగత అనుభవాన్నైనా సమూహపరం చేస్తుందనడానికి నామిని కథలే సాక్ష్యం

నామిని ఒక వ్యక్తి మాత్రమే కాదు; ఒక సామాజిక వర్గానికి చెందిన వ్యక్తి కూడా! అతని వ్యక్తిగత జీవితమూ, వర్గ జీవితమూ ఎక్కడ ఐక్య మయినాయో, ఆ మూలస్థానం నుండీ అతని సృజన శక్తులు ఊటలై ప్రవహించాయి

వ్యక్తి సమాజమైపోయే ప్రక్రియ ఏ రచయితలో ఎంత బలవత్తరంగా రూపొందుతుందో ఆ రచయిత అతని సామాజిక వర్గానికి అంత గొప్పగా ప్రాతినిధ్యం వహించగలడని నామిని రుజువు చేస్తాడు

సమాజంలో ఏ వర్గానికి సంబంధించిన ప్రజలకు ఆ వర్గానికి సంబంధించిన జీవిత స్వభావముంటుంది ఈ వర్గ జీవిత స్వభావమనే రంగు తొడుక్కుని మాత్రమే మనిషిలోని సహజమైన గుణాలూ, ఉద్వేగాలూ బహిర్గతమవుతాయి రూపాయి డబ్బులకోసం పోట్లాడుకునే పేదవారు మధ్య తరగతికి విడ్డూరంగానూ, పంద రూపాయల దగ్గర పోట్లాడుకునే మధ్యతరగతివారు ఉన్నత వర్గం వారికి విడ్డూరంగానూ కన్పించవచ్చు ఇదే జీవిత స్వభావం నామిని పాత్రల్లో కూడా కన్పిస్తుంది కడుబీదవైన కొన్ని దొంగ పనులను శ్రామి వర్గం తప్ప దానిపై వర్గం చేయలేదు ఈ వర్గ జీవిత స్వభావాన్ని ఈ కథల్లోని చింతకాయల దొంగలూ, కోళ్ళ దొంగలూ, గడ్డిమోపు దొంగలలో చూసినప్పుడు - నైతిక స్పృహను మించిన వర్గ జీవిత స్వభావం పాఠకులకు గాఢ స్పర్శగా అందుతుంది

అపద్ధములు ఆడరాదు దొంగతనం చేయరాదులాంటి మధ్యతరగతి రచయితల నైతిక దృష్టిని నామిని తన పాత్రల మీద ఆరోపించడు పాత్రలు తమ జీవితం గురించి ఏమనుకుంటాయి? కథకుడు తన పాత్రల గురించి ఏమనుకుంటాడు? అని మనం ప్రశ్న వేసుకున్నప్పుడు - ఇక్కడ కథకుని దృష్టికీ, పాత్రల దృష్టికీ మధ్య పెద్ద అగాధమేదీ కన్పించదు రచయిత ఏ పాత్రలోకీ వేలు అద్దడు ఒకపాత్ర ఏ వ్యక్తికి సంబంధించినదో, ఆ వ్యక్తి చైతన్య పరిమితుల్ని అతిక్రమించి డైలాగులు చెప్పడానికి ఎప్పుడూ ప్రయత్నించదు చాలా శుభ్రమైన పాత్రలు నామినివి!

ముగింపును మనసులో ఉంచుకుని నామిని కథను ప్రారంభిస్తాడను కుంటాను కథను ఎక్కడ మొదలుపెట్టి ఎలా అల్లుకుంటూ వచ్చి ఏ తూటా ల్లాంటి మాటతో ముగించాలో నామినికి తెలుసు

నామిని కథాశిల్పం వ్యూహాత్మకమైంది ఒక్కొక్క కథనూ ఒక్కొక్క వ్యూహంతో పన్నుతాడు. దీని ఫలితమే కథాంతంలో రసోత్పత్తి! తెలుగు కథకుల్లో శంకరమంచి, నామినిల కుండే ద్రవీభవనశక్తి ఇతర రచయితల్లో మృగ్యం

అమ్మ - 'ఆ ఆవుల్తో సేద్దిం చేస్తావుంటే నీకు కండ్లలో నీళ్ళు కాలువలు కడతావుండాయో నేను లేనా బక్కగా కొట్టంలో ఉండే ఆ ఆవు దానికి, ఈ ఆడదానికీ తేడా ఏంది?' అని అమె మొగున్ని నిలదీసినా, 'ఎవురో ఏదో అంటే నన్ను నీ అమ్మగాదని నమ్మేసినావే! నీతో నాకేం పనిరా ముండ మోపి యెదవా?' అని కొడుకుతో నిష్ఠూరపోయినా, 'ఆ పొద్దు నేను పోగొట్టుకుని వుంటే ఈ పొద్దు నువ్వు నా ముందర ఈ పద్యాలు చదువుతావా నాయనా!' అని కండ్లను మసక జేసుకున్నా ఇలాంటి ముగింపు వాక్యాల్లో బుస్సుమని పొంగే దుఃఖానికి కారణం ఆ కథల మొత్తం నిర్మాణం నిండా బావిగోడల చెమ్మలాగా వ్యాపించి ఉంటుంది

మా అమ్మ భలేటి లంజరా! అని ఊదోడు కంప్లయింట్ చేసినా, బడికి

పోవాల్సిన నాగరాజు మాదిగ పల్లెనుంచీ చంకలో చిక్కం, చేతిలో కత్తి పట్టుకుని ఆవుల వెంట అడవికి పోతూ కన్పిస్తున్నా - దీన్నంతా జీవన విషాదంగానే తప్ప పోషకాహార విలువల సమస్యగానో, బాలకార్మికుని సమస్యగానో చర్చించడు రచయిత. జీవితంనుండీ సమస్యను సమస్యగా గ్రహించడు నామిని. సమస్యను దాని తాలూకు వ్యక్తితో సహా పెకిలించి స్వీకరిస్తాడు అందుకే సామాజిక సమస్య అతని రచనల్లో ఒకానొక పాత్ర జీవితంగా రూపాంతరం చెందుతుంది జీవితాని కుండే వివిధ పార్శ్వాల్ని అర్థం చేసుకోకుండా, జీవితాన్ని మార్చే ఉబలాటంలో కొట్టుకుపోయే విప్లవవాద, స్త్రీవాద రచయితలకు జీవితంనుంచీ సమస్యలు సేకరించడం తప్ప, నామిని లాగా పాత్రల్ని సేకరించుకోవడం తెలీదు

కష్ట జీవులకు పేదరికం గురించి స్పృహ తప్ప మరో ఆహ్లాదకర పార్శ్వం ఉండటానికి వీల్లేదని నమ్మడం మూతి మూరెడు పొడుపు పెట్టుకుని రాసే రచయితలకు అవసరమేమోగానీ, కాయకష్టపు మనుషులకు జీవితమంటే గొప్ప తమాషా కూడా! కయ్యల్లో, మళ్ళల్లో చింత చెట్టు కిందా, వీధుల్లో పొట్ట చెక్కలయ్యే వినోదంలో మునిగిన పాఠకవర్గపు జీవన క్రీడను కూచ్చుంటే కత లేస్తే కత అన్నట్టు కథలు కథలుగా చెప్పుకొస్తాడు నామిని పల్లె జీవితమూ, నగర జీవితమూ రెండిట్లో అసలు సిసలు జీవనోత్సాహపు వారసత్వం దేనికి సంక్రమిస్తుందో నామినికి మాత్రమే అనుభవపూర్వకంగా తెలుసు

ప్రభుత్వపు చదువులు చదువుకోవడానికీ కాయకష్టానికి దూరమై పట్టణీకరించబడటానికీ మధ్య పరస్పర సంబంధముంది. (ఈ చదువుల మాయనుంచీ మహామహా మార్క్సిస్టు మేధావుల క్కూడా మినహాయింపు లేదని వాళ్ళ మమ్మీ డాడీ కల్చరు ఎప్పుడో రుజువు చేసేసింది కదా!) ఇదే నాగరికత అయిన పక్షంలో దాని డొక్కలోకి ఎగిచ్చి ఎడం కాలితో తన్ని ఆ పరస్పర సంబంధాన్ని భగ్నం చేసే వీరత్వం నామిని రచనల్లో స్వేచ్ఛగా విహరిస్తుంది

బతుకు గోరే తల్లి సరోజత్తా, నగరి కాలవలో కయ్యాకోల్పోయిన జుట్టుబావా, కొడుకు అప్పు తీరేదాకా తన దినాల ఖర్చు రానీయకూడదనుకునే రామస్తానం, నా పుంజున్నీవు, నీ పుంజున్నేనని శాస్త్రం మాట్లాడిన అంజిగోడూ, రొయ్యాస్పత్రిలో చెంగాళత్తా, భాషనుంచీ పరాయీకరించబడిన ఐద్యాబాదర్ ఇంద్రాణీ, బ్యాంకులో అప్పెగిరిపోయిందని అరకేజి కురాకు తెచ్చుకున్న కమలత్తా, నా పెళ్ళాం బలే లంజిమా! అనే పెరుగు సాయిబూ, నీతి మాటలు చెప్పిన పొట్టవ్వా, మిట్టమింద సుబ్బీ, మొగుడి దగ్గర శుద్ధం లేక కూతురిలా దగ్గరి కొచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకున్న శివమ్మ కూతురూ, కట్నాలడిగే కొజ్జానా బట్టలు అల్లుళ్ళుగా ఉండి ఏమి సుకమని అక్కసుపడే కర్రెక్కా, నువ్వు జంటిలిమేను అంటే నువ్వు జంటిలిమేను అని జుట్టు పట్టుకున్న దనలచ్చిం నీలావతీలూ, రామబక్తికి భాష్యం చెప్పిన కన్నె బావా, దేముడు మెచ్చే తప్పు చేయడానికి జంకని సుశీలా, బాసకత తెలిసిన బక్కత్తా, శారదక్కోళ్ళ అమ్మా ఈ చెమట మనుషుల్తో కిక్కిరిసిన కథా ప్రపంచంలో తప్పిపోయి, వారి చిన్న చిన్న ఆశలూ, భ్రమలూ, తమాషా

నవ్వులూ, కన్నీటి రోదనలూ, దారిద్ర్యపు ముక్కి వాసనల మధ్య వారి బతుకు జ్ఞానమూ, జీవితోత్సాహమూ అన్నిటినీ తలచుకుని తిప్పిన పేజీలే తిప్పుతూ, ఎక్కిన గుమ్మమే ఎక్కుతూ దిగుతూ మళ్లీ ఈ ప్రపంచానికి దారి వెతుక్కోవడానికి హైరానా పడాలి సహృదయ పాఠకులు

జీవితాన్ని విశ్లేషించడానికి మారుగా, జీవితంలోని నాటకీయతనూ, రసాన్నీ వెలికిదీసే కళా ప్రయత్నంతో తెలుగు పాఠక ప్రపంచాన్ని సమ్మోహన పరిచిన రచయిత నామిని

తామెప్పుడూ వాసన కూడా చూడని జీవితాన్ని సైద్ధాంతిక బలంతో చిత్రించడానికి ఉబలాటపడిపోయే నేటి కథా రచయితల కృతక మేధస్సుకు భిన్నంగా, తన జీవితాన్ని తాను గనిగా తొలిచి సమాజపు అట్టడుగు పొరల్లోని మానవ ఖనిజాన్ని బైటికి ప్రదర్శించిన కథా కార్మికుడు నామిని

రచయితల్లోని మేధావితనమూ, ధర్మాగ్రహమూ, సంస్కరణ ప్రయత్నమూ, సందేశాభిలాషా వంటి ఆధునిక ధోరణుల్ని తోసిరాజని - జీవితంలో ఐక్యమై జీవించే కుమారవిద్యను కాచి వడబోసిన మిట్టూరు మహారచయిత నామిని

నామిని ఈజ్ ద బ్యూటిఫుల్ రైటర్ ఎండ్ ఆల్సో ఎ గ్రేటెస్టు రైటర్ రచయిత కంటే జీవితం గొప్పదని రుజువు చేసిన రచయిత నామిని సుబ్రహ్మణ్యం నాయుడికి నా అక్షర జోహార్లు

# మధురాంతకం నరేంద్ర

♦ దాదాహయాత్ ♦

అదేమిటోగానీ కవులకూ రచయితలకూ వారసులు ప్రచురణ హక్కులకైతే పుడతారు రచయిత కడుపున రచయిత పుట్టడం దాదాపు అసంభవమన్నంత అరుదు ఒకవేళ పుట్టినా విడిగా పేరు తెచ్చుకోవడం అంతకన్నా అరుదు. ఏ భాషకైనా ఇది వర్తిస్తుంది

అయితే -

అన్ని వేళలా అది నిజం కాదు

ప్రతి సూత్రానికీ మినహాయింపనేది వుంటుంది తెలుగు కథా సాహిత్యంలో అలాంటి మినహాయింపు ఒకటుంది. మళ్ళీ మాట్లాడితే ఒకటి కాదు - రెండుంది

మధురాంతకం అనేది తమిళనాట ఒక ప్రదేశం కానీ, మధురాంతకం రాజారాంగారి చలవతో అది తెలుగు కథకు పేరుగా మారింది. ఇవాళ మధురాంతకం అంటే ఒకరు కాదు, ఇద్దరు కాదు - ముగ్గురు రచయితలు.

నిజానికి రచయిత అర్హతను నిర్ణయించేది ఆభిజాత్యం కానేకాదు. ఏ రచయిత అయినా తనకాళ్ళమీద తాను నిలబడాల్సిందే - తప్పదు. కేవలం వారసత్వమే ప్రాతిపదికగా ఏ రచయిత గురించీ మనం చెప్పుకోలేం

మధురాంతకం రాజారాం, మధురాంతకం మహేంద్ర, మధురాంతకం నరేంద్ర - ఈ ముగ్గురూ విభిన్నమైన రచయితలు. ఎవరి కథలు వారివే. ఎవరి పద్ధతి వారిదే ఎవరి గొంతు వారిదే అందుకే ఈ ముగ్గురికీ వున్న రక్త సంబంధం అక్కడికే వదిలేసి ముందుకు సాగడం మంచిది

మధురాంతకం నరేంద్ర నూనూగు మీసాల నూత్న యవ్వనంనుంచీ రాస్తున్న కథా రచయిత నరేంద్ర రాసిన తొలి కథలకూ తర్వాత రాసిన కథలకూ తేడా వుంది

నిజానికి తొలినాటి కథల్లోనే నరేంద్ర ప్రతిభ స్పష్టంగా కనిపిస్తుంది. ఆదర్శవాదం, కథలో కొత్తదనం చొప్పించాలనే ఉబలాటం, సున్నితమైన హాస్యప్రియత్వం, లాలిత్యం, కించిత్ అమాయకత్వం ఇవన్నీ ఆ కథల్లో దోబూచులాడతాయి

'కేంద్రం లేని వృత్తం' (1976) నరేంద్ర తొలికథల్లో ఒకటి. బహుశా ఇదే మొదటి కథ కూడా కావచ్చు ఈ కథలోనే రచయిత కులమతాల అంతరాల్ని పెద్ద దెబ్బ కొట్టడం చూడొచ్చు. ఈ కథలో మూడు తరాల వారి పెళ్ళిళ్ళు

మూడు విధాలుగా జరుగుతాయి మొదటితరం పెళ్ళి కృష్ణమూర్తి శాంతమ్మ గార్లది అది ప్రేమ వివాహం అప్పట్లో ఆ ప్రేమ వివాహమే ఒకవిప్లవం లాంటిది వాళ్ళిద్దరూ మేనత్త మేనమామ బిడ్డలు కృష్ణమూర్తి పేదకుటుంబంలో పుట్టాడని శాంతమ్మనిచ్చి పెళ్ళి చేయడానికి ఆమె తండ్రి ఒప్పుకోడు అప్పుడు శాంతమ్మ కొట్లాడి, పెద్ద విప్లవం లాంటిది లేవదీసి, ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి కృష్ణమూర్తిని చేసుకుంటుంది అప్పటికదే ఆదర్శం

అయితే అలాంటి ప్రేమ వివాహం చేసుకున్న కృష్ణమూర్తిగారే తన తర్వాతి తరానికి చెందిన సురేంద్ర కూడా ప్రేమ వివాహం చేసుకోబోతే హర్షించడు సరికదా, "మనకు వాడు పుట్టనేలేదు", అని శాంతమ్మతో అనేస్తాడు దానికి కారణం సురేంద్ర తనకంటే ఒకడుగు ముందుకేసి వర్ణాంతర వివాహం చేసుకోబోవడమే

మూడో తరానికి చెందిన సుధారాణి మరో అడుగు ముందుకేసీ సలీం అనే కుర్రాడిని మతాంతర వివాహం చేసుకుంటుంది ఇంతలో కృష్ణమూర్తిగారి మరో కొడుకు సుధాచంద్ర అకాలమరణం చెందుతాడు దాంతో కృష్ణమూర్తి గారు తీవ్రమైన మానసిక వ్యథకు లోనై సురేంద్రనూ, చిన్న కూతురు సుధారాణినీ దగ్గరకు తీసుకుంటాడు

రచయిత చిన్న వయసులోనే తీవ్రమైన సంస్కరణాభిలాషతో 'కేంద్రం లేని వృత్తం' కథ రాశాడు మనుషులు మారాలనీ, మారడమే అభ్యుదయమనీ రచయిత ప్రతిపాదిస్తాడు. తరాల అంతరాలు దాటి మనుషులు ముందుకు వెళ్ళాలని కూడా సూచిస్తాడు. అయితే 'కేంద్రం లేని వృత్తం' కథలో జరిగిన అపారమైన సంస్కరణ వ్యక్తుల మధ్యే వుండిపోయింది. కృష్ణమూర్తిగారిలో వచ్చిన మార్పు సామాజిక మార్పుల కారణంగాకాక సుధాచంద్ర అకాలమరణంతో వచ్చింది. ఒక రకంగా మానసికంగా అలసిపోయిన కృష్ణమూర్తిగారు మిగతా పిల్లల్ని కూడా పోగొట్టుకోలేక పరిస్థితుల్తో రాజీ పడ్డాడే గానీ, మార్పును నిజంగా ఆమోదించాడా? సందేహమే! అభ్యుదయకరమైన ఏ మార్పైనా వైయక్తికం కాదనీ, సామాజికమేననీ, వ్యక్తి సామాజికుడనీ అనంతర కథల్లో రచయిత బాగా గుర్తించాడు. దానికి ఉదాహరణ 'కుంభ మేళా' కథ

ఏదేమైనా 'కేంద్రంలేని వృత్తం' కథ సుమారు ముప్పై ఏళ్ళ తర్వాత ఇవాల్టి సమాజంలోని విషాదాంశాన్ని గుర్తుకు తెస్తుంది. ఎప్పుడో నరేంద్ర తొలియవ్వనంలో రాసిన ఈ కథలోని ఆదర్శవాదం ఇప్పటికీ నెరవేరనే లేదు దేశంలో కులమత భేదాలు మరింత సంక్లిష్ట దశకు చేరుకున్నాయి అగ్రవర్ణాధిక్యాలు పెచ్చరిల్లుతున్నాయి మత విద్వేషాలు రగులుతున్నాయి రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలే పనిగట్టుకుని వైషమ్యాలు సృష్టిస్తున్నాయి ఇప్పటికే ఎంతో విధ్వంసం జరిగింది. సమీప భవిష్యత్తులో ఇంకా విధ్వంసాలు జరిగే సూచనలున్నాయి ఈ నేపథ్యంలో 'కేంద్రంలేని వృత్తం' లాంటి కథ రాయాలంటే ఇవాళ్టి టీనేజీ రచయిత కొంతైనా సాహసం చేయాలేమో

నరేంద్ర తొలిరోజుల్లోనే రాసిన 'గుజ్జిమూ - కళ్ళెమూ' కథ (1977) చాలా

హాయిగా నడుస్తుంది పెద్ద సీరియస్ కథ కాదిది అయినా సామాజికాంశం నుంచి పక్కకు జరగదు పురుషాహంకారానికీ స్త్రీ వ్యక్తిత్వానికీ మధ్య సంఘర్షణను చిత్రించిన కథ జానపద కథల్లో ఒక రాజకుమారుడుంటాడు పెళ్ళాడ్డానికి తనకు మామూలు రాజకుమారి వద్దట! అసలైన రాజకుమారి కావాలంటాడు అలాంటి 'అసలైన' రాజకుమారి అతనికి ఎక్కడా దొరకదు కనబడ్డ ప్రతి రాజకుమారిలోనూ ఏదో లోపం కనిపిస్తూనే వుంటుంది

అలాంటివాడే ఈ కథలో నాగరాజు ఈ నాగరాజు ఎడతెగకుండా పెళ్ళి చూపులకు పోతూనే వుంటాడు ప్రతిచోటా పెళ్ళి కూతుర్ని తలతిక్క యక్షప్రశ్నలు వేస్తూనే వుంటాడు. సరైన సమాధానం చెప్పలేదని అందర్నీ తిరస్కరిస్తాడు. చివరికి శోభ అనే యువతి నాగరాజుకు ఎదురవుతుంది నాగరాజు దూకుడుకు కళ్ళెం వేసి అతని యక్షప్రశ్నలకు మాడు అదిరేలా సమాధానాలిచ్చి పంపిస్తుంది. చిత్రమేమిటంటే ఆ అమ్మాయే నాగరాజుకు నచ్చుతుంది ఇంతకీ శోభ అతన్ని పెళ్ళాడేందుకు ఒప్పుకుందో లేదో? అది తేల్చకుండానే కథ ముగిస్తాడు రచయిత అంత వ్యక్తిత్వం కలిగిన ఆ అమ్మాయి నాగరాజుని పెళ్ళాడటానికి ఒప్పుకుంటుందా? ఒప్పుకోదుగాక ఒప్పుకోదు అతగాడికో జాట్ దెబ్బ తగిలించడానికే ఆ పెళ్ళి చూపులకైనా ఒప్పుకుంది

'తియ్యటి శాపం'(1977) అనే కథలో ఒకదానికొకటి పొంతనలేని పరస్పర విరుద్ధ పరిస్థితుల్లో మానవతా సంబంధాలు ఎంత చిత్రంగా వుంటాయో చూపిస్తాడు రచయిత పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సులో జూనియర్ విద్యార్థి అయిన రాజుకు విజయ అనే సీనియర్‌తో పరిచయం కలుగుతుంది. రాజు తన ఈడు కుర్రాళ్ళ కొంటె స్వభావానికి విరుద్ధంగా విజయను 'అక్కా' అని పిలిచి చకితురాల్ని చేస్తాడు రాజు పుట్టి పెరిగిన కుటుంబ పరిస్థితుల దృష్ట్యా అదేమంత ఆశ్చర్యకరం కాదు. తన కంటూ ఆప్యాయంగా పిలుచుకోవడానికి అక్కచెల్లెళ్ళు గానీ, అన్నదమ్ములు గానీ లేని ఒంటరివాడు రాజు. బంధుత్వాలూ, ఆప్యాయతలూ ఇవేవీ తెలీక మానసికంగా కూడా ఒంటరిగా పెరుగుతాడు విజయ పుట్టి పెరిగిన కుటుంబ పరిస్థితులు అందుకు పూర్తిగా విరుద్ధం. ఆమెకు ఇంటినిండా కావలసిన వాళ్ళే ఒకరిపట్ల ఒకరికి పట్టరాని అభిమానాలు. ఆర్థిక ఇబ్బందులు, ఒడిదుడుకులు వీటి మధ్య పెరిగిన విజయ, 'వీళ్ళలో నేనొక్కదాన్నీ పుట్టకపోతేనేం?' అనుకుంటుంది చివరికి వాళ్ళమ్మ కూడా, 'ఇంతమందిని కన్నాను,' ఒకరిద్దరితో ఆపివుంటే వీళ్ళ కింత బాధలుండేవి కావు", అని పైకే అనేస్తుంది దానికి రాజు మాత్రం మరోవిధంగా స్పందిస్తాడు "ఇంతమందిని కన్నదానివి! వీళ్ళతోబాటు నన్నూ కనివుంటే నీ సొమ్మేం పోయి వుండేదమ్మా", అంటాడు మందిలో బతికినప్పుడే మనిషికి సుఖమనేది ఈ కథలోనే రచయిత గుర్తించాడనిపిస్తుంది

నరేంద్ర తొలికథలు చదివితే, ఈ రచయిత కథలు రాయడంతో పాటు సామాజికంగా ముందుకు ప్రయాణం చేస్తున్నాడని అవగాహనకు వస్తుంది 'రచన చేయడమన్నది ఒక ప్రయాణం లాంటిదేనని నాకు తెలిసివచ్చింది అయితే మరెవరూ నడవని చోటుకు వెళ్ళడమంటేనూ, నా అంతట నేనుగా

నా బాటను తయారు చేసుకోవడమంటేనూ నాకిష్టం రచన నాకు విలాసయాత్ర కాదు అది ఒక సాహసయాత్ర అడ్వెంచర్', అంటాడు నరేంద్ర

మనిషి నిజాయితీగా ఇతరులను సానుభూతితో అర్థంచేసుకుంటూ ఆదర్శంగా జీవించాలని నరేంద్ర తొలికథల్లోనే స్పష్టం చేస్తాడు కథన శిల్పంలో పట్టు తొలినుంచే బాగా అలవడింది చెప్పదల్చుకున్న విషయాన్ని కథలో అంతర్లీనంగా ప్రవహింపచేస్తూ అన్యాపదేశంగా చెప్పడమనే సుగుణాన్ని నరేంద్రలో మొదట్నుంచీ గమనించవచ్చు పాత్రల ప్రవర్తనద్వారా, సంభాషణ ద్వారా కథలో రచయిత ఆశించిన ప్రయోజనం సాధించడం కూడా మొదటినుంచే వుంది. ఒకసారి అలవడ్డాక ఈ రెండు సుగుణాలూ రచయితకు పోయేవికాదు నరేంద్ర అనంతర కథల్లో అచ్చంగా అవి అలాగే కొనసాగడం చూడొచ్చు

నరేంద్ర రాసిన అనంతర కథలు వస్తువరంగా క్రమంగా చిక్కనవుతూ వస్తాయి తొలి కథల్లో నరేంద్ర ఏ కోశానో తండ్రిగారి వేలుపట్టుకు నడుస్తున్నాడా అనిపిస్తుంది. అయితే ఆ తర్వాత తనే స్వంతంగా పరిగెత్తడం మొదలెట్టాడు వస్తువుతోపాటు కథనంలో కూడా గాఢత పెరుగుతూ వచ్చింది

నరేంద్ర రాసిన అనంతర కథల గురించి చెప్పుకోవాలంటే మొదట 'మిత్ర' కథ గురించి చెప్పుకోవాలి హెమింగ్వే సొంతమైన deceptively simple style 'మిత్ర' కథలో కనిపిస్తుంది శైలి విషయంలో అనితరసాధ్యుడు హెమింగ్వే నరేంద్ర హెమింగ్వే జోలికే పోలేదు అయినా అలాంటి సరళత్వమే 'మిత్ర' లో సాధించగలిగాడు. కథలో గాఢత, కథనంలో గోప్యత ఇంత అసాధారణ స్థాయిలో నరేంద్ర సరళంగా మలచగలగడం మరెక్కడా ఇంతగా సాధించలేదు.

పైకెంతో సరళంగా కనిపించే 'మిత్ర' కథలో గాఢమైన విషాదం ఘనీభవించి నెమ్మదిగా కరుగుతున్నట్లనిపిస్తుంది మొత్తంగా స్త్రీ అస్తిత్వానికే సంబంధించిన కథ మిత్ర. ఈ కథలోని మిత్ర పేరుకు తగ్గ స్నేహితురాలే రాజేష్‌కు అనేక సంవత్సరాల తర్వాత అనుకోకుండా మిత్రను ఆసుపత్రిలో కలుసుకుంటాడు రాజేష్. మిత్ర మామగారు గుండెపోటుతో ఆ ఆసుపత్రిలో వున్నాడు సమయానికి డాక్టర్ లేడు. రాజేష్ సాయంతో ఎలాగో తిప్పలుపడి మామగారికి సకాలంలో వైద్యం చేయించగలుగుతుంది మిత్ర మామగారి ప్రాణాలు నిలుస్తాయి మామగారిని కాపాడినందుకు అత్తగారి వైపు నుంచి కనీసపు అభినందన సైతం ఆశించదు సరికదా రాజేష్ తనకు సాయం చేశాడని కూడా చెప్పుకోలేదు.

ఎందుచేత?

ఈ కథ మొత్తంలో మిత్రవింద తాను మనిషిలాకాక నీడలా వుండిపోతుంది జీవితంలో అడుగడుగునా తనని తాను కుదించుకుంటూ పోతుంది అలా కుదించుకోవడమే ఆమె నైజంగా మారిపోతుంది ఆ నైజాన్ని ఆమె ఎంతో సహజంగా తనకుతాను ఆపాదించుకుంటుంది

నిజానికి రాజేష్‌తో స్నేహాన్ని మిత్రవింద తన అంతరంగిక రహస్యంగా వుంచాల్సినంత అగత్యం వాళ్ళిద్దరి మధ్యా ఏమీలేదు తన వూరే! తన చిన్ననాటి స్నేహితుడే! తనతో చిన్నప్పుడు కలిసి చదువుకున్నవాడే! అయినా రాజేష్ తనకు

మామగారి ప్రాణం కాపాడ్డంలో సాయం చేశాడని మాటవరసకైనా చెప్పుకోలేనంత అపరాధం ఏం జరిగిపోయింది? చదువుకుని ఉద్యోగం చేస్తూ కూడా తనని తాను అంతగా కుదించుకోవలసిన అవసరం ఏమిటి? ఈ ప్రశ్నలన్నింటికీ ఒకటే సమాధానం కనిపిస్తుంది - ఆమె స్త్రీ కావడం ఈ కథలోని విషాదం మిత్రవిందదికాదు, మన సమాజానిదే

మామగారిని ఆసుపత్రిలో చేర్చినప్పుడు ఆమె పడ్డ డైలమా సూక్ష్మదృష్టితో గమనించగలిగితే 'మిత్ర' కథలోని విషాదం ఎంత గంభీరమైందో తెలుస్తుంది. "అసలే మా అత్తగారికి నాపైన నమ్మకం తక్కువ చదువుకున్న కోడళ్ళకు అత్తామామా అంటే అలుసని ఆమె అభిప్రాయం యీయన గారేమో సమయానికి హాస్పిటల్లో చేరలేదు కొంపదీసి అనుకోనిదేమైనా జరిగుంటే జీవితాంతం నిందమోసి వుండాల్సిందే నేను తలుచుకుంటేనే భయంగా వుంది థాంక్ గాడ్!"

'కాకులు - గద్దలు' అనేది మరో శక్తివంతమైన కథ రచయిత సామాన్యుల్లో కెల్లా సామాన్యుల పక్షం నిలబడి ఈ లంపెన్ ప్రపంచంలో కాకుల్ని కొట్టి గద్దలకు వేయడం అంటే యేమిటో ప్రత్యక్షంగా కళ్ళకు కట్టిస్తాడు ఇవాల్టి రాయలసీమ ఒకానొకప్పుడు దుర్గమారణ్య ప్రాంతం పోయినవి పోగా అడవులు ఇంకా మిగిలే వున్నాయి. చిత్తూరు జిల్లాలోని అడవుల్లో కట్టెలు కొట్టేవారి జీవితాలు ఎలాంటివో, వారనుభవించే హింస ఎలాంటిదో, ఆ దోపిడీ ఎవరిదో వాస్తవ దృష్టితో పరిశీలించే కథ 'కాకులు - గ్రద్దలు'.

అసలా అడవుల్లో కట్టెలు కొట్టే వాళ్ళెవరు?

'వూర్లో సగానికి పైగా రైతులు బీళ్ళు పెట్టేసినారు మాలోళ్ళకు కూలీ పనులు లేవు. వాళ్ళు కట్టెల దుడ్డురుచి చూసేసినారు టవున్లో మోపుకు కనాకష్టం పదైదిరవై పలకతావుందట", అని వివరిస్తుందో లంపెన్ పాత్ర

అడవిలో కట్టెలు కొట్టడం, వాటిని రైల్లో వేసి టౌనుకు తీసుకుపోవడం, అక్కడ మోపుకింతని అమ్మడం - అడవినుంచి టౌనుకు సాగే ఈ ప్రయాణం నిప్పులమీద నడకలాంటిది. దారిపొడుగునా మామూళ్ళ రాబందులు ఈ కథలో ప్రధానపాత్ర కట్టెలు కొట్టే మునెమ్మ కథలో కొనా మొదలు ఈ మునెమ్మ నేపథ్యంలోనే వుంటుంది. చివర్లో మాత్రం పూర్తిగా ముందుకొస్తుంది మధ్యలో అక్కడక్కడా ఫ్లాష్‌లా ఎదురవుతూ వుంటుంది కథ యావత్తు లంపెన్ పాత్రలే ముందుకు నడిపిస్తాయి. మధ్యలో ఎదురైనప్పుడల్లా మునెమ్మ ఎప్పుడూ ఒకే మాట పలుకుతుంది - "దండాలు దొరా! నేను సామీ... మునెమ్మని." కథ చివర్లో తప్ప మునెమ్మ ఆ ఒక్క మాట తప్పనిచ్చి నోరు విప్పదు మునెమ్మకు దార్లో ఎదురయే ప్రతి మామూళ్ళ వాడూ, ప్రతి గార్డూ, ప్రతి అధికారి - అందరూ దొరలే రైల్లో చెకింగ్ కోసం అధికారులు వచ్చినప్పుడు కట్టెల మోపులు వదిలేసి, ప్రాణాలకు తెగించి, పరిగెడుతున్న రైల్లోంచి దూకి పారిపోయేవాళ్ళు పారిపోగా, అలా పారిపోలేని మునెమ్మ అధికారులకు దొరికిపోతుంది

"దొరా! నేనొక మాట చెప్తాను, యేమీ అనుకోవద్దు యీ మోపు వూరికే వచ్చిందని అనుకుంటూ వుండావు కదా! అదేం లేదు సామీ! ఫారెస్టు గార్డుకు తలా కొంచెమిచ్చినాము రైలుగార్డుకూ, టిగిట్లాయనకూ యిచ్చినాము చాలని దానికి వూళ్ళో రైతులు అడ్డం పడితే కాళ్ళా వేళ్ళా పడినాము కూలీ రూకలు చానా గావాలని అడగమని పమాణకం చేసినాము" అని చెబుతుంది

కథ చివర్లోగాని ముందుకురాని ఈ మునెమ్మ కట్టెలోళ్ళ జీవితాల్లోని హింసను ఒక్కసారిగా బట్టబయలు చేస్తుంది లాఘవమైన సంభాషణల్తో కథ నడిపిస్తాడు రచయిత

"నాకు యేమీ తెలియదని అనుకుంటా వుండావేమోగానీ అన్నీ తెలుసులే సామీ! యీ కట్టెల మోపుల్ని మేము పోయినాక యేలం యేస్తారంట గదా? యెవురు యెక్కువగాపాడితే వాళ్ళకమ్మేసి రూకలు గవర్నమెంటు కిచ్చేస్తారంటగదా! యీ కట్టెల్ని మేమే తలాకొంచెం యేసుకొని యిచ్చేస్తాం కాకుల్ని కొట్టి గద్దలకెయ్యొద్దు సామీ", అంటుంది మునెమ్మ

ఇదంతా విన్న అధికారికి ఏ మూలో కాస్త అపరాధభావం కలక్క మానదు "యీ రూల్సు యెవరు ఫ్రేం చేశారో కానీ, వాడు భలే కంత్రీగా వుండి వుంటాడు", అనిపిస్తాడు రచయిత రాజ్య స్వభావం ఇక్కడ బాగా వ్యక్తమవుతుంది

'అత్యాచారం' కథలోని అత్యాచారం భిన్న స్థాయిల్లో భిన్న విధాలుగా వుంటుంది వెరశి మొత్తంగా అత్యాచారం శ్రమ జీవనం మీద సాగుతుంది పెట్టుబడిదారీ సమాజంలో వ్యవసాయంమీద బిజినెస్ ఎలా పెత్తందారుగా మారుతుందో వివరిస్తుంది 'అత్యాచారం' కథ రాయలసీమ ప్రాంతంలో వ్యవసాయంమీద సాగుతున్న 'అడమాణం' అనే దోపిడీ విధానం గురించి కూడా తెలియజేస్తుంది

చిత్తూరు జిల్లా మామిడి పళ్ళకు ప్రసిద్ధి ఇక్కడ మామిడి తోపులు, ఎక్కడ చూసినా ఫలసాయంతో బరువుగా తలాడిస్తూ కనిపిస్తాయి పీతర్, నీలం, రుమానీ - ఇలా రకరకాల మామిడి పళ్ళు వాటిని మార్కెట్ చేయడానికో బిజినెస్ బకాసురుడు అతని పేరు సిద్ధముని ఈ సిద్ధముని రైతుల పంట మొదటే కొనేస్తాడు - పూర్తి డబ్బులివ్వకుండా! పంట రైతుది కాదు, వ్యాపారస్తుడిది పంట చేతికొచ్చే దాకాకూడా పరోక్షంగా వ్యాపారస్తుడే పంటమీద గుత్తాధిపతి శ్రమించే రైతు నిమిత్తమాత్రుడు పంట తనదే అయినా దానిమీద అధికారం లేనివాడు. ఇదే అడమాణం పద్ధతి భూమికీ, భూమిమీద పెత్తనం చేసేవాడికీ నేరుగా సంబంధమే లేదు

రైతు తనని మోసం చేస్తాడేమోనని వ్యాపారస్తుడి అనుమానం భూమి రైతుది కాపలాదారుడు వ్యాపారస్తుడి మనిషి రైతుమీద నిఘా వేయడానికి ఏర్పాటైన వాడు రైతు సహిస్తాడా? ఏదో వంక పెట్టి సిద్ధముని ఏర్పాటు చేసిన కాపలాదారును తరిమేస్తాడు. పంట పండించిన రైతునే దొంగ అంటాడు వ్యాపారస్తుడు

ఈ వైకుంఠపాళిలో కాపలాదారు పాత్ర గమ్మత్తుగా వుంటుంది అటు రైతు, ఇటు వ్యాపారస్తుడు - ఎటు తంతే అటు పోయి పడే ఫుట్‌బాల్ ఈ కాపలాదారు ఇతని మీద దొంగతనం నేరం మోపి రైతు తరిమేస్తే వ్యాపారస్తుడి దగ్గరికి వచ్చిపడతాడు రైతుతో కుమ్మక్కైనాడని నింద మోపి ఇతనికివ్వాల్సిన అయిదు వందల రూపాయలు కూడా ఎగ్గొట్ట పంపిస్తాడు వ్యాపారస్తుడు వీళ్ళందరి మధ్యా కాపలాదారు భార్య కూడా వుంటుంది ఆమె నోటి వెంట మాట పెగిలే రకం కాదు అన్నిరకాల అత్యాచారాలకూ ఆమె అతీతమైంది కాపలాదారును భయపెట్టి తరిమేయడానికి రైతు తాలూకువాళ్ళు ఆమె కొంగుపట్టి లాగుతారు తనపై అత్యాచారం జరిగిందో లేదో పట్టించుకునే స్థితిలో కూడా వుండదామె

"నాలుగు కాళ్ళ మండపం" సత్రం పాలబడి బతికే కూలినాలి జనం దీనగాథ. నాలుగు కాళ్ళ మండపంలో రాత్రి ముణగదీసుకు పడుకున్న కూలి జనానికి తెల్లారకముందే బతుకుపోరు ప్రారంభమైపోతుంది శరీరంలో కంటే, వంట్లో శక్తి వారి పెట్టుబడి. వాళ్ళని అజమాయిషీ చేసే మేస్త్రీలు, చవగ్గా బేరమాడుకుని పిల్చుకెళ్ళే యజమానులూ వుంటారు వీళ్ళలో చాలామంది రైతులే పొలాలు బీడు పెట్టేసి కూలీలుగా వచ్చి నాలుగు కాళ్ళ మండపంలో చేరతారు ఆడకూలీలైతే వంట్లో శక్తితోపాటు వున్నంతమేరకు యవ్వనమూ పెట్టుబడే! అది వళ్ళమ్ముకోవడం మాత్రం కాదు- తమని పన్లో పెట్టే ఎవరో ఒకర్ని నమ్ముకోవడం!

ఒక మగాడి చేతుల్లో మోసపోయిన రాజీ నాలుగు కాళ్ళ మండపం కేరాఫ్ అయిన రంగమ్మ అనే కూలిమనిషి ప్రాపకంలో చేరుతుంది. కూలిపని చేయడానికి శక్తి వుడిగిపోయిన రంగమ్మ మంచి వయసులో వున్న రాజీని ఏ మేస్త్రీకో అప్పగించి తన ఆర్థికావసరాలు గడుపుకోవాలని ఆలోచన చేస్తుంది. అయితే రంగమ్మతో ప్రమేయం లేకుండానే రాజీని ఎగరేసుకుపోతాడు మేస్త్రీ.

ఈ కథలో రాజీ ఎక్కడా చిన్నమెత్తు మాటకూడా పలకదు. బతుకు ఎటువైపు తోస్తే అటువైపు నిర్లిప్తంగా వెళ్ళిపోవడమే రాజీ వంతు. అదే ఆమె అవసరం కూడా. రంగమ్మకు మాత్రం రాజీమీద తన పెట్టుబడి వృథా అయిపోగా రాజీ తనను మోసం చేస్తోందని తోస్తుంది.

ఈ కథలో కూడా శ్రమదే ముఖ్య పాత్ర. శ్రమఫలితం మీద శ్రమజీవికి అధికారం లేనప్పుడు అంచెలంచెలుగా దోపిడీ ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా కూడా ఎలా జరుగుతుందో 'నాలుగు కాళ్ళ మండపం' కథ తెలియజేస్తుంది.

'నిత్యమూ నిరంతరమూ' కథలో మళ్ళీ స్త్రీల సమస్య గురించి చర్చిస్తాడు నరేంద్ర. ఈ కథలో ముగ్గురు స్త్రీలుంటారు - షర్మిల, సుశీల, సుగుణమ్మ. భర్త గురించి ఎడతెగని ఎదురు చూపులు వీరి సమస్య. ఎంత పడిగాపులు కాచినా రోజూ సమయానికి ఇంటికి రాని భర్త స్త్రీ జీవితంలో ఎంత సమస్య సృష్టిస్తాడో స్త్రీ దృష్టికోణం నుంచి చూస్తాడు రచయిత 'మిత్ర' కథలో మగపాత్ర

ద్వారా పరోక్షంగా స్త్రీ అస్తిత్వాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేసిన రచయిత 'నిత్యమూ నిరంతరమూ' కథలో నేరుగా స్త్రీ జీవితంలోకి చొచ్చుకుపోతాడు

"యెప్పుడో యిట్ల చూస్తా చేస్తా కాలుజారి కిందపడి చస్తానేమో నేను" అని షర్మిల గొణుక్కోవడంతో ఎంతో అర్థవంతంగా కథ ప్రారంభమవుతుంది భర్తకోసం ఎదురుచూడ్డంలో గల బాధని షర్మిల, సుశీల ఇద్దరూ కలబోసుకుంటారు. కూతురు జ్వరంతో పడున్నా పార్టీకి వెళ్ళి అర్ధరాత్రి దాకా ఇంటికి రాని భర్త ఒకడు. బిడ్డను ఆసుపత్రికైనా తీసుకెళ్ళలేని పెళ్ళాం ఎందుకని గంతులేసే భర్త మరొకడు షర్మిల ఉద్యోగం చేయకపోయినా, సుశీల ఉద్యోగం చేస్తున్నా ఇద్దరి బాధ ఒకలాంటిదే! అది నిత్యమూ, నిరంతరమూ దానికి కులమతాల భేదంలేదు. సుగుణమ్మ పరిస్థితి కాస్తవేరు ఈమె భర్త ఇంటి పట్టునే వుంటాడు. అతన్తో ఏళ్ళ తరబడి మాట్లాడకుండా మూగనోము పట్టి ఇంట కట్టి పడేస్తుంది సుగుణమ్మ అందుకుని తామిద్దరికంటే సుగుణమ్మే కాస్త మేలేమోననిపిస్తుంది షర్మిలకు. అయితే సుశీల దానికి మరోవిధంగా సమాధానమిస్తుంది - "అదీ వొకరకమైన యెదురు చూడ్డమే కదా! మొగుడితో సామరస్యం కోసం, సుఖమైన సంసార జీవితం కోసం, వొకే కప్పు కింద వుంటే యేళ్ళ తరబడి యెదురు చూడ్డం," అయింది ఏ వైపునుంచి చూసినా అసలు సమస్య స్త్రీదే! ఇంటా బయటా ఎక్కడైనా పురుషాహంకారం ఒక్కటే!

'జాతరలో వేషధారి'లో ప్రధానపాత్ర తన అంతర్ముఖం నుంచి కథ చెబుతుంది. ఈ రకమైన కథన శిల్పం తెలుగులో అరుదు మనిషిలోపల దాగివుండే మిస్టర్‌హైడ్‌ని బయట్టబయలు చేసే ప్రయత్నంలో ఈ విధమైన శిల్పం అవసరమైంది రచయితకు. దానివల్ల మనిషిలోపలి చీకటి కోణాన్ని నేరుగా ఆవిష్కరించడానికి వీలైంది. పైకి ఘరానాగా కనిపిస్తూ వెనక గోతులు తీసేవాడి అంతర్దృష్టి కోణం నుంచి కథ సాగుతుంది కొన్ని చోట్ల అధివాస్తవిక కథా లక్షణాలు కనిపించినా ఇది సర్రియలిస్టు స్టోరీకాదు. వాస్తవిక కథ. మానసిక చిత్రణ అవసరాన్ని బట్టి ఇందులో ప్రధాన పాత్ర ఎప్పటికప్పుడు మొహం మార్చేసుకుంటూ వుంటాడు. ఒకసారి గోముఖం ఒకసారి గాడిద ముఖం. ఒకసారి తోడేలు ముఖం. ఒకసారి సింహం ముఖం ఒకసారి కుక్క ముఖం - ఇలా రకరకాలుగా - కొన్నిసార్లు ప్రయత్న పూర్వకంగా, కొన్నిసార్లు సహజంగానూ మార్చేసుకుంటూ వుంటాడు. ఎదుటివాణ్ణి పడగొట్టేసినప్పుడల్లా ఒక పువ్వు చేతికిచ్చాడని రచయిత సింబాలిక్‌గా తెలియజేస్తుంటాడు అందుకే అతను జాతరలో వేషధారి ఈ ప్రపంచమంతా అతనికో జాతర ఆ జాతరలో రకరకాల వేషాలు వేసి అయినవాళ్ళనీ కానివాళ్ళనీ అందర్నీ మోసంచేసి బతికేస్తుంటాడు. అంతాచేసి అతగాడి అసలు మొహం కనబడకుండా చీకట్లో వుండిపోతుంది.

'గమనం' కథ మనుషుల మధ్య సంబంధాలు డబ్బుతో ఎలా ముడిపడి వుంటాయో, మనిషి చనిపోయాక కూడా బతికున్న వాళ్ళతో అతని సంబంధాన్ని డబ్బు ఎలా కొనసాగిస్తుందో తెలియజేస్తుంది. ఈ కథలో రచయిత మనుషుల మధ్య సంబంధానికి ఎన్నుకున్న ప్రతీక వివాహం.

మోటారు యాక్సిడెంటులో ఒకతను చనిపోతాడు నష్ట పరిహారానికి కోర్టులో దావా వేయడంకోసం సుబ్రమణ్యం అనే కుర్రలాయరు మృతుడి భార్య ఎక్కడుందో ఆరా తీసి మరీ వెళ్తాడు. అయితే అప్పటికే ఆమె రెండో పెళ్ళి చేసుకుంటుంది నష్టపరిహారం పొందడానికి చట్టపరంగా ఆమెకిప్పుడు అధికారం లేదు కానీ, ఆమె రెండో భర్త ఆ డబ్బు కోసం ఆమెతో తనపెళ్ళి జరగలేదన్నట్టే వుండి పోవడానికి సిద్ధపడతాడు నల్లపూసల తాడు తీసేసి కోర్టుకు రావడానికి ఆమె కూడా సిద్ధపడిపోతుంది. తమాషా ఏమిటంటే తనకా నష్టపరిహారమేదో చేతికొచ్చాక ఆ నల్లపూసలతాడే బంగారంతో చేయించుకోవాలని ముచ్చట పడుతుంది

అయితే దానికీ కారణం వుంది. ఆమె తన వెంట పెళ్ళిలో విలువైన వస్తువు ఒక్కటీ తేలేదని రెండో భర్త సతాయిస్తుంటాడు రచయిత మొదట్నుంచీ వివాహానికీ అర్థికానికీ సంబంధం సూచిస్తూనే వుంటాడు. శ్రీదేవి అనే అమ్మాయితో కుర్రలాయరుకు జరగాల్సిన పెళ్ళి అర్థిక స్థోమతలేని కారణంగానే గల్లంతై వుంటుంది చెల్లెలి పెండ్లికి ఇంట్లో పదివేలిస్తే గానీ కుర్రలాయరు మానం నిలవలేదు.

లాయరు గుమస్తా ఒక ధర్మ సూక్ష్మం బోధిస్తాడు "బాగా బీదోళ్ళలోనూ, పెద్ద ధనవంతుల్లోనూ ఆడపిల్లకు అవసరమైతే రెండో పెండ్లి గూడా చేస్తారు. నడిమధ్య వుండే మన మిడిల్ క్లాసోళ్ళు మాత్రం అట్లంతా వొప్పుకోరు", అంటాడు

కథ చివర్లో తన క్లయింటుపట్ల ఆకర్షణ కలుగుతంది కుర్రలాయరుకు. స్త్రీ పురుషుల మధ్య సహజంగా కలిగే ఆకర్షణ వివాహ రూపం ధరించాలంటే అర్థికాంశం పెద్దపాత్ర పోషిస్తుందని అన్యాపదేశంగా సూచిస్తాడు రచయిత సమాజ గమనం డబ్బుతో ముడిపడి వుంది మనుషుల మధ్య సంబంధాలన్నీ దానికి అనుగుణంగానే వుంటాయి

'కుంభమేళా' కథలో కూడా 'జాతరలో వేషధారి' కథలోలాగే అక్కడక్కడా అధివాస్తవిక ధోరణి గోచరిస్తుంది. అయితే ఇది కూడా అధివాస్తవిక కథ కాదు 'కుంభమేళా' కథలో రెండు అసాధారణ పాత్రలుంటాయి అసాధారణ పాత్రలని ఎందుకనాల్సి వచ్చిందంటే నిత్య జీవితంలో మనకు రోజూ ఇలాంటి పాత్రలు తారసపడవు.

ఒకటి మధుశోధన్ పాత్ర నిజానికతని పేరు మధుసూదన్ సింబాలిక్ అతను తన పేరు మధుశోధన్‌గా చెప్పుకుంటూ వుంటాడు ఇతను తన జీవితంలో శోధించేవి రెండు ఒకటి అందర్లో ప్రత్యేకత. రెండవది మనశ్శాంతి మొదటి శోధనలో పట్టుబట్టి సినిమా నటుడై పెద్దస్టార్‌గా వెలిగిపోతాడు. దాని కారణంగా అతని జీవితంలో రెండవ శోధన ప్రారంభమవుతుంది పదిమందిలో తన ప్రత్యేకత కాపాడుకోవాలనే యావ ఉన్మాదస్థితికి చేరుకుని సాటి మనిషికి దూరమై ఒంటరివాడైపోతాడు 'ప్రపంచంతో సంబంధం లేకుండా జీవించడమనే కళను ప్రాక్టీసు చేయడం మొదలుపెట్టేశాను' అని ఒక చోట చెప్పుకుంటాడతను. అలా జీవించడం అతనికి గొప్పగా తోస్తుంది. అయితే మనిషనుంచి దూరమై

పోవడంతో అతనికి రకరకాల మానసిక ప్రకోపాలు కలుగుతాయి తీరా తన రెండో పిక్చరు ఫెయిలయితే ఈ ప్రత్యేకతంతా ఏమైపోతుందనే భయం కలుగుతుంది.

అలాంటి స్థితిలో మధుశోధన్‌కు పండరిపురంలో ఒక విచిత్ర వ్యక్తి తారసపడతాడు ఈ విచిత్ర వ్యక్తికి పేరులేదు తెలుపూ నలుపు గడ్డంవాడు అనేదే అతని అభిజ్ఞ ఈ తెలుపూ నలుపు గడ్డంవాడు ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమైపోతూ వుంటాడు జనంతోటే అతని వాసం జనంతోటే అతని సాహచర్యం "ఆశ్చర్యం. అద్భుతం. వొక్కడు కాదు అక్కడక్కడా ప్రతి గుంపులోనూ వొక్కడుగా, ప్రతి యిద్దరిలోనూ వొక్కడుగా" గడ్డంవాడు కనిపిస్తాడు మధుశోధన్‌కు. గడ్డం వాడితో కొద్ది సేపటి పరిచయం మధుశోధన్‌లో పెద్దమార్పు తెస్తుంది. అంతకు ముందు అతను ఒంటరివాడు

ఆ ఒంటరితనం ఎలాంటిదో కథా ప్రారంభంలోనే ఒక పీడకల వర్ణనగా సూచిస్తాడు రచయిత అంతటి భయంకరమైన ఒంటరితనాన్ని ఎదుర్కొంటున్న మధుశోధన్ - కేవలం అహంకారమే ఆలంబనగా జీవిస్తున్న మధుశోధన్ - తన నెక్స్ట్ పిక్చర్ ఫెయిలయితే ఎలాగనే ఆందోళనతో ఆత్మహత్యకు సిద్ధపడ్డ మధుశోధన్ గడ్డంవాణ్ణి చూసి మారతాడు

'కుంభమేళా' మనిషి అహంకారాన్ని గురించిన కథ అయితే మనిషి అహంకారం అంతరించడం గురించి ఎలాంటి మెట్ట వేదాంతం ప్రతిపాదించటం లేదు రచయిత 'కుంభమేళా' లో రచయిత సూచిస్తున్న పరిష్కారం లౌకికమైంది మనిషి సంఘజీవి. జనంలో ఒకడుగానే మనిషి జీవించాలి ఈ సత్యాన్ని కథ ముగింపులో ఇలా సూచిస్తాడు రచయిత -

"యే ప్రత్యేకతాలేని సామాన్యమైన వ్యక్తిగా, మామూలు మానవుడిగా, జనంతో కలిసి పదిమందిలో వొకడుగా, సముదాయంలో వొకభాగంగా, వొళ్ళు మరిచి గుంపులో కలిసిపోతూ నా మిత్రుడైన నలుపూ తెలుపు గడ్డం వాడిని అన్వేషించి పట్టుకోగలిగేదెప్పుడు? అది సాధ్యమేనా యికపైన? దాహం తీర్చుకోవడానికి మామూలు నీళ్ళు గ్లాసుడు చాలు పెద్ద సముద్రంలో ప్రయాణం చేస్తున్నా, మంచినీళ్ళు కరువైతే బతకడమెలా? నీడల్లో, చీకట్లో, వొంటరితనంలో, నీళ్లలో, యెండలో, మట్టిలో గడపడమెలాగో తెలుసునాకు జనస్నానపు రుచి యిప్పుడిప్పుడే తెలిసింది"

తీర్థయాత్రను 'జనస్నానం' అని సమీకరించడంలో రచయిత తాత్వికదృష్టి లౌకికమేనని తెలుస్తుంది వాస్తవిక కథలు రాసే నరేంద్ర 'కుంభమేళా' కథలో మాత్రం మిస్టిసిజాన్ని ఆశ్రయించాడు. అయితే రచయిత చెప్పదల్చుకున్న విషయం ఈ మిస్టిసిజంలో ఎక్కడా కొట్టుకుపోలేదు మిస్టిసిజాన్ని ఆశ్రయించి లౌకికంగా కథ చెప్పడం ఒక సాహసం అయితే రచన చేయడం తనకో అడ్వెంచర్ లాంటిదని రచయితే చెప్పుకున్నందువల్ల ఈ సాహసాన్ని అర్థం చేసుకోవచ్చు.

'గమ్యం' కథ గురించి చెప్పకుండా నరేంద్ర రచనల గురించి ఎంత

చెప్పినా తక్కువే అవుతుంది సామాజిక 'గమనం' గురించి చెప్పాక 'గమ్యం' గురించి చెప్పకుండా వుంటాడా? మనుషుల ప్రవర్తనకు ఆర్థిక మూలాలతో గల సంబంధం కథ ద్వారా కాళీపట్నం రామారావుగారుచేసే నిరూపణ లాంటిదే నరేంద్ర 'గమ్యం' కథలో చేసి చూపుతాడు.

'గమ్యం' కథలో ఎప్పుడో చిన్నప్పుడే శ్రమపట్ల వెగటుతో ఇల్లు విడిచి పోయిన చినబ్బ చాలాకాలం తర్వాత విమల ప్రకాశానంద స్వామిగా అవతారమెత్తి తన పల్లెకు తిరిగొస్తాడు అక్కడ అన్నగారైన వెంకట సిద్ధయ్య టీచరుగా రిటైరై మామిడికాయల వ్యాపారంలో బాగా గడించాడు వెంకట సిద్ధయ్యకు ముగ్గురు కొడుకులు పెద్దవాడు రాజగోపాల్ కువైట్ వెళ్ళొచ్చి ప్రస్తుతం షార్జాకు వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు రెండోవాడైన రెడ్డెప్ప ఎమ్మేదాకా చదివినా సేద్యం చేసుకుంటూ కుటుంబాస్తి అయిన పొలాల్నీ, మామిడితోటనూ చూసు కుంటున్నాడు మూడోవాడు రామచంద్రయ్య ఉద్యోగస్తుడు

ఒకదానికొకటి విరుద్ధమైన ఈ అయిదుపాత్రలూ ఆస్తిచుట్టూ తిరుగుతాయి అయిదుగుర్నీ పట్టివుంచే న్యూక్లియస్ కుటుంబాస్తి అంటే, పొలమూ మామిడితోట. దాన్ని స్వాధీనంలో వుంచుకొని ఎడతెగని శ్రమ చేస్తున్న రెడ్డెప్ప ఈ కథకు కేంద్ర బిందువు రెడ్డెప్ప కష్టజీవి కాబట్టి అందరికీ అతనంటే చిన్న చూపే అయితే అందరికీ కుటుంబాస్తి కావాలి. ఇక్కడ మళ్ళీ శ్రమ దగ్గరికే వస్తాడు రచయిత కుటుంబంలో అందరికంటే ఎక్కువ శ్రమించేవాడు రెడ్డెప్ప ఎంత ఎక్కువ శ్రమపడతాడో అంత తక్కువ ఫలితం పొందుతాడు అన్నదమ్ములు ముగ్గుర్లోనూ అతి తక్కువ శ్రమపడే రామచంద్రయ్య ఎక్కువ సుఖపడి పోతుంటాడు.

శ్రమ ఫలితం దక్కడంలో గల ఈ అవతవక వెంకట సిద్దయ్యను కూడా ఆశ్చర్య పరుస్తుంది ఇదంతా కప్పల తక్కెడ వ్యవహారం. కష్టానికీ ఫలితానికీ సంబంధమే లేదు అని ఒకచోట అనేస్తాడు. పెట్టుబడిదారీ సమాజంలోని వైపరీత్యం అదేనని వెంకట సిద్ధయ్యకు తెలీదు. రచయితకు తెలుసు. శ్రమకు వ్యతిరేకిగా మారి కూర్చుని తినడానికి అలవాటు పడ్డ స్వామీజీ అందర్లోకి ఎక్కువ సుఖపడుతున్నాడని అందుకే ముచ్చటపడతాడు వెంకట సిద్ధయ్య

కథ మళ్ళీ అటూ ఇటూ తిరిగి ఆస్తికాడికే వస్తుంది శ్రమఫలితం దక్కని రెడ్డెప్ప భూమిని అమ్మేయాలనుకుంటాడు మిగతా ఇద్దరు సోదరులూ దాన్ని కొనేయాలనుకుంటారు సేద్యానికి కాదు - అడమాణం పెట్టడానికి. సర్వసంగ పరిత్యాగి అయిన స్వామీజీ కూడా ఆశ్రమం ఏర్పాటు చేయడానికి అదే ఆస్తిమీద కన్నేయడం కొసమెరుపు ఈ జంజాటంలో కష్టపడి పండించిన టమేటాకు ఒక్కసారిగా మార్కెట్లో రేటు పడిపోతుండంతో రెడ్డెప్ప ట్రాక్టరు కిందపడతాడు రెడ్డెప్ప ట్రాక్టరు కింద పడ్డం వెనకున్న కారణం అన్వేషిస్తే ఒక అర్థశాస్త్ర గ్రంథం రాయొచ్చు. నరేంద్ర కథ రాశాడు.

నరేంద్ర కథల్లో సంతృప్తి కలిగించే అంశం రచయిత సామాన్యుడి పక్షాన నిలబడ్డం సమాజాన్ని నడిపించే ఆర్థిక సూత్రాలు నరేంద్రకు బాగా తెలుసు.

స్త్రీల కథలు రాస్తే తనే స్త్రీగా ఆలోచించగలడు 'యేమగవాడినైనా యీ లోకంలోకి తీసుకొచ్చిన వ్యక్తి స్త్రీ మూర్తే అయినప్పుడు, ప్రతిమగవాడికీ దొరికే మొదటి ఆలంబన స్త్రీయే అయినప్పుడు, సహతుకంగా ఆలోచించే ప్రతి మగవాడూ ఫెమినిస్టుగాక మరేమౌతాడు?'' అంటాడు నరేంద్ర

నరేంద్ర కథలు పెద్దవి. కొన్ని చాలా చాలా పెద్దవి. కా రా మాస్టారులో కనిపించే విస్తృతి, పరిశీలనా శక్తి ఈ కథల్లో కూడా కనిపిస్తుంది నాన్నగారినుండి నరేంద్ర కథ నేర్చుకున్నా, కథనంలో తన వరవడి తాను దిద్దుకున్నాడు రాజారాంగారి మధుర కథనం నరేంద్ర అలవర్చుకోలేదు కానీ, ఎందుకు అలవర్చుకోవాలి? నాన్నగారిలాగే కథ రాస్తే పిల్ల వసుచరిత్ర కారుడై మిగిలేవాడు నరేంద్ర మరో యుగంలో కథ రాస్తున్నవాడు తన యుగ ప్రభావం నరేంద్ర మీద పడి తీరుతుంది. "క్రమంగా నేను ప్రతి రచయితా తనకోసమే రచనలు సాగించాలని తెలుసుకున్నాను సర్వమానవాళికీ తనకూ తేడాలేదని తెలుసుకున్న రచయిత తన అంతఃప్రపంచానికీ బాహ్యప్రపంచానికీ తేడా వుండదని తెలుసు కోగలుగుతాడని నాకర్థమైంది", అంటాడు అది చాలా అర్థవంతమైన మాట

పాత్రల చేత మాట్లాడించడం ద్వారా నరేంద్ర ఎలా కథ నడిపిస్తాడో మాట్లాడించకుండా కూడా అలాగే కథ నడిపిస్తాడు 'నాలుగు కాళ్ళ మండపం' కథలో అతిముఖ్యమైన రాజీ పాత్ర ఎక్కడా ఒక్కమాటకూడా మాట్లాడదు. 'అత్యాచారం' కథలో కాపలావాడి భార్య కూడా అంతే- ఎక్కడా నోరు విప్పదు ఈ పాత్రలు మౌనంతో చెప్పగలిగినంత కథ మాటలతో చెప్పగలిగేవి కాదు. వారి మౌనం వెనకున్న అగాధం చాలా లోతైనది.

భాష విషయానికొస్తే చిత్తూరు జిల్లా మాండలికాన్ని కథలో జాగ్రత్తగా ప్రయోగిస్తాడు నరేంద్ర. వాక్యంలో అచ్చుల కంటే హల్లులు వాడ్డమే నరేంద్ర కిష్టం. వ్యావహారిక భాషా ప్రయోగంలో అదొక అందమేగానీ వాక్యారంభంలో కూడా అచ్చుకు బదులు హల్లే వాడ్డం కాస్త విచార్యమే. అ అలు తప్పనిచ్చి మిగతా అచ్చుల ప్రయోగమే లేకపోయింది. నరేంద్ర ఇది కాస్త ఆలోచించాలి. వ్యవహారంలో మనమింకా అచ్చుల్ని పూర్తిగా విసర్జించలేదు

నరేంద్ర వయసింకా చిన్నదే! మరిన్ని సాహసాలు చేయాల్సిందే! మరిన్ని కథలు రాయాల్సిందే

# ఎ. అప్పలనాయుడు

♦ వివిన మూర్తి ♦

ఆంధ్రప్రదేశ్‌లో ఒరిస్సా రాష్ట్ర సరిహద్దుల్లో ఉంది శ్రీకాకుళం జిల్లా అశోక చక్రవర్తిని ఎదిరించి ప్రాణాలు ధారపోసిన చరిత్ర ఈ ప్రాంతానికి ఉంది స్వాతంత్ర్యానంతర ఎన్నికల తీరునే ఓ కొలమానంగా తీసుకున్నా - ఇతర ప్రాంతాలను ముంచెత్తిన ఎన్నికల తరంగాలు ఇక్కడ పనిచేయని సందర్భాలు ఉన్నాయి బెంగాల్‌లో నక్సల్బరీ ఉద్యమానికి సమాంతరంగా ఇక్కడే గిరిజనులు వ్యవస్థపై పోరాటం ఆరంభించారు అడవులు, కొండలూ, సముద్రతీరం, మైదానాలూ గల ఈ ప్రాంతంలో సవరలూ, కోదులూ వంటి గిరిజనుల మీద జరుగుతున్న దోపిడీ, దౌర్జన్యాలకు చలించిపోయిన ప్రభుత్వ పాఠశాల ఉపాధ్యాయులే ఈ పోరాటాలకు ఆద్యులయ్యారు శ్రీకాకుళ ఉద్యమం అనగానే గుర్తు వచ్చేది ఉద్యమ సాహిత్యం ఈ సాహిత్యం అనగానే గుర్తుకు వచ్చే రచయితలు భూషణం మాస్టారూ, అట్టాడ అప్పలనాయుడూ

శ్రీకాకుళ ఉద్యమం ఆరంభం కాకముందే భూషణంగారు రచయితలు అప్పటికే ఉపాధ్యాయ సంఘాలలో, కమ్యూనిస్ట్ ఉద్యమంలో కార్యకర్తలు. వీరి కలం ఉద్యమంతో మరింతగా జనానికి చేరువయింది. అప్పలనాయుడు రచయిత కావటం పూర్తిగా ఉద్యమ ఫలితమేనని చెప్పవచ్చు.

ఎందుకంటే-

ఉద్యమం సాగుతున్న ఏజెన్సీకి ఐదు, పది కిలోమీటర్ల దూరంలో నాగావళి ఒడ్డున పార్వతీపురం తాలూకా కొమరాడ మండలం గుమ్మడ గ్రామంలో 1953లో ఈయన పుట్టారు కొందరి గుర్తుల ప్రకారం వీరి పుట్టిన తేదీ ఆగస్ట్ 23 వీరిది మధ్యతరగతి రైతుకుటుంబం ఈయన ఎదుగుతుండగా కుటుంబం ఆర్థికంగా చిదుగుతుండేది యస్సెల్సీకి చేరుకునేసరికి ఉద్యమం తీవ్రస్థాయిలో వుంది వీరి కుటుంబాల్లో సాహిత్యంతో గానీ, కళలతో గాని పరిచయం ఉన్నవారు లేరు ఉద్యమం వీరికి మార్క్సిజాన్ని, సృజన పత్రికనీ, భూషణంగారి కథలనీ అందించింది కొండలకి ఆ వైపు జీవితం గురించి భూషణంగారు రాస్తుంటే తమ వైపు జీవితం గురించి రాయాలన్న తపన కలిగించింది.

దాంతో -

అప్పలనాయుడు తొలికథ అచ్చుకాకముందే జననాట్యమండలి కుట్ర కేసులో ముద్దాయి అయ్యారు కేసులలో ఇరుక్కున్నారు రచయిత అయ్యారు.

వీరి కళ్ళ ఎదురుగా :

తొలి ఉద్యమం తీవ్రస్థాయికి చేరుకుంది అమాయక గిరిజనులు పల్లపు సాహుకారీల దగాలనూ, దోపిడీని గ్రహించి ఎదిరించి దౌర్జన్యాలకూ నిర్బంధాలకూ గురయ్యారు ఉద్యమం చల్లబడింది ప్రభుత్వాలు అనేక సంక్షేమ పథకాలతో కొండలలో, వలసలలో, పల్లెలలో ప్రవేశించింది రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ పార్టీలు మారాయి అంతర్జాతీయ వాణిజ్యం ఉత్తరాంధ్ర పల్లెల వరకూ విస్తరించింది దాని ప్రభావంతో చాలా వేగంగా సామాజిక సాంస్కృతిక రంగాలలో మార్పులు వచ్చాయి తిరిగి ఉద్యమం మొదలయింది

వీటి అన్నింటిమీదా అప్పలనాయుడి నలుగుడే ఆయన సాహిత్యం

ఈయన కథలలో

వంశధార అందాలు ఉన్నాయి నాగావళి నడకలు ఉన్నాయి జంఝావతి ఉంది రెబ్బకొండ గాలి ఉంది పడమటి రివ్వ ఉంది యానగాలి ఉంది. దాగరంత పొద్దు ఉంది తూర్పు కొండల వలసలు ఉన్నాయి తూర్పున నేల పొత్తిళ్ళలోంచి మిసమిసా మెరుస్తూ నాగేటి చాళ్ళమీద గర్వంగా తిరిగే ఆరుద్ర పురుగు ఉంది గట్టుమీద గరిక దుబ్బులకు అంటిన మంచుతో రెక్కలు తడుపుకునే తూరీగలు ఉన్నాయి

ఇవన్నీ ఈ ప్రాంతంతో రచయిత హృదయబంధాన్ని తెలియబరుస్తాయి.

వీటితో బాటు -

గ్రామాలలో జరిగే సామాజిక దురన్యాయాల మీద పూర్తి అవగాహన ఉంది

అందుకే -

ఓ అసిరిసెట్టి వెట్టిచాకిరీ బతుకులో జరిగిన ఓ సంఘటన వీరి తొలికథ 'పువ్వుల కొరడా' అయింది అసిరిసెట్టి తెలుగు నేల ఏ ఊరిలో చూసినా ఎదురయే ఊరుమ్మడి మనిషి ఓ చాకలి చాకళ్ళచేత సారె కావిళ్ళు పంపడం నిన్నమొన్నటి వరకూ జరిగిన విషయమే ఏ వస్తువుమీద ఎవరికి హక్కుందో తెలియని పసివాళ్ళు సారెకు పంపిన పంచదార అరిసెలు తినడం, తక్కువైన అరిసెల కోసం అసిరిసెట్టి కొరడా దెబ్బలు తినడం ఓనాటి భారతీయ భూస్వామ్య వ్యవస్థలో సర్వసమ్మత - దెబ్బలు తినేవాళ్ళతో సహా - విషయం అసిరిసెట్టి దానికి ఎదురు తిరగడమే అప్పలనాయుడి కథ ఈ పరిష్కారం రచయితదా లేక అసిరిసెట్టిదా? కాక ఆ ప్రాంతంలో తలెత్తిన ఉద్యమానిదా?

దీనికి జవాబు వీరి తొలి కథా సంపుటం 'పోడు - పోరు'లో తతిమ్మా కథలన్నిటా సులువుగానే దొరుకుతుంది

ఒక గూడుబండిలో రెండు కిరసనాయలు డబ్బాలూ, ఒక ఉప్పు బస్తా, ఒక ట్రంకు పెట్టెతో గెడ్డాలసకు బయలుదేరిన సావుకారీ గురవయ్యకు బండికడతాడు సామంతు సవర బూగన్న. ఓ కంపెనీ బనియను, రెండు అలమండ పొగాకు రెమ్మలూ, ఓ అగ్గిపెట్టె మదుపు పెట్టి బూగన్న, 'నేస్తం' దోచుకుంటాడు గురవయ్య పదేళ్ళ తరువాత ఆరు గూడుబళ్ళతో బంగారాన్నీ,

నోట్ల కట్టలనీ, సంపదనీ తీసుకువెళ్తూ 'నేస్తం' బూగన్నని శవం చేసి, శవాన్ని నక్సలైటుగా చేసి ఋణం తీర్చుకుంటాడు

పదేళ్ళలో 'మూలుగులన్నీ పీల్చేసి ఉల్లిబామునాగ' గురవయ్యలు ఎలా 'పొంగిపొయ్యారో' లెక్కలు విడమరుచుతుంది 'ఖండగుత్త' 100 రూపాయల అప్పు ఐదేళ్ళలో 1155 కేజీల చింతపండు చెల్లించగా 1350 రూపాయల అప్పుగా మారిన ధర్మ మర్మాన్ని విప్పి చూపిస్తారు రచయిత కొండల్లో కాస్తంత అక్షరజ్ఞానం గల ఓ పోస్ట్‌మాన్ ఒక ఉత్తరం చదివి పెట్టటానికి జీలుక్కల్లూ, కందులూ, కోడిపెట్టా వసూలు చేయగలిగితే (అరణ్య పర్వం) పట్టణాలలో అంతో యింతో పోలీసుల పద్ధతులు అంచనా కట్టగలిగిన మధ్యతరగతి పాఠకుడికి - ఇతర కథల్లో కనిపించే పోలీసుల ప్రవర్తన ఆశ్చర్యం కలిగించదు ఇటువంటి దౌర్జన్యాలకు లోనయిన సవరలూ, కోదులూ మొదలైన గిరిజనుల నుంచి పుట్టిన పోరాట చరిత్ర 'పంట', 'ప్రజాకోర్టు', 'ఖండగుత్త' కథల్లో చదివిస్తారు అప్పలనాయుడు పోరాటంలో పారిపోయిన పల్లపు సాహుకారీలు అది అణచబడిన తర్వాత తిరిగి రాటం, వీరికి తోడయిన పోలీసు కాంపులూ, గిరిజనోద్ధరణ కోసం ప్రభుత్వాలు ఏర్పరచిన కార్పొరేషన్ల పనితీరూ, ఈ ముగ్గడిలో పడిన శ్రీకాకుళ కొండ వలసల జనం తిరిగి ఉద్యమం వైపు నెట్టబడటం 'పోడు - పోరు' కథలో చిత్రితమయింది

అయితే

ఈ కథలన్నీ అప్పలనాయుడి తొలి కథలు. వీటిలో దాదాపు అన్నింటిలోనూ కథ కాలంలో ఓ దగ్గర మొదలై ఓ దగ్గర ముగుస్తుంది. రచయిత ఆవేశం వ్యక్తమయే వ్యాఖ్యానాలు చదువరిలో ఆ ఆవేశం కలిగించలేకపోగా కథ వేగాన్ని అడ్డుకుని చికాకు కలిగిస్తాయి. ఇవన్నీ వీరి సాధన దశలో రచనలని వీరి తరవాత రచనలు స్పష్టం చేస్తాయి

తొలిదశలోనే వస్తువుని స్థిరపరుచుకున్న రచయిత, కనీసం ఒక్క కథ కూడా కాలక్షేపానికి రాయలేదు తన వస్తువులతోనే చదువరిని గురించి ఆలోచిస్తూ, ఆకట్టుకోవాలని ప్రయత్నిస్తూ, ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ 'రచయితా శిల్పమూ' తెలుగు అనువాదమూ, కాళీపట్నం రామారావు, 'కథా కథనమూ' వంటి దొరికిన పుస్తకాలతో శిల్పం గురించి సాధన చేసుకుంటూ తరువాత కాలంలో ఆశ్చర్యకరమైన కథన విన్యాసాన్ని ప్రదర్శించారు

'ఓ తోటకథ' లో ఒక తోట తన కథ చెపుతుంది 'వంశధారా నది సన్నగా యేడుస్తున్న గ్రామ దేవతలా', 'మీద తలపాగా, నాగులగావంచా చిలక్కట్టూ తప్ప మరేమీలేని మృతదేహాలు కోటేరేసిన నాగళ్ళలా' కనిపించే కలతో ఆరంభమవుతుంది 'క్షతగాత్ర గానం'. ప్రధాన పాత్ర కనిపించకుండా 'జీవన ప్రవంతి' కథ నడిపిన తీరు మరో మంచి ఉదాహరణ

'తల్లీ - కూతుళ్ళు'లో అడవి పందులు సేను మేసిస్తే ఊరపందుల చెవులు గోస్సారుట అలగుంది గండల తిత్తవ'. అన్న సంభాషణలతో కథలోకి దిగిన రచయిత కాలిపోతున్న పెనంలాంటి కళింగ తీరం చూపిస్తూ, 'యానగాలి'ని

మొదలెడతారు తిరిగి అదే సంభాషణతో మొదటి కథ ముగిస్తే, అదే యానగాలితో రెండో కథ ముగుస్తుంది శీర్షికతో కథను గొప్ప ఎత్తులకు తీసుకువెళ్ళిన కథ 'డోర్ డెలివరీ' వర్ణనలను అవసరాలకు తగువిధంగా మాత్రమే వాడటం అనేక కథలలో కనిపిస్తుంది

పోతే -

అప్పలనాయుడి కథలన్నిటా ప్రముఖంగా కనిపించేది వర్తమానం వర్తమానంలోనే మండలాధ్యక్షురాలు శాంతామణి, ఎమ్మెల్వో సరళమ్మా ఉండగలరు వారి భర్తలు ఉండగలరు జర్నలిస్ట్ శ్రీనివాస్, నక్సలైట్ చంద్రం వుంటారు చర్మాల దాసుతో బాటు నామినేషన్ల పాపారావు వుంటాడు గోవర్ధన్నాయుడికి మధునాయుడే కొడుకు కాగలడు, గవిరికి సరస్వతే కూతురు కాగలదు. ఆరిక బాలరాజూ, ఆశీర్వాదం మాస్టారూ ఉంటారు 'పనీపాటు లేకుండా 'ఇంటిమీదది - వొంటిమీదకి తెచ్చుకునీ' మాటలాడే సక్కేన కన్నయ్యా ఉంటాడు. పట్టా పట్టుకు భూమికోసం తిరిగే దాలప్పడు ఉంటాడు వాళ్ళని వెంట తిప్పుకుని జోగినాయుళ్ళ పనులు చేసిపెట్టే కన్నబాబులుంటారు అనుబంధాలకు ముప్పు పెరుగుతూండగా అన్నదమ్ములు బలరామయ్యా, శివకృష్ణలూ, తోడికోడళ్ళు అన్నపూర్ణమ్మ, ఉమలూ, తల్లీ బిడ్డలు చంద్రమ్మ సూర్యనారాయణలూ ఉంటారు

వీళ్లందరిలోనూ మనం ఉన్నాం మనలో వీళ్ళందరూ ఉన్నారు అంతకు మించి మనందరినీ ఇలా చేస్తున్న వర్తమానం ఉంది వర్తమానాన్ని క్లిష్టం చేస్తున్న జీవితం ఉంది ఈ క్లిష్టతని విడదీసుకోటానికి సహజమైన స్పందనలతో, నిశితమైన ఆలోచనలతో, స్నేహపూరిత స్వరంతో అప్పలనాయుడు ఉన్నాడు

అప్పలనాయుడు ఇటీవల చూపుతున్న జీవితాన్ని బట్టి అతని కథలని వర్గీకరించటం సులభం కాదు ఒకప్పుడు ధనికుల దౌర్జన్యాలనూ, పేదల ప్లాట్లూ; ఆ మీదట తమ హక్కులకై పోరాడిన తాడితులూ, పీడితులూ, వారికై పోరాడిన ఆలోచనాపరులు, వారి సమస్యలూ - ఈ వస్తువులను బట్టి మార్క్సిస్ట్, విప్లవ కథలుగానూ, కొంతకాలంగా రచయితలే వర్గీకరించుకుంటున్న స్త్రీవాద, దళిత వాద కథలుగానూ ప్రాచుర్యంలో ఉన్న వర్గీకరణలకు - ఈ విషయాలన్నీ ఉన్నా - ఈ రచయిత కథలు ఇమడవు అలాగని జీవితం పట్ల రచయిత దృక్పథం పట్టుకోవటం కష్టమనిపించే ఇటీవలి కథలలాగ ఆయన కథలలో దృక్పథం దాక్కుని ఉండదు. అది విస్పష్టంగా ఉంటుంది

అందుకే వీరి కథలను పట్టిపట్టి చూస్తే

సమాజమంతటినీ కలిపి ఆలోచించే ధోరణి కనిపిస్తుంది ఏదో ఒక వాదానికి కలం కలిపితే రచయితగా వచ్చే తక్షణ ప్రాచుర్యం ఆశించని ధోరణి కనిపిస్తుంది జీవితాన్ని అఖండంగా చూసే ధోరణి కనిపిస్తుంది

ఈ ధోరణికి ప్రాతినిధ్యం వహించే కథలలో 'తల్లీ కూతుళ్ళు' ప్రధానమైనది

'అవునుగానీ, మాస్టారూ, యీ రిజర్వుడు సీటు వలన మనకు జరిగేమేలు ఏవిటీ?' అని అడుగుతుంది సరస్వతి 'గోవుల్ని చంపి, చర్మాలు అమ్మితే

మరి ఆ పేరే వొస్తాది అది మానేసి గోవులికి కాపలా కుదిరిపో గోపాలకృష్ణుడి పేరొస్తాది అయితే, యిప్పుడ్లాగ రూపాయలు కూడెయ్యలేవు. పేడ కచ్చిలు కూడేస్తావు' అంటాడు గోవర్ధన్నాయుడు 'పదవుంతే అందరూ కట్టేసారేటీ? మరి నువ్వేమీ, యేటికో యెకరా అమ్మేసినావు' అంటాడు క్రరి ముసిలాడు ఇలా ఎవరి తత్వాన్ని వారు చెప్పే 'తల్లీ కూతుళ్ళ'లో కథ పంచాయితీని హరిజన స్త్రీలకు కేటాయించటంతో మొదలవుతుంది దాన్ని చేతులో ఉంచుకోటానికి ఆలోచిస్తారు మాజీ సర్పంచులు మధునాయుడూ, దాసూ దాసు హరిజనుడు భార్యపోయిన దాసు పిల్లల పేరు చెప్పి, చుట్టరికం పేరు చెప్పి మరదలు 'సరస్వతిని తనకిచ్చి పెళ్ళి చెయ్యమని అత్త గవిరి మీద వత్తిడి తెస్తాడు ఇప్పుడికే ఒక కూతుర్నిచ్చే యింత అక్రమానం అనుబగించేను. ఇంకా మరొక కూతుర్నిస్తానా? ఆడి మర్యాద మీద ఆడున్నాడా మంచిదే! లేకపోతే..అడికో నాకో నూకలు సెల్లిపోతాయి భూమ్మీద!' అని గవిరి తేల్చెయ్యటంతో కథ ముగుస్తుంది. ఈ కథ కేవలం ఒక మిష పార్లమెంటరీ విధానంలో సంస్కరణలు అధికారాన్ని బదిలి చేయలేవన్నది రచయిత చెప్పదలుచుకున్నది. దాన్ని వెల్లడి చేయటానికి ఒక క్రైసిస్ ఎంపిక చేసుకోటం, ఆ ఎంపిక విషయాన్ని మోయగలిగేదిగా ఉండటం కథా విజయానికి కీలకం ఈ కథలో అన్నీ చక్కగా అమిరాయి

కథ శీర్షికను బట్టి, ఇన్సిడెంట్‌ని బట్టి బలాన్ని పెంచుకున్నవి 'జీవన స్రవంతి', 'డోర్ డెలివరీ'. ప్రజలవద్దకు పాలన పథకం కింద గ్రామానికి వచ్చిన అధికార్ల వద్దకు 'నా బిడ్డ కనిపించలేదు బావూ' అంటూ వస్తాడు గడ్డి ముసలయ్య. అతని బిడ్డను జీపులో తెచ్చి ఇంటిముందు పడేస్తారు అధికార్లు. అదీ డోర్ డెలివరీ. అంతకన్న విస్తృతమైన కథ జీవన స్రవంతి. అదుపులోకి తీసుకున్న నక్సలైటుని సరెండర్ చెయ్యాలా...ఎన్‌కౌంటర్ చెయ్యాలా అన్నది సమస్య. జనజీవనస్రవంతిలోకి రమ్మని మంత్రి ప్రకటన. సరెండరవుతున్నట్టు వార్త దాన్ని కవరుచెయ్యటానికి వెళ్ళిన విలేఖరులకు ప్రోగ్రాం మారిపోయిందని చెపుతాడు రైటర్. 'లక్ష పోతుందని వొకటే యేడుపు. మినిస్టరేమో ...త్వరలో పార్లమెంటు ఎన్నికలున్నాయి. దెబ్బగొడతాయని... యేడుపులు.. ఏదీ తేలకపోయి వుంటుంది. మనల్ని పొమ్మన్నారు' అంటాడు ఓ విలేఖరి. మండలాధ్యక్షుడి కిడ్నాప్.. నక్సలైటు విడుదల వార్తతో జీవనస్రవంతి ముగుస్తుంది. పాతబస్టాండ్ యేరియాను వందేళ్ళ లీజుకి ప్రైవేటు పరం చేస్తుంది మున్సిపాలిటీ. దాంతో బడ్డీనీ, బతుకునీ పోగొట్టుకున్నవాళ్ళలో నమస్కారాల భద్రయ్య ఒకడు. అతను పాలకులని ఆశ్రయించాలి - ప్రజా ఉద్యమాలను ఆశ్రయించాలా అన్నది తేల్చుకోమంటాడు రచయిత ప్రైవేటీకరణను వ్యతిరేకించే ఈ కథకు వ్యక్తి సమస్య అన్నట్లు కనిపించే శీర్షిక నప్పలేదు. నినాదంతో ముగింపు కథను తేలికచేసింది.

అనుబంధాల మీద రచయిత పరిశీలన తెలిపే కథలు 'బంధాలు - అనుబంధాలు', 'ప్రత్యామ్నాయం'. తల్లీ కొడుకుల మధ్యా, అన్నదమ్ముల మధ్యా అనుబంధాలు తగ్గిపోతున్నాయనే సాధారణ భావనను కాదని, వాటిని

కనిపించకుండా చేసే 'అవసరాలను', 'సామాజిక పరిణామాలను' చూపిస్తారు ఈ కథలలో 'చావులు' జీవిత సమస్యలకు ముగింపు చావులేనా అన్న అనుమానం కలిగిస్తాయి

ఓ తోటకథ బహుముఖమైన కథ దానిని చెప్పటానికి చొక్కావారి తోటనే మాట్లాడించటం అప్పలనాయుడి చతురత దీనివల్ల ఈ కథలో ఏ విషయం చెప్పాలన్నా చాలా అవకాశం ఏర్పడింది 'శిథిలాల్లోంచే. మళ్ళీ ఏదైనా కొత్తగా మొలకెత్తేది' అన్న రచయిత అభిప్రాయమూ, అకాంక్షా సహజంగా వ్యక్తం కాగలిగాయి.

వీరి కథలన్నింటిలోనూ విశిష్టమైనది 'యానగాలి' ఇది ముగ్గురు స్త్రీల కథ పోరాటాల కథ రాజీల కథ అందరూ తమ తప్పులని నెట్టివేసే బ్యూరోక్రటిక్ వర్గం స్థితిని సన్నిహితంగా పరిశీలించిన కథ మైక్రో లెవిల్‌లో ఒక ప్రాంతపు జీవితాన్ని తీసుకుని, దీన్ని ప్రపంచమంతటినీ అర్థం చేసుకునే శక్తిగల నమూనా స్థాయికి తీసుకువెళ్ళిన కథ.

పోతే -

వీరి కథలలో శాస్త్రీయ పదాలు - ఘర్షణ, ఐక్యత, వైరుధ్యం వంటివి కనిపిస్తుంటాయి వీటిని సరైన అర్థంలో వాడుతున్నట్లు చాలాచోట్ల కనిపించదు క్షతగాత్ర గానం కథలో ఉన్న జీవితగాఢతకూ, ప్రధాన పాత్ర అనుభూతి తీవ్రతకూ సమన్వయం సాధింపబడలేదు అలాగే యుద్ధం కథలో సెలేను మ్యాస్టు చివరి మాటలలో ఎరుక ఆ పాత్ర పట్ల రచయిత కథారంభంలో కలిగించిన దృష్టికి నప్పదు కథనం పట్ల శ్రద్ధ వహించే సాధనదశలో రచయిత చూపుని ఈ అంశాలు తప్పించుకున్నట్లున్నాయి.

శ్రీకాకుళపు మాండలికంపై, నుడికారంపై గొప్ప అధికారాన్ని సంపాదించుకున్న అట్టాడ అప్పలనాయుడు అక్కడ జీవితంపై తన అవగాహనను పెంచుకుంటూ, పంచుకోటమ్మ ఆ జీవితాన్ని శాసిస్తున్న, దానిలో మార్పులు తేజూస్తున్న రాజకీయాలను, వాటి వెనుకనున్న వ్యాపారకీయాలను విడమరుస్తూనే - వీటన్నింటినీ చుట్టుముడుతున్న ప్రపంచ రాజకీయ వ్యాపారాల మీదా, వ్యాపార రాజకీయాల మీదా దృష్టి సారించటం ఆహ్వానించదగిన విషయం. వీరి కథా, కథనాలు ఆ ప్రయత్నాలనుంచే పుట్టాయి ఎదిగాయి

# తుమ్మేటి రఘోత్తమరెడ్డి

♦ *పినాకపాణి* ♦

కంటికి కనిపించిన ఒక పరిణామాన్నో, ఘటననో కథగా మలిచి సరిపెట్టుకోకుండా, జీవితంలోని అవ్యక్త సంఘర్షణను వెలికి తీయాలని ప్రయత్నించిన అతికొద్దిమంది కథకులలో తుమ్మేటి రఘోత్తమరెడ్డి ఒకరు దాదాపు యిరవై ఏళ్ళుగా ఆయన తెలంగాణా జీవితాన్ని, ప్రజా పోరాటాలను అత్యంత సమీపంగా దర్శించి కథాసాహిత్యంలోకి అనువదిస్తున్నారు తెలంగాణా కథను, మరీ ముఖ్యంగా విప్లవ కథను వస్తుశిల్పాల్లోనే గాక, దృక్పథం విషయంలో కూడ రఘోత్తం కథలు చాలా ఉన్నతీకరించాయి. పోరాట కథమీద తెలిసీ తెలియక, దురుద్దేశపూరితంగా నేటికీ కొంతమంది కొనసాగిస్తున్న దుర్విమర్శ నిందగా కూడ మారిపోయిన పరిస్థితిలో, ఒకసారి యిరవై ఏళ్ళ వెనక్కి వెళ్ళి రఘోత్తం కథలన్నింటినీ పరిశీలిస్తే, ఈ నింద ఈ రోజే కాదు. అప్పట్లో కూడ ఎంత అసంబద్ధమైనదో, అన్యాయమైనదో స్పష్టమవుతుంది

తొలినాళ్ళ విప్లవ కథకులు కొందరు ఒక అవసరం కోసమే కావచ్చు, విప్లవ రాజకీయాలకు కథాప్రక్రియ స్వభావానికి ఉన్న సంబంధాన్ని పూర్తి స్థాయిలో అర్థం చేసుకోలేకపోవడం వల్లనే కావచ్చు, అప్పట్లో రాసిన కొన్ని కథలు నిజంగానే కొన్ని దురభిప్రాయాలు గూడు కట్టడానికి పరోక్షంగా కారణ మయ్యాయి కాని యిది తొలినాళ్ళ విప్లవ కథలన్నింటికీ వర్తించదు. ముఖ్యంగా శ్రీకాకుళ విప్లవోద్యమం దెబ్బతిన్నాక, ఎమర్జెన్సీ కాలంనాటికే ఉత్తర తెలంగాణ అంతటా విస్తరించిన రైతాంగ పోరాటాల ప్రేరణలో విప్లవకథ అంతకు ముందటి యాంత్రిక అవగాహననుండి బైటపడింది రాజకీయాలలో ప్రజాపంథా నేలపొరల నుండి పోరాటశక్తిని వెలికితీసినట్టే, ఆ పోరాటాల వెలుగులో విప్లవ సాహిత్యం, విప్లవ కథ వస్తు, శిల్పాల సమ్మేళనంలో, దృక్పథంలో శక్తివంతమైనది

విప్లవ కథకు ఇంతటి శక్తిని అందించినవారిలో రఘోత్తం ఒకరు. విప్లవ కథ సాధించిన పరిణతిని, అందులో మైలురాళ్ళవంటి రఘోత్తం కథలకు గాని, తెలంగాణ స్థలకాల నిర్దిష్టతలతో ముడిపడిన విప్లవోద్యమం నేపథ్యంగా పనిచేసింది. విప్లవోద్యమం తన ప్రారంభదశలోని లోపాలను అధిగమించి ఈ నేలమీద దృఢంగా నిలబడి, మట్టి మనుషుల సమస్త రాగద్వేషాలనుండి, అవసరాల నుండి సజీవ మానవుల సృజనాత్మక కార్యకలాపంగా విస్తరించినట్టే, విప్లవ కథ కూడా ఒక మానవీయ అభివ్యక్తిగా ఎదిగివచ్చింది

ఈ నేపథ్యమే రఘోత్తంను సృజనకారుడిగా తీర్చిదిద్దింది చాలా స్థూలమైన విశ్లేషణలో భాగంగా యిదంతా చెప్పుకున్నప్పటికీ, ఈ నేపథ్యంలోని సారాన్ని

గుర్తించి, అందులోని అన్ని మేలిమి లక్షణాలను సాహిత్యంలోకి తీసుకు రావడంలో రఘోత్తం ప్రత్యేకత ఉన్నది సాహిత్య తత్వానికి - సామాజిక ప్రయోజనానికి ఉన్న సంబంధంతోపాటు, కథాప్రక్రియ స్వభావం, ప్రత్యేకతలు కూడ ఆయనకు బాగా తెలుసునని ఆయన తొలికథలను చదివితేనే స్పష్ట మవుతుంది సామాజిక చలనాలను కథా సాహిత్యంలోకి తీసుకురావటానికి ఎన్నెన్ని అవకాశాలుండేదీ తెలిసినవాడు కాబట్టి, ఆయన కథలు కేవలం ఒకానొక ఘటనను చిత్రించినట్టుగానే కాక, అందులోని అంతర్గత విరుద్ధతత్వం, వైరుధ్యాల స్వభావం పునాదిగా నిర్మాణమైనట్లు అర్థమవుతాయి

రఘోత్తం కథల్లోని వస్తు వైవిధ్యాన్ని కథన పద్ధతిని తెలంగాణలో గత రెండు దశాబ్దాలుగా కొనసాగుతున్న విప్లవోద్యమ నేపథ్యం నుండి చూడాలి రఘోత్తం కథా రచనలోకి ప్రవేశించే నాటికి తెలంగాణలో విస్తారమైన మూడు సామాజిక సమూహాలు వర్గ పోరాటంలోకి క్రియాశీల పాత్ర పోషిస్తున్నాయి. ఎమర్జెన్సీ నాటికే కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో ప్రత్యామ్నాయ ప్రజాపంథాను ముందుకు తీసుకు వచ్చాయి. రైతాంగ పోరాటాల విస్తృతిలో ఆదివాసీ ఉద్యమాలు, సింగరేణి కార్మిక ఉద్యమాలు రఘోత్తంలోని రచయితకు ఆలోచనాపరుడికి ప్రేరణ నిచ్చాయి.

రైతాంగ, ఆదివాసీ, కార్మిక పోరాటాల ఉద్రిక్త వాతావరణంనుండి రఘోత్తం కథలు పుట్టుకువచ్చాయి. అందుకే ఆయన కథల్లో మారుమూల పల్లెల్లోని రైతాంగం, కూలీలు - సింగరేణి బొగ్గు బావుల మీది కార్మికులు - అటవీ ప్రాంతంలోని ఆదివాసీలు పదేపదే తారసపడుతూ ఉంటారు. మరీ ముఖ్యంగా పల్లెల్లో బతుకు భారమై బొగ్గుబాయిల మీదికి పొట్ట చేతపట్టుకుని వచ్చిన కార్మికులు ఆయన కథల్లో పాత్రలయ్యారు కేవలం పొట్ట చేతబట్టుకుని రావడం వల్లనే, గ్రామీణ మనస్తత్వాన్ని అక్కడి ఉద్యమ ఆలోచనలతో సహా నిలబెట్టుకుని ఉన్నందువల్లనే సింగరేణి బొగ్గు పొరల్లో వాళ్ళెట్లా నిప్పు రాజేసిందీ రఘోత్తం దగ్గరిగా చూచి కథల్లోకి ఎక్కించారు.

నిజానికి రఘోత్తం రాసిన కథలన్నింటినీ ఒక వరుసక్రమంలో తెలంగాణ, రైతాంగ, ఆదివాసీ, కార్మికోద్యమాల బహుముఖీన కాల్పనిక వ్యక్తీకరణలుగా చదువుకోవచ్చు ఆర్థిక, రాజకీయ లక్ష్యాలతో నడిచిన ఈ ఉద్యమాలు మానవ సంబంధాల్లో, చైతన్యంలో, తీసుకువచ్చిన మార్పును రఘోత్తం కథల ఆధారంగా సామాజిక సాహిత్య విశ్లేషణ చేయడం దానంతటదిగా ఒక ప్రత్యేకమైన పని. కనీసం నా పాత స్నేహితుడు(1985), చావు విందు(1991), జాడ(1992), ఉరి(1993), పనిపిల్ల(1995), హంతకులు(1997) లాంటి కొన్నికథల ఆధారంగా కూడా తెలంగాణలోని విప్లవోద్యమాన్ని మానవ సంబంధాల సంఘర్షణ క్రమంలో వివరించుకోవచ్చు ఈ వ్యాసంలో అలాంటి అవకాశం లేక పోయినప్పటికీ, ఆయన స్వీకరించిన పోరాట వస్తువులన్నీ కేవలం ఒక పోరాట ఘటనకు, ఉద్యమ శకలానికో పరిమితంగాక విప్లవోద్యమ నేపథ్యంలో మానవ సంబంధాల సంఘర్షణమీద ప్రధానంగా భిన్న విలువల మధ్య, భిన్న నేపథ్యాల

మధ్య, భిన్న వ్యక్తిత్వాల మధ్య, రెండు తరాలమధ్య సంఘర్షణగా అనుభవంలోకి వస్తుంది చాలా మానవీయమైన వ్యక్తులు సైతం రెండు శిబిరాలుగా విడిపోయినప్పుడు ఘర్షణే ప్రధానంగా రాపిడి జరుగుతుంది. వర్గపోరాటం ఒకచోట మొదలైందంటే దాని ప్రభావం జీవితంలోని ఎన్నెన్ని మారుమూల ప్రాంతాలకో విస్తరిస్తుంది ఈ ఎరుక ఉన్నందువల్లనే రఘోత్తం కథల్లో గొప్ప వస్తు వైవిధ్యం కనిపిస్తుంది.

ఒక ఉద్యమ ఘటనమీద రాసిందే పోరాటకథ కవసరంలేదని, సమస్త మానవ సంబంధాలను, అందులోని వైరుధ్యాలను, సంఘర్షణను వర్గపోరాట దృక్పథంతో విప్లవోద్యమ నేపథ్యంలో చూచి రాసినప్పుడే విప్లవ కథ విస్తరిస్తుందని చెప్పడానికి రఘోత్తం కథలు గొప్ప ఉదాహరణలు

సమాజ సాహిత్య సంబంధాల పట్ల ఒక స్పష్టమైన తాత్విక దృక్పథం ఉన్నందువల్ల వస్తు ఎంపికలోనేగాక, దాన్ని సమగ్రంగా, సమర్థవంతంగా వ్యక్తీకరించడానికి ఎన్నుకున్న శిల్ప పద్ధతిలో కూడా రఘోత్తం అవగాహన వెల్లడవుతుంది. ఒక సామాజిక సందర్భం తనదైన సృజనాత్మక వ్యక్తీకరణ కోరుకునే క్రమంలో రచయితగా రూపొందించిన రఘోత్తం లాంటి వారిలో ఈ అవగాహన రక్తమాంసాల ప్రతిస్పందనల్లో సైతం యింకి ఉంటుంది దీనివల్లనే రఘోత్తం అల్లకల్లోమైపోతున్న ప్రపంచాన్ని వివరించడానికి మానవ సంబంధాల పరిశీలనలోకి, మానవ అంతరంగ ప్రపంచంలోకి అడుగుపెట్టి అక్కడినుండి సమాజ చలనాలను, అభివృద్ధి విధ్వంసాలను విశ్లేషించడానికి పూనుకుంటారు. ఉద్రేకాలపుట్ట అయిన మనిషిని మానవ సంబంధాల సంక్లిష్టతలో, వర్గ సమాజపు సంక్షోభాల్లో చూచే సునిశిత దృష్టి - దాన్నీ కళాత్మకంగా తీర్చిదిద్దగల రచనా నైపుణ్యం ఆయనకు పుష్కలంగా వున్నాయి. ఆయనకథల వరుసక్రమం చూస్తే యివి రెండూ ఎలా ఎదుగుతూ వచ్చాయో తెలుస్తుంది.

యిక్కడే యింకో ముఖ్యమైన విషయం చెప్పుకోవాలి. ఆధిపత్య రూపాలను చూపటంలోగానీ, వాటిని ఎదుర్కొనే మానవ ఆచరణను వివరించడంలోగానీ రఘోత్తం కథల్లో ఒక క్రమ పరిణామం ఉన్నది. దీన్ని రచయిత దృక్పథ వికాసం, శిల్ప పరిణామం అనే రెండు కోణాల్లో చూడగలిగితే మంచివిశ్లేషణ అవుతుంది. నిజానికి యిది మొత్తం విప్లవ కథ పురోగమనానికి కూడా అన్వయమయ్యే పరిశీలన

రఘోత్తం కథా రచనలో ప్రవేశించే నాటికే విప్లవోద్యమం వేర్వేరు ఆధిపత్య రూపాలను గుర్తించి, వాటికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించే ప్రయత్నంలో ఉన్నది 80ల కంటే 90లలో ఈ అవగాహన, ఆచరణ విస్తృతమైంది సామాజిక సంబంధాల్లోని ఆధిపత్యాన్ని, హింసను వర్గపోరాట దృక్పథంతో చూచి ఎదుర్కొన్నప్పుడే పరిష్కారం దొరుకుతుంది సాహిత్యంలో కూడ హింసను, ఆధిపత్య రూపాలను, సంఘర్షణలను గుర్తించి, వాటిని కాల్పనిక స్థాయికి తీసుకెళ్ళినప్పుడే వస్తు వైవిధ్యం శక్తివంతమవుతుంది. ఆధిపత్యం, హింస,

వైరుధ్యాలు ఏఏ రూపాలలో వ్యక్తంగా అవ్యక్తంగా ఉన్నదో, ఉండేందుకు అవకాశం ఉన్నదో గ్రహించడంలోనే దృక్పథం ఒక ఖచ్చితమైన గీటురాయిలాగ పనిచేస్తుంది. యిట్లా వైవిధ్యం కోసం చేసే ప్రయత్నం అనివార్యంగా శిల్ప పద్ధతులను ప్రభావితం చేస్తుంది ముప్ఫైఏళ్ళ విప్లవ కథా చరిత్రలో - రఘోత్తం ఈ దిశగా సాగించిన కృషికి గణనీయమైన స్థానం ఉన్నది

కంటికి కనిపించే ఆధిపత్య వ్యవస్థలను, వాటి అణచివేతను కథలోకి తేవడం దగ్గర మొదలై, తర్వాత్తర్వాత కంటికి కనిపించని ఆధిపత్య రూపాల, స్వభావాల, ప్రత్యామ్నాయాల చిత్రణలోకి వెళ్ళిపోయారు చాలా సందర్భాల్లో రఘోత్తం మానవ సంబంధాల ఉద్వేగాన్ని చిత్రించడంమీద ప్రత్యేక శ్రద్ధ పెట్టినట్టు ఉంటుంది కాని, వాస్తవానికి అది అంతవరకే పరిమితం కాదు మానవ సంబంధాలన్నింటా అలుముకపోయిన వర్గలక్షణాల వల్ల భిన్న విలువల ముద్ర ఎడతెగని పెనుగులాటనుంచి పెల్లుబికే ఉద్వేగ ప్రవాహమిది. దీని వల్లనే ఆయన కథల్లో మానవ సంబంధాల, ఉద్వేగాల, సంఘర్షణల పైపై చిత్రణకాక వర్గ సమాజపు విషాదం లోలోపలి పొరలనుండి ప్రసరించే అంశమేదో పాఠకుల మనసును, ఆలోచనలను గాఢంగా తాకుతుంది

ఈ విషాదానికి మూలమైన గెలుపు ఓటములు, అభివృద్ధి విధ్వంసాలు, పరస్పర విరుద్ధ ప్రయోజనాలు ఒక సంక్లిష్ట క్రమాన్ని తీసుకుంటాయని రఘోత్తం కథలు నిరూపిస్తాయి పైకి ఒక చిన్న పేచీలాగా కనిపించే ఏ అంశమైనా సారాంశంలో ఎంత భిన్న సంఘర్షణగా ఆవరించి ఉంటుందో ఉరి, జాడ, పనిపిల్ల మొదలైన కథల్లో వేర్వేరు స్థాయిల్లో, భిన్న రూపాల్లో కనిపిస్తుంది.

దీన్ని సాధించడానికి ఆయన దృష్టికోణంలోని ఒక ప్రత్యేకత బాగా దోహదపడింది. పైకి స్పష్టంగా కనిపిస్తూ తేటతెల్లంగా ఉందనుకున్న అంశాలను రఘోత్తం ఆవలివైపునుంచి చూస్తారు ఈ చూపులో సునిశితమైన రాజకీయ తాత్విక కోణంతోపాటు, కథా ప్రక్రియ గురించి, సాహిత్య తత్వం గురించి ఆయన తెలివిడి కూడ కలగలసి ఉంటుంది.

పైకి సాధారణంగా, సరళంగా ఉన్నట్టు కనిపించే యితివృత్తాలను ఎంచుకున్నట్టు ఉంటుందికాని, వాటిని ఆవలివైపునుంచి చూడటం ఈ రచయిత ప్రత్యేకత దీనివల్లనే సాధారణంగా పోరాట వస్తువుగా కనిపించే కథలే అయినా ప్రతి కథ ఒక ప్రత్యేకతను, నిర్దిష్టతను ప్రదర్శించగలిగాయి చాల భిన్నమైన పాత్రల వైపునుండి కథ నడపటం అనే టెక్నిక్ వల్ల కథానిర్మాణంలో వైవిధ్యాన్ని సాధించగలిగారు. దీనివల్ల అవ్యక్త అంశాలు అనేకం కథనంలో చోటు చేసుకుంటాయి. రచయితకున్న వస్తు దృక్పథం వల్ల ఆ ఇతివృత్తంలో తను దర్శించిన అంశాలను కథలోకి తేవడానికి దోహదపడే పాత్ర వైపునుంచి కథ నడిపిస్తారు. దీనివల్ల శిల్పం కూడా సాధారణంగా ఉన్నట్టనిపిస్తూనే, ఒక విస్తృత నేపథ్యంలోని అనేక అంశాలను వ్యక్తీకరించడానికి తగినట్టు రూపొందుతుంది

ఉదాహరణకు 'ఉరి' కథలో ఒక కార్మికుడి ఆత్మహత్య ద్వారా సామాజిక విషాదాన్ని దాన్ని లోలోతు పొరల నుండి చిత్రించగలిగారు హత్యనో, ఆత్మహత్యనో తెలియని ఒక మరణం మనిషి చుట్టూ బిగుసుకపోతున్న

ఉచ్చును సూచిస్తుంది భౌతిక పరిస్థితుల్లో తలెత్తిన సంక్షోభాలు మానవ సంబంధాల్లో, విశ్వాసాల్లో విధ్వంసాన్ని సృష్టిస్తాయని ఈ కథ వివరిస్తుంది. మానవ సంబంధాల్లోని ప్రేమను, స్వార్థాన్నీ, ఒక సామాజిక వాతావరణంలో ఎట్లా చూపాల్సిందీ, అసలు సామాజిక వాతావరణమే ప్రేమ, స్వార్థంలాంటి వాటిని ప్రభావితం చేస్తాయనీ ఈ కథ చెప్తుంది యింత విస్తృతమైన విశ్లేషణకు దారితీసే కథన పద్ధతిని ఈ కథలో రఘోత్తం పాటించారు

చాలామంది కథల్లోలాగ రఘోత్తం కథల్లో ఒకటో రెండో పాత్రలు పదే పదే తారసపడవు. వాతావరణం మూడ్ కూడా దగ్గరదగ్గరగా ఉండవు ఒక యితివృత్తాన్ని ఎన్నుకున్నప్పుడు దానిలోని అంతర్గత విషయాలన్నింటినీ వెలుగులోకి తేవడానికి ఉపకరించే పాత్రలను రూపొందించడంలో దానికి అనుగుణమైన స్థల, కాల, వాతావరణాన్ని, తద్వారా కథలో ఒక విధమైన మూడ్‌ను తీసుకొని రావడంలో రఘోత్తంకు స్పష్టత వుంది

యిది కేవలం కథనంలోని ఒకానొక విశిష్టతగానే ఉండిపోలేదు. దీనివల్ల వస్తువు వేర్వేరు స్థాయిల్లో వ్యక్తమై సమగ్రతనే సంతరించుకుంటుంది. "చావు విందు" కథలో దొరల వైపునుంచి కథ నడపడంవల్ల భూస్వామ్య ఆధిపత్య పతనం అనే అంశం లోలోపల దాగి వుండే విషయాలన్నీ కథలోకి వచ్చాయి. బహుశా దీన్ని రైతాంగ పాత్రల వైపునుంచీ, ఉద్యమకారుల వైపునునంచీ, నడిపి వుంటే యిన్ని అంశాలు యింతగా రావడం సాధ్యమయ్యేది కాదేమో. రచయిత ఎంచుకున్న పద్ధతివల్ల వస్తువులోని విరుద్ధ తత్వం, సంఘర్షణ వెల్లడి కావడమేగాక, సామాజిక సంబంధాల్లోకి విలువల పొరల్లోకి అది ప్రసరించి అక్కడ అలజడిని, విధ్వంసాన్ని నూతన సృష్టినికూడా చిత్రించే అవకాశం దొరికింది.

దీంతోపాటు రఘోత్తం తీసుకున్న యితివృత్తాల్లో కథలు, శీర్షికల్లో ఒక ఆసక్తికరమైన అంశం కూడా ఉన్నది. మొదట ఉదహరించిన కథల్లోనే యితివృత్తం, కథ చెప్పిన కోణం పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది.

1989, 90లలో రాష్ట్రవ్యాప్తంగా మరీ ముఖ్యంగా తెలంగాణలో ఉవ్వెత్తున ఎగిసిన భూపోరాటాల వల్ల భూస్వామ్య ఆధిపత్యం కూలుతున్న సన్నివేశం 'చావు విందు' కథకు వస్తువు. రఘోత్తం ఈ సన్నివేశాన్ని దొరల కోణంలో చిత్రించారు ఈ పరిస్థితి మరింత గాఢంగా సంక్లిష్టంగా మారిపోతున్న నేపథ్యంలో భూపోరాటాలు, సారా వ్యతిరేకపోరాటాలు, కార్మిక తిరుగుబాట్లు, ఎన్‌కౌంటర్ హత్యలు.. రచయిత మాటల్లోనే చెప్పాలంటే రెండు భిన్న ప్రపంచాల మధ్య తీవ్ర సంఘర్షణను 'తమ్ముడు' కేంద్రంగా చిత్రించిన కథ 'జాడ'. యిందులో అతని అక్క సుజాత వైపునుంచి కథ నడుస్తుంది.

ఈ రెండు కథలతో పోల్చుకుంటే సంకీర్ణత, లోతు మరింతగా ఉన్న కథ 'పనిపిల్ల'. నిజానికి ఈ విస్తృతి యితివృత్తానికి సంబంధించింది మాత్రమే కాదు ప్రజా పోరాటాలను, వాటి అవగాహనకు, ప్రభావానికి సంబంధించింది కూడ. విప్లవోద్యమం భూ ఆక్రమణలతోపాటు, కరవు దాడులు అనే సరికొత్త పోరాట రూపాన్ని స్వీకరించిన సందర్భం అది యింక బాగా చెప్పాలంటే

నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ అనే సామ్రాజ్యవాద రాజకీయ ఆర్థిక వ్యూహానికి ప్రతిగా విప్లవోద్యమం వెనుకబడిన గ్రామీణ, ఆదివాసీ ప్రాంతాల్లో రచించిన ప్రత్యామ్నాయ ప్రతివ్యూహంలో భాగంగా కరవు దాడులు మొదలయ్యాయి.

ఒక కుటుంబంలో పనిపిల్ల అవసరం, ఆదివాసీ ప్రాంతంలో కరవు దాడులు అవసరం - ఇవి రెండూ సంక్లిష్టమైపోతున్న వర్తమాన జీవిత వ్యక్తీకరణలు. ఈ అవసరాలు, ప్రయోజనాలు సరళంగా, సూటిగా దృశ్య మానమయ్యేవి కావు. స్త్రీ - పురుషులమధ్య, కరవు కోరల్లో చిక్కిన ఆదివాసీలకు - మైదాన ప్రాంత సంపన్న వర్గాలకు మధ్య తలెత్తిన వైరుధ్యాల అల్లిక యిందులో దాగి ఉన్నది. కథలోకి వచ్చిన రెండు రకాల వైరుధ్యాల నడుమ పోటీ ఉండదు కాని, దేని ప్రత్యేకత దానిదే. ఒక విశాలమైన ప్రత్యామ్నాయ రూపకల్పన నేపథ్యంలో స్త్రీ - పురుష వైరుధ్యాల చిత్రణలోకి, స్వభావాల విశ్లేషణలోకి వెళ్లిన కథ యిది.

మానవ సంబంధాలు, స్పందనలు, ఆకాంక్షలు సంక్లిష్టదశకు చేరుకున్నాయని, సంఘర్షణ రూపాన్ని, ఆశ్రయిస్తున్నాయని చెప్పదల్చుకున్న కథ 'పనిపిల్ల' కథ శీర్షికేమో 'పనిపిల్ల' కథనమేమో మహేంద్ర వైపునుంచి

'పనిపిల్ల' కథ వివాదానికి దారితీసినా 'చావు విందు', 'జాడ' కథలు తెలుగు కథ ఉన్నతికి నిదర్శనాలు 'చావు విందు' లో దొరతనానికి పదునైన ఎదురు దెబ్బలు ఒక విషాదకరమైన వాతావరణాన్ని తయారు చేస్తాయి. కథలోనికి వెళ్ళాక యిది దొరసాని మరణం వల్ల కలిగిన విషాదమా? ఆమె మరణం కంటే ముందునుండీ మొదలైన దొర ఆధిపత్యపతనం వల్ల కలిగిన విషాదమా? అనే సందేహం కలుగుతుంది. అంతర్లీనంగా కథలో భూమిమీద దొరల ఆధిపత్యపతనం సృష్టించిన విషాదం చివరంటా పరచుకుని బీభత్సకరంగా మారిపోతుంది. ఈ విషాదం, బీభత్సం రచయిత ఉద్దేశాన్ని శక్తివంతం చేశాయి. భూస్వామ్య పెత్తనం కూలిపోవడం అనివార్యమని చెప్పడమే గాక, ప్రత్యక్షంగా, కథలో కనిపించని రైతాంగ ఉద్యమాల శక్తి విస్తృతి చిత్రించడమే రచయిత ఉద్దేశ్యం. కథలో బైటికి కనిపించే విషాదంతో పాఠకులకు ఎక్కడా, ఏకీభావం కలగదు. దొరల కోణాలతో కథ నడపడం, పేరు 'చావు విందు' కావడం దీని విశిష్టత.

యివన్నీ శిల్ప సంబంధమైన అంశాలు మాత్రమే కాదు. రచయిత దృక్పథ స్పష్టతవల్ల జీవితాన్ని, పోరాటాలను, ముఖ్యంగా వైరుధ్యాలను అర్థం చేసుకోవడం వల్ల, వస్తువులోని అంతర్గత శక్తినంతా వెలికితీయగల శిల్ప పద్ధతులు సమకూరాయి.

సామాజికచరిత్రను నిర్మించే పనిలో మనిషి తన చుట్టూ వున్న పరిసరాలతో ఘర్షణపడే క్రమాన్ని, తనలో తాను అనుభవించే సంఘర్షణ క్రమాన్ని చిత్రించడం, ఆయనలోని మరో ప్రత్యేక లక్షణం. రఘోత్తం కథల్లోని పాత్రలు పరిసరాలతో, చుట్టూ ఉండే మనుషులతో ఎట్లా వ్యవహరించాలి? అనే విషయంలో అంతులేని రాపిడికి, సందిగ్ధానికి గురవుతుంటాయి. అత్యంత సహజంగా అధిగమించ

వలసిన ఈ స్థితినుండే మనిషికి చైతన్యవంతమైన ఆలోచనలు రూపొందుతాయి. రఘోత్తం ఈ క్రమాన్ని వర్గసంఘర్షణలోకి ఎంత తాత్వికంగా అనువదిస్తారో, అంతే కళాత్మకంగా కూడ చిత్రిస్తారు అందువల్లనే సామాజిక వైరుధ్యాల సంఘర్షణకు మనిషి చైతన్య వికాసానికి ఉన్న సంబంధాన్ని విశ్లేషించడానికి ఈ కథలు గొప్ప కాల్పనిక సాధనాలుగా ఉపయోగపడతాయి ఈ విశ్లేషణలోకి దిగితే, ప్రతి కథకూడ ఊహించజాలని అనేక అంశాలపై సరికొత్త వెలుగు ప్రసరిస్తున్నట్టు అర్థమవుతుంది.

మొదటే అన్నట్లు రఘోత్తం కథా వస్తువులతోపాటు, శిల్ప పద్ధతులను కూడ ఆయన రచయితగా రూపొంది, కథలు రాసిన సామాజిక సందర్భంలో భాగంగా చూడవచ్చు సాధారణంగా వస్తు విశ్లేషణ చేసేటప్పుడు నేపథ్యానికి, సందర్భానికి ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చే సాంప్రదాయం మనకుంది కాని శిల్పవిశ్లేషణ కూడ సామాజిక సందర్భంనుండి సామాజిక వాతావరణం నుండి చేయడానికి కావలసిన శిల్ప సంబంధమైన ప్రత్యేకతలు ఆయన కథల్లో ఉన్నాయి.

కొంచెం వివరంగా చెప్పకుంటే గత పదిహేనేళ్ళకాలంలో విప్లవకథ శిల్ప పరిణామాన్ని మన సామాజిక ఉద్యమ వాతావరణంలో వచ్చిన మార్పుల నేపథ్యంలో పరిశీలించవచ్చు ఉద్యమాలు కాల్పనిక సాహిత్యానికి వస్తు వైవిధ్యాన్ని, దృక్పథాన్ని అందించినట్టే గొప్ప శిల్ప పద్ధతులకు కూడా ప్రేరణ అవుతుంది. వస్తు వైవిధ్యం, దాన్ని సాహితీకరించే దృక్పథం తప్పనిసరిగా శిల్పంలో కూడ అవసరమైన మార్పులను తీసుకొనివస్తుంది.

ఈ దృష్ట్యా మొత్తంగా తెలుగు కథా వికాసాన్ని పరిశీలిస్తే విప్లవ కథకుల పాత్ర, అందులోనూ రఘోత్తమ రెడ్డి నిర్వహించిన కథన పద్ధతుల గురించి ప్రత్యేకంగా చెప్పకోవలసి వస్తుంది. నేలమీద నడిచే శిల్పాన్నీ ఆశ్రయించడం, సాధారణంగా ఉంటూనే విశిష్టంగా కనబడటం ఆయన కథనంలోని ప్రత్యేకత. రఘోత్తం కథన పద్ధతిని వస్తువు, దృక్పథం, సామాజిక సందర్భాలతో ముడిపెట్టకుండ చర్చించడం సాధ్యం కానంతగా కలగలసిపోయాయి. సామాజిక సందర్భాలలోని వాతావరణం, మూడ్ శిల్పంలో ప్రధానమైన అంశాలుగా ఉంటాయి. సామాజిక పరిణామాల ఉధృతిని మానవ స్పందనల అలజడిని పొరలు పొరలుగా చిత్రించుకుంటూ వెళ్లడంవల్ల కథ పొడవునా ఒక తాత్విక వాతావరణం అంతస్సూత్రంగా నెలకొంటుంది.

రఘోత్తం కథనంలో సంక్లిష్టత గురించికూడా చెప్పకోవాలి. నిజానికి ఏ యితివృత్తాన్నయినా సరే దాని సంక్లిష్టతలోనే గుర్తించాలి. స్వీకరించాలి. ముందే అన్నట్టుగా చాలా సాధారణంగా ఉన్నట్టుండే ఏ యితివృత్తాన్ని కూడ రఘోత్తం అంత సరళంగా చూచి సరిపెట్టుకోలేదు. దాన్ని సమస్త సంక్లిష్టతలతో, అనేక వైరుధ్యాల ప్రాతిపదిక మీదినుండి కథలోకి తీసుకురావడానికి ప్రయత్నిస్తారు. ఈ ప్రయత్నంలో ఏ ఒక్క అంశాన్ని విస్మరించకుండ జాగ్రత్తపడటం మాత్రమే గాక కథలోని సంక్లిష్టతను బహుముఖీనతను అర్థం చేసుకోవడానికి అవసరమైన సరళతను కూడ అతి జాగ్రత్తగా పాటిస్తారు సంక్లిష్టతను కథలోకి తీసుకు

రావడానికి ఆయన సాధారణంగా తెలిసిన విషయంనుండి తెలియని విషయానికి, కంటికి కనిపించే దాని నుండి, దాని వెనుక కనిపించని దానిలోకి ప్రయాణిస్తూ ఉంటారు చాలా అలవోకగా మొదలైన కథ అనేక మనస్తత్వాల మీదుగా ప్రసరించి లోలోపలి సంఘర్షణను వెలికి తీస్తుంది. ఈ క్రమంలోనే రఘోత్తం పాత్రల మనస్తత్వం మీద, అంతరంగ చిత్రణమీద శ్రద్ధ పెంచుకున్నారు.

కథా సాహిత్యంలో నిర్దిష్ట పాత్రల ద్వారానే కథ నడుస్తుంది తను ఎంచుకున్న వస్తువుకు అనుకూలమైన మనస్తత్వంగల పాత్రలను జాగ్రత్తగా రూపొందించుకుంటారు. సామాజిక, బాహ్య ప్రేరణలతో నిమిత్తంలేని మనస్తత్వ చిత్రణకూ, రఘోత్తం పాత్రల అంతరంగ చిత్రణకూ పోలికలేదు. వ్యక్తిత్వ నిర్మాణానికి - సామాజిక చలనాలకు ఉండే సంబంధంతోపాటు వ్యక్తిత్వం మీద సామాజిక సంచలనాల ప్రతిఫలనం కూడా ఆయన కథల్లో ఒక ప్రత్యేక లక్షణం. 'జాడ' కథలోని సుజాత పాత్రను ఈ దృష్టితో పరిశీలించవచ్చు.

యింటా బైట రెండు పరస్పర విరుద్ధ విలువల మధ్య జరుగుతున్న సంఘర్షణ సుజాత వ్యక్తిత్వాన్ని కాంతివంతం చేస్తుంది తమ్మునికి భర్తకు మధ్య తలెత్తిన ఘర్షణను రెండు భిన్న ఆర్థిక, రాజకీయ నమూనాల మధ్య పెనుగులాటను చిత్రించే క్రమంలో, వర్గపోరాటంలో ఉండే సున్నితమైన మానవీయ ప్రతిస్పందనలు ఆమెను ఎంతగానో ప్రభావితం చేసేదీ రఘోత్తం సూక్ష్మదర్శినిలో చేపిస్తారు. సుజాత అంతస్సంఘర్షణలో తమ్ముని గురించిన ఆరాటం కనిపిస్తుంది కాని నిజానికి అతని మార్గానికి భర్త మధుసూదన్ నిలబడిన మార్గానికి నడుమ నర్సింమ యుద్ధం జరుగుతూ ఉంటుంది. ఈ యుద్ధ ప్రభావంతో సుజాత తనలోని మానవీయ లక్షణాలను మరింత దృఢపరచుకుంటుంది. ఆ క్రమాన్ని రచయిత జాగ్రత్తగా చిత్రించారు.

సుజాత రైలు దిగినప్పటినుండి ఆమె నడుస్తున్న దారిలో అడుగడుగును ఎంత నిశితంగా చూపిస్తారో, అదే పద్ధతిలో ఆమె జీవిత గమనాన్ని, వ్యక్తిత్వ వికాసాన్ని ఉద్యమ ప్రభావంతో ఏకకాలంలో చిత్రించుకుంటూ వెళ్ళారు

రఘోత్తం కథల్లోని పాత్రలను, వాటి స్వభావాలను తెలంగాణా నేపథ్యం నుండి, మరీ ముఖ్యంగా తెలంగాణా సామాజిక వాతావరణంలో వచ్చిన మార్పుల నేపథ్యం నుండి పరిశీలించాలి 'నా పాత స్నేహితుడు' కథనుండి 'హంతకుల' దాకా ఆయన కథల్లో రూపొందిన పాత్రలను కేవలం నిజ జీవితంలోని వ్యక్తులు అని సరిపెట్టుకోవడం సాధ్యంగాదు విప్లవోద్యమ నేపథ్యంలో తెలంగాణా సామాజిక సాంస్కృతిక రంగాల్లో జరిగిన పరిణామాల స్వభావాలను - రఘోత్తం కథల్లోని పాత్రల స్వభావాలను కలిపి పరిశీలిస్తే కథకుడిగా ఆయన మానవ జీవితాన్ని చూడటంలో సాధించిన పరిణతి కనిపిస్తుంది.

ఒక రైతుకూలీ, కార్మికుడు, గృహిణి మొదలైన ఏ పాత్రలయినా సరే కథా సాహిత్యంలో నమూనా పాత్రలుగా తారసపడటం గమనిస్తూంటాం. నిజ జీవితానికి చాలా దగ్గరిగా వున్న పాత్రలయినా సరే ఈ నమూనా పాత్రల ద్వారా జీవిత సారాన్ని, సంక్లిష్టతను, వైవిధ్యాన్ని చిత్రించడం సాధ్యం కాదు. రఘోత్తం పాత్రలను గమనిస్తే ఏ రెండు పాత్రలమధ్య పోలిక కనిపించదు.

వస్తువుకుండే నిర్దిష్ట స్థలకాలాల పట్ల రచయితకున్న అవగాహన వల్ల పోరాట నేపథ్యంలో ఉద్యమ పరిధిలో అనుకూలంగానో, ప్రతికూలంగానో ఉండే పాత్రలే అయినా వాటి మధ్య గొప్ప వైవిధ్యం కనిపిస్తుంది నిజజీవితంలోని మనుషులను సాహిత్యంలో పాత్రలుగా మలచడంలో అనేకమంది వ్యక్తులకు ప్రాతినిధ్యం వహించే పాత్రలను రూపొందించడంలో - నిజజీవితంలో బైటికి కనిపించే ప్రతిస్పందనలతోపాటు, అంతరంగ సంఘర్షణకు ప్రాధాన్యత యిస్తూ పాత్రలను నిర్మించడంలో రఘోత్తం చూపిన ప్రతిభ విప్లవ కథ పురోగమనాన్ని శక్తివంతం చేసింది.

మొత్తంగా కథా రచనలో రఘోత్తమ రెడ్డి సాధించిన విజయాలను తెలంగాణ సమాజ సాహిత్య సంబంధాల నేపథ్యంలో, వర్గ పోరాటంలో భాగంగా వివిధ సామాజిక బృందాల ఆరాటాలు, సంఘర్షణల నేపథ్యంలో వివరించినప్పుడే యిప్పటికీ తెలియని అనేక విషయాలు వెలుగులోకి వస్తాయి. తెలంగాణ ఆర్థిక రాజకీయ సంఘర్షణల పునాదిమీద ముఖ్యంగా రైతులను, కార్మిక ఉద్యమ సంచలనాల ప్రాతిపదికమీద రఘోత్తం కథలను, వాటిలోని వస్తు శిల్ప పరిణామాలను చర్చించడానికి యిక పూనుకోవలసే ఉన్నది ఆర్థిక, రాజకీయ సంఘర్షణలు మానవ సంబంధాల సారంలోను, మానవ అంతరంగం లోనూ తీసుకొని వచ్చే మార్పులను అధ్యయనం చేయడానికి రఘోత్తం కథలు సృజనాత్మక సాధనాలుగా ఉపయోగపడతాయి

తెలంగాణ గ్రామంలో ఆదివాసీ, కార్మిక జీవితాలను, వాళ్ళ జీవన్మరణ పోరాటాలను, హత్యలను, ఆత్మహత్యలను కథల్లోకి ఎక్కించే ప్రయత్నాలను వర్గపోరాటం మానవ సంబంధాలన్నింటిలో ఎన్నెన్ని రూపాల్లో ప్రతిఫలించేందుకు అవకాశం ఉన్నదో ఒక సృజనకారుడిగా అన్వేషించి చిత్రించగలిగారు. రాజ్యం ఒక అణచివేత సాధనమైన ఈ సమాజంలో ఆధిపత్యం, హింస లెక్కలేనన్ని వికృతరూపాల్లో పెచ్చరిల్లి ఒక అమానవీయ విధ్వంస క్రమంలోకి మనిషిని నెట్టి వేస్తుంది ఈ క్రమం మానవ సంబంధాల్లో అనేక అవ్యక్త హింసా వ్యవస్థలను ప్రోది చేస్తుంది

ఒకవైపు యింత విధ్వంసకర వాస్తవాన్ని చిత్రిస్తూనే పరమ మానవీయ నిర్మాణ ప్రయత్నాలను కూడా యిదే మనుషులు తమ రెండు చేతులతోటి చెమట బిందువుల తోటి, రక్త తర్పణతోటి సాధిస్తారనే విశ్వాసాన్ని రఘోత్తం కథలు ప్రకటిస్తాయి. తెలుగుకథా చరిత్రలో విప్లవ కథా చరిత్రలో రఘోత్తం రెడ్డి కథకుడిగా సాధించిన విజయాలు ప్రజాపోరాటాలకు ఆశ్వాసంగా చిరకాలం నిలచి ఉంటాయి.

# బండి నారాయణస్వామి

♦ గుడిపాటి ♦

**జీ**వితంలోనైనా, సాహిత్యంలోనైనా పదేళ్ళ కాలం చిన్నదేం కాదు పదేళ్ళ కాలాన్ని ప్రతిఫలించే ప్రయత్నం కూడా చిన్నది కాదు స్వామి కథల్ని ఒకేసారి ఒకచోట చదివినప్పుడు కలిగిన అభిప్రాయమిది తెలుగు సమాజాన, ప్రత్యేకించి మధ్యతరగతి జీవితంలోని వైవిధ్యాన్ని, వైరుధ్యాల్ని వ్యక్తం చేయడానికి, జీవితాన్ని కొత్త దృష్టితో దర్శించటానికి స్వామి ప్రయత్నించారు 1987లో కథా రచన ఆరంభించిన బండి నారాయణస్వామి దాదాపు పదేళ్ళపాటు విస్తృతంగా కథలు రాశారు. ఈ పదేళ్ళ కాలంలోనే నవలలు కూడా రాశారు. అయితే స్వామి కథల పరిశీలనకే పరిమితమైన వ్యాసమిది.

అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం దగ్గర టీచర్‌గా పనిచేస్తున్న స్వామి జీవితానుభవం విస్తృతమైందని ఆయన కథలు చెబుతాయి ఆయన కథల్లో విభిన్న పార్శ్వాలు దర్శనమిస్తాయి 1987లో కథా రచన ఆరంభించినప్పటికీ అంతకుముందు పదేళ్ళకాలపు జీవిత స్వరూపంకూడా ఈ కథల్లో దర్శనమిస్తుంది. దాదాపుగా పదిహేను, ఇరవైఏళ్ళ కాలంలోని సామాజిక పరిణామాలు, మానవ సంబంధాల్లో నెలకొన్న వైరుధ్యాలు ఈ కథల్లో చిత్రితమయ్యాయి. ఈ కథలు చదివినప్పుడు ఒకరకమైన విషాదం, విస్మయం, దిగులు, ఉద్వేగం ముప్పిరి గొంటాయి. గతం తాలూకు జ్ఞాపకాలు కళ్ళముందు కదలాడుతాయి. నడిచిపోయిన కాలం స్ఫురణకొస్తుంది స్మృతిపథంలో ఉండిపోయిన మనుషులు ఆకస్మికంగా మనసు పొరల్లోకి తోసుకు వస్తారు. వైఫల్యాల తాలూకు నీడలు సుప్తచేతనలోంచి తన్నుకొస్తాయి

అయిదేళ్ళ కిందట ఈ కథల్ని ఓసారి చదివాను. మళ్ళీ ఇప్పుడు చదివాను. అయినా కొత్తగా అనిపిస్తాయి వాటిలో తాజాదనం ఉంది బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' లానే స్వామి కథల పుస్తకాన్ని కూడా కొన్ని తరాల పాఠకులు చదువు కుంటున్నారన్నది నా ప్రగాఢ నమ్మిక. ముఖ్యంగా జీవితాన్ని తాత్వికమైన దృక్పథంతో వ్యాఖ్యానించినందునే ఈ కథలు చదివింపజేస్తాయి. కాలాతీతమైన కొన్ని జీవిత సత్యాల్ని ఆవిష్కరించినందునే వీటిని చదివిన పాఠకులు స్పందిస్తారు. ఎంచుకున్న ఇతివృత్తం, కథను నడిపించేందుకు అవసరమైన నైపుణ్యం, శైలీ శిల్పాలు సమతూకంలో ఉన్నందునే ఈ కథలకి నాలుగు కాలాలపాటు నిలబడే గుణం ఉంది. ఇలాంటి సాహిత్య విలువలున్న కథలు ఒక పుస్తకంగా రాక పోవడం, పాఠకులకు అందుబాటులో ఉండకపోవడం విచారకరం

ఏమిటీ కథల గొప్పదనం? వస్తువులో వైవిధ్యమా? శిల్పంలో వైశిష్ట్యమా?

శైలిలో సరికొత్త విన్యాసమా? స్థల కాలాలకు అతీతమైన సాహిత్య సౌందర్యమా? ఏమిటి స్వామి కథల్లోని గొప్పదనం? స్వామి నిసర్గమైన జీవితాన్ని చిత్రించారు. సహజత్వానికి పట్టం కట్టారు కథను కొత్తగా చెప్పడానికి ప్రయత్నించారు. చెప్పాలనుకున్న విషయాల్ని చెప్పడానికి జంకలేదు అన్నిటికీ మించి తాత్వికునిలా జీవితాన్ని చూసే దృష్టికోణం ఆయన కథలకు జీవం పోసింది ఏదో ఒక పక్షం వహించి తెగనాడటం స్వామి చేయలేదు తను ఒక సైద్ధాంతిక దృక్పథాన్ని తలకు ఎత్తుకొని జీవితాన్ని వ్యాఖ్యానించడానికి ప్రయత్నించలేదు. ఒక తీవ్రత నుంచి మరో తీవ్రతలోకి ప్రయాణించలేదు జీవితాన్ని యథాతథంగా చూపిస్తూ, జీవితం మనుషుల్ని ఎలా లాక్కెళుతుందో చెప్పడానికి ప్రయత్నించారు. అదే సమయాన సమాజం, శతాబ్దాలుగా మనిషిని వెన్నాడి వచ్చే మూసలు, వలయాలు మనిషిని ఏవిధంగా నియంత్రిస్తున్నాయో చెప్పడానికి ప్రయత్నించారు. ఈ క్రమంలో రచయిత ఏ పక్షం వహించకపోవడంవల్ల ఈ కథల్ని చదివిన పాఠకుడు ఆత్మావలోకనంలో పడే అవకాశముంది. తనను గురించి తానే వివేచించుకోడానికి, జీవితాన్ని తనదైన దృష్టిలోంచి చూడటానికి, జీవితాన్ని వీలైనంత మానవీయంగా మలుచుకోడానికి ఆస్కారమిస్తాయి స్వామి కథలు.

స్వామి కథా సాహిత్యంలో నాలుగు రకాలయిన అంశాలు కనిపిస్తాయి.

1. తాత్విక నేపథ్యం నుంచి జీవితాన్ని చిత్రించిన కథలు
2 రాయలసీమ జీవితాన్ని రికార్డు చేసిన కథలు
3. మధ్యతరగతి జీవితాలకు సంబంధించిన కథలు
4. దళిత జీవిత పార్శ్వాల్ని వ్యక్తం చేసిన కథలు

స్వామి రాయలసీమకు చెందిన రచయిత అయినప్పటికీ అక్కడి జీవిత చిత్రణకే పరిమితం కాలేదన్న విషయాన్ని ఈ వర్గీకరణను గమనిస్తే అర్థమవుతుంది తాత్విక నేపథ్యం నుంచి కొన్ని కథలు రాశారు. అయితే మిగతా కథలకు ఎలాంటి తాత్విక నేపథ్యం లేదనుకుంటే పొరపడినట్టే దాదాపుగా అన్ని కథల్లోనూ తనదైన తాత్విక ధోరణి స్వామి కథల్లో ఉంటుంది. జీవితాన్ని గురించి స్పష్టమైన తాత్విక దృక్పథం వ్యక్తం చేసే కథలు కొన్ని ఉన్నాయి కాబట్టి ఈ వర్గీకరణ అవసరమైంది.

**తాత్విక నేపథ్యం నుంచి వచ్చిన కథలు:**

స్వామి రచనా వ్యాసంగానికి భౌతికవాదంతో కూడిన భారతీయ తాత్విక చింతన ప్రేరణగా నిలిచిందని, తొలినాళ్ళలో స్వామి రాసిన కథలు చెబుతాయి. ప్రతి కథలోనూ జీవితాన్ని, దాని బహుముఖ పార్శ్వాల్ని స్వామి చిత్రించారు. అయితే అసలు మానవజీవితాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? జీవితానికి ఉన్న పరమార్థం ఏమిటి? జీవితాన్ని ఏ దృష్టికోణం నుంచి చూడాలి? అన్న ప్రశ్నలు వేసుకొని, వాటికి సమాధానాలు చెప్పే ప్రయత్నం స్వామి రాసిన "నీడల మెట్లు, రెండు అబద్ధాలు, పరుగు, చమ్కీదండ, పద్మపాదం, అద్దం, నిన్నటి ఊపిరి" కథల్లో కనిపిస్తుంది. ఈ ప్రయత్నం వెనుకల స్పష్టమైన తాత్విక

నేపథ్యం ఉంది కనుకనే తాత్విక నేపథ్యం నుంచి వచ్చిన కథలుగా వీటిని విడదీసి చూపాల్సి వచ్చింది జిడ్డు కృష్ణమూర్తి, యు జి కృష్ణమూర్తి, రజనీష్ మొదలైన తత్వవేత్తల ఆలోచనా ధారకి సంబంధించిన ప్రభావం ఈ కథల్లో చూస్తాం

స్వామి తొలి కథ 'పరుగు'లోనే దీనికి సంబంధించిన ఆనవాళ్ళు కనిపిస్తాయి. జీవితంలో మనిషి తనకు తెలియకుండానే పరుగు దీస్తుంటాడు ఎందుకోసమో తెలుసుకునేసరికి చివరికి ఏమీ మిగలదు ఎవరికోసమో పరుగుదీస్తున్నట్లుగా కాలాన్ని దొర్లించే మనిషి నైజాన్ని ప్రశ్నిస్తుందీ కథ. ఒకసారి నిలిచి తనను తాను చూసుకోవాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తుంది. జీవితాన్ని హాయిగా, ఆనందంగా గడపటం కన్నా ఎవరో నిర్దేశించిన మూసపాత్రల్లోకి ఒదిగిపోయి పరుగు దీసే మనిషి చివరాఖరున సాధించేదేమిటి? ఏం ఉండదు అయినా ఎదగడం కోసం బతుకు అంతా పరుగులు దీస్తాడు. సమాజం నిర్దేశించిన చట్రాల్లో తనను తాను కుదించుకోవడానికి తంటాలు పడతాడు అందుకోసం ఎన్నెన్నో ప్లానులు... లెక్కలు. .ఇలాంటి మనిషి జీవితంలోని అర్థరాహిత్యాన్ని స్వామి ఈ కథలో చెబుతారు. విరగబూసే పువ్వులంత సహజంగా, పక్షులంత స్వేచ్ఛగా బతకడాన్ని మనుషులు మరిచిపోయారు అందం, ఆనందం లేని రసహీన జీవితానికి అలవాటు పడిపోయారు భద్రతలేని బతుకు కోసం నిరంతరం వెంపర్లాట. ..ముఖ్యంగా మధ్యతరగతిలో, ఉన్నత వర్గాల్లో కనిపించే దృశ్యమిది. సమాజపు చట్రంలో ఇమిడిపోయి కదలికలు లేని నకలుగా పడివుండటానికి ఏవో లక్ష్యాలు. కొండ గుర్తులు. మైలురాళ్ళు నిర్దేశించుకొని వాటికోసం పరుగుదీయడాన్ని మనుషులు అలవరుచుకుంటారు. ఈ క్రమంలోనే చదువులు, ఉద్యోగాలు, పెళ్ళి, పిల్లలు, వాళ్ళకోసం సంపాదన... వారిని ప్రయోజకులుగా చేసేందుకు ఎత్తుకు పై ఎత్తులు వేయడం తన వైఫల్యాల్ని వారి ద్వారా విజయాలుగా మార్చుకునేందుకు వృధా ప్రయాస ...ఇలా మొనాటనస్ బతుకులో పడికొట్టుకుపోతూ పరుగులు పెట్టడమే జీవితంగా భ్రమించడాన్ని కథకుడు విమర్శిస్తాడు జీవితమంటే ఇదే ననుకునేవాళ్ళకు అది ఎంత యాంత్రికమో, బండబారిన మూసనో చెబుతాడు వ్యర్థమైన ఈ పరుగులాటను తెగనాడే తత్వం ఈ కథలో వుంది.

అయితే కథ ముగింపు మాత్రం అభ్యంతరకరం కథలో పరుగుపెట్టే మనిషి మృత్యువును వరించడంతో అతని పరుగులాట ముగుస్తుంది. అయితే మృత్యువును చేరుకోవడమంటే చనిపోయిన తన తల్లి దగ్గరకు చేరుకోవడంగా, తన చిన్నప్పటి బాల్యంలోకి చేరుకోవడంగా అభివర్ణిస్తాడు రచయిత. తల్లి గర్భంలోకి వెళ్ళిపోవడంగా చెబుతాడు. అయితే మృత్యువు, బాల్యం ఒకటి ఎలా అవుతుంది? మాయా మర్మం తెలియని స్థితి మృత్యువుతో సమానం కాదు. స్వచ్ఛతకు సంకేతం మాత్రమే. ప్రాకృతిక స్వభావానికి చిహ్నం మాత్రమే కనుక ఈ కథలో ముగింపు ఈ రకంగా ఉండాల్సింది కాదు. స్వామి పేరు చెప్పగానే చాలామందికి గుర్తుకొచ్చే కథ 'చమ్కీదండ' నిస్సారమైన జ్ఞాపకాల్ని పట్టుకు వేలాడే మానవ స్వభావాన్ని విప్పి చెప్పిన కథ ఇది జీవితకాలమంతా

జ్ఞాపకాలతో, వైఫల్యాలతో కునారిల్లే సగటు మనిషి తాపత్రయాల్లోని వివేక రాహిత్యాన్ని చెబుతుందీ కథ మనిషి ఆనంద విషాదాలకు వర్తమాన పరిస్థితులకన్నా గతించిన రోజుల జ్ఞాపకాలే ఎక్కువగా మూలం మానవ మనస్తత్వాన్ని గమనించినవారికి ఈ విషయం చక్కగా అర్ధమవుతుంది. కాని వర్తమానాన్ని విడిచి గత జ్ఞాపకాల్లో జీవించడం అతి పెద్ద దౌర్బల్యం. విషాదమైనా, ఆనందమైనా గతాన్ని తీసుకురాలేరు. జ్ఞాపకానికి ప్రాణం పోయలేరు. అయినా జ్ఞాపకాల్ని వదల్లేకపోవడం మనిషి దురవస్థకు సంకేతం. కాని జ్ఞాపకాలు శాంతిని ప్రసాదించవు. "జ్ఞాపకాలు వేధిస్తాయే గాని అప్యాయంగా పలకరించవు" అన్న అఫ్సర్ కవితా పాదం గుర్తుకొస్తుంది ఈ కథ చదివినప్పుడు గతం పునాదిగా జీవించాలనుకునే దురవస్థ నుంచి బయట పడినప్పుడే మనిషి ప్రశాంత చిత్తుడవుతాడన్న ఎరుకను కలిగిస్తుందీ కథ. మనిషిలో నిరంతరం రెండు విరుద్ధ భావాల సంఘర్షణ, వాటి మధ్య సమన్వయం అంత సులువు కాదు. మంచీ చెడు, నీతి అవినీతి అనేవి నిరంతరం మన ఇంద్రియాలని అదుపు చేస్తుంటాయి. అనుభవానికీ, ఆలోచనకీ మధ్య ఘర్షణ సాగినంతకాలం అశాంతి తప్పదు. కనుకనే అంతర్గత ఆలోచనకీ భాష, ప్రవర్తనకీ మధ్యన ఏకత్వం సాధించాలన్నది 'రెండు అబద్ధాల' కథ సారాంశం గడిచిపోయిన గతమంతా మృత్యు సమానమే. కానీ ఆ గతాన్ని గురించి తలపోత మనిషి నైజంలో ఉంది కానీ "గతం నుంచి ఎన్ని జ్ఞాపకాలైనా తవ్వుకోవచ్చు. కానీ ఆ గతం నుంచీ ఒక చిన్న ఇంద్రియానుభవం కూడా పొందలేరు" (నీడల మెట్లు) అంటారు రచయిత. జిడ్డు కృష్ణమూర్తి కూడా జ్ఞాపకాల వరదలో కొట్టుకుపోయే మనిషిని హెచ్చరిస్తాడు. వర్తమానంలో జీవించలేని మనిషి గతాన్ని పట్టుకు వేలాడుతాడన్న సత్యం కృష్ణమూర్తి ప్రబోధాల్ని చదివితే అర్థమవుతుంది. ఆ బోధనల సారాంశం స్వామి రాసిన 'చమ్కీదండ', నిన్నటి 'ఊపిరి, నీడల మెట్లు' కథల్లో చిత్రితమైంది. జీవిత పరమార్థాన్ని, జీవన సాఫల్యాన్ని గురించి ఆలోచించేవారికి ఒక అవగాహనను ఇస్తాయి ఈ కథలు.

### మధ్యతరగతి జీవితాన్ని చిత్రించిన కథలు:

తాత్విక దృష్టి మనిషిని నిష్క్రియాపరుణ్ణి చేస్తుందన్న భావం ఎక్కువమందిలో ఉంది. తాత్వికతను వేదాంతంతో సమానంగా పరిగణించడం వల్ల ఇలాంటి అభిప్రాయానికి వస్తారు. కానీ వేదాంతంలా తాత్విక దృష్టి సృజనకారుల్ని నిమిత్తమాత్రుల్లా చేయదు. మరింత నిశిత దృష్టిని, సంయమనంతో మనుషుల ప్రయాణాల్ని ఆకళింపు చేసుకునే అవగాహనను ఇస్తుంది. ఈ జ్ఞానం అంతిమంగా తమ సృజనాత్మక కలాపంలో మరింత నిజాయితీగా, స్పష్టంగా ఉండటానికి దోహదపడుతుంది. మధ్యతరగతి కుటుంబాల్లోని వైరుధ్యాల గురించి స్వామి రాసిన కథలే ఇందుకు దాఖలా. మధ్యతరగతి జీవితాన్ని "అమ్మ, పిప్పి మనిషి, నీడల ముడులు, ఇరుసు అధోముఖం, అగాధం, ఊరు తల్లి, ఆగామి వసంతం" కథల్లో చిత్రించారు. పరాయీకరణ, డబ్బు సంబంధాలు మధ్యతరగతి జీవితాల్ని చిన్నాభిన్నం చేస్తున్న తీరు 'అగాధం',

ఇరుసు' కథల్లో వ్యక్తమవుతాయి. బాల్యంలో కలిసి ఆడిపాడే పిల్లల మధ్య ఎలాంటి మాయామర్మం ఉండదు వాళ్ళ స్నేహం పక్షుల గుసగుసంత సహజం కానీ బాల్యంలోని సున్నితపు పొరల్ని విడచి కౌమారంలోకి, యవ్వనంలోకి పాదం మోపాక సామాజిక ఆర్థిక స్థితిగతులు చిన్నప్పటి స్నేహితుల మధ్య ఎడాన్ని పెంచుతాయి. ఈ సత్యాన్ని హృద్యంగా వ్యక్తీకరించిన కథ 'అగాధం'. మర్యాదలు, విలువలు, అంతస్తులు అడ్డుగోడలై మనిషి నుంచి మనిషి దూరమయ్యే క్రమాన్ని ఈ కథలో చూసి దిగ్భ్రమ చెందుతాం. స్వామి పదమూడేళ్ళ కిందట ఈ కథ రాశారు. మనుషుల మధ్య ఈ అగాధం ఇవాళ ఎంతగానో పెరిగింది.

జీవితాన్ని కొన్ని నమూనాల్లో కుదించుకోవాలన్న మనిషి ఆరాటం, అనివార్యంగా మనిషి తనను తాను కోల్పోతున్న స్థితి 'ఇరుసు' కథలో చిత్రించారు. బతుకు దెరువు కోసం కువైట్ వెళ్ళి పదేళ్ళ అనంతరం తిరిగి వచ్చిన సత్తికి తన ఊరు, తన మిత్రులు మారిపోవడం చిత్రంగా తోస్తుంది. "ఊరికి దూరంగా ఒక ఆశ్రమం లాంటిది కట్టుకొని అంతా ఒకచోట సమిష్టిగా, కళాత్మకంగా బతకాలని కలలుగన్న" తన మిత్రుల నాటి భావోద్వేగం, ఉత్సాహం కనిపించకపోగా పరస్పరం రగులుకునే విద్వేషం చూసి ఆశ్చర్యపోతాడు పదేళ్ళ కాలంలో మార్పు సహజం కానీ ఆ మార్పు మానవ సంబంధాల్ని దెబ్బ తీసేవిధంగా ఉండటం విషాదం. కూతురు ప్రేమని సంపాదించడానికి వడ్డీ వ్యాపారం చేసి డబ్బులందించే తల్లిది ఎంతటి దైన్య స్థితి. కానీ ఇది కాదనలేని వాస్తవమని 'నీడలు ముడులు' కథ తెలియచెబుతుంది. తనకంటూ సొంత సంపాదన లేకపోవడమే ఆమెను చాటుగా వడ్డీ వ్యాపారం చేయాల్సిన దుస్థితికి నెట్టిందన్నది మరో వాస్తవం ఆడవాళ్ళలో ఎక్కువమందికి ఇది తప్పని పరిస్థితి. డబ్బు సంబంధాలు రక్త సంబంధాల్ని కూడా కలుషితం చేస్తున్నాయి. కనుకనే తల్లి కొడుక్కి తెలియకుండా వడ్డీ వ్యాపారం చేస్తుంది. తెలిసినా ఏమనలేని స్థితి కొడుకుది. ఇవాళ మధ్యతరగతి కుటుంబాల్లో సర్వసాధారణంగా కనిపించే నిజాలు ఇవి.

అవసరాలకీ, ఆకలికీ మధ్యన ఉన్న వైరుధ్యం, మానవీయ స్వభావానికీ, అమానుష జీవనశైలికీ మధ్యన ఉన్న అంతరం ఎంత బీభత్సంగా వుంటుందో 'అధోముఖం' కథలో చూస్తాం. జీవితం ఎన్ని చిక్కుముళ్ళతో ముడిపడి వుందో చెప్పడానికి రచయిత ప్రయత్నించారు. అవసరాలు, డబ్బు సంబంధాలు ఒక ఎత్తు అయితే, బతికినంతకాలం, చచ్చాక కూడా వదలని కులం - మనిషిని ఎంత హీనంగా చూస్తుందో ఈ కథలో చిత్రించారు కథలో ఎక్కడా వ్యక్తుల ప్రవర్తనపై తీర్పులు ప్రకటించకుండా రచయిత సంయమనం చూపారు. అవసరాలు, స్వార్థపరత్వం మనుషుల్ని ఏవిధంగా నడిపిస్తాయో చెప్పడానికి ప్రయత్నించారు. 'పిప్పి మనిషి' కథ కూడా ఇదేకోవలో నడుస్తుంది. అవసరం తీరాక మనుషుల్ని వదిలించుకునే ఆధునిక జీవనరీతిని తెలియజెప్పే కథ 'ఇది. లౌక్యం పేరున, తెలివి మాటున వాడుకుని వదిలేసే నైజం మనుషులకు అలవడింది. ఇందుకు ఏ ఒక్కరూ మినహాయింపు కాదని రచయిత ఈ కథల ద్వారా చెబుతారు.

స్వామి పేరుచెప్పగానే చాలామందికి గుర్తుకు వచ్చే కథ 'అమ్మ' మధ్య తరగతి నుంచి వచ్చిన ప్రతి ఒక్కరికి తమ అమ్మే గుర్తుకు వస్తుంది ఈ కథ చదివితే పల్లె తల్లి స్వభావాన్ని సహజంగా చిత్రించిన కథ ఇది కానీ ఇప్పుడు ఈ తరం ఆడవాళ్ళను చూస్తే అమ్మతనంలోని ఆప్యాయతాకోణం తరిగి పోతోందనిపిస్తుంది స్వామి చూపిన 'అమ్మ' తనంలో సెంటిమెంట్ లేదు వలపోత లేదు కఠోర జీవిత వాస్తవం ఉంది స్వార్థపు నీడలెరుగని అమ్మతనంలోని ఔన్నత్యం ఉంది. అనేకానేక వైరుధ్యాల మధ్యన, డబ్బు సంబంధాల మధ్యన కూడా నిలిచి వెలిగే అమ్మతనం గొప్పదనం ఏమిటో చెప్పారు మధ్య తరగతి కుటుంబాల్లో మమతలుంటాయి కోపతాపాలుంటాయి పంతాలుంటాయి. పట్టింపులుంటాయి. కనిపించని అసూయా ద్వేషాలుంటాయి. పట్టుదలలుంటాయి రాజీపడటాలుంటాయి ఆశనిరాశలుంటాయి. నిర్ణయాలు తీసుకోడం, వాటినించి వెనక్కి వెళ్ళడమూ ఉంటుంది. అవసరాలు జీవితాల్ని శాసిస్తుంటాయి. సమాజం నిర్దేశించిన నమూనాల్లో బతుకును కుదించు కునేందుకు ఆరాటాలుంటాయి ఈ క్రమాన నిలువెత్తు స్వార్థం మనుషుల్ని ఆవరించే పరిస్థితులుంటాయి వీటన్నిటి మధ్యన మానవీయ స్పర్శతో వ్యవహరించడం, జీవితంలో శాంతిని సాధించడం అంత సులువు కాదు అయినా అందుకోసం మనిషి తపన పడతాడు ఆ తపనను 'ఆగామి వసంతం' కథలో చూస్తాం. నిర్ణీత సూత్రాల పరిధిలో జీవితం ఉండదని మధ్యతరగతి జీవితం గురించి స్వామి రాసిన కథలు చెబుతాయి. సకల సూత్రాలు, సిద్ధాంతాలు జీవితం ముందు చిన్న బోతాయని స్వామి కథలు చదివితే అర్థమవుతుంది జీవితంలోని వైరుధ్యాల్ని చూడగలగటం, ఆవేశ రహితంగా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించటం వల్లనే స్వామి ఈకథలు రాయగలిగారు

**దళిత జీవిత నేపథ్యం నుంచి వచ్చిన కథలు:**

అయితే స్వామి ధర్మాగ్రహం ఎక్కడా ప్రదర్శించరనుకుంటే పొరపాటు. ధర్మాగ్రహం వ్యక్తం చేస్తాడు మనుషుల మీద కాకుండా మనుషుల్ని దిగజార్చిన పరిస్థితుల మీద, వ్యవస్థల మీద ధర్మాగ్రహం కనిపిస్తుంది. దళిత జీవిత నేపథ్యం నుంచి రాసిన తల్లిమట్టి, ఒక హెచ్. సరస్వతి కథలు ఇందుకు దాఖలా. ప్రశాంతం కూడా ఇదే కోవలో వచ్చిన దళిత కథ. కులం మనుషుల్ని కుంచింప జేస్తున్న వైనం మొదటి రెండు కథల్లోనూ చూడొచ్చు. 'తల్లి మట్టి' కథలో బ్యాంకు ఉద్యోగి అయిన శ్రీనివాసులు దళితుణ్ణని చెప్పుకోవడానికి నామోషీగా ఫీలవుతాడు. తన సాంఘికస్థాయిని ప్రదర్శించుకోవడానికి అగ్రకులాల వారితో స్నేహం చేస్తాడు. తన ఇంటిని ఆధునాతన సామాగ్రితో నింపడానికి ప్రయత్నిస్తాడు. 'రెడ్డీస్' అమ్మాయిని ప్రేమించి భంగపడతాడు. కులప్రస్తావన వచ్చిన ప్రతిసారి కుంచించుకుపోతాడు. తన కులాన్ని తక్కువగా భావించే ఈ ధోరణి తన తల్లి మట్టిని, బతుకు వేర్లని మరచిపోవడమేనంటారు స్వామి. దళిత కులాలవారు ఉన్నత కులాల సంస్కృతిని, అలవాట్లను అనుసరించడానికి చేసే ప్రయత్నం ఇప్పటికీ ఉంది. ఈ సంస్కృతీకరణ క్రమం దళితుల ఆత్మగౌరవానికి భంగకరమని, దళిత ఉద్యమాలు రూపుదిద్దుకోని కాలంలోనే

స్వామి ఈ కథ ద్వారా చెప్పారు అదే సమయాన ఆత్మగౌరవంతో వ్యవహరించాలనుకునే దళితులు ఎన్ని ఇబ్బందులకు గురి కావల్సివస్తుందో 'ఒక హెచ్ సరస్వతి కథ' చిత్రించింది శతాబ్దాల హిందూత్వ భావజాలం కొన్ని దశాబ్దాల్లోనే కనుమరుగు అవుతుందనుకోవడం పొరపాటు కనుకనే చదువుకున్న వాళ్ళు సైతం దళితుల్ని అవమానిస్తారు. వారి ప్రతిభాసంపత్తుల్ని గుర్తించ నిరాకరిస్తారు తమకు తెలిసీ తెలియక "మీరు హరిజనుల్లో పుట్టాల్సింది కాదండీ" అంటారు కానీ ఏ దళితుడికయినా అది అవమానమేగానీ మెచ్చుకోలు కాదు మంచివాళ్ళ మనుకునే అగ్రకులాలవారు సైతం ఇలానే మాట్లాడుతారు కులం పునాదులు ఎంత బలమైనవో, వాటిని కాదని జీవితాల్ని నిర్మించు కోవడానికి మనుషులు ఇంటా బయటా ఎంతగా పోరాడాలో ఈ కథ చెబుతుంది. దళితులు చదువుకోడానికి, ఉద్యోగాలు చేయడానికి రాజ్యాంగం రిజర్వేషన్లు కల్పించినా దళితుల ఎదుగుదలను, ఆత్మగౌరవంతో జీవించడాన్ని అగ్రకుల సమాజం ఇప్పటికీ సహించలేక పోతుందన్న వాస్తవానికి చిత్రిక ఈ కథ.

బిసి, ఎస్సి కులాల మధ్య వైరుధ్యాన్ని చిత్రించిన కథ 'ప్రశాంతం అగ్రకులాలవారు తమ పబ్బం గడుపుకోడానికి ఈ వైరుధ్యాల్ని ఆసరా చేసుకొని ఆయా కులాల వారిని రెచ్చగొట్టే తీరు ఎలా వుంటుందో ఈ కథలో చూస్తాం అణచివేతకు గురయ్యే కులాలవారు తమకు తెలియకుండానే తమలో తాము పోట్లాడుకునే పరిస్థితులు ఏ విధంగా తటస్థిస్తాయో రచయిత చెబుతారు. 'తల్లి మట్టి' కథని దళిత దృక్పథం ఒక వాదంగా రూపుదిద్దుకోకముందు రాశారు ఈ దృక్పథం ఒక వాదంగా బలపడుతున్న తరుణంలో మిగతా రెండు కథల్ని రాశారు. మూడింటిలోనూ దళిత జీవిత వాస్తవాల్ని, వైరుధ్యాల్ని చిత్రించారు

**రాయలసీమ జీవిత సాక్షాత్కారం:**

తన ప్రాంత జీవితాన్ని తనదైన దృష్టితో చిత్రించిన రచయిత స్వామి. రాయలసీమ జీవితంలోని భిన్న కోణాల్ని "బ్రతుకు ఊబి, ఎవరి వేరు ఎక్కడ? వానరాలే, నీళ్ళు, సావుకూడు, నడక, అవశేషం" కథల్లో చిత్రించారు స్వామి రాసిన 'నీళ్ళు' కథ గురించి ప్రత్యేకంగా చెప్పుకోకుండా ఉండలేం. నీటి సమస్య గురించి ఎందరో రాసినప్పటికీ స్వామి తీసుకున్న కోణం వేరు. నీటికీ, అభివృద్ధికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని రచయిత చిత్రిస్తారు గుక్కెడు నీళ్ళు సైతం కరువైన దేశంలో మనం సాధించిన అభివృద్ధి ఏమిటని ప్రశ్నిస్తారు వానల కోసం ఎదురుచూసే రైతుల కడగండ్లను 'వానరాలే' కథ చెబుతుంది. కార్తెలు గడిచిపోతున్నా వాన రాకపోవడం, చిన్న చిన్న మబ్బు తునకలను చూసి వానొస్తుందని రైతులు ఆశపడటం, చివరకు వాన వచ్చి సేద్యం చేసినా అప్పే మిగలడం రైతుల జీవితంలోని విషాదాన్ని సూచిస్తుంది. కరువు దినాల్లో వ్యవసాయాలు చేయలేక కూలీ కోసం ఇంటిల్లిపాదీ వలసపోయే దృశ్యానికి 'బ్రతుకు ఊబి' కథ ప్రతీక మంచం మీంచి కదలలేని తండ్రి నొక్కణ్ణీ వదిలేసి భార్యా పిల్లలతో వలసపోవడం మల్లప్పకు ఇష్టముండదు.

అయినా తప్పని స్థితి కరువు వల్ల బతుకు భారమై అన్ని బంధాల్నీ తెంచుకోక తప్పని స్థితి ఇది ఈ విధంగా కరువు మమతల్ని, ఆప్యాయతల్ని ఏ విధంగా కాలరాస్తుందో, బతుకును ఒక ఊబిలా ఎలా మార్చివేసిందో చిత్రిస్తారు 'సావు కూడు' కథ కూడా మరో ఉదాహరణ కరువు రోజుల్లో మంచాన పడి చావుకు దగ్గరలోనున్న పెద్దప్పయ్యకు మాంసం కూర తినాలన్నది చివరి కోరిక కరువు రోజుల్లో గంజి దొరకడమే గగనం ఇక మాంసం కూర తినాలన్నది అతి ఖరీదయిన కోరిక కావడం విడ్డూరం కాదు ముగ్గురు కొడుకులున్నా అతడు తన కోరిక తీరకుండానే చనిపోతాడు కాని దినాల చివరిరోజు యాటను కోసి ఊళ్ళో వాళ్ళందరికీ 'వడ్డిస్తారు బతుకులోని విషాదవైచిత్రి ఇది బతికి వున్న మనిషికి ఒక్కపూట మాంసం కూర వండిపెట్టలేని కొడుకులు, తండ్రి చనిపోయాక ఊరందరికీ మాంసం కూరతో విందు చేయడం చిత్రం కదా! ఆ సందర్భాన భర్త చనిపోయి ఏడ్చే భార్య తన విస్తరిలోకి నాలుగు మాంసం ముక్కలు రానందుకు శాపనార్థాలు పెడుతూ ఏడవటం మరో వైచిత్రి. మధ్య తరగతిలో ఇది కనిపించదు కానీ మనసులోని మాటనుపైకి వెళ్ళగక్కే తత్వమున్న పల్లెమనుషులు తమ నిష్ఠూరాల్ని, కోపాల్ని ఇంతే సహజంగా వ్యక్తం చేస్తారు. కరువురోజుల్లోనూ సంప్రదాయిక మైన తంతును జరపక తప్పనిస్థితి ఎందుకనే ఆలోచనలకి తావునిచ్చే కథ ఇది.

పల్లెలన్నీ స్వచ్ఛంగా ఉన్నాయని ఎవరయినా అనుకుంటే పొరపాటు. పల్లెల్లోనూ పట్నం పోకడలున్నాయి వాణిజ్య పంటలు వచ్చాక పల్లె ప్రజలు ఆలోచనతీరు మారింది దగ్గరలో ఉన్న టౌనులోని విభిన్న అంశాలు ఆకర్షణకు లోను చేస్తుంటాయి. వీటి ప్రభావం పల్లె జనాల మీద ఉండటం సహజం. పల్లీయుల అవసరాల్లో, సౌకర్యాల్లో, అభిరుచుల్లో వచ్చిన మార్పులు, పల్లెల ప్రయాణాన్ని మార్చిన వైనం ఎలా వుందో 'నడక' కథలో స్వామి చిత్రించారు. వీటిని ఆసరా చేసుకొని పల్లెల్లో డబ్బున్నవాళ్ళు, డబ్బు సంపాదించాలన్న యావ ఉన్నవాళ్ళు మనుషుల్ని ఎలా వాడుకుంటారో ఈ కథ చెబుతుంది. ముఖ్యంగా ఇటీవలి సంవత్సరాల్లో రాయలసీమ గ్రామీణ ప్రాంతాల్లో వచ్చిన మార్పుల్ని ఈ కథ ప్రతిఫలిస్తుంది పట్నాల్లో సినిమాలు రావడం, హోటళ్ళు వెలియడం, బార్లు తెరవడం, మట్కా, పేకాట, లాటరీల వంటి జూదపు క్రీడలు పల్లె జీవితాల్ని ఎలా చిన్నాభిన్నం చేస్తున్నాయో చెప్పే కథ 'నడక'. డబ్బు సంబంధాలు, డబ్బుతో తీర్చుకోడానికి వీలయ్యే సరికొత్త సౌకర్యాలు మనుషుల్ని ఏ విధంగా దిగజారుస్తాయో 'ఎవరి వేరు ఎక్కడ?' కథలో కూడా చూస్తాం. అవసరాల కోసం వస్తూత్పత్తి కాకుండా, వస్తువుల్ని తయారుచేసి వాటిని మనుషుల చేత కొనిపించే వ్యవస్థ పారిశ్రామికీకరణతోనే ఆరంభమైంది ఇరవయ్యో శతాబ్దంలో ఇది మరింత విస్తృతమైంది కనుకనే జీవితం ఇంత ఛిద్రమైంది పల్లెల్లో ఒకప్పుడు ఉండే ప్రశాంత జీవితం బీటలు వారింది. ఇది అమానవీయ ధోరణులకి దారితీసింది. పల్లెలు, అక్కడి ప్రజలు వీటికి మినహాయింపు కారు. కనుకనే పల్లె జీవితాల్లో అశాంతి, ఘర్షణ, సంక్షోభం పెద్ద ఎత్తున నెలకొంటున్నాయి. అవసరాలకీ, సౌకర్యాలకీ, విలాసాలకీ మధ్యన అంతరం

చెరిగిపోయి మార్కెట్లో లభించే ప్రతి వస్తువును సొంతం చేసుకోవాలన్న యావ మనషుల్లో పెరిగింది ఈ కారణంగా పల్లె జీవితాలు చిన్నాభిన్న మవుతున్నాయి. రాయలసీమలోని పల్లెలు కూడా ఇందుకు మినహాయింపు కావని స్వామి కథలు చెబుతున్నాయి ఈ విధంగా సీమ ప్రాంతం గురించి రాసిన కథల్లోనూ విలక్షణత్వం కనిపిస్తుంది రాయలసీమలో కరువు జీవితాల్లో సృష్టించిన బీభత్సంతోపాటు, ఆర్థిక పరిణామాలు తీసుకొచ్చిన పతనావస్థను కూడా స్వామి రికార్డు చేశారు

ఇతివృత్తం:

ఇతివృత్తాల ఎంపికలో స్వామి ఎలాంటి పరిమితుల్ని విధించుకోలేదు. ఒక వాదాన్ని దృష్టిలో పెట్టుకొని, కొన్ని సిద్ధాంతాల్ని ప్రాతిపదికగా చేసుకొని ఇతివృత్తాల్ని ఎంచుకోలేదు తన అనుభవంలోకి వచ్చిన విషయాల్ని, తన దగ్గరగా చూసిన విషయాల్ని ఇతివృత్తాలుగా ఎంచుకున్నారు విభిన్న జీవనరంగాలకు సంబంధించిన మనుషులు, వారి జీవన రీతులు స్వామి కథలకు ఇతివృత్తాలు తొలినాళ్ళలో జీవితాన్ని గురించి తను చెప్పదలుచుకున్న విషయాల్ని కథలుగా మలచడానికి ప్రయత్నించారు తనకు ఉన్న తాత్విక దృష్టితో ఆ కథల్ని రాశారు. తాత్విక నేపథ్యం నుంచి వచ్చిన కథల తీరుతెన్నులు ఇదే విషయాన్ని చెబుతాయి మధ్యతరగతి కుటుంబాల వారు, పల్లె ప్రాంతాల వారు, అగ్రకులాల వారు, దళితులు, విభిన్న వృత్తులవారు స్వామి కథల్లో కనిపిస్తారు రెండు దశాబ్దాల పరిణామాలు, చరిత్ర ఈ కథల్లో చిత్రితమైంది ఆంధ్ర రాష్ట్ర రాజకీయాల్లో వచ్చిన పరిణామాల నేపథ్యం, ఆర్థిక సంస్కరణల ప్రభావం ఈ కథల్లో చూస్తాం.

శైలీ శిల్పాలు:

స్వామి తన కథల్లో బాల్యాన్ని, మాతృత్వాన్ని, అద్భుతంగా కవితాత్మక శైలిలో చిత్రీకరించారు 'అమ్మ' కథే ఇందుకు దాఖలా. ఆర్ద్రత నిండిన ఈ కథ చదివితే కళ్ళు చెమరుస్తాయి 'చమ్కీదండ, పద్మపాదం, రెండు అబద్ధాలు' కథల్లోనూ కవితాత్మక వచనం ఉంది అంతేగాక స్వామి చాలా కథల్ని ఉత్తమ పురుషలో రాయడం విశేషం పాఠకులు తమను తాము ఐడెంటిఫై చేసుకోడానికి ఈ రకమైన కథనం ఉపకరిస్తుంది స్వామి కథ చెప్పేటప్పుడు తన వ్యాఖ్యానాన్ని జోడిస్తాడు అయితే ఇది కథలో ఇమిడిపోయి కథకు నిండుదనాన్ని తెస్తుంది గానీ, కథకుడు అనవసర జోక్యం చేసుకున్నట్లుగా అనిపించదు ఆ విధమైన శిల్ప విన్యాసంతో కథను నడిపిస్తాడు 'తల్లి మట్టి' కథలో "శ్రీనివాసులు బతుకు వేర్లు అతడు పుట్టి పెరిగిన భాషలోనూ, మనుషుల్లోనూ, మట్టిలోనూ లేవు. మరొక కొత్త వాతావరణంలో ఉన్నాయి. తల్లి మట్టిలోనికే సరిగ్గా పాతుకోలేని వేర్లు ఇతర వాతావరణంలో నాటుకుంటాయా? ఆత్మవిశ్వాసంలోకి పాతుకోలేని వేర్లు, చెట్టుకు నిజమైన పెంపునూ, అభివృద్ధినీ కలిగించగలవా?" అంటాడు రచయిత అదే విధంగా 'ఆగామి వసంతం' కథలో "స్త్రీ పురుష సంబంధాలు అవసరాలకు అతీతమైనవని అనే అలౌకికత్వంతో నన్ను నేను

మభ్య పెట్టుకోలేను అంతమాత్రం చేత, మానవ సంబంధాల్ని పరిపాలించే హక్కు కేవలం అవసరాలకు మాత్రమే ఉందని సిద్ధాంతీకరించే అమానుషత్వానికి కూడా ఒడికట్టలేను" అని వ్యాఖ్యానిస్తాడు రచయిత "ఆకలితో క్రౌర్యం ముడిపడి ఉండటం ప్రకృతి స్వభావమే కావచ్చు కానీ మనిషిలోని క్రౌర్యానికి ఆకలీ అవసరాలు ఎంతవరకూ కారణమో, స్వార్థపరత్వం ఎంతవరకు కారణమో విభజించి చెప్పడం అంత సులువైన పనిగా అనిపించదు" అని 'అధోముఖం'లో చెబుతారు. ఈ విధమైన వ్యాఖ్యానాలు చాలా కనిపిస్తాయి. ఆయా పాత్రల స్వభావాన్ని, ఆ పరిస్థితుల నేపథ్యాన్ని ఇలా వివరించేందుకు రచయిత ప్రయత్నించిన సందర్భాలున్నాయి కొన్నిసార్లు కథ ముగింపు ఇలాంటి వ్యాఖ్యానాలతో ఉంటుంది కథను అర్థం చేసుకోడానికీ, ఆయా పాత్రల అంతరంగాన్నీ, స్వభావాన్నీ అర్థం చేసుకోడానికి ఇవి ఉపకరిస్తాయి ఇవన్నీ కూడా కథలో ఇమిడి పోయేలా ఉండటం వల్ల ఇబ్బంది లేదు.

## భాషలో వైవిధ్యం:

స్వామి కథల్లో భాషను కృతకంగా వాడుకున్న దాఖలాలు కనిపించవు ఆయా ఇతివృత్తాలకీ, పాత్రలకీ అనుగుణమైన భాషలోనే కథ చెప్పారు కవితాత్మకమైన భాషలో చెప్పిన కథలున్నాయి ఇతివృత్తాలకు తగిన రీతిలో ఉన్నందున అభ్యంతరం చెప్పనక్కర్లేదు మధ్యతరగతి కుటుంబాల వారి జీవితాన్ని వారి భాషలోనే చెప్పారు పట్టణాల్లో ఉండేవారి భాషని కూడా అదేరీతిలో వాడారు. పల్లె ప్రాంతాల జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకున్నప్పుడు వారి భాషలోనే కథని నడిపించారు ఈ రకమైన కథల్లో ఆ ప్రాంత ప్రజలు మాట్లాడుకునే జీవద్భాషనే ఉంది. సీమమాండలికంలోనే ఆ కథల్ని చెప్పారు. సీమ ప్రాంతాల గురించి రాసిన కథలన్నీ ఆ ప్రాంత మాండలికంలోనే ఉన్నాయి భాషపై రచయితకు ఉన్న పట్టును ఇది తెలియజేస్తుంది. పల్లె ప్రాంతాల జీవితాన్ని తీసుకున్నప్పుడు కథనాన్ని, పాత్రల సంభాషణని ఆ ప్రాంత మాండలికంలోనే చెప్పడం గమనించదగ్గ విషయం. రచయిత జీవితం భిన్న భాషలతో ముడిపడి ఉంది తను తన ఊళ్ళో ఉన్నప్పుడు అనుభవంలోకి వచ్చిన భాష ఒకటి. చదువుకునేప్పుడు, ఉద్యోగాలు చేసేప్పుడు అనుభవంలోకి వచ్చిన భాష మరొకటి పుస్తకాలు చదవడం వల్ల అలవడిన భాష ఇంకొకటి ఈ విధంగా స్వామి భాషా సంస్కారంలోనూ వైవిధ్యం ఉంది. అయినప్పటికీ ఎంచుకున్న ఇతివృత్తానికి తగిన భాషలోనే కథ చెప్పడం రచయిత ప్రతిభకు నిదర్శనం.

## ఈ కథలు ఏం చెబుతున్నాయి?

జీవితంలోని విశాలత్వాన్ని, వైవిధ్యాన్ని ప్రతిఫలించాయి ఈ కథలు బీభత్సాన్నీ, విషాదాన్నీ, హింసనీ, ఘర్షణనీ, మూసల్లో ఒదిగి కునారిల్లి పోయే మనుషుల నైజాన్నీ రచయిత చెబుతారు అదే సమయాన సంయమనంతో, వివేచనతో జీవితాన్ని మలుచుకోవడం ఎలా సాధ్యమో చిత్రించారు. సమస్యల భిన్న కోణాల్ని, పరిస్థితుల్ని ఆకళింపు చేసుకోడానికి అనువైన భూమిక మాత్రమే

కథల్లో ఉంటుంది పరిష్కారాలు చెప్పే పనికి పూనుకోలేదు ఏదో ఒక వాదపు కోణంలోంచే జీవితాన్ని చిత్రించటానికి ప్రయత్నించలేదు వాదాలు, సిద్ధాంతాలు, తాత్విక ధోరణులు ప్రపంచాన్ని, జీవితాన్ని అర్థం చేసుకోడానికి ఉపకరిస్తాయి కాని వాటంతట అవే మార్పుకు నేరుగా దోహదం చేయవు ఈ అవగాహన రచయితకి ఉందని ఈ కథలు చెబుతాయి. వ్యష్టికి, సమష్టికి మధ్యన సమన్వయం అవసరమన్న స్పృహను కల్పిస్తాయి ఆవేశకావేషాలకు తావు లేకుండా పాఠకుల ఆలోచనాసరళిలో అసంకల్పితంగా మార్పులు తీసుకు రావడానికి తోడ్పడుతాయి జీవితాన్ని, మనుషుల్ని ప్రేమించే తత్వాన్ని అలవరుస్తాయి అన్య ప్రభావాలకు అతీతంగా సహజంగా బతకాలన్న తపనను కలిగిస్తాయి. ఈ క్రమంలోనే మనిషి అన్యాయానికి వ్యతిరేకంగా స్పందించేందుకు, న్యాయం పక్కన నిలిచేందుకు కావాల్సిన నైతికబలాన్ని కూడా అందిస్తుంది స్వామి కథా సాహిత్యం. మానవీయంగా జీవించాలన్న దృక్పథం సంతరించు కోడానికి తోడ్పడుతుంది. ఏ రచన అయినా సాధించాల్సిన ప్రయోజనం ఇంతకు మించి ఉండదు ఈ దృష్టికోణంతో చూసినప్పుడు తెలుగు కథా సాహిత్య సంపన్నతకు స్వామి కథలు చేసిన దోహదం అర్థమవుతుంది.

# వి. చంద్రశేఖరరావు

♦ బి. తిరుపతిరావు ♦

ప్రతి సామాజిక సందర్భం రచయితలకి సవాలుగానే ఉంటుంది ప్రతి సమాజంలో నిరంతరం ఎదురయ్యే ఆత్మిక, ఆర్థిక సంక్షోభాలు రచయితల్ని ఎప్పుడూ నిలదీస్తూ ఉంటాయి ఈ స్థితి కేవలం కొద్దిమంది నిబద్ధతవున్న రచయితలకు మాత్రమే సంబంధించిన వ్యవహారం కాదు. ప్రతి రచయితకు సంబంధించి, ప్రతి రచయిత ఎదుర్కొనక తప్పని స్థితి. అయితే ఈ స్థితిలో ప్రతి రచయిత ఒకేరకంగా స్పందించలేకపోవచ్చు ఈ స్పందనకు సంబంధించిన వ్యత్యాసం ఆయా రచనల్లో మనకు స్పష్టంగానే అవగతమవుతుంది. ఒక సామాజిక సందర్భానికి రచయిత స్పందించే వేగాన్నిబట్టి ఆ రచయిత స్పందన స్థాయిని అంచనా వేయటం సరికాదు నిజానికి తక్షణ స్పందన అనేది ప్రధానంగా కవులకు మాత్రమే వీలుపడే విషయం. రూపపరమైన సౌలభ్యం దీనికొక కారణం కావచ్చు అందుకే కవులు స్పందించినంత త్వరగా ఒక సామాజిక దారుణానికి కాల్పనిక సాహిత్యకారులు స్పందించలేరు కాల్పనిక సాహిత్యకారుల స్పందన ఆ సామాజిక స్థితి విస్మృతిలోకి వెళ్ళిన తరువాత మొదలవుతుంది. ఇలా అనటం సాధారణీకరణే అయితే కాదు కానీ, ఎక్కువ సందర్భాలలో మనం ఎదుర్కొనే సన్నివేశం మాత్రం అదే.

పై క్రమానికి భిన్నమైన పరిస్థితి, అంటే తక్షణ సమస్యలకి, సందర్భాలకి స్పందించి వెనువెంటనే కాల్పనిక సాహిత్య ఉత్పత్తికి పూనుకోవటం అనేది ఈ మధ్యకాలంలో, ముఖ్యంగా గత రెండు దశాబ్దాల కాలంలో, తెలుగులో మనకు కన్పిస్తుంది కవులు కవిత్వం రాసినంత వేగంగా కాల్పనిక సాహిత్య కారులు కథా సాహిత్యాన్ని రూపొందించే ప్రయత్నం చేయటం అనేది ఒక మంచి పరిణామం ఈ పరిణామాన్ని మరింత వేగవంతం చేస్తున్న రచయితల్లో వి.చంద్రశేఖరరావు ఒకరు. ఈ రెండు దశాబ్దాల కాలంలో ముందుకు వచ్చిన రచయిత్లో కేవలం రాజకీయ నిబద్ధతేకాక సాహిత్య నిబద్ధత కూడా కన్పించటం విశేషాంశం. కాబట్టే వాళ్ళ సాహిత్య ఉత్పత్తి అనేది చాలా వేగంగా ఉండటమే కాక, సంఖ్యాపరంగా కూడా ఎక్కువ రచనలు చేయటం జరుగుతోంది. ప్రతి సంఘటనకి, సంక్షోభానికి, అది ఆత్మికమైనా, సామాజికమైనా, సాహిత్య రూపమివ్వటం అత్యవసర విషయంగావాళ్ళు భావించటంవల్ల ఇలా రాయ గలుగుతున్నారు. అందువల్లనే కేవలం ఒక్క దశాబ్ద కాలంలో చంద్రశేఖరరావు దాదాపు అరవైకి పైగా కథలు రాయటం జరిగింది.

ఒక కథకుడిగా చంద్రశేఖరరావు శక్తి కేవలం ఎక్కువ సంఖ్యలో కథలు రాయటంలోకాక నిరంతరం వస్తురూపాల సమన్వయంతో ముందుకుపోవటంలో ఉంది వైవిధ్యాన్ని ప్రదర్శించటలో ఉంది 1990లో ప్రచురించిన 'జీవని' కథల సంపుటికి 1998లో వచ్చిన 'లెనిన్ ప్లేస్' సంపుటికి వస్తురూపాల్లో వున్న వ్యత్యాసం చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది 'లెనిన్ ప్లేస్' తరువాత రాసిన కథలు కూడా ఒక ప్రత్యేక తరహాలో ఉంటాయి శైలి చూసి ఇది చంద్రశేఖరరావు కథ అనే స్థాయిలో ఆయన కథలుంటాయి ఇటీవలికాలంలో కథకులుగా ఒక స్వతంత్ర శైలిని రూపొందించుకున్న కొద్దిమంది కథకుల్లో ఆయన ఒకరు. కథకులకి శిల్పం మీద అత్యంత అసక్తి వుంటే తప్ప ఇది సాధ్యం కాదు దీన్ని సానుకూల అర్థంలో 'శిల్ప వ్యామోహం' అనటంలో తప్పు లేదు. రోజు వారీ భాషనుండి సాహిత్యాన్ని వేరుచేసి ఉంచటంలో ప్రముఖ పాత్ర నిర్వర్తించేది శిల్పమే శిల్ప వ్యామోహం లేనివాళ్ళు సాహిత్యంలోకి రారని, అలా రావటం కూడా అనవసరమని ఈ వ్యాసకర్త ఉద్దేశం నిజానికి రష్యన్ రూపవాదులతోపాటు, ఇరవయ్యో శతాబ్దపు ద్వితీయార్థంలో హెర్బర్ట్ మార్క్యూస్, థియోడర్ అదార్నోలాంటి మార్క్సిస్టు సాహిత్య విమర్శకులు, తాత్వికులు కూడా శిల్పమే సాహిత్యమనేదాకా వెళ్ళారు ఈ విషయం మనం కనీసం ఇప్పుడైనా గుర్తించటం మంచిది. ప్రతి దాన్ని రెండుగా కుదించి చూసే మన తాత్విక పరిమితివల్ల శిల్పాన్ని గురించి మాట్లాడమంటే, వస్తువుకున్న ప్రాముఖ్యతను నిరాకరించటంగా అర్థం చేసుకోవటం జరుగుతోంది. సరే, ఆ విషయాన్ని వదిలి, చంద్రశేఖరరావు కథల్ని చూద్దాం. మొదటిగా 'జీవని' సంపుటి గురించి.

'జీవని' చంద్రశేఖరరావు మొదటి కథల సంపుటి ఈ కథలు కాలానుగుణంగా చూస్తే ప్రతి కథ అంతకుముందు రాసిన కథకంటే innovative గా ఉంటుంది. 'జీవని'లో రెండవ కథ 'నైట్ డ్యూటీ' చంద్రశేఖరరావు అచ్చయిన కథల్లో మొదటిది ఇది 1990లో రాసినది ఈ సంపుటిలో చివరి కథలు "మహాకవి మరణం", "ఆనందశంకరం", అనేవి 1994లో రాసినవి నైట్ డ్యూటీ కథకి 'మహాకవి మరణం' కథకు మధ్య మౌలిక వ్యత్యాసం చూడవచ్చు. ఈ వ్యత్యాసం శిల్ప సంబంధమైనదని తేలిగ్గా గుర్తించవచ్చు. అంటే కేవలం నాలుగు సంవత్సరాల కాలంలో ఈ కథకుడు చూపిన శిల్పపరమైన వైవిధ్యం, నైపుణ్యం, కథాశిల్పం మీద ఇతనికున్న అసక్తిని, శ్రద్ధని తెలియజేస్తాయి. తన మొదటి కథా సంపుటికి రాసుకున్న 'స్వగతం'లో పరిణితివైపు ప్రయాణించగలిగే ఆత్మవిశ్వాసం తనకుందని ప్రకటించిన ఈ రచయిత ఒక దశాబ్దకాలంలో ఆ పరిణితిని సాధించగలిగాడని ఆ తరువాత ఆయన రాసిన కథలు రుజువు చేస్తాయి ముఖ్యంగా, పాత్ర రూపకల్పనలో, వర్ణనలలో, గాఢమైన వాతావరణాన్ని చిత్రించటంలో ఈ రచయితకి విశేషమైన శక్తి ఉంది. దీన్నే ఆయన మనుషుల్ని తయారుచేసే కళగా, సామాజిక, రసాయనిక జీవనిర్మాణ శాస్త్రంలా ప్రకటించు కొన్నాడు (చూ. లెనిన్ ప్లేస్ 'నేపథ్యం')

మనిషికి వాస్తవికతతో మొదటి పరిచయం రూపంతోనే ఆ తరువాతే సారంలోకి వెళతాడు క్రమంగా మనిషి రూపాలకి అలవాటుపడటం జరుగుతుంది ఆ క్రమంలో మనిషి మనస్సులో రూపాలు స్థిరపడతాయి, లేక అప్పటికే స్థిరపడిపోయి వున్న రూపాలకి మనుషులు అలవాటు పడతారు. ఈ అలవాటుపడటం అనేది కొన్ని విషయాల్లో చాలా భయంకరంగా కూడా పరిణమిస్తుంది ప్రతి అలవాటు ఆలోచనకి ఒక నిర్మితిని విధిస్తుంది ఆలోచనను కుదిస్తుంది. ఫలితంగా ఈ నిర్మితిలో లేని దేన్నీ ఆమోదించలేని స్థితిలోకి మనిషిని లోను చేస్తుంది సమాజంలో రూపొందిన అనేక నిర్మితులలో అందం, తెలివి అనేవి రెండు నిజానికి ఈ రెండు అంశాలు చాలా సాపేక్షికమైన అంశాలు. అయితే ఇవి చాలా అఖండమైన స్థాయిలో కన్పిస్తాయి ఇంకా చెప్పాలంటే ఇవి రెండూ రెండు వర్గీకరణ రూపాల స్థాయికి చేరుకొన్నాయి

ఏ సమాజంలోనైన వర్గీకరణలు సారాంశంలో నిషేధ రూపాలుగానో, బహిష్కరణ రూపాలుగానో, అణచివేత రూపాలుగానో ఉంటాయి ఈ వర్గీకరణ రూపాలను అంతరంగీకరించుకొన్న వ్యక్తులు తమ సారంనుంచి దూరమై ఒక కృత్రిమ స్థితిబాధితులవుతారు ఆ స్థితిలో సమస్త మానవీయ స్పర్శను కోల్పోతారు రూపాలకి అలవాటుపడ్డ తనం మనిషిని ఇలా మిగల్చటం అనేది నిజంగా విషాదకర అంశం 'జీవని' కథ ఈ విషాదాన్ని సంకేతిస్తుంది. "వాట్ ఎ డెవిలిష్ ఫేస్, బతికుందో, చచ్చిందో తెలియనట్లు ఎప్పుడూ నిద్రపోతుంది. దీన్ని చూస్తే నా బిడ్డ అనే ఫీలింగ్ కలగటం లేదు. దీన్ని భరించటం మన వల్లకాదు లెటజ్ డిస్పోజ్ ఇట్" అని తన కూతుర్ని చూసి ఈ కథలో తండ్రి అన్న మాటలు ఈ విషాదాన్నే సూచిస్తాయి. అలాగే అతని వైఖరి రూపాలకి విక్టిమ్ అయిన వ్యక్తి స్థితిని సంకేతిస్తుంది. ఈ స్థితిలో మానవసారం కోల్పోవటం వల్లనే సజీవమైన ప్రాణి గురించి, తన స్వంత కూతురు గురించి వస్తు సంబంధమైన పరిభాషలో 'లెటజ్ డిస్పోజ్ ఇట్' అనటం జరిగింది. నిజానికి ఇటువంటి విషయాల్ని గురించి మరింత కాల్పనిక సాహిత్యం రావాల్సి ఉంది. ఇదొక తాత్విక సమస్య అయితే దీన్ని తాత్వికులకంటే కాల్పనిక సాహిత్యకారులు సులువుగా పరిష్కారాలు చూపే వీలుంది కథలో తండ్రి వైఖరి కేవలం బాధ్యతారాహిత్యంగా కొట్టివేయటం సులువు వాస్తవానికి తండ్రి స్థితిని అతని దృక్కోణం నుంచి కూడా పరిగణించాల్సిన అవసరం ఉంది. ఈ కథలో తల్లి బిడ్డతో తనకున్న ప్రత్యక్ష శరీరం సంబంధంనుంచి మాత్రమే కాక, ఆ సంబంధంమీద ఆమె రూపొందించుకున్న లేక నిర్మించుకొన్న భావుకత ద్వారా ఈ రూపాల ఆధిపత్యం నుంచి బయటపడి 'కురూపి' అయిన కూతుర్ని ప్రేమించగలుగుతుంది మరొకవైపు ఇదే సమస్యని తన జీవితంలో ఇంతకు ముందే ఎదుర్కొన్న విశ్వనాధన్ ఆ సమస్యని తాత్వికంగా అధిగమించటానికి ప్రయత్నించి విజయం సాధిస్తాడు. సైన్స్ నియంత్రణకి లోనుకాకుండా ఆలోచించగలిగితే 'జీవని' కథలోని సమస్యని తాత్వికంగా తప్ప, అమలులో

వున్న సామాజిక సందర్భంలో, వేరుగా అధిగమించటం సాధ్యం కాకపోవచ్చు జీవని తల్లి వైఖరి కూడా అసాధ్యం కాదు కానీ, అరుదు ఇంతకుముందే చెప్పుకొన్నట్టు ఈ కథని తండ్రి వైపు నుంచి నడపటం ద్వారా మరొక శక్తివంతమైన కథకు రూపకల్పన చేయవచ్చు

పై విషయాన్నే అంటే శరీరంలో జరిగిన ఒక మార్పు (బ్రెస్ట్ కాన్సర్ వల్ల బ్రెస్ట్‌ని తొలగించటం అనేది) ఒక స్త్రీ జీవితంలో తెచ్చిన పరిణామం, ముఖ్యంగా ఆమెకు ఆమె భర్త శారీరకంగా, మానసికంగా కూడా దూరం కావటం అనేది 'ఆకాశంలో సగం' కథలో చిత్రించటం జరిగింది "శరీరంపై ఇంత వ్యామోహం ఎందుకు మీ మగవాళ్ళకు. ఈ శరీరాన్ని తప్ప దీని వెనుక వున్న మనసు అస్తిత్వాన్ని గుర్తించరు మగవాళ్ళు" అని లలిత వేసిన ప్రశ్న మనిషినుంచి సారాన్ని వేరుచేసి చూడటంలో ఉన్న దారుణత్వాన్ని ప్రశ్నించటంలో భాగమే. "వివాహ వ్యవస్థమీద అట్టే నమ్మకంలేని వ్యక్తిని నేను" అని ప్రకటించిన లలిత, నిజానికి వివాహ వ్యవస్థమీద గట్టి నమ్మకంతోనే కుటుంబంలోకి ప్రవేశించింది అయితే చాలా త్వరగా ఆ నమ్మకం సడలిపోయింది. ఆ సడలిపోవటం అనేది భర్త దృష్టిలో తన రూపం విరూపమై, తన సారం గుర్తింపు కోల్పోయిన తరువాత మాత్రమే జరిగింది. వ్యవస్థల్ని, నిర్మాణాలను తమలో అవిభాజ్య అంశాలుగా మార్చుకొన్న వాళ్ళకు, వ్యవస్థీకృతంగా తప్ప వేరుగా అస్తిత్వాన్ని ఊహించుకోలేని వాళ్ళందరికీ disillusionment అనివార్యం భ్రమలలో కూరుకుపోయిన వ్యక్తికి భ్రమలు తొలగిపోయిన తరువాత మిగిలేది లేక తను ఎదుర్కొనేది అసంబద్ధతే. ఈ అసంబద్ధత, అర్థరాహిత్యం మనిషిని అనివార్యంగా నిస్పృహలోకి నెట్టటమే కాకుండా అసలు జీవితాన్నే అంతం చేసుకునేందుకు పురికొల్పటం మనం సర్వసాధారణంగా రోజువారీ సామాజిక జీవితంలో చూస్తూ ఉన్న విషయమే. అయితే ఈ కథలో లలిత అందుకు భిన్నంగా సామాజిక ఉద్యమాల్ని ఊతం చేసుకుంటుంది. ఆ ఉద్యమాలు ఆమెకు ప్రేరణనిస్తాయి. అయితే ఈ ప్రేరణ కూడా కొంతకాలం తరువాత వొట్టి భ్రమ అని అనిపించవచ్చు. అందువల్లనే లలిత, జీవితం అసంబద్ధంగా ఉన్నప్పుడు ఆ అసంబద్ధత మీద యుద్ధం ప్రకటించి జీవితాన్ని జీవించటంలో అర్థముందని ప్రకటించిన ఫ్రెంచ్ తాత్వికుడు అల్బర్ట్ కామూలాగా, "జీవించాలన్న తెగువే జీవితానికి సమాధానం అని నిరూపించాను" అని ప్రకటిస్తుంది లలిత గొప్ప వ్యక్తిత్వాన్ని ప్రదర్శించే పాత్ర. చంద్రశేఖరరావు కథల్లో ప్రధాన పాత్రలు. తొంభయి శాతానికి పైగా స్త్రీ పాత్రలు. ఆ క్రమంలోనిదే లలిత పాత్ర వైయక్తికమైన సమస్యలకి వ్యక్తిలో ఘర్షణ అనివార్యం. అయితే ఈ ఘర్షణను అధిగమించి, మళ్ళీ తన జీవితాన్ని కొనసాగించే క్రమం సహజంగా రెండు రకాలుగా వుంటుంది. ఒకటి, ఇంతకు ముందే చెప్పుకున్నట్లుగా సమస్యను తాత్వికంగా అధిగమించటం, రెండవది కొన్ని ఉద్యమాల్లో భాగస్వామికావటం ద్వారా సమస్యని తెరమరుగుకు పంపించటం నిజానికి ఈ రెండింటికి వైరుధ్యం ఉండవనసరం లేదు. అయితే ఎక్కువ సందర్భాలలోఈ వైరుధ్యం ఎదురవుతూనే

వుంటుంది పై కథలో లలిత రెండవమార్గాన్నే అనుసరిస్తుంది వాస్తవం చెప్పాలంటే, ఈ కథలో కథకుడికి ఒక తాత్విక పరిమితి ఉంది. అదేమంటే కథకుడు స్త్రీవాదాన్ని శుద్ధ ఆచరణాత్మక విషయంగా గ్రహించాడు తాత్వికంగా కూడ చూడలేకపోయాడు అందువల్లే లలిత సమస్యకు ఉద్యమంలో తప్ప వేరు పరిష్కారం చూపలేకపోయాడు. 'ఉద్యమంలోకి వెళితే తప్పేంటని కథకుడితోపాటు, కొంతమంది పాఠకులూ ప్రశ్నించవచ్చు దీనికి సమాధానం ఏమంటే, అది లలిత ఎదుర్కొంటున్న సమస్యకు పరిష్కారం కాదు. సమస్య నుంచి పారిపోయి, దాన్ని విస్మృతిలోకి పంపించటమే ఈ సమస్య మళ్ళీ మరొకసారి, లేక మరొక రూపంలో ఆమె అస్తిత్వాన్ని సంక్షోభమయం చేయదని హామీ ఏమీ లేదు అందువల్ల "ఇంటి పనులపై శ్రద్ధ చూపుతూ మామూలు ప్రపంచానికి రా"। అని సైక్రియాటిస్టు ఇచ్చిన సలహాకి, కథకుడు ఇచ్చిన ముగింపుకి పెద్ద తేడా లేదు రెండు సందర్భాలలో జరిగింది సమస్య నుంచి పారిపోవటమో, సమస్యను మరిచిపోయే ప్రయత్నం చేయటమో, ఫలితంగా ఈ కథలో ముగింపు సాదాసీదా కథల ముగింపులాగానే ఉంటుంది. నిజానికి లలితలాంటివాళ్ళు ఎదుర్కొంటున్న సమస్య రచయితలకి సవాలుగా నిలిచే సమస్య. ఈ సమస్యను, సవాలును కాల్పనిక రచయితలు మరింత లోతుగా చర్చించాల్సిన అవసరం ఎప్పుడూ ఉంటుంది. అప్పుడు మాత్రమే తాత్వికులు విఫలమైనచోట, శాస్త్రవేత్తలు పరిష్కారాలు చూపలేని చోట సాహిత్యకారులు విజయవంతమవటం జరుగుతుంది.

తెలుగు సాహిత్యంలో రాజకీయ చైతన్యం చాలా ఎక్కువ. అసలు ప్రధాన సాహిత్య ధోరణులన్నీ రాజకీయ ఉద్యమాల నుంచి రూపొందినవే. తెలుగు సమాజంలో నడిచిన రాజకీయ ఉద్యమాలలో చోదకశక్తులు ఎక్కువ సందర్భాలలో కమ్యూనిస్టులే. గత మూడు నాలుగు దశాబ్దాలలో వచ్చిన అన్ని సాహిత్య ఉద్యమాలలో ప్రధాన పాత్ర వహించిన వాళ్ళందరూ గతంలోనో, వర్తమానంలోనో, కమ్యూనిస్టు రాజకీయాల సంబంధంలోంచి వచ్చినవాళ్ళే 1970 - 80ల మధ్యకాలంలో తెలుగు సాహిత్యం, దానికి ప్రేరణగావున్న రాజకీయాలు కమ్యూనిస్టు రాజకీయాలే ముఖ్యంగా విప్లవ కమ్యూనిస్టు రాజకీయాలే. ఆ దశాబ్దకాలంలో రాజకీయ ఉద్యమంలోనూ, సాహిత్య ఉద్యమంలోనూ కీలక శక్తులు విద్యార్థి, యువజనులే. సరిగ్గా ఈ యువతరమే ఆ తర్వాత, అంటే ఎనభైల తర్వాత తమకు ప్రేరణ అయిన ఉద్యమాలమీద, ఉద్యమ రాజకీయాల మీద, వాటి పరిమితుల మీద తీవ్ర విమర్శలను పెట్టటం జరిగింది. కొత్తగా ముందుకు వస్తున్న ఉద్యమాల ప్రాధాన్యతను గురించి కూడా వీళ్ళు చర్చించటం, వాటిని గుర్తించటం ఆ ఉద్యమాలలో పాల్గొనటం కూడా జరిగింది ၊ ఒక దశాబ్దంపాటు, స్పష్టంగా చెప్పాలంటే 1985 నుంచి 1995 వరకు చాలా తీవ్రంగా ఈ కొత్త ఉద్యమాలు, వాటికి సంబంధించిన చర్చలు నడవడమే కాకుండా, నిర్దిష్టమైన సాహిత్య ఉత్పత్తి జరిగింది. సంప్రదాయ ఉద్యమ రాజకీయాలు ఈ కాలంలో చాలావరకు

డిఫెన్స్‌లో పడిపోయాయి దాదాపు అన్ని వామపక్ష శక్తులు ఈ ఉద్యమాలు తీవ్రంగా నడుస్తున్న కాలంలో నిరపేక్ష ప్రేక్షకులుగా మిగిలిపోయాయి ఇంతకీ ఈ వివరణ అంతా ఎందుకంటే, చంద్రశేఖరరావు సరిగ్గా ఈ ఎనభైల తర్వాత ముందుకు వచ్చిన తరంలోనివాడు అని చెప్పటానికి

ఈ పై భావపరిణామాన్ని మొత్తాన్ని దగ్గరగా చూడటమే కాకుండా, స్వయంగా వాటికి కథారూపమిస్తూ, వచ్చినవాడు చంద్రశేఖరరావు ఈ పరిణామం మొత్తం ఆయన కథల్లో చూడవచ్చు 'జీవని ' సంపుటిలోని కథలు, ముఖ్యంగా 'నైట్ డ్యూటీ', 'గోర్కీ పాత్ర' లాంటి కథలు, ఆ తరువాత 'లెనిన్ ప్లేస్' సంపుటిలోని కథలతోపాటు ఈ మధ్యకాలంలో ఆయన రాసిన అనేక కథలు చూసినప్పుడు చంద్రశేఖరరావు భావపరిణామం స్పష్టంగానే అర్థమవుతుంది. వామపక్ష రాజకీయ చైతన్యంతో రాసిన కథల నుంచి ఈ రచయిత 'లెనిన్ ప్లేస్' సంపుటి నుండి రాస్తున్న కథలనుండి స్పష్టంగా దళిత, స్త్రీవాద చైతన్యం వైపు విస్తరించటం కన్పిస్తుంది ఈ విస్తరణ కారణంగానే ఈ కథకుడి మీద వామపక్ష విమర్శకుల నుంచి విమర్శ రావటం కన్పిస్తుంది

'జీవని' కథల్ని ఆహ్వానించిన వామపక్ష విమర్శకులు ఆ తరువాత వచ్చిన కథల మీద విమర్శ పెట్టటంపై విస్తరణ కారణంగానే అనేది చాలా సులువుగా అవగతమయ్యే విషయం. అయితే ఈ మార్పు వల్లనే చంద్రశేఖరరావు ఇంకా కథాసాహిత్యరంగంలో నిలబడగలగటం జరిగిందనేది విస్మరించటానికి వీలులేని విషయం. ఒక వ్యక్తిగా చంద్రశేఖరరావు విశేషమేమంటే, నిరంతరం సమాజంలో జరుగుతూవున్న తాత్విక చర్చలను, రాజకీయవాద వివాదాలను లోతుగా పరిశీలిస్తూ ఉండటం. కథకుడుగా కొన్ని సందర్భాలలో ఈ పరిశీలనలకే కథా రూపం ఇవ్వటం జరిగింది. 'ఆకాశంలో సగం', 'ఆనందశంకరం', 'మహాకవి మరణం' లాంటి కథల్లో మనకు అవగతమయ్యే విషయం ఇదే. దళిత, స్త్రీవాద ఉద్యమాల ప్రేరణ ఈ కథల్లో చూడవచ్చు ఈ ప్రేరణ ఆ తరువాత రాసిన కథల్లో మరింత గాఢంగా కన్పిస్తుంది

ఇంతకుముందే చెప్పుకున్నట్టు 'జీవని' సంపుటిని 'లెనిన్ ప్లేస్' సంపుటికీ మధ్య చాలా తేడా వుంది. వస్తుపరంగా కూడా ఈ రెండు సంపుటాలు మౌలిక వ్యత్యాసంలో వుంటాయి. 'జీవని' సంపుటిలో ఎక్కువ కథలు ఆసుపత్రి చుట్టూ తిరుగుతాయి. ఆసుపత్రిని ఆవరించి ఉండే విషాదం కూడా ఎక్కువ భాగం కథల్లో ప్రతిఫలించింది. పదిహేడు కథలున్న 'జీవని' సంపుటిలో సగానికి పైగా కథలు ఏదో రకంగా ఆసుపత్రి సంబంధంలో నడుస్తాయి "లెనిన్ ప్లేస్' కథలు పై క్రమానికి భిన్నంగా ఉండటమే కాకుండా పూర్తి వైవిధ్యంతో కూడా కన్పిస్తాయి.

చంద్రశేఖరరావు వాస్తవికతావాద రచయిత కాదు. ప్రతి వాస్తవికతావాద రచయిత. ఇంగ్లీషులో Donald Bonthelme, Thomas Pesuchon, John Barth లాంటి రచయితల్ని ప్రతివాస్తవికతవాద రచయితలంటున్నారు. ఈ తరహా

రచనల్లో పాత్రలు విషాద పూరితంగా, కొంత సారరహితంగా self-reflectiveగా ఉంటాయి తమ చుట్టూ ఉన్న ప్రపంచంలో తమ సొంత అస్తిత్వ అర్థాన్ని, అర్థరాహిత్యాన్ని గురించి అన్వేషణ చేస్తూ ఉంటాయి కొంత విపరీత మనః స్థితిలో ఉంటాయి పూర్వ స్థితికి సంబంధించిన వాస్తవికత తమ వర్తమానాన్ని నిర్దేశిస్తూ వుండటాన్ని గురించి ఈ తరహా కథల్లో పాత్రలు వేదనకు గురవుతూ వుండటమే కాకుండా, తమ చుట్టూ ఉన్న ప్రపంచంలో తమ అస్తిత్వం ఆధార రహితంగా, సారరహితంగా ఉందనే భావన పాత్రల అచేతనంలో ఉండటమే కాకుండా, బాహ్యంగా కూడా వాటి ప్రవర్తనలో కూడా అది ఆవిష్కరణ పొందటం కన్పిస్తుంది ఇంతకుముందే చెప్పుకొన్నట్లు, చంద్రశేఖరరావు పాత్రల్లో మోహిని, మాలతి, ఆనందశంకరం అనే పాత్రలు (ఇవి చాలా సందర్భాల్లో కథల్లో మనకు ఎదురవుతాయి) పై తరహా కథల్లోని పాత్రలు లాంటివే. ఇవి వర్తమానంలో సారరహితమైన, పాత్రలు సారరహితమైన అనటం కంటే, సామాజిక బీభత్సంలో సారాన్ని కోల్పోయిన పాత్రలు ఈ పాత్రల శిరస్సుల మీద మోయలేని విషాదం ఎప్పుడు వేలాడుతూ ఉంటుంది

ఈ సందర్భంలో ఆనందశంకరం పాత్ర గురించి మరికొంత చూద్దాం. ఆనందశంకరం అనే పాత్ర సార్త్ర్ పరిభాషలో చెప్పాలంటే 'thing for itself'. ఈ పాత్ర తన స్వార్థం కేంద్రంగా నిరంతరం 'ఎదగటానికి' ప్రయత్నిస్తూ వుంది. ఈ 'ఎదగటం' అనే ప్రయత్నంలో ఎదుటివాళ్ళ జీవితాలు ధ్వంసమైనా ఫర్వాలేదు అనే స్పృహ కనీసం ఆలోచనాస్థాయిలో ఈ పాత్రకు ఉంటుంది. తన చుట్టూ ఉన్న అధికార నిర్మాణాలు తన ఎదుగుదలను నివారిస్తూ ఉండటంవల్ల ఈ పాత్రకు ఆ నిర్మాణాలమీద తీవ్ర అసహనం, అసంతృప్తి ఉంటుంది ఈ నిర్మాణాలలో ఉండే అధికార సంబంధాలమీద ఈ పాత్రకు అసంతృప్తి ఉండదు. ఆ అధికారాన్ని పొందాలనే కోర్కె మాత్రమే ఉంటుంది. ఈ అధికార నిర్మాణాలతో తలపడాలనే తలంపు వాస్తవికతావాద పాత్రల్లో ఉంటుంది ఆనందశంకరం లాంటి వాళ్ళ పద్ధతి వేరు. మరి ఈ అధికార నిర్మాణాలను అధిగమించటం ఎలా? అనే ప్రశ్నకు 'వాటి నుంచి పారిపోవటమే' అనే సమాధానాన్ని ఆనందశంకరం తాత్వికంగా చెప్పగలడు.

ఆనందశంకరంలాంటి పాత్రలు బహుళ అస్తిత్వాల్ని ఏకకాలంలో కొనసాగిస్తూ ఉంటాయి. ఒక స్థితినుండి మరొక స్థితిలోకి, ఒక వేషంనుండి మరొక వేషంలోకి చాలా త్వరత్వరగా ఇవి మారిపోగలవు. చుట్టూ ఉన్న సమాజ సమస్యలు వీటికంత ప్రధానం కాదు ఎప్పటికప్పుడు కొత్త identities లోకి రూపాంతరం చెందే ఈ పాత్రలు తమ వైయక్తిక అవసరాల్ని తీర్చుకొనే ప్రయత్నంలో ఎంతటి దారుణానికైనా సిద్ధంగా ఉంటాయి. ఈ తరహా పాత్రల్ని, వాటి మూర్తిమత్వాల్ని చాలాలోతుగా అవగతం చేసుకొని చిత్రించటం వల్ల చంద్రశేఖరరావు ఒక విలక్షణమైన కథకుడిగా మనకు కన్పిస్తున్నాడు.

పంతొమ్మిది వందల ఎనభైలలో తెలుగు రాజకీయ, సాహిత్యరంగాలలో మౌలిక మార్పులు వచ్చాయి ముఖ్యంగా కమ్యూనిస్టు ఉద్యమాల పరిమితులు బహిర్గతమయ్యాయి కొన్ని సామాజిక బృందాల ప్రత్యేక సమస్యలను ప్రతిబింబించటంలో కమ్యూనిస్టు పార్టీలు విఫలమయ్యాయి. ఈ వైఫల్యాన్ని గుర్తించిన దళిత, స్త్రీవాద ఉద్యమాలు ముందుకువచ్చాయి ఇవి కొత్త రాజకీయ ప్రతిమానాల్ని రంగం మీదకు తెచ్చాయి ఒక దశాబ్దంపాటు ఈ రెండు ఉద్యమాలు, ఎన్ని అంతర్గత వైరుధ్యాలు ఉన్నప్పటికీ, శక్తివంతంగా పనిచేశాయి ఒక దశలో కమ్యూనిస్టు ఉద్యమాల అస్తిత్వపు అర్థాన్ని సందేహంలో పడవేశాయి. అయితే క్రమంగా దళిత, స్త్రీవాద ఉద్యమాలు ఎన్జీవోల పరమయ్యాయి ఫలితంగా ఈ ఉద్యమాల రాజకీయ ఆచరణ కేవలం పత్రికా ప్రకటనలకు, రిపోర్టులు తయారు చేయటానికి పరిమితమైపోయింది ఈ ఉద్యమాలకి ఏ లక్ష్యాలు ఉన్నాయో, ఆ లక్ష్యాలకు ఈ ఉద్యమాలు క్రమంగా దూరమయ్యాయి సామాజిక రంగంలో నిర్దిష్ట ఆచరణకు దూరమైన ఈ ఉద్యమాలు సహజంగానే సాహిత్యరంగంలో ఏ విధమైన ప్రేరణా ఇవ్వలేక పోయాయి. దీనికి తోడు పై ఉద్యమాలలో క్రియాశీలకంగా పాల్గొన్న రచయితల కార్యరంగం కూడా ఎన్జీవోలయ్యాయి ప్రారంభకాలంలో ఈ ఉద్యమాలకు ఎన్జీవోలు అదనపు శక్తి అవుతాయని కొంతమంది భావించినట్టుగా జరగకపోగా ఈ ఉద్యమాలే ఎన్జీవోలకు అదనపుశక్తి అవటం జరిగింది దీనికి తోడు 1990ల నుండి శరవేగంగా అమలవుతున్న ఉదార ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ నేపథ్యంలో ఈ ఎన్జీవోల బలం మరింత పెరగటం, మిగతా అన్ని ఉద్యమాల శక్తి చాలావరకు తగ్గిపోవటం జరిగింది ఫలితంగా తెలుగు సమాజంలో రాజకీయ వాతావరణం చాలావరకు చల్లారిపోయింది ఈ మధ్యకాలంలో దళిత, స్త్రీవాద ఉద్యమాలు వేసిన ప్రశ్నల్ని కొంతవరకు కమ్యూనిస్టు ఉద్యమాలు గర్తించినప్పటికి, ఆ గుర్తింపు కేవలం డాక్యుమెంట్ల స్థాయిని దాటలేకపోయింది. అందువల్ల ఆచరణాత్మకంగా కమ్యూనిస్టులు కూడా చేయగలిగింది ఏమీ లేకుండా పోయింది ఈ సందర్భంలో కమ్యూనిస్టుల్లో మరికొంతమంది ఎన్జీవోలుగా మారిపోవటం అనేది మరింత విషాదకర అంశం.

ఇంతకీ ఈ పై వివరణంతా ఎందుకంటే, చంద్రశేఖరరావు ఈ క్రమం మొత్తాన్ని రేఖా మాత్రంగా గుర్తించాడు ఆ గుర్తింపు చాలా కథల్లో కన్పిస్తుంది. ముఖ్యంగా 'ముఖాముఖం', 'లెనిన్ ప్లేస్', 'మోహనా! మోహనా!' లలో చూడవచ్చు ఆ మాటకొస్తే 'లెనిన్ ప్లేస్' లో కథలన్నీ పై నేపథ్యంలో రాసినట్టు అవగతమవుతుంది. 'లెనిన్ ప్లేస్' కథ మాదిగ దండోరా దాకా నిలిచిన ఉద్యమాల్ని ప్రస్తావిస్తుంది కమ్యూనిస్టు మోహనసుందరం మార్క్స్, లెనిన్, గోర్కీల ఫోటోల సరసన అంబేద్కర్, పూలేల ఫోటోలను చేర్చాల్సి వచ్చిన స్థితిని స్థూలంగా 'లెనిన్ ప్లేస్' కథ చిత్రిస్తుంది అలాగే 'ముఖాముఖం' కథలో ఎన్జీవోల గురించి 'రాజకీయాలకు, డబ్బుకు అమ్ముడు'పోయాయనే ప్రస్తావన ఉంటుంది 'మోహనా! మోహనా!' కథలో దళిత రాజకీయాల్ని,

అందులో ఉద్యమ లక్ష్యాల్ని దెబ్బతీయటానికి ప్రయత్నించి వాళ్ళని సంకేతిస్తూ మోహనరావు పాత్రకి రూపకల్పన చేయటం జరిగింది.

ఇంతకుముందే చెప్పుకొన్నట్టు చంద్రశేఖరరావు కథలు వాస్తవికతావాద కథలకు భిన్నంగా ఉంటాయి వాస్తవికతావాద రచనల్లో కథకుడికి స్పష్టమైన సామాజిక దృక్కోణం ఉంటుంది ఈ దృక్కోణానికి అధిగమించి పాత్రకు స్వేచ్ఛ నివ్వటం అనేది కథకుడికి కూడా సాధ్యం కాదు మరింత స్పష్టంగా చెప్పాలంటే కథకుడు తాను విధించుకొన్న చట్రానికి తానే బందీ అయిపోవటం జరుగుతుంది. అసలు వాస్తవికత పట్ల కథకుడికి ఒక అఖండమైన విశ్వాసం ఉంటుంది ఏ జీవితానుభవం ఈ విశ్వాసాన్ని దెబ్బతీయకుండా, చూసుకొనే ప్రయత్నంలో వాస్తవికతావాద రచయిత అంతిమంగా సృష్టించగలిగేది కేవలం టైప్స్‌ని మాత్రమే, సజీవమైన పాత్రల్నికాదు. ఆయన పాత్రలు టైప్స్‌గా మిగలవు. మానవ అచేతనం, అహం రెండు కూడా నిరంతరం స్థిరంగాకాక, అస్థిరంగా ఉంటాయనే విషయం ఒక కథకుడిగా చంద్రశేఖరరావు ఎప్పుడూ మర్చిపోడు ఇతని పాత్రల ప్రవర్తనలు, దృక్కోణాలు చాలా త్వరగా మారుతుంటాయి ఇతని పాత్రలతో తాదాత్మ్యం చెందటం ఏ పాఠకుడికైనా కష్టం కావటానికి కారణం ఇదే. ఒక సన్నివేశంలో పాఠకుడి సానుభూతి పొందిన పాత్ర మరొక సన్నివేశంలో అందుకు పూర్తి విరుద్ధమైన స్పందన కలిగిస్తుంది

First personలో చంద్రశేఖరరావు కథలు ఎక్కువ భాగం కథకుడిగా మిగతా పాఠకుడికి మధ్యఉండే సంబంధాన్ని చెరిపి వేస్తాయి కథకుడితోపాటు పాత్రలు తమంత తాముగా తమ గురించి మాట్లాడుకొంటాయి. కథకుడి 'నేను' పాత్రల 'నేను'ల మధ్య వ్యత్యాసం గమనించటం పాఠకులకి దాదాపు అసాధ్యమవుతుంది చంద్రశేఖరరావు కథలు చాలావరకు పాఠకుడి expectanceyని విచ్ఛిన్నం చేస్తూ ఉంటాయి. పాఠకులు తామున్న లేక తమని రచయిత తీసుకెళ్ళిన కాల్పనిక ప్రపంచం నిరంతరం విచ్ఛిన్నమవుతూ ఉండటం లేక రచయిత వాటిని విచ్ఛిన్నం చేస్తూ ఉండటం వల్ల ఒక గందరగోళంలో పడటం జరుగుతుంది. ఇందుకు స్పష్టమైన ఉదాహరణగా 'నిశ్శబ్దాలు' అనే చిన్న కథ చాలు. నిజానికి ఇదొక స్వాప్నిక అవస్థకు సంబంధించిన కథ. అందువల్లనే స్వప్నంలో ఉండే disorder అంతా ఈ కథలో కన్పిస్తుంది.

చంద్రశేఖరరావు కథలు సంఘటన ప్రధానంగా నడిచే కథలు కాదు, ఎక్కువ భాగం పాత్రలు ప్రధానంగా నడిచే కథలు. కథల్లో సంఘటనలు ఉన్నట్టు కనిపించినా అవి కథలో నేపథ్యానికి సంబంధించనవిగానే ఉంటాయి. గత సంఘటనల పాత్రలు 'fate' ని నిర్దేశిస్తూ ఉంటాయి. చాలావరకు పాత్రలు ఒకానొక 'guilt' తో సంచరిస్తూ ఉంటాయి. జ్ఞాపకాల్ని ట్రామాల్లాగ భరిస్తూ ఉంటాయి ఎక్కడో ఆత్మిక ప్రపంచపు లోతుల్లో ఏదో అస్పష్టమైన వేదననిదేన్నో మోస్తూ ఉంటాయి సంవేదన సంక్లిష్టతలో సంచరిస్తూ ఉంటాయి. అలాగే కొన్ని పాత్రలు, ఉదాహరణకు పార్వతి, మోహిని, ఆనందశంకరం

లాంటి పాత్రల్ని లోతుగా పరిశీలిస్తే అవి ఏదో ఒక అసాధారణ చైతన్యానికి బాధితులయినట్లు అన్పిస్తుంది ప్రతి పాత్రకు సంబంధించిన గతం వాటి వర్తమాన జీవితాన్ని ఉద్దేశించటమే కాకుండా తీవ్ర కల్లోలానికి కూడా గురిచేస్తుంది పాత్రలు తమ వైయక్తిక బాధల్ని మోనోలాగుల్లో ఆవిష్కరిస్తూ ఉంటాయి 'జీవని' సంపుటంలో కొద్దిగా కనిపించే ఈ ధోరణి క్రమంగా విస్తరిస్తూ వచ్చి, ఈ మధ్యకాలంలో మరింతగా పెరిగింది 2000 సంవత్సరంలో రాసిన 'అపరిచిత భాషలు' కథలో ఈ లక్షణం చాలా ఎక్కువగా కన్పిస్తుంది అసలీ కథలో ప్రధాన పాత్ర ఒకటే. చాలా కథల్లో స్త్రీ పాత్రలు లాగానే ఈ కథలో కూడా స్త్రీ పాత్ర, విషాదాన్ని మోసీ మోసీ క్రమంగా దానికి అలవడి, తాత్వికంగా ఆమోదించటం కన్పిస్తుంది. 'ఆకాశంలో సగం' అనే కథలో లలిత ఒక వ్యక్తి జీవితంలో ఎంత విషాదాన్ని అనుభవించటానికి వీలుందో అంత విషాదాన్నీ భరిస్తుంది. అంతిమంగా ఈ విషాదాన్ని అధిగమించే ప్రయత్నంలో ఉద్యమాల్లోకి వెళుతుంది ఆ ఉద్యమాల్లో కూడా విషాదం లేదని చెప్పలేం ఉద్యమం కూడా మరొక బాధగా పర్యవసానం చెందవచ్చు అయితే రచయిత ఉద్యమాన్ని మాత్రం ఆమె విషాదానికి పరిష్కారంగా చెప్పడు

స్త్రీ పురుష సంబంధాల్లోని (వివాహ వ్యవస్థకి లోపలా బయటవున్న) అమలయ్యే అధికారాన్ని, ఆ అధికారం అమలవడంలో అనివార్యంగా ఉండే హింసని ఇతని కథలు చిత్రిస్తాయి. కొన్ని పాత్రలు ఈ అధికారాన్ని తృణప్రాయంగా నిరాకరించి బయటపడుతుంటాయి మరికొన్ని అందులో సంఘర్షిస్తూ ఉంటాయి. మరికొన్ని పాత్రలకి ఉద్యమాలు నేపథ్యంగా ఉంటాయి అసలు కొన్ని పాత్రలు ఉద్యమాల్లో ప్రత్యక్షంగా పాల్గొని బయటపడినవి ఉంటాయి. వైఫల్యాల్ని ఈ పాత్రలను నిర్వచించే సూత్రాలుగా ఉంటాయి ఈ వైఫల్యాలను అధిగమించాలనే కోరిక, ప్రయత్నం కూడా ఈ పాత్రల ప్రవర్తనలలో స్పష్టమవుతూ ఉంటుంది. స్థూలంగా చెప్పాలంటే ప్రతి పాత్ర పాఠకులమీద తనదైన ముద్ర వేయటంలో విజయవంతమవుతుంది.

చంద్రశేఖరం రాసిన ఈ అరవైపైగా కథలకి వస్తువు 1990-2000 మధ్యకాలానికి సంబంధించినదే. నేపథ్యం మాత్రం గత నాలుగు, అయిదు దశాబ్దాలు. ఈ మొత్తం కాలంలో నడిచిన ప్రతి సన్నివేశాన్ని ఉద్యమాల్ని ఈయన కథల్లో చిత్రించాడు. మరింత స్పష్టంగా చెప్పాలంటే ఈ దశాబ్దపు చరిత్రని కాల్పనిక సాహిత్యంలో రాశాడు చరిత్రని సాహిత్యంలో మరింత సూక్ష్మ కోణాల్నించి అర్థం చేసుకోవచ్చనే అభిప్రాయాన్ని చంద్రశేఖరరావు కథలు బలపర్చుతాయి

ఈ పై విషయాలతోపాటు చంద్రశేఖరరావు కథల్లోని లోపాల్ని, పరిమితుల్ని కొన్నింటి గురించి చెప్పుకోవటం అవసరం 'జీవని' సంపుటిలో కథలకి, 'లెనిన్ ప్లేస్'లో కథలకి వస్తురూపాల్లో ఒక స్పష్టమైన తేడా కన్పిస్తుంది అలాగే 'లెనిన్ ప్లేస్' కథల్లో చంద్రశేఖరరావు పరిణితి చెందిన కథకుడుగా కన్పిస్తాడు 'లెనిన్

ప్లేస్' తరువాత వచ్చిన కథల్లో కొంత రూప సంబంధమైన మొనాటనీ కన్పిస్తుంది అయితే ఈ కథల్లో వస్తు విస్తృతి, వైవిధ్యం మాత్రం బాగా ఉంది జీవితానికి విషాదమే కాక మరొక పార్శ్వం ఉంటుందనే స్పృహ ఈయనకు తక్కువ ఆ రెండవ పార్శ్వాన్ని అరిస్టాటిల్ లాగ దూరంగా పెట్టాడు చంద్రశేఖరరావు ఎంత కాదనుకొన్నా అక్కడక్కడా మెలోడ్రామా లక్షణాలు కన్పిస్తూ ఉంటాయి వాటిని పరిహరించుకొంటే బాగుంటుంది కథల్లో మరికొంత తెలుగు వాతావరణం తీసుకువస్తే వచ్చే నష్టం ఏమీ లేదు ఇంగ్లీషు పదాలు ఈ మధ్య కథల్లో కొంత తగ్గినప్పటికీ ఇంకా తగ్గించే అవకాశం ఉంది అలాగే కవుల్ని మించిన కవిత్వ వ్యామోహం కూడా నిజానికి ఇవన్నీ ఏదో ఒక రూపంలో విమర్శకులు చెపుతూనే వచ్చారు ఈయనకు అయితే ఈ విమర్శలను చంద్రశేఖరరావు సీరియస్‌గా తీసుకున్నట్టు కన్పించదు విమర్శ నుంచి స్వయం ప్రతిపత్తిలో ఉండటంవల్ల అంతిమంగా నష్టం రచయితకే అనే విషయం గుర్తించాలి నిజానికి సాహిత్యం నుంచి విమర్శకులు గానీ, విమర్శ నుంచి రచయితలుకానీ స్వయం ప్రతిపత్తిలో ఉండటంవల్ల అంతిమంగా సాహిత్యపు ఎదుగుదల ఆగిపోతుంది. పై పరిమితుల్ని అధిగమించటం ద్వారా సాహిత్యలోకంలో ఇప్పటికే శక్తివంతమైన రచయితగా పేరు పొందిన చంద్రశేఖరరావు మరింతగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకోగలుగుతాడు పాఠకులకి మరింత దగ్గరవటం జరుగుతుంది

# శాంతినారాయణ

♦ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ♦

అనంతపురం జిల్లాలో తెలుగు కథా రచనకు తొలి ప్రయత్నాలు చేసిన వాళ్ళు చిలుకూరి నారాయణరావు, జి రామకృష్ణ, తూమాటి దోణప్ప, సర్దేశాయి తిరుమలరావు మొదలయినవాళ్ళు వీళ్ళలో స్థానిక జీవిత వాస్తవికతను 'గంజికోసరం' వంటి కథల్లో వాస్తవికంగా చిత్రించే ప్రయత్నం చేశారు రామకృష్ణ. వీళ్ళు కథారచనను ప్రారంభించారుగాని కొనసాగించలేదు. 1930 ప్రాంతాల్లో మొదలయిన వీళ్ల కథ రచనా ప్రయత్నం 1970 ప్రాంతాలదాకా అందిపుచ్చుకునే దిక్కులేక ప్రయత్నంగానే మిగిలిపోయింది. డెబ్భైయవ దశకంలో 'అనంత' కథను ఆధునిక స్పృహతో ఆధునిక రూపంతో ప్రారంభించిన వాళ్ళు సింగమనేని నారాయణ, విద్వాన్ పి.దస్తగిరి వీళ్ళ తర్వాత ఆ వారసత్వాన్ని కొనసాగిస్తున్న వాళ్ళు చిలుకూరి దేవపుత్ర, బండి నారాయణస్వామి, శాంతినారాయణ మొదలయిన వాళ్ళు

రైతు పొలం బాగా మెత్తగా దున్ని పాదులు చేసి అవసరమైన శీతోష్ణ పరిస్థితులు కల్పిస్తే నాటిన విత్తనం మొలకెత్తడం చాలా సులభం ఎక్కడో కొండలమీద రాతి నెర్రెలో పడ్డ విత్తనం మొలకెత్తి చెట్టుగా విస్తరించటం పెద్ద సంఘర్షణాత్మక ప్రక్రియ. శాంతినారాయణ కథా రచయితగా ఎదగడం ఈ రెండో రకం కిందికి వస్తుంది శాంతినారాయణ 1989లో 'దళారి' కథతో కథా రచయితగా గుర్తింపులోకి వచ్చారు. అయితే అది హఠాత్తుగా, అసంకల్పితంగా జరగలేదు దానికి ముందొక జీవిత సంఘర్షణ ఉంది సాహిత్య సంఘర్షణ కూడా ఉంది.

శాంతినారాయణ 1946 జూలై ఒకటిన కరువుకు మారుపేరైన అనంతపురం జిల్లా, శింగనమల తాలూకా సి బండమీదపల్లెలో నిరుపేదలైన కాశమ్మ వెంకటస్వామి దంపతులకు పెద్ద కొడుకుగా పుట్టారు సాంఘికంగా వెనకబడ్డ కులానికి, ఆర్థికంగా వ్యవసాయ కూలి కుటుంబం శాంతినారాయణది. తాను బతికినట్లుగా తన పిల్లలు బతకకూడదనీ ఒక చైతన్యవంతమైన ఆలోచన వెంకటస్వామికి కలిగి శాంతినారాయణను పాఠశాలలో చేర్పించేట్లు చేసింది చాలీచాలని తిండీ బట్టలతోనే ప్రాథమిక విద్య పూర్తయింది హైస్కూలు విద్యకు శింగనమలకు నడచిపోయాడు హైస్కూలులో జి గురుమూర్తి సాహిత్య బోధన శాంతినారాయణలో చిన్న వయసులోనే సాహిత్యం పట్ల ఆసక్తిని కలిగించింది ఆ స్కూలు ప్రధానోపాధ్యాయులు చిత్తరంజన్‌దాస్ శాంతినారాయణ జీవితాన్ని మలుపు తిప్పారు హైస్కూలు విద్యతో చదువు ముగిసిందనుకున్న

శాంతినారాయణను చిత్తరంజన్ దాస్ తిరుపతి ఓరియంటల్ కళాశాలలో చేర్పించి మొక్క ఎండిపోకుండా కాపాడారు నెలకు 15, 20 రూపాయలు పంపించి ఆదుకున్నారు. తిరుపతిలో శాంతినారాయణకు రెండు రకాల పరిస్థితు లెదురయ్యాయి నరాల రామారెడ్డి, ఆశావాది ప్రకాశరావువంటి అవధానుల పరిచయంతో అవధాన విద్యపట్ల ఆసక్తి కలిగింది అదే సమయంలో డి నాగసిద్ధారెడ్డి ఆధునిక విధానంలో సాహిత్య బోధన, సింగమనేని నారాయణ పరిచయం ఆధునిక మార్గాన్ని చూపించాయి. ప్రాచీనసాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేస్తూనే ఆధునికంగా ఆలోచించడం ప్రారంభించారు అవధాని కాబోయి అధునిక రచయిత అయ్యారు. 1966-67 ప్రాంతాల్లోనే 'బాటసారి' నవలరాసి సింగమనేనికి చూపించారు. ఆ నవలను పదేళ్లు అలాగే వుంచేసి ఆ తర్వాత కూడా బాగుందనుకుంటే అచ్చు వెయ్యమని సలహా ఇచ్చారు సింగమనేని. ఆ పదేళ్ళలో శాంతినారాయణలో అనంతమైన మార్పు వచ్చింది. ఆ నవలను చింపేశారు. 1978లో 'మాధురి' అనే నవల రాశారు అందులో కొన్ని యవ్వనోద్రేక లక్షణాలున్నా, అప్పటి సామాజిక రుగ్మతల్ని ఎండగట్టారు. ఈ లోపల ఆధునిక తెలుగు కవిత్వాన్ని బాగా చదివారు సినారె ప్రభావంతో 'నడిరేయి నగరం' రాశారు.

శాంతినారాయణ కథా రచన 1989లో 'దళారి'తో హఠాత్తుగా ప్రారంభం కాలేదు. ఆయన అంతకుముందే 1974లో 'రక్తపు ముద్ద పిలిచింది' అనే అయిదు కథల సంపుటిని, 1977లో 'రస్తా' అనే మూడు కథల సంపుటిని ప్రచురించారు. మొదటిది ముప్పయ్యేళ్ళ వయస్సులో ఉన్న శాంతినారాయణలో చెలరేగిన ఊహా ప్రేమ కథల అల్లిక. రెండో దాంట్లో 'రస్తా' మంచి కథ. పంచాయతీ ప్రెసిడెంటు ఒకగ్రామ సేవికను నాశనం చేస్తే, ఆమె కూతురు అతని మీద పగతీర్చుకునే కథ 'రస్తా'. ఇదంతా శాంతినారాయణ నేటి కథా రచయితగా పుట్టడానికి గల సాంఘిక సాహిత్య నేపథ్యం.

గత పదహైదేళ్ళలో శాంతినారాయణ దాదాపు ముప్పైకథలు రచించారు. అనంతపురం జిల్లా నిర్దిష్ట జీవితాన్ని గురించి రాస్తూనే, మొత్తం సమాజంలోని ఇతర సమస్యలను గురించి కూడా రాస్తున్నారు. ఏ వస్తువును తీసుకున్నా, అనంతపురం జిల్లా నేపథ్యంలోనే రాశారు. ఈయన కథల్లో సీమ వ్యవసాయరంగం, స్త్రీ పురుష సంబంధాలు, అస్పృశ్యత, ఆర్థిక అవినీతి, విద్యా విలువల పతనం వంటివి వస్తువులుగా కనిపిస్తున్నాయి

**రైతుల బతుకే అద్దమాన్నమయిపోయింది:**

స్వతంత్ర భారత రాజకీయార్థిక విధానాలు వ్యవసాయక భారతదేశంలోని రైతును నాశనం చేసి, దళారులను సంపన్నులను చేసిన దుర్మార్గం మీద కోప ప్రదర్శనలే శాంతినారాయణ వ్యవసాయ కథలు. 'దళారి' కథలో రామప్ప అనే రైతు "రైతుల బతుకే అద్దమాన్నమయిపోయింది" అని ఇచ్చిన తీర్పు ఈ వాస్తవానికి నిదర్శనం. వేరుశనగ, ఉల్లిగడ్డలు, చీనాకాయలు, కొంతవరకు టమోటా (ఒకప్పుడు ద్రాక్ష) ఇవీ అనంతపురం జిల్లాలో రైతులు పండించే

పంటలు వేరుశెనగ ప్రధాన పంట వరి కొన్ని ప్రాంతాల్లో పండిస్తారు ప్రకృతి సహాయ నిరాకరణ, దళారి ఆర్థిక వ్యవస్థ, ప్రభుత్వ నిర్లక్ష్యం. ఈ మూడు ముప్పేటగా చుట్టుముట్టి అనంత రైతును వ్యవసాయ పద్మవ్యూహంలో బంధించి చంపుతున్న విధానాన్ని, అనంతపురం జిల్లాలో రైతు జూదగాడుగా, వ్యవసాయం జూదంగా మారిపోయి రైతు కుటుంబాలు శిధిలమైపోతున్న తీరును శాంతి నారాయణ కథలు ప్రతిఫలిస్తున్నాయి రామప్ప(దళారి) మల్లప్ప (కల్లమయి పాయ), నారపరెడ్డి(పల్లేరుముళ్ళు), చెన్నప్ప(తాలుగింజలు), సంజీవప్ప (ఎండమావి), మల్లన్న(రతనాల సీమలో) వంటి రైతులు దగాబడ్డ అనంత రైతులు వ్యాపార పంటల వ్యవసాయం అనే గూటిలోని సాలెపురుగుల్లాంటి రైతుల విలవిలల్ని ఈ కథలు విన్పిస్తాయి. వ్యవసాయ రంగంలో చిన్నప్పటి నుండి సునిశిత సంబంధంగల శాంతినారాయణ 'అనంత' రైతు జీవన శైలిని, ఆలోచనల్ని, ప్రకృతిలో వచ్చే మార్పులు, అవి వ్యవసాయంపై చూపే ప్రభావం, వ్యవసాయ రంగాన్ని ఆవరించిన అనేక ప్రభుత్వ రంగ సంస్థల తీరు తెన్నులు వంటి వాటిని అనుభవ పూర్వకంగా పరిశీలనాత్మకంగా తన కథల్లో చిత్రించారు. వ్యవసాయం గురించి శాంతినారాయణ రాసిన ఆరు కథల్లో కరువుతో ప్రకృతితో పోరాటం చేసే దశనుంచి ప్రభుత్వ విధానాలవల్ల చితికిపోతూ, దళారుల మోసాలతో నిర్వీర్యుడైపోతూ భూమిని తెగనమ్ముకుని పట్నం చేరడమో, తమకు తామే ఉరికొయ్యలకు ఆహుతైపోవడమనే దశకు చేరుకుంటున్న అనంత రైతు దర్శనమిస్తాడు. స్థానికంగా చిత్రింపబడ్డ ఈ అనంత రైతు, బహుశా భారతదేశంలోని నిరాదరింపబడ్డ ప్రాంతాలకన్నింటికీ చెందిన దగాపడ్డ జాతీయ రైతుకు ప్రతినిధి అవుతాడు. "వూర్లోకి బోతే వుంద బుద్ధిగాదు. ఈటి కొత్తే సూడబుద్ధి గాదు" అనే మల్లప్ప పరిస్థితి (కల్లమయి పాయ) ఇవాళ దేశమంతటా కనిపిస్తున్నాది. "వ్యవసాయ మంతా జూదమైపోతే ఇంగ యావల్లనప్పా బతికేది!" అన్న నారపరెడ్డి (పల్లేరు ముళ్ళు) ప్రశ్న భారత జాతీయ వ్యవసాయ రంగ ప్రశ్న)

ఆరుగాలం కష్టపడి పండించిన పంటను అమ్మడానికి పోయే అమాయక రైతుల్ని పట్టణ వ్యాపారులు అతి తెలివితో మోసం చెయ్యడాన్ని 'దళారి' కథ చిత్రించింది. రెక్కలు విరుచుకుని కష్టపడే రైతును మార్కెట్ రాక్షసి ఎలా మింగేస్తుందో ఈ కథ వివరించింది. ఉల్లిగడ్డలు పండించిన రామప్పకు సబ్బరాయుడనే వ్యాపారి - దళారి లారీ బాడుగ, నగరాలకు పోన్లు, మార్కెట్ల విచారణ, కమీషన్ పేర్లతో దగా చేసిన తీరుకు వాస్తవిక రూపం ఈ కథ "నాలుగేండ్లనుంచీ కరువు జుట్టుకున్నా పెద్దోల్లకు చీమ గుట్టెట్టు గుడకాలే" అని విమర్శ పెట్టిన కథ 'కల్లమయి పాయ' రాత్రింబవళ్ళు కష్టపడి, ప్రకృతితో పోరాటం చేసి ఋతువుల మోసానికి గురై పండించిన పంట చేతికొచ్చినాక అమ్మితే వచ్చిన ఆదాయం ఏ మూలకు చాలక తెల్లముఖం వేసిన రైతు, అనివార్యంగా భూమిని అమ్ముకొని పట్నాలకు కూలీలుగా వలసపోతున్న తీరుకు ప్రతిఫలం ఈ కథ. 'బూమమ్మను నమ్ముకుని ఏమి బాగుపడ్నాము?" అనే నారమ్మ ప్రశ్నకు నేటికీ జవాబు దొరకలేదు అనంతపురం జిల్లాలో.

శాంతినారాయణ రాసిన కథల్లో పెద్దది 'పల్లేరుముళ్ళు' వ్యవసాయం కోసం పుట్టుకొచ్చిన అనేక రంగాలు దానిని నిర్వీర్యం చేస్తున్న తీరుకు అద్దం ఈ కథ ఇదొక ఐతిహాసిక కథ రైతుని పరాజితుణ్ణి జేస్తున్న ప్రభుత్వ విధానాలకీ కథ వాస్తవిక చిత్రం. "కష్టమంతా రైతుపాలైతాంది ఈ కష్టం తెగేది యెప్పుడప్పా?" అని ఈ కథ నిలదీస్తుంది "తాలు గింజలు" కథ అనంతపురం లోని బదులు వ్యవసాయాన్ని మనకు పరిచయం చేస్తుంది. పరస్పర సహకారానికి నిలయాలైన గ్రామాల్లోకి వ్యాపార సంబంధాలు ప్రవేశించి, పరాయివాళ్ళ పనులంటే అదేదో పొద్దుబుచ్చుకోవడంగా భావించడం, తమ పనులయితే జాగ్రత్త చేసుకోవడం - అనే పరిణామాన్ని ఈ కథ ప్రతిఫలించింది అనంతపురం జిల్లాను నిరంతరం పీడించేది అనావృష్టి అయితే, ఎప్పుడో ఒకసారి కాలం కాని కాలంతో వచ్చిపడి రైతును దగాచేసేది అతివృష్టి ఉల్లిపాయల్ని ఎంతో శ్రమకోర్చి పండించిన సంజీవప్ప, నారప్పల్ని పంట చేతికొచ్చినాక ఉల్లిగడ్డల్ని రాసిపోసినాక పెద్దవర్షం వచ్చి వాటిని నాశనం చేసి రైతును కుళ్ళబెట్టిన విధానాన్ని 'ఎండమావి' కథ చిత్రించింది

గత నాలుగేళ్ళుగా అనంతపురం జిల్లాలో 400మంది దాకా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు మొవ్వకుళ్ళు తెగులు వస్తే ప్రభుత్వం సరఫరా చేసిన మోనోక్రోటోపాస్ మందు పరుగుల్ని చంపలేదుగానీ, అనేకమంది రైతుల్ని మాత్రం బలిగొంది ఇప్పటికీ రైతులు ఆత్మహత్యలు చేసుకోడానికి ఆ మందే బాగా పనిచేస్తోంది ఒక ఏడాదిలో వందమంది దాకా వేరుశనగ రైతుల్ని, మోనోక్రోటోపాస్ బలిగొన్న తీరును ప్రతిబింబించింది 'రతనాలసీమలో' అనే కథ. ఈ కథలోని మల్లన్న ఇప్పటిదాకా ఆత్మహత్య చేసుకొన్న 450 పైగా 'అనంత' రైతులకు తొలినాటి ప్రతినిధి

"ఈ పయనం ఎక్కడికి?" అనే కథ ప్రాంతీయ అసమానతలను విశ్లేషించే కథ కోస్తా, రాయలసీమల మధ్య భౌగోళిక పరిస్థితులు, అభివృద్ధిలోని అసమానతల్ని ప్రదర్శించి రాయలసీమలోని ఆర్థిక పరిస్థితులు కుటుంబ సంబంధాలలో తీసుకొచ్చిన మార్పును ఈ కథ ప్రతిబింబించింది

రాయలసీమను కరువు పీడిస్తున్నట్లుగానే ఫాక్షనిజమూ పీడిస్తున్నది ఆధిపత్య భావజాలంతో, ప్రజాస్వామిక స్వభావమేమీ లేకుండా, ప్రకృతి వనరుల మీద పెత్తనం చెలాయిస్తూ, మనుషుల్ని కూడా అజమాయిషీ చేసేవర్గం ఫాక్షనిస్టు వర్గం. ఇవాళ కాంట్రాక్టులు, రాజకీయాలు అన్నీ వాళ్ళవే. ఆఖరికి ప్రజల జీవితమే వాళ్ళ చేతుల్లోకి వెళ్ళిపోతున్నది ఒకనాడు కడప, కర్నూలు జిల్లాలకు పరిమితంగా ఉండిన ఫాక్షనిజం అనంతపురం జిల్లాకు కూడా పాకి అనేక పేర్లతో చెలామణి అవుతూ, జిల్లాను రక్తపుటేరుల్లో ముంచుతున్నది. ఇది మానవ మనుగడకే ప్రమాదకారియై గ్రామాలను కలవరపెడ్తున్నది. పట్టణాలను వణికిస్తున్నది. ఈ నయా పాలెగాళ్ళమీద రావల్సినన్ని కథలు అనంతపురం జిల్లా నుండి రాలేదు. సింగమనేని 'అనంతం' దేవపుత్ర సమిధలు, శాంతినారాయణ 'గర్భస్రావం' ఈ దృష్ట్యా వచ్చిన కథలు. కర్నూలు, కడప జిల్లాల నుండి ఫాక్షన్ కథలు బాగానే వచ్చాయి. ఫాక్షనిజం ఒక వారసత్వంగా

మారి శివారెడ్డిలాంటి యువకులు అమాయకంగా, అనివార్యంగా ఫాక్షనిజం సర్పయాగంలో పడి మాడిపోతూన్న తీరు పట్ల ఈ కథ ఆలోచనలు రేకెత్తిస్తుంది అంతేకాక ఫాక్షనిజం స్త్రీల భవిష్యత్తుమీద వాళ్ళ సుఖసంతోషాలమీద చూపే దుష్ప్రభావాన్ని కూడా ఈ కథ ప్రదర్శించింది

**దళిత జీవన దృశ్యాలు:**

శాంతినారాయణ రెండు కథల్లో దళిత జీవిత చిత్రణ చేశారు. స్వాతంత్ర్యం సిద్ధించి దశాబ్దాలు గడిచిపోయినా భారతీయ గ్రామాల్లో ఇంకా సజీవంగా ఉంటున్న దళిత వివక్షకు 'జీవనాడులు', 'ఉక్కుపాదం' అనే కథలు నిలువెత్తు దర్పణాలు. దళితులు పల్లెలో ఎదుర్కొంటున్న వివక్షను 'జీవనాడులు' ప్రదర్శిస్తే వాళ్ళు పట్టణాల్లో వివక్షకు గురికావడాన్ని 'ఉక్కుపాదం' ప్రతిఫలిస్తున్నది. దళితుల పెళ్ళి ఊరేగింపును ఊళ్ళోకి రానివ్వకుండా దొడ్డిదారివైపు మళ్ళించడం ద్వారా అగ్రవర్ణాలు దళితులను అవమానించి, తమ ఆధిక్యతను చాటుకొని దళితులు ఆర్థిక సాంఘిక పరిమితుల్ని నిర్ణయించే దుర్మార్గాన్ని 'జీవనాడులు' విమర్శనాత్మకంగా ప్రతిబింబించింది భారతీయ గ్రామం చాల మంచిది అనుకునే దివాంధుల కళ్ళు తెరిపిస్తుందీ కథ అంతేకాక దళితుల్లో వస్తున్న మార్పును చైతన్యాన్ని గుర్తించలేని, గుర్తించినా సహించలేని అగ్రవర్ణాల వెనుకబాటుతనాన్ని కూడా ఈ కథ బహిర్గతం చేస్తుంది దళితులు చదువుకొని రాజకీయాల్లోకి ప్రవేశించి, అధికారంలో భాగస్వాములైనా పట్టణాల్లో సైతం బాడుగ ఇల్లు దొరకని నిజాన్ని 'ఉక్కుపాదం' ప్రదర్శిస్తుంది. అగ్రవర్ణ భూస్వాముల నాయకత్వంలోని పార్టీలలో దళిత రాజకీయ నాయకులకు ఏపాటి గౌరవ మర్యాదలు దక్కుతున్నాయో కూడా ఈ కథ స్పష్టం చేస్తుంది.

**నూతన స్త్రీ సృష్టి:**

వ్యావసాయక జీవితాన్ని ప్రతిబింబించే కథల్లో శ్రామిక స్త్రీలను చిత్రించిన శాంతినారాయణ "బొమ్మా బొరుసా, నిర్ణయం, శాలిని, అద్దెతల్లి" - కథల్లో మధ్యతరగతి నూతన స్త్రీని సృష్టించారు స్త్రీ జీవితం చుట్టూ పితృస్వామిక వ్యవస్థ శిలాకవచం ఏర్పాటు చేయడాన్ని 'మట్టి మరకలు' కథ విమర్శనాత్మకంగా చిత్రించగా, అలాంటి కవచాలను పగలగొట్టి కుటుంబ ఆధిపత్యం మీద తిరుగుబాటు చేసి, అరుణలాంటి నూతన స్త్రీని 'బొమ్మా బొరుసా' కథ ప్రదర్శించింది. తనను హీనాతిహీనంగా అవమానించిన కుటుంబ పెత్తనంమీద తిరుగుబాటు చేసిన అరుణకథ అదైతే, కులాల హద్దుల్ని దాటి, కుల పురుషాధిపత్య సంకెళ్ళను ఛేదించి పునర్వివాహం చేసుకున్న సీతాలక్ష్మి కథ 'నిర్ణయం' బతుకు తెరువు కోసం మగవారు చేసే పనికి అడ్డంరాని కులం ఆడది చేస్తే అడ్డం రావడం ఏమిటన్న సీతాలక్ష్మి ప్రశ్నకు పురుష సమాజమే సమాధానం చెప్పాలి. 'శాలిని' లో బాగా చదువుకుని సమాన ఆర్థిక సాంఘిక హోదా కలిగిన స్త్రీ పురుషుల మధ్యకూడా వరకట్న పిశాచం నృత్యం చేస్తున్న తీరును రచయిత విమర్శనాత్మకంగా చిత్రించారు అంతేకాక భార్యకు భర్త కన్నా మించిన హోదా అవకాశంవస్తే సహించలేని భర్తను ధిక్కరించిన నూతన

స్త్రీ 'శాలిని' ఈ కథలో మనకు కనిపిస్తుంది పెళ్ళి ఒక్కటే ఆడదానికి జీవితాశయం కాదని, దానికి మించిన స్త్రీ వ్యక్తిత్వముందని తెలిసిన శాలిని కథ ఇది పేద స్త్రీల గర్భాన్ని సంపన్నులు సంతానం కోసం వాడుకొన్న పునరుత్పత్తి శక్తిని డబ్బుతో కొలిచే విచిత్ర ఆచారాన్ని 'అద్దెతల్లి' కథ మనకు పరిచయం చేస్తుంది

**మానవీయ విలువల పతనం, బాధ్యతారాహిత్యాలపై ఆగ్రహం:**

పట్టణీకరణ అనేక సాంఘిక రుగ్మతలకు విరుగుడౌతున్నా, మానవ జీవన విలువల పతనానికి కూడా దోహదం చేస్తున్నది పీత బాధలు పీతవి అన్నట్లు, పట్టణ సమస్యలు పట్టణానికి ఉన్నాయి శాంతినారాయణ గ్రామంనుంచి వచ్చి పట్టణంలో నివసిస్తూ రెండు జీవితాల అనుభవంకలిగున్నారు ఆ అనుభవం లోంచి తన కథలు రాశారు. 'మట్టి మరకలు'లో రాత్రిపూట అహల్య రౌడీల చేతుల్లో మానభంగానికి గురై సంతాన ప్రాప్తిని కోల్పోయిన విషాదాన్ని చిత్రించింది దానిని కళ్ళారా చూసిన భర్త గౌతమరావు, గొప్ప మనసుతో అర్థంచేసుకొని, తన భార్యను నిరాదరించకపోడం కూడా ఈ కథలోని విశేషం ఒక దారిదోపిడికి సాక్షిగా ధైర్యంగా నిలబడి వ్యక్తిని హత్య చేసిన దుర్మార్గాన్ని 'మనిషయినందుకు' కథ ప్రదర్శింపగా, 'వైద్యో నారాయణో హరిః' అనే సూక్తికి భిన్నంగా, ఆసుపత్రులు బకాసురుల నిలయాలుగా మారిన వైనాన్ని 'రొంపి' కథ చిత్రించింది "తులసి వనంలో తుమ్మచెట్టు" చదివిస్తే పిల్లలు తమను ముసలితనంలో ఆదరిస్తారనే తల్లిదండ్రుల ఆశల్ని వమ్ముచేసిన యూనివర్శిటీ స్థాయి అధ్యాపకుల స్వార్థపరతకు ప్రతిబింబం. చదువుకున్నవాళ్ళు చదువురాని వాళ్ళ అజ్ఞానాన్ని వాడుకొని మోసగించే తీరుకు 'తేడా' ప్రతిఫలనం. ఇంటర్మీడియెట్ విద్యార్థుల పేపర్ల స్పాట్ వాల్యుయేషన్ సెంటర్లలో ఉపాధ్యాయుల బాధ్యతారాహిత్యం వల్ల విద్యార్థుల జీవితాలు ముగిసిపోతున్న సత్యాన్ని 'బలిపశువులు' కథ ఎంతో వాస్తవికంగా ప్రదర్శించింది. స్వతంత్ర భారతదేశంలో ఇంకా కొనసాగుతున్న బాలకార్మిక వ్యవస్థను 'బతుకు వేదం' ప్రతిబింబించింది. వ్యవస్థ మారుతున్నా, మారని ఇనాములవంటి భూస్వామ్య అవశేషాల పట్ల విమర్శ 'విజయవిహారం' అయ్యప్పభక్తుల విచిత్ర ప్రవర్తనను 'స్వాములు' కథ అధిక్షేపించింది. దున్నేవాడికి భూమి అనే సిద్ధాంతాన్ని అమలుపరిచిన ఒక బ్రాహ్మణుని కథ 'మట్టి మనుషులు' ఎంతో వస్తువైవిధ్యం ప్రదర్శించిన శాంతినారాయణ 'ఎటుచూస్తే అటు' అనే కథ రాయకుండా వుండవలసింది.

శాంతినారాయణ కథల్లో వర్తమాన గ్రామీణ పట్టణ జీవిత వాస్తవికత వైవిధ్యంతో వస్తువైంది. చాలా వరకు ఆయన చూచినవీ, విన్నవీ, అనుభవించినవే ఆ వస్తువులు. మానవ జీవితం బాగుపడాలన్న తపన, జీవితాన్ని ఛిద్రం చేస్తున్న పాలక విధానాలపట్ల కోపం, మనుషుల్లో ఉండవలసిన మానవీయ సంబంధాల పట్ల ప్రేమవంటి విశేష గుణాలకు అక్షర రూపాలు ఆయన కథలు

రాయలసీమ జీవితాన్ని, అందులోనూ అనంతపురం జిల్లా జీవితాన్ని ప్రధాన

ఆధారంగా చేసుకొని రాయబడ్డ ఈ కథలు స్థానికతా స్వభావాన్ని కలిగుంటూనే భారతీయ కథా సాహిత్యంలో భాగమౌతున్నాయి

కథన రీతి:

జీవిత వాస్తవికతను వస్తువుగా తీసుకున్న శాంతినారాయణ కథనంలోనూ వాస్తవిక పద్ధతినే అనుసరించారు. వస్తువును పాఠకులకు అంతుబట్టకుండా చేసే ప్రయోగవాద కథన రీతులను శాంతినారాయణ వాడుకోలేదు "ఈ పయనం ఎక్కడికి?" అనే కథలో కోస్తా ప్రాంత అభివృద్ధిని, రాయలసీమ అనభివృద్ధిని చెప్పడానికి, అనంతపురం జిల్లా నుండి ఇరవయ్యేళ్ళ కితం ఒక వ్యక్తిని మచిలీపట్నం పంపించి అతని ఇరవయ్యేళ్ళ తర్వాత అనంతపురం రప్పించి రెండు ప్రాంతాల మధ్యగల వైరుధ్యాన్ని చెప్పించడంమీద బాగా చర్చ జరిగింది. అయితే ఇటీవల సందర్భన కథన పద్ధతి ఎక్కువౌతున్న నేపథ్యంలో ఈ రీతి కథనాన్ని అర్థం చేసుకోవాలి ప్రకృతిలో వచ్చే మార్పులను, ఋతువుల, కార్తెల ప్రభావాన్ని శాంతినారాయణ తన కథలకు నేపథ్యంగా ఉపయోగించుకోవడంలో ప్రతి కథలోను విజయం సాధించారు. ఉతమ పురుషను అరుదుగానే వాడారు. సర్వసాక్షి దృష్టికోణాన్ని ప్రధానంగా ఉపయోగించుకున్నారు. 'మట్టి మరకలు' కథలో అహల్య, గౌతమరావు పేర్లలో పౌరాణిక అహల్యా గౌతములను ధ్వనించడం అర్థవంతంగానే చేశారు. కథా ప్రారంభంలో గాని, ముగింపులోగాని, పాఠకుల్ని బుట్టలో వేసుకునే లేదా బోల్తా కొట్టించే వ్యాపార శిల్ప పారీణతకు పాల్పడలేదు. పాత్రల్ని అక్కడక్కడా రచయిత పరిచయం చేసినా, వాటంతట అవే తమను తాము ఆవిష్కరించు కుంటాయి. రచయిత సంతోషాన్నయినా, కోపాన్నయినా పాత్రల్ని దాటివచ్చి ప్రదర్శించారు.

శాంతినారాయణ కథల్లో ప్రధానంగా కనిపించే శిల్ప లక్షణం బలమైన కంఠస్వరం. దానిని ధ్వనించే స్థానిక భాష. భాషకు వస్తువాస్తవికతకు అవినాభావ సంబంధముంది. దానిని బాధ్యతాయుతంగా ఉపయోగించు కున్నారు శాంతినారాయణ. గ్రామీణ పాత్రలు సంప్రదాయబద్ధంగా కనిపిస్తూనే అవసరమైనప్పుడు, వాళ్ళలోని హేతువాద జ్ఞానాన్ని, కుల సంబంధాలు కలిగి ఉంటూనే అవి అడ్డమైనప్పుడు వాటిని నిరసించడాన్ని రచయిత చాలా పరిశీలించి కథకు వాస్తవికతను చేకూర్చడానికి వాడుకున్నారు. కథానిక సాధారణంగా గత వర్తమానాల మధ్య మగ్గంలో నూలు కండెలుగా సంచరిస్తుంది. అయితే గత వర్తమానాలను అనుసంధానం చెయ్యడంలో విఫలమైతే కథానిక శిల్ప లక్షణాన్ని కోల్పోతుంది. శాంతినారాయణ ఈ విషయంలోనూ జాగ్రత్త వహించారు. గతాన్ని స్మృతి రూపంలో చెప్పడం చాలా కథల్లో కృత్రిమంగా జరుగుతుంటుంది. శాంతినారాయణ ఆ ప్రమాదానికి గురికాలేదు క్లుప్తత కథకు ప్రాణం, గుండెకాయ. శాంతినారాయణకు ఈ విషయం బాగా తెలుసు. క్లుప్తత తర్వాత సంఘర్షణ కథకుండవలసిన లక్షణం. శాంతినారాయణ కథల్లో వస్తువే జీవిత సంఘర్షణ గనక, శిల్పపరంగా దానిని ప్రయత్నించి సాధించవలసిన ఒక అవసరం లేకపోయింది.

శాంతినారాయణ కథలన్నీ చదివాక ఈ కింది ప్రశ్నలు, అభిప్రాయాలు, వేదనలు పాఠకులందర్నీ డిస్టర్బ్ చేస్తాయి. ఆయన కథలు సాధించిన ప్రయోజనం ఇదే

"దేవుని దెగ్గర్నుంచీ అందరూ రైతును పీక్కుతినేవాళ్ళే"

"రైతు బతుకు రాత్రానూ శానా కష్టమయిపోతాంది"

"బాకీలు తీర్చడానికే కాలమంతా సరిపోతాంది. ఎప్పుడు గట్టెక్కుతామో యేమో"

"ఈ గడ్డమీద రైతు బతుకే ఇట్లయ్యింది"

"యాపంటపెట్టినా రైతుకు ఎదురుదెబ్బలేనప్పా"

"రైతు దెగ్గిరనుంచీ కొనే సరుకు యాదీ రేటుండదు రైతు కొన్నీకిపోతే మాత్తరం అన్నీ రేట్లే"

"పేదోని బతుకు పెద్దోని కళ్ళముందు నగుబాటయి పోయింది"

"పేదోన్ని పీక్కతినేదాంట్లో అందరూ వొగటే దొంగనాకొడుకులు"

"వ్యవసాయమంతా జూదమై పోతే ఇంకా యావల్లనప్పా బతికేది"

"బూములన్నీ అమ్ముకొని వూరికే కూలిపనికి తిరుక్కుండేది మేలు"

"పైనుండి కిందిదాకా పతివొక్కడూ కష్టాన్నిమించే లాబం పొందతాండాడు రైతు కష్టం మాత్తరం బూమిలోనే యింకిపోతాంది"

"పాలనాధికారం ఉండి కూడ దళితుడు పీడింపబడవలసిందేనా?"

"బహుశా ఈ భూమి పోరాటాలు ముగిసిన పిమ్మట నీటి పోరాటాలు ప్రారంభమవుతాయేమో"

"సొతంత్రమొచ్చి నలభైయాభైయేండ్లు గడిసినా ఇంకా ఇక్కడుండే రైతు వానపడకుండా గంపెత్తుకొని పోవలసిందేనా"

"ఈ గడ్డలో పుట్టిన పాపానికి రైతులు ఇట్లనే బతకల్లేమో"

"ఆధునికమయిన జీవితాన్ని అనుభవిస్తున్న మనిషిలో ఆధునికమయిన ఆలోచనలు ఎందుకు కలగడం లేదు"

"బతుకుతెరువు కోసం మగవాడు చేసేపనికి అడ్డంరాని కులం - ఆడది చేస్తే అడ్డం రావడమేమిటి?"

తెలుగు కథానికకు శాంతినారాయణ అనంతపురంనుండి నిస్సందేహంగా ఒక ఆశాకిరణం.

# దాదాహయాత్

♦ గుడిపాటి ♦

మనకు తెలియకుండా మన జీవితం ఊహించని రీతిలో మలుపులు తిరుగుతుంటుంది వేగంగా జరిగిపోతున్న మార్పులను తీరిగ్గా పరిశీలించే ఓపిక, తీరిక ఎవరికీ ఉండవు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకునేవారు కూడా అరుదు కాని ఆ మార్పులు సాహిత్యంలో ప్రతిఫలించినప్పుడు జీవితంలో మనకు తెలియకుండా జొరబడే విషయాల పట్ల ఎంత ఉపేక్షభావంతో ఉన్నామో తెలిసి షాక్ తింటాం. మన జీవితంలోనూ, మన ఉనికిని ఆవరించి ఉన్న పరిసరాల్లోనూ సంభవించే మార్పుల్ని కొత్తగా అప్పుడే చూసినట్లు ఫీలయి చలించిపోతాం. ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో ఇవాళ కథ ఈ పని చేస్తోంది ఈ దశాబ్దంలో కథా ప్రక్రియ విస్తృతమై నాలుగు చెరగులా తన ప్రభావాన్ని చూపుతోంది ఇందుకు వివిధ ప్రాంతాల రచయితలు చేస్తున్న దోహదం తక్కువదేమీ కాదు అయితే వీరిలో రాయలసీమ కథా రచయితలది ప్రత్యేక పాయ. వీరిలోనూ ఎవరి వైవిధ్యం వాళ్ళదే. ఎవరి బాణీవాళ్ళదే. రాయలసీమలోని ఈ తరం కథా రచయితల్లో దాదాహయత్‌ది విశిష్ట స్థానం. కథారచనలో ఆయనది విలక్షణ శైలి ఇతివృత్తానికి తగిన శిల్పాన్ని ఎంచుకొని కథ చెప్పడంలో మంచి నేర్పు ఉన్న రచయిత. 1983లో తొలిసారి రాసిన 'అహింస' అనే కథతోనే ఆయన మంచి కథా రచయితగా స్థిరపడ్డారు. ఇప్పటివరకు దాదాపు ముప్పయికి పైగా కథలు రాశారు. వస్తు శిల్పాల్లో వైవిధ్యం ఈ కథలన్నిటా కనిపిస్తుంది. రాయలసీమ ప్రాంతానికి చెందిన వాడయినా కేవలం ఆ ప్రాంత జీవిత చిత్రణకే ఆయన పరిమితం కాలేదు. ఆయన రాసిన కథల్లో వర్తమాన సామాజిక జీవితంలోని విభిన్న పార్శ్వాలు ఉన్నాయి.

దాదాహయత్ రాసిన తొలికథనే ఒక సంచలనం. ఈ కథలో ఇతివృత్తం అతి సామాన్యమైన అంశం. కాని మనలో చాలామంది పట్టించుకోని విషయం, బడికి వెళ్ళనని తల్లికి చెప్పి ఒకరోజు ఇంట్లోనే ఆటపాటలతో గడిపిన అయిదేళ్ళ పిల్లవాడి మనస్తత్వాన్నీ, ప్రవర్తననీ, ఆలోచనల తీరునీ మనోహరంగా ఈ కథలో చిత్రించారు. పైకి మామూలు కథగానే అనిపిస్తుంటుంది కాని స్వేచ్ఛాపూరిత వాతావరణం పిల్లల మానసిక వికాసానికీ, వారిలోని సృజనకీ ఎలా తోడ్పడు తుందో ఈ కథలో అంతర్లీనంగా ఇమిడి ఉంటుంది సున్నితమైన ఈ అంశాన్ని అసాధారణమైన కథన రీతిలో వ్యక్తం చేశారు. ఒక సాదా సీదా అంశాన్ని ఇంత సున్నితంగా చెప్పిన ఈ రచయిత అసాధారణమైన అంశాన్ని తీసుకొని కూడా ఇదే రీతిలో హృదయాలను హత్తుకునేలా కథ చెప్పగలరనడానికి ఆయన రాసిన మరో కథ 'మురళి వూదే పాపడు' తార్కాణం. పర్యావరణ విధ్వంసం మానవాళికి

తెచ్చిపెట్టే విపత్తును, ప్రకృతిని ప్రేమించలేని మనుషుల మధ్య రాతిగోడలు మొలవడాన్ని ఈ కథలో చూస్తాం ఆస్తులు, అంతస్తులు పెంచుకొడానికి పోటీపడే క్రమంలో పర్యావరణానికి జరుగుతున్న నష్టం పట్ల స్పృహను కలిగించే ఈ కథను ఆయన అద్భుతమైన శిల్పంతో మలిచారు ఈ కథలోనూ ఇద్దరే పిల్లలే జానపద కథనరీతిని అనుసరించి ఆయన ఈ కథ రాశారు ఈవిధంగా ఎంతో బరువైన ఇతివృత్తాన్ని తీసుకొని కూడా మనస్సును కదిలించే విధంగా కథ చెప్పడంలో చూపిన నైపుణ్యమే ఆయన శిల్పంలోని విశిష్టత ఇదే రీతిన శిల్పపరమైన నైపుణ్యం 'మసీదు పావురం' కథలోనూ చూడవచ్చు మతఘర్షణల నేపథ్యంలో వచ్చిన కథ యిది మత ఘర్షణలు, కర్ఫ్యూల మధ్య బీభత్సపూరిత జీవనదృశ్యాన్ని రూపు గట్టించడంలో రచయిత ఎంచుకున్న శిల్పం ప్రత్యేక తరహాలో ఉంది మసీదు మీద కాపురం చేసే ఒక పావురం స్వగతంలో ఈ కథ నడిచింది ఈ కథలో మసీదులో మకాం ఉండే పావురాల జీవన వైభవాన్ని కూడా మన ముందు దృశ్యాలు దృశ్యాలుగా పరుస్తారు రచయిత. మతకల్లోలాలతో దెబ్బతిన్న నగర స్వరూపాన్ని పావురం దృష్టిలోంచి చూపిస్తారు మతం పేరుతో పోట్లాడుకుంటూ మనుషులు ఎంత అమానవీయంగా ప్రవర్తిస్తున్నారో చాలా సింబాలిక్‌గా చెప్పారు ఈ విధంగా సీరియస్ విషయాలను కూడా కథలుగా మలిచి చెప్పడంలో రచయిత చూపే శ్రద్ధ ఆయన రాసిన చాలా కథల్లో కనిపిస్తుంది

రాయలసీమ ప్రాంతానికి చెందిన దాదాహయత్ ఆ ప్రాంత జీవనాన్ని అక్కడి ఘర్షణలను కూడా చాలా కథల్లో చిత్రించారు. గుక్కెడు నీళ్ళు లేక ప్రాణాలు విడిచిన ఒక ముసలమ్మ హృదయ విదారక గాథకు చిత్రిక ఆయన రాసిన 'గుక్కెడు నీళ్లు' నీళ్ళ కోసం ఆరాటం రాయలసీమ ప్రజల జీవితంలో ఒక భాగం నీళ్ళు లేక తల్లడిల్లిపోయే అనుభవం ఎంత దారుణంగా ఉంటుందో ఆ ప్రాంతం వారికి బాగా తెలుసు రాయలసీమ మాండలికంలో ఆయన ఈ కథను రాశారు నీళ్ళు తెమ్మని నయానా భయానా మనవరాలికి చెప్పి ఒప్పించడానికి ఒక ముసలమ్మ పడేపాట్లు ఏవిధంగా ఉంటాయో ఈ కథలో చూసి చలించిపోతాం. అర్ధరాత్రి ముసలమ్మ దాహంతో అల్లాడిపోతుంటే తాగడానికి కొద్దిగా నీళ్ళు యివ్వమని మనవరాలు ఇంటింటికి వెళ్ళి అడుగుతుంది అయినా ఎవరూ గుక్కెడు నీళ్ళు ఇవ్వరు ఆ గుక్కెడు నీళ్ళు లేకనే ఆ ముసలమ్మ ప్రాణాలు విడుస్తుంది తన పొరుగునున్న మనిషి నీళ్ళు లేక చావు బతుకుల్లో ఉన్నాదన్నా ఎవరూ చలించలేదంటే నీటి కరువు ఎంత తీవ్రంగా వుందో అర్థం చేసుకోవచ్చు. 'నీళ్ళేకదా బంగారమా' అని నాగరికులు అనుకోవచ్చు కాని బంగారమయినా వదులుకుంటారేమోగానీ నీళ్ళను వదులుకోలేని దారుణస్థితి రాయలసీమలో ఇప్పటికీ అనేక గ్రామాల్లో నెలకొని వుంది ఈ వాస్తవాన్ని ఆవిష్కరించిన కథ ఇది.

నీళ్ళ కరువు తీవ్రత అలా వుంటే పెన్నానదికి వచ్చే వరదలు, అకాల వర్షం ఎన్నో కుటుంబాల జీవితాల్ని శాపగ్రస్తం చేస్తున్న తీరు 'ఎడారి సేద్యం' కథలో చిత్రితమయింది ఈ కథలోనూ రాయలసీమ జీవద్భాష తొణికిస లాడుతుంది. వ్యవసాయాన్ని నమ్ముకొని జీవితంపై ఎన్నో ఆశలు పెంచుకున్న రైతు కుటుంబం

అనుకోని పరిణామాలతో దెబ్బతినడం ఈ కథలో చూస్తాం పెన్నానది ఏట్లో కర్బూజా తోటలు పెంచుతూ ఆ పంటపై ఆధారపడి జీవిస్తుంది ఒక రైతు కుటుంబం. కాని అనుకోకుండా భారీ వర్షాలు కురిసి పంటంతా వరదల పాలవుతుంది. అప్పుడు ఆ పంటమీదనే ఆశలు పెంచుకున్న కుటుంబం భవిష్యత్తు ఎంత భయానకంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు

రాయలసీమలోని సంక్లిష్టమైన జీవితానికి సంబంధించిన విభిన్న పార్శ్వాలను చిత్రిస్తూ 'ఎల్లువ', 'ఏటి ఒడ్డు చేపలు', 'వారసత్వం' వంటి కథలను దాదాహయత్ రాశారు 'ఎల్లువ' కథ - రాయలసీమ పల్లెల్లో తరుచుగా జరిగే సంఘర్షణల్లోని విభిన్న వైరుధ్యాలకు మంచి వ్యక్తీకరణ పల్లెల్లో మానవ సంబంధాలు ఏరకంగా ఉంటాయో ఈ కథ బాగా రికార్డు చేసింది కరణాలు, రెడ్డిలు, మాలలు, గొల్లవాళ్ళ మధ్య ఉండే సంబంధాలు ఎప్పుడు ఏరకంగా మారిపోతాయో రచయిత ఈ కథలో స్పష్టంగా చూపారు గొల్ల కులానికి చెందిన రైతుకు వ్యతిరేకంగా మారిన కరణం, అదే రైతును మాలలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టి, అతడి భూమిని ఆక్రమించుకోజూసే రెడ్డి భూస్వామి - కుల సంబంధాల్లోని వైరుధ్యాలకు ప్రతీకలు బిసిలకు, ఎస్సీలకు మధ్య తగాదాలు రెచ్చగొడుతూ లబ్ది పొంద జూసే అగ్రకులాల వారి ఎత్తులు పైకి కనిపించని రీతిలో ఎంత నిగూఢంగా ఉంటాయో ఈ కథను చదివితే తెలుస్తుంది. అంతేగాదు, న్యాయంకోసం కోర్టుల చుట్టూ తిరిగే మామూలు రైతుల పాట్లు ఏరకంగా ఉంటాయో కూడా ఈ కథ చిత్రించింది

సీమలో ఫ్యాక్షన్ లీడర్స్ తమ ప్రయోజనాల కోసం సామాన్యులను, ముఖ్యంగా దళితులను బలి చేస్తారనే వాస్తవాన్ని తెలియజెప్పే కథ 'సెగమంటలు' ఈ కథలో - ఎన్నికల్లో రెండు గ్రూపుల నాయకులు హరిజనుల ఓట్లు కొనే క్రమంలోనూ, దొంగ ఓట్లు వేయించడంలోనూ ఎంతటి దారుణానికి ఒడిగట్టడానికి అయినా సిద్ధపడతారు ఈ ఫ్యాక్షన్స్ రాజకీయాల చిచ్చు ముఖ్యంగా దళితుల జీవితాలనే ఛిన్నాభిన్నం చేయడం గమనార్హం.

రాయలసీమలోని హింసాత్మక రాజకీయాలు మామూలు జీవితాన్ని గడుపుతూ పొట్టపోసుకునేవారి బతుకుల్లో సృష్టించే బీభత్సం ఏవిధంగా ఉంటుందో వ్యక్తీకరించిన కథ 'ఏటి ఒడ్డు చేపలు'. సీమలో రెండు గ్రూపులు తగాదా పడినప్పుడు, దానికి సంబంధంలేని వారు కూడా ఏ విధంగా విక్టిమ్స్ అవుతారో, వారు అనివార్యంగా ఈ ఘర్షణల్లోకి ఎలా లాగబడతారో తెలియ జేస్తుంది కథ జీవితంలో తమ మానాన తాము ఏదోరకంగా బతుకు గడపాలనుకున్నా అది సులువైన విషయం కాకపోవడం, కాకతాళీయంగా జీవితాల్లో పెనుమార్పులు సంభవించడం చూసి మామూలు మనిషి షాక్ తింటాడు కాని రాయలసీమలో మాత్రం జీవితమంటే ఇలానే ఉంటుందని ఈ కథ చదివితే తెలుస్తుంది నిజానికి రాయలసీలో ఈ సంక్లిష్టమైన జీవితం ఉచ్చుల్లోంచి బయటపడడం ఏ ఒక్కరి వ్యక్తిగత నేర్పు వల్లో అయ్యే పనికాదు అందుకు సామూహిక చర్య అవసరం ఆ సంగతి అలా ఉంచితే సీమ జీవితంలోని వైరుధ్యాల తీరుతెన్నులకు సంబంధించిన స్పృహను అందించడంలో దాదాహయత్ రాసిన కథలు సక్సెస్ అవుతాయి.

రాయలసీమలోని బాంబుల సంస్కృతి ఈ తరం పిల్లలపై సైతం ఏ రకమైన ప్రభావం చూపుతుందో ఆయన రాసిన 'వారసత్వం' కథ చక్కగా వ్యక్తీకరిస్తుంది పిల్లల చేతనే బాంబులు తెప్పించడం, వాటి ఉపయోగాల గురించి మాట్లాడటం వల్ల చివరకు చిన్నతనంలోనే పగ, ప్రతీకార వాంఛలతో బాంబులను చేత బట్టేందుకు సిద్ధపడే ఒక రెడ్డి పిల్లవాడిని చూసి ఆశ్చర్యపోవడం పాఠకుడి వంతవుతుంది

కేవలం తమ ప్రాంత జీవితంలోని విభిన్న పార్శ్వాలను చూపడం వరకే దాదాహయత్ పరిమితం కాలేదు. జీవితంలోని వైరుధ్యాలను చిత్రిస్తూ కూడా ఆయన అద్భుతమైన కథలు రాశారు 'ప్రసూతి వార్డు' కథ ఇందుకు ప్రబల సాక్ష్యం ఈ కథలో కాన్పు కోసం ఆస్పత్రిలో చేరిన అరవిందకు అక్కడి వాతావరణం పట్ల ఏవగింపు కలుగుతుంది ఆడపిల్ల పుట్టిందంటే విసుగు ప్రదర్శించే అత్తలు, భర్తలు, తండ్రులను చూసి ఆశ్చర్యపోతుంది. పుట్టబోయేది ఆడపిల్ల అని స్కానింగ్ రిపోర్టులో తెలిసి కడుపు తీయించుకునే ఆడవాళ్ళను చూసి విలవిలలాడిపోతుంది. అలాంటి అరవింద ఆడపిల్లను కంటే భర్త కూడా నిరుత్సాహపడతాడు. వచ్చినవాళ్ళు కూడా ఆడపిల్లే కదా అని పెదవి విరుస్తారు అయితే భర్త తిరస్కారం, ఊరినుంచి వారం దాకా అతను రాకపోవడం ఆమెకు కోపం తెప్పిస్తుంది వారం తర్వాత వచ్చిన భర్తతో 'నా బిడ్డను సాక్కోగలను మీరు వెళ్ళి రండి'అని ముఖంమీదే అంటుంది అయితే అతనికి మగపిల్లవాడయితే బావుండనే కోరిక ఉంటుంది గానీ, ఆడపిల్లను తన బిడ్డ కాదనుకునే మనస్తత్వం కాదు అందుకు ఆడపిల్ల పుట్టినందుకు తనకేం బాధలేదని చెబుతాడు. మగపిల్లవాడితో సమానంగా పాపను కూడా పెంచుతానని అతడి చేత మాట తీసుకుంటుంది అరవింద. ఆ తర్వాతనే పాపను చూపిస్తుంది. ఈ కథను ఇలా ముగించడంలో రచయిత చాలా సంయమనం చూపించారు. ఆడపిల్ల పట్ల సమాజంలో వివక్ష ఉంది. కాని మగ పిల్లవాడు పుట్టాలని కోరుకునే వాళ్ళంతా ఆడపిల్లలను వ్యతిరేకిస్తారనే సూత్రీకరణ నిజం కాదు రచయిత ఈ వైరుధ్యాన్ని అర్థం చేసుకోగలిగాడు కాబట్టే ఈ కథ అర్థవంతంగా ఉంది.

'రెండణాల గుగ్గిళ్ళు', 'ఆశీర్వాదం', 'కోరిక', 'ప్రదర్శన' కథలు మరో కోణంలోంచి జీవితాన్ని దర్శింపజేస్తాయి. 'రెండణాల గుగ్గిళ్ళు' అమ్ముకునే ముసలమ్మ జీవితాన్ని ఒక లాయర్ దృష్టికోణంలోంచి దర్శింప జేశారు రచయిత. ఆ ముసలామె ఎనభై ఏళ్ళ వయసులోనూ గుగ్గిళ్ళు అమ్ముకుంటూ బతుకుతూ కొడుకు బాగుకోసం తపిస్తుంటుంది. ఆమె చనిపోయాక మాత్రం తనకోసం తల్లి బంగారం దాచి ఇచ్చిందేమోనని లాయర్ దగ్గరకొచ్చి గొడవ పడతాడు ఆమె కొడుకు మానవ సంబంధాల్లో ఉండాల్సిన ఆర్తి కొరవడుతున్న వాస్తవానికి ఈ కథ సజీవ చిత్రణ. విలువల విధ్వంసాన్ని రూపుగట్టించిన కథ 'ఆశీర్వాదం'. చదువుకునే రోజుల్లో కట్నం గురించి, పెళ్ళిళ్ళ గురించి ఇచ్చే ఉపన్యాసాల్లోని డొల్లతనం జీవితంలో ఆచరణలోకి వచ్చినప్పుడు బయట పడుతుంది. జీవితం దగ్గరికొచ్చేసరికి ఆదర్శాలను అతిసునాయాసంగా వదిలి వేయడం, వాటిని ఒక వయసులో ఉండే ఆవేశంగా కొట్టిపడేయడం చాలామంది నైజం ఈ జీవన

వాస్తవాన్ని ప్రతిఫలించిన కథ ఇది గాంధీ ఆశయాలను తూట్లు పొడుస్తూ ఆయన విగ్రహాలు, పార్కులు కట్టించడం లోని కుటిల నీతిని 'ప్రదర్శన' కథలో బలంగా చెప్పారు. ఈ కథలో మునిసిపల్ ఛైర్మన్ దళితుల గుడిసెలను బలవంతంగా ఖాళీచేయించి ఆ స్థలంలో గాంధీ విగ్రహాన్ని, పార్కును కట్టిస్తాడు ఆ పట్టణంలోని ఇతర కులాలవాళ్ళు, మధ్యతరగతి కుటుంబాలవారు తమకు పార్కు ఏర్పడి నందుకు సంతోషిస్తారు కాని నిరాశ్రయులై దళితుల గురించి ఎవరూ ఆలోచించరు అందరూ గాంధీకి పూలమాలలు వేసి, ఆయన గురించి గొప్పగా మాట్లాడేవాళ్ళేగానీ ఆయన ఆదరించిన దళితుల గురించి మాత్రం పట్టించుకోరు మరి ఇది ఏరకమైన ఆదర్శమో పాఠకుల ఆలోచనలకే వదిలివేస్తారు రచయిత

దాదాహయత్ కథా రచనలో ముఖ్యంగా శిల్పం పట్ల అమిత శ్రద్ధ కన బరుస్తారు ఏం చెప్పాలన్నదే కాదు, ఎలా చెప్పాలనేది కూడా ఆయన సీరియస్‌గా పట్టించుకుంటారనేది ఈ కథలు చదివాక అనిపిస్తుంది తను ఒక విషయాన్ని ఎలా చెబితే పాఠకుడు సీరియస్‌గా తీసుకుంటాడనే విషయం పట్ల ఆయనకు సరైన అవగాహన ఉంది కనుకనే రాయలసీమ జీవితాన్ని, అక్కడి సంఘర్షణను చిత్రించేటప్పుడు మాండలికంలో కథా రచన సాగించారు. అక్కడి యాసను, భాషను, అందులోని సొగసులన్నిటిని తన కథల్లోకి పట్టుకొచ్చారు కథా కథనంలో ఆ భాషలోని సౌందర్యం ప్రతిఫలిస్తుంది. అదే విధంగా మత ఘర్షణలు, పర్యావరణ విధ్వంసం వంటి సీరియస్ విషయాలను తీసుకొని కథలు రాసినప్పుడు పౌరాణిక గాథలను, జానపద కథన రీతులను అనుసరించి రాశారు. విషయంలో సీరియస్‌నెస్ ఉన్నా హృదయాలను హత్తుకునే రీతిలో భావాలను వ్యక్తం చేస్తూ ఈ కథలను మలిచారు. ఈ రకంగా శిల్పం పట్ల శ్రద్ధ చూపే అరుదయిన కథా రచయిత దాదాహయత్. జీవన వాస్తవాలను ఆయన చూసే దృక్కోణంలో కూడా విలక్షణత్వం ఉంది. సమస్యలను చిత్రించడంలోనే వాటికి గల మూలాలను కథలో ఆవిష్కరింప జేస్తారు తనే పరిష్కారాలు చూపడం, ప్రబోధాలు చేయడం వంటి పనులకు పూనుకోరు కొడవటిగంటి కుటుంబరావు ఒక సందర్భంలో "సరి అయిన సాహిత్యం చదివేవారి భావాలను ఒక మార్గంగా నడపాలిగాని ఒక గమ్యస్థానం చేర్చి వదలరాదు" అంటారు. అందుకు తగిన విధంగా ఉంటాయి దాదాహయత్ కథలు. ఆయన కథలు చదివాక కచ్చితంగా పాఠకుడు ఆలోచిస్తాడు. ఆ కథలు, అందులోని పాత్రలు, ఆ పాత్రల మనోగతాలు పాఠకులను వెన్నాడుతాయి. దాదాహయత్ కథలు ఇందుకే గుర్తుండిపోతాయి. చాలా మామూలుగా అనిపించే ఇతివృత్తాలను తీసుకొని అద్భుతమైన కథలుగా మలిచే ఆయన రచనా సంవిధానమే రాయలసీమ రచయితల్లో ఆయనను విశిష్ట కథకునిగా నిలబెట్టింది.

# వి.ఆర్. రాసాని

♦ *రాచపాళెం చంద్రశేఖరరెడ్డి* ♦

నలభై నాలుగేళ్ళ వయసుగల డా॥ వి.ఆర్ రాసాని (రాసాని వెంకట్రామయ్య) చిత్తూరు జిల్లాలో ఒక సాహితీ యాక్టివిస్టు. ఈయన కవి, కథా నవలా నాటక రచయిత, నాటక ప్రయోక్త. అంతేగాక అనేక సాహితీ సాంస్కృతిక సంస్థలలో, ప్రత్యేకించి "మధురాంతకం రాజారం సాహిత్యసంస్థ"లో ప్రధాన బాధ్యతలు వహిస్తున్నారు. చిత్తూరు జిల్లాలోని అనేకమంది ప్రసిద్ధ రచయితల్లాగా రాసాని కూడా జిల్లా పడమటి ప్రాంతానికి చెందినవారే. చిత్తూరు జిల్లా, పులిచెర్లమండలంలోని 'కురవపల్లె' రాసాని ఊరు కింది మధ్యతరగతి వృత్తి కులానికి చెందిన రాసాని సమకాలీన సామాజిక వాస్తవికతను జానపద సాంస్కృతిక నేపథ్యంలో సరళమైన కథా సంవిధానంతో, సుందరమైన చిత్తూరు జిల్లా స్థానిక భాషలో చిత్రిస్తూ వందదాకా కథలు రాశారు ఎల్లమ్మ, సిద్ధయ్య అనే శ్రామిక దంపతుల కుమారుడైన రాసాని కథల్లో మానవత వాస్తవికత ప్రధానంగా కనిపిస్తాయి స్వభావతః జానపదుడైన రాసాని జానపద సాహిత్యంమీద పరిశోధన చేశారు. ఆయన కథా రచనమీద ఆయన జానపద విజ్ఞానం ప్రభావం అపారంగా ఉంది ఒక్కోసారి అది రచయితను లౌల్యానికి గురి చేసినట్లు కూడా కనిపిస్తుంది

రాసాని రెండున్నర దశాబ్దాల నుంచి కథలు రాస్తున్నారు. ఈయన మీద మధురాంతకం రాజారాం, కలువకొలను సదానంద, డా పి. కేశవరెడ్డివంటి సీనియర్ రచయితల ప్రభావం ఉంది రాసానికంటూ ఒక మౌలికమైన చట్రమూ ఉంది.

1977లో 'మధురక్షణం' అనే తన తొలికథను రాశారు రాసాని. ఔత్సాహిక కథకులకు సహజమైన కాకతాళీయతను నాటకీయతగా మర్చే లక్షణం రాసాని తొలి కథలోనూ కనిపిస్తుంది. రవి మిత్రునితో కలిసి పెళ్ళి చూపులకు బస్సులో పోతూ చూసిన అమ్మాయే పెళ్ళి కూతురిగా వస్తుంది. ఆమె రవికి భార్య అవుతుంది అతని షష్ఠిపూర్తి సమయంలో ఆయన తన దాంపత్య జీవితాన్ని సింహావలోకనం చేసుకునే పద్ధతిలో ఈ కథ చెప్పబడింది. ఈ కథ తర్వాత రాసాని పదేళ్ళదాకా ఏ కథా రాసినట్లు లేదు. మళ్ళీ 1988నుంచి ఆయన కథా రచన కొనసాగింది. నేల రాలిన వసంతం, శిల్ప సంగీతం, భయం అనే మూడు కథల్ని 1988, 89లలో చైతన్య స్రవంతి శిల్పంలో రాసే ప్రయత్నం చేశారు. మొదటిది కోకిలన్న అనే అంధుని కథ. మేకలు మేపుతూ కోకిల అరుపులకు తన్మయత్వం చెంది దాన్ని చూడాలని ప్రయత్నించి బావిగట్టున కంప చెట్లమీద పడి కళ్ళు పోగొట్టుకున్న పదేళ్ళ కుర్రాడు, అప్పటినుంచి

కోకిలపైన కోపాన్ని పెంచుకుని అది అరచిన చోటికల్లా పోయి దాన్ని రాళ్ళతో కొట్టడానికి ప్రయత్నిస్తూ ఒక మామిడితోటలోని బావిలో పడి చనిపోతాడు. అదే సమయంలో కాకుల దెబ్బకు మరణించిన ఒక కోకిల అతని పక్కనే పడి చనిపోతుంది. 'శిల్ప సంగీతం' ఒక స్వాప్నికుడి విపరీత ఆలోచనకు ప్రతిబింబం. ఒక భావుకుడు ఒక పూలతోటలో ఉన్న ఒక అందమైన శిల్ప సుందరిని చూస్తాడు ఆ శిల కరిగి సుందరిగా మారిపోయి అతనితో వెన్నెల రాత్రుల్లో విహరిస్తుంది. ఆమె చివరికి అతని కామ దాహానికి బలైపోతుంది ఆఖరికి ఆమె మామూలు రాతి విగ్రహంగా మారిపోతుంది. ఇదంతా ఆ యువకుని స్వప్నంగా సంవిధానం చేశారు రాసాని. 'భయం' ఒక ఆత్మన్యూనత గల వ్యక్తి జీవితం విషాదాంతం కావడాన్ని చిత్రించింది.

ఈ కథల తర్వాత రాసాని వాస్తవిక జీవిత చిత్రణకుపక్రమించాడు ఊహల్ని వదిలిపెట్టి ఉన్న జీవితాన్ని రాయడానికి పూనుకున్నాడరు. కాకతాళీయతను విస్మరించి సంభవనీయతకు పట్టం కట్టారు. 1990 తర్వాత రాసాని కంటి ముందర కనిపించే వాస్తవాలను మలుచు కుంటూ అసంఖ్యాకంగా కథలు రాశారు. 1989 "దయ్యం చెట్టు" పేరుతో గ్రామీణ మూఢనమ్మకాల గుట్టురట్టు చేసే కథను రాశారు రాసాని. కాటేరు, మిత్తవ వంటి భయాలను ప్రజలలో కలిగించి అమ్మాయిల్ని నాశనం చేస్తూ ప్రశ్నించిన వాళ్ళను చంపుతున్న 'గ్రామ పెద్దలు' గంగరాజు అనే ఒక మేకల కాపరి చేతిలో చావడం ఈ కథ. కథతో రాసాని వస్తు శిల్పాలలో వాస్తవిక మార్గంలోకి ప్రవేశించారు ఈయన రాసిన కథల్లో అత్యధికం గ్రామీణ, గిరిజన జీవిత వాస్తవికతా ప్రతిబింబాలే. కాలం మారుతున్నా మారని భారతీయ ఫ్యూడల్ గ్రామాల స్వరూప స్వభావాలు ఈయన కథల్లో స్వస్వరూపంతో కనిపిస్తాయి

స్వాతంత్ర్యం వచ్చి దశాబ్దం గడిచిపోయినా భారతీయ రైతుల్ని ప్రత్యేకించి రాయలసీమ రైతుల్ని కరువు బారినుండి తప్పించలేకపోయిన రాజకీయ వ్యవస్థలో ఆ రైతుల జీవితాలు గాలిలో దీపాల్లాగా ఎలా ఆరిపోతున్నాయో 'అన్నే కారి జల' (2000)కథ విస్పృతంగా చిత్రించింది. ఈ కథలోని మునెప్ప చిత్తూరు జిల్లా మెట్ట ప్రాంతంలో రైతువర్గానికి ప్రతినిధి టమోటా పంటను నమ్ముకుని సీమరైతు కుళ్ళిపోతున్న తీరును టమోటా చెట్టుకు రైతుకు మధ్య సంభాషణా రూపంలో ఆసక్తికరంగా ప్రదర్శించారు రాసాని. మట్టిని, పంటను ప్రేమించి వాటితో జీవితాన్ని ముడిపెట్టుకున్న మునెప్పను "మాయదారి పంట, మాయలమారి సేద్దెం" అనుకునే వైరాగ్యదశకు చేరుస్తున్న తీరు ఈ కథలో ప్రతిఫలించింది. స్వర్ణ భారతి, స్వర్ణాంధ్ర నామ జపధారులు ఇలాంటి కథలలోని వాస్తవాలను గ్రహించాలి. అయితే ఈ కథలో ప్రాకృతిక ఆర్థిక పార్శ్వమున్నంత సమగ్రంగా, రాజకీయ పార్శ్వం లేదు. "బతుకే వొక జలజూదంగా మారిపోయిండే ఈ గడ్డన సొసంత్రంగా సచ్చిపోయే అదురుష్టం గూడా లేకపోయ" అని మునెప్పలాంటి శ్రామిక రైతు అనుకునే స్థితిని ఈ వ్యవస్థ కల్పిస్తున్నది. సాహిత్యం సామాజిక పరిణామాలను, వాటి పర్యవసానాలను చిత్రించే బాధ్యతకు ఈ కథ మంచి ఉదాహరణ

కరువు చిన్న పెద్ద రైతుల్నే కాక వీధి నాటకాలాడుతూ స్వచ్ఛందంగా జీవించే వాళ్ళను కూడతీసి, వాళ్ళ సాంస్కృతిక వాస్తవికత నుండి వాళ్ళను దూరం చేసి కూలీలుగా అడుకునే వాళ్ళుగా మారుస్తున్న వాస్తవాన్ని రాసాని 'పగటితారలు' కథలో చిత్రించారు మునుస్వామిలాంటి సంచారభారతి కళాకారుల జీవిత విషాద పరిణామాలు చిత్తూరు జిల్లాలో స్పష్టంగా కనిపిస్తాయి ఈ కథలోని బ్రహ్మయ్య మాటల్లో కరువు భారత కళాకారుల్ని అజ్ఞాతవాసం లోకి పంపించేసింది

రైతు జీవితాన్ని 'తాలుగింజలు'గా భావించి రాసిన కథ కూడా రాసాని కథల్లో గట్టిది తాలుగింజ అంటే పండీ పండని గింజ ఇది కూడా, రాజకీయ పార్శ్వం లోపించినా, సీమరైతు జూదంలాంటి వ్యవసాయంలోపడి కడతేరి పోవడాన్ని ప్రతిబింబించింది ఈ పథంలో వర్ణన అధికమైంది. అయినా అది రైతు జీవితంలోని దైన్యాన్ని బలంగా చెప్పడానికి ఉపయోగపడింది ఈ కథలో సిద్దప్ప జీవచ్ఛవాలవంటి బతుకు వెళ్ళదీస్తున్న సీమ రైతులకు ప్రతినిధి

గ్రామం అంటే రైతులేకాదు అనేక వృత్తుల వాళ్ళు కూడా ఉంటారు వాళ్ళమీద ఇటీవల కథలు అధికంగా వస్తున్నాయి గ్రామాలు స్వర్గతుల్యాలు అనుకునేవాళ్ళకు కొదవలేదు అయితే భారతీయ గ్రామం అన్ని అసమానతలకు కేంద్రమన్న వాస్తవాన్ని గుర్తించిన రచయితలూ ఉన్నారు రాసాని గ్రామంలో అగ్రవర్ణ భూస్వాముల పెత్తనం కింద నలిగిపోయే దళితులను (హోమం, వీరజాటి) వడ్రంగి(కొలిమి) వడ్డెర (మాత) సంచార జీవులైన నక్కలోళ్ళ (ఎన్‌కౌంటర్) వంటి వృత్తుల వాళ్ళను తన కథల్లో పరిచయం చేశారు. సమాజంలోని అట్టడుగు వర్గ కుల ప్రజల జీవిత వాస్తవాల మీద రాసానికి గల అవగాహన ఈ కథలు రుజువు చేస్తున్నాయి. గ్రామంలో సహజ వనరులైన చెరువుల మీద అగ్రవర్ణ భూస్వాముల పెత్తనాన్ని సహించలేక తమను అంటరాని వాళ్ళుగా చూపడానికి సంక్రమించిన డప్పులు, కొమ్ములు వంటి సాధనాలనన్నిటిని అగ్నిలో వేసి కాల్చి బూడిద చేసిన దళితుల తిరుగుబాటును 'హోమం' కథలో చిత్రించారు రాసాని ఇది 'యజ్ఞం' కథలో సీతారాముని 'ఊరబావి' కథలో చిదంబరం భార్య తిరుగుబాటు వంటిది దీనికి భిన్నమైంది 'వీరజాటి' కథ. నెత్తిమీద గుడి గంగమ్మను మోస్తూ ప్రదర్శనలిచ్చే దళిత కోటప్ప పొలంపైన ఊరి సర్పంచి కన్నేసి సొంతం చేసుకుంటే, ఏమీ చెయ్యలేని కోటప్ప భూస్వామి ఇంటి ముందే వీరజాటితో తనను తీవ్రాతి తీవ్రంగా కొట్టుకుని చనిపోయిన తీరుకు ఈ కథ ప్రతిబింబం. కోటప్ప జాటితో తీవ్రంగా కొట్టుకోవడం ఊరి ప్రజలకు వినోదంగా కనిపిస్తూనే, అది కోటప్ప భూస్వామి మీద తెలిపే నిరసనగా అయినట్లు కథను మలచడం ఈ కథలోని శిల్పరీతి వ్యవసాయ అవసరాలకు పనిముట్లు చేసిచ్చే కమ్మరి బొజ్జన్న గ్రామంలో రాజకీయాధిపత్యం నెరపే భూస్వాముల దుర్మార్గానికి బలైపోయి జైలుకు వెళ్ళడాన్ని 'కొలిమి' కథ ప్రదర్శించింది నిరంతరం నిప్పుతో సహజీవనం చేసే బొజ్జన్న వంటి కమ్మరివాళ్ళ జీవన వాస్తవాలను రచయిత చాలా వివరాలతో చిత్రించి కథకు సమగ్రత తెచ్చారు "మన బతుకే వొక కొలిమి లాంటిదే. అది ఎప్పుడూ మండతా

ఉండాల్సిందే" అన్న బొజ్జన్న మాటలు వాళ్ళ బతుకు తీరుకు నిర్వచనాలు ఆధునిక భారతీయ సమాజంలో ఇంకా కొనసాగుతున్న ఫ్యూడల్ అవశేషం బసివిని వ్యవస్థ 'మాత' కథలో ఒకవడ్డెర అమ్మాయిని బసివినిని చెయ్యడానికి ప్రయత్నిస్తే ఆ ఊరి సర్పంచి కూతురు ఆమె స్థానంలో కూర్చుని ప్రతిఘటిస్తుంది ఈ కథా నిర్మాణంలో కొంత 'అనూహ్యత' ఉన్నా అది ప్రతిఘటనకు తోడ్పడింది అగ్రవర్ణ పురుషులు క్రింది వర్గాల స్త్రీలను బసివిని అనే సాంస్కృతిక సంప్రదాయంతో లొంగదీసుకునే దురాచారాన్ని రాసాని సహజంగానే తన వర్ణనాత్మక కథన రీతిలో చక్కగా ప్రదర్శించి చూపారు తమకంటూ కొంత భూమి కావాలనుకున్న నక్కలోళ్ళ గంగజ్జును, భూస్వామి 'ఎన్‌కౌంటర్' చేయించిన దుర్మార్గాన్ని 'ఎన్‌కౌంటర్' కథలో చిత్రించిన రాసాని రాజ్యం భూస్వామి పక్షం వహించిన తీరును ఆసక్తికరంగా నిరూపించారు తుపాకి కథలో.

తక్కిన జిల్లాలతో పోల్చి చూచినప్పుడు రాయలసీమలో చిత్తూరు జిల్లాలో ముఠా కక్షలు గొడవలు చాలా తక్కువ ఆ జిల్లాలో అప్పుడప్పుడు భూస్వాముల మధ్య జరిగే ఘర్షణలు సామాజిక సామరస్యాన్ని దెబ్బతియ్యడాన్ని, ఆ ఘర్షణల్లో సామాన్యులు బలైపోవడాన్ని రాసాని మెరవణి కథల్లో చిత్రించారు. పంచాయితీ ఎన్నికల్లో ఒక గ్రామం శీనప్ప రామచంద్రయ్య వర్గాలుగా (కులం ప్రాతిపదికన) విడిపోయి, శ్రీరామ నవమి ఊరేగింపు సందర్భంగా ఏ వర్గానికి చెందని రంగన్న చిన్న కొడుకు చనిపోవడం, 'మెరవణి' కథ రంగన్న భార్య సాలమ్మ "ఏ వరణమైతే ఏవింరా? అందురూ బెతికేది ఈ భూమిపైన్నే అందరూ జీవనం గడపతావుండేదీ జానెడు పొట్ట కోసరంమే. చీంమీముండలమొయ్యా ఇది తెలీక కొట్లాడుకోని సస్తారంట్రా.. తు పు" అని అసహ్యించుకోవడాన్ని ముఠా నాయకులు ఆలోచించుకోవాలి. రాయల సీమలోని పాలకవర్గ కులాలు చిన్న చిన్న విషయాలకే కక్షలు పెంచుకొని, వాటికి విశ్వరూపం కల్పించి ఊళ్ళను వల్లకాడులుగా మార్చుతున్న అనాగరిక సంస్కృతికి ప్రతిఫలనం 'శనీస్వరుడు'. ఇది కడపజిల్లా నేపథ్యంగా నడచిన కథ.

రాసాని కథల్లో స్త్రీల మీద రాసినవి స్త్రీవాద కథా సాహిత్య వికాసానికి దోహదం చేశాయి కింది తరగతి జీవితాల్లో తాగుడు సృష్టించే కల్లోలాన్ని రాసాని మద్యపాన వ్యతిరేకోద్యమ కాలంలో "సురసాగర మథనం" కథలో అక్షరీకరించారు. గాంధి పుట్టిన దేశంలో ఆయన వారసులుగా చెప్పుకునే పాలకులు ప్రజల బలహీనతల్ని పెంచి పోషించే దుర్మార్గాన్ని రాసాని స్పష్టం చేశారు తాగుబోతు భర్తల వల్ల మహిళలు, కుటుంబాలు విచ్ఛిన్నం కావడాన్ని ఈ కథలో బాగా చెప్పగలిగారు రచయిత "అమ్మా! అమ్మా! నన్ను చంపేయవూ" అనే కథ చైతన్య స్రవంతి శిల్పంలో స్కానింగ్ దుర్మారాన్ని బలంగా చెప్పారు రాసాని. తల్లి గర్భంలో ఉన్న ఓ శిశువు ఎప్పుడెప్పుడు ఈ లోకంలోకి వచ్చి అందమైన ప్రపంచాన్ని చూస్తానా అని ఆరాటపడుతూ ఉంటుంది ఆడశిశువని తెలిసి ఆరాటపడుతున్న పెద్దల మాటలు విన్న శిశువు తనను చంపేయమని ఆక్రోశించినట్లు చెప్పి సాంకేతికాభివృద్ధి కూడా స్త్రీకి ఎలా ద్రోహం చేస్తున్నదో రచయిత చెప్పగలిగారు. స్త్రీలకు అక్రమ సంబంధం అంటగట్టే నీచ సంస్కృతికి

భారతదేశం పేరుమోసిన కేంద్రంగా ఉంది 'తీర్పు' కథలో గౌరమ్మ ఆ నిందనే మోపింది అయితే తనకు రంకు అంటగట్టి దౌర్జన్యం చేస్తున్న భర్త మీద గౌరమ్మ తిరగబడి, "ఇంక నీతో తాను కాపరం చెయ్యలేను" అని తండ్రితోపాటు వెళ్ళిపోతుంది పెళ్ళి అయినప్పట్నుంచీ కట్నం తేలేదనీ గొడ్రాలనీ, ఆఖరికి ఆడబిడ్డను కనిందని వేధించే అత్తమామలు, భర్త తనను ఇంట్లోంచి తరిమేస్తే పుట్టింటికి చేరిన మునిలక్ష్మమ్మ ఉద్యోగంలో చేరి పైకి వచ్చినాక, భర్త రమ్మని పిలిచినప్పుడు తిరస్కరిస్తుంది "గాలిచెట్టు" కథలో. గాలిచెట్టుమీద హక్కు అది మొలిచిన భూమికే ఉన్నట్లు సంతానం మీద అధికారం తనకే ఉండాలని గౌరమ్మ వాదిస్తుంది గ్రామాల్లో పిల్లలు పుట్టిం ట్రుకలు తీసే ఊడగ చెట్టును గాలిచెట్టు అంటారు గాలి చెట్టును ఉపమానంగా తీసుకొని స్త్రీ సంతాన హక్కు వస్తువును చిత్రించడం బాగుంది మధ్యతరగతి స్త్రీ చుట్టూ అల్లిన శీలం ముళ్ళ తీగల్ని ఒక గువ్వలోళ్ళ స్త్రీ జీవితం ఆధారంగా రచయిత తెంపేసే ప్రయత్నం చేశారు 'ఓలి బతుకులు' కథలో ఎంత్రోపాలజీ శాఖలో ఒక పరిశోధకుడు గువ్వలోళ్ళ గూడానికి పోయినప్పుడు నాంచారి అనే యువతి తన జీవితాన్ని వివరించినట్లు రాసిన ఈ కథ మగవాదుల కళ్ళు తెరిపిస్తుంది. 'ఓలి' ఆచారానికి ముగ్గుర్ని పెళ్ళిచేసుకున్నా మగదిక్కులేక చంటిబిడ్డతో ఆకలిని అనుభవించిన నాంచారి ఆత్మకథ మనసున్న వాళ్ళకు కంటతడి పెట్టిస్తుంది.

వస్తువైవిధ్యం రాసాని సొత్తు "మహన్నబావుడు మా నామాల సాయిబు" కథలో వెంకటేశ్వరస్వామి బీబీనాంచారి దాంపత్యం ఆధారంగా సాంస్కృతిక, మత సమైక్యతను ప్రతిపాదించారు. గర్భిణీ స్త్రీ ప్రసవించకుండా మరణిస్తే, ఆమెను అలాగే ఖననం చేస్తే ఊరికి కీడని భావించి, మొండోడితో శవం గర్భం చీల్చి బిడ్డను బయటికి తీయించే అమానుష మూఢాచారం మీద రాసిన కథ 'కీడు'. ఇది తెలుగు కథాసాహిత్యంలో అరుదైన కథ పట్టణాల్లో సంపన్న విద్యాధిక కుటుంబాల వాళ్ళ బంగాకు తాగుడును అలవాటు పడిన తీరును 'చీకటి' కథలో చిత్రించారు సంపన్నుల్లో కన్నా పేదవాళ్ళలోనే మానవత మానవీయతలున్నాయని ఇద్దరు స్త్రీలు ఆధారంగా రాసిన కథ 'భిక్షు వర్షీయసి'. హృదయమున్న మనిషి ఈ సమాజంలో తన శక్తిసామర్థ్యాలన్నీ తనను నమ్ముకున్న వాళ్ళకే వినియోగించి తాను మాత్రం ఏకాకిగా మిగిలిపోయిన వైనాన్ని ఒక స్త్రీ ఆధారంగా రాసిన కథ 'సాలెగూడు'. సంప్రదాయ సామాజిక ఆచారాలకు ఆర్థిక పరిస్థితులకు ' క్రమక్రమంగా దూరం పెరిగి వైరుధ్యాలు ఎక్కువ అవుతున్నాయి. చావును కూడా పండగలాగా చేసుకునే నామధారుల సంప్రదాయం రాసప్పలాంటి వాళ్ళకు లేమి కారణంగా గుదిబండగా మారిన వైనాన్ని "చావు కూడు" కథలో చిత్రించారు. మానవ జీవితంలోని అనేకత్వాన్ని వస్తువుగా తీసుకొని కథలుగా మలుచుకుంటున్న రాసాని మరింత వస్తు వైవిధ్యం ప్రదర్శించగలరు

రాసాని కథల్లో గ్రామీణ జీవితమే వస్తువుకాగా, ఆయన కథా శిల్పంలో జానపద కోణం కనిపిస్తుంది. అది కథనంలోను, భాషలోను ఉంది. మధురాంతకం, కలువకొలను, పులికంటి వంటి చిత్తూరు జిల్లా కథకులు

పట్టి కదిలిస్తాయి ఆ వాక్యనిర్మాణమే అందులోని శిల్ప విన్యాసం "అవునండయ్యా నేను ముగ్గురి మొగోళ్ళకు కాపురం చేసిన అయినా నేనేం తప్పు సెయ్యలేదు. నేను నిప్పులాంటి మనిషినే" అని తన జీవిత కథనాన్ని ప్రారంభిస్తుంది నాంచారి ఈ మాటలు పాఠకుడిని అరెస్ట్ చేస్తాయి కథ ముగిసినప్పుడు గాని విడుదల కాడు రాసాని ఆవేశపడలేదుగాని ఇక్కడ నాంచారమ్మకు శ్రీకృష్ణుని ఉపమానంగా వాడేసేవారేమో! అలా చెయ్యక పోవడం వల్ల ఈ కథలో మంచి బిగింపు వచ్చింది కథ సందులు గొందులు తిరక్కుండా ఒక్క ఉదుటున సాగిపోయింది

అయ్యవార్లు కథలు రాస్తే సాధారణంగా మాటలు అవసరానికి మించి పడుతూనే ఉంటాయి. రాసాని కూడా అయ్యవారే ఆయన చాలా కథలు నిగ్రహంగానే రాశారు అయినా కొన్ని చోట్ల ప్రత్యేకించి, కథల ముగింపులో కథ ఇక్కడ ఆగిపోయుంటే బాగుండును అనిపించినాక, మరికొన్ని వాక్యాలు రాశారు. 'కొలిమి' కథ చివరి రెండు మూడు వాక్యాలు ఆ కథలోని క్లుప్తతను దెబ్బ తీశాయేమో ననిపిస్తుంది

'హోమం' కథలో రాసాని మరో రకమైన శిల్ప సామర్థ్యాన్ని ప్రదర్శించారు ఈ కథ వెడల్పాటి కడవకు చిన్న మూతి పెట్టినరీతిలో నిర్మింపబడింది సిన్రాయుడు నాయకత్వంలో దళితుల తిరుగుబాటును ఆద్యంతాలలో పెట్టి, తిరుగుబాటుకు కారణమైన గ్రామీణ భూస్వామ్య వ్యవస్థను - ఒక సంఘటన ద్వారామధ్యలో నిక్షిప్తం చెయ్యడంవల్ల ఈ కథ సన్న మూతిగల నిండు కుండలాగా తయారైంది

కథానిర్మాణంలో రాసాని శిల్పపరమైన జాగ్రత్తలు తీసుకుంటారు. తీర్పు వంటి చిన్న కథల్లోనే గాక 'అన్నేకారి జల' వంటి పెద్ద కథల్లో కూడా ఈ జాగ్రత్త కనిపిస్తుంది. సంఘటనల మధ్య, సంభాషణల మధ్య వ్యాఖ్యానాల మధ్య, సమన్వయం కుదరడమే కథా నిర్మాణ శిల్పం. అయితే "మహన్నభావుడు మా నామాల సాయిబు' అనే కథలో రచయిత కొంత బ్యాలన్సు తప్పినట్లని పిస్తుంది. భావజాలపరమైన, గందరగోళం ఏదైనా రచయితను అయోమయంలో పడవేసి, శిల్పపరంగా దెబ్బతీసిందా? అనిపిస్తుంది ఈ కథంతా చదివిన తర్వాత. మత సామరస్యాన్ని బోధించడానికి ఎన్నుకున్న వస్తువును విశ్లేషించు కోవడంలో స్పష్టత కొరవడటం వల్ల మల్‌రెడ్డి దంపతులకు సంతానం ఎలా కలిగింది? అనే ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోతుంది.

రాసాని కథలకు జవజీవాలను కల్పించి ఆయన శిల్పపరిణతికి అద్దం పట్టింది ఆయన భాషే సజీవమైన చిత్తూరుజిల్లా స్థానిక భాషను ఒడుపుగా వాడుకోవడంలో రాసాని విజయం సాధించారు. "ఆ పల్లెలో మల్‌రెడ్డి అంటా వొగ ఆయకట్టు రైతుండేవోడు అయప్పకు పెండ్లయ్యి ఏడేండ్లయినా సంతు గలగలా ఆయప్ప బారియే ఆది లచ్చిమి మహన్ని బావురాలు. గొప్ప యిల్లాలు. తన కడుపులో వొగ కాయ వొగ సిన్న నలుసు పుట్టలేదే అంట వొగిటే యాతన బడిపోతావుండే మహాతల్లి. వంజెదానా, గొడ్డుబోతుదానా అంటా సూటిపోటి మాటలనే ఆడోళ్ళ ఎటకారాలు ఇనలేక ఇంట్లోనే ఇగరబడి సస్తా

వున్నిందనుకో" (మా నామాల సాయిబు) అనంతపురం జిల్లా భాషకు దగ్గరగా వుండే చిత్తూరు జిల్లా పడమటి ప్రాంత భాషతో రాసాని తన కథల్ని జీవ రసగుళికలుగా మార్చగలిగారు

శిల్పం గారడీలతో పాఠకులకు దూరం చెయ్యకుండా, వస్తువుకు ఒదిగి ఉండే శిల్ప సహకారంతో తన కథలతోపాటు తానూ పాఠకులకు దగ్గరవుతున్న రాసాని రాబోయే కాలంలో మరిన్ని కొత్త వస్తువులను శిల్ప వైవిధ్యంతో రాయగలరని ఇప్పుడు ఆయన రాసిన కథలు రుజువు చేస్తున్నాయి

తిరుపతి యాత్రిక స్థలం కావటంవల్ల అక్కడ అనేక అసాంఘిక శక్తుల కార్యకలాపాలు సాగుతున్నాయి అక్కడి మానవ సంబంధాలను వాటిలో వస్తున్న మార్పులను, అక్కడి యాత్రా సంస్కృతి నేపథ్యంలో చిత్రించాల్సి ఉంది ప్రపంచీకరణ అక్కడి ప్రజల్ని పరాధీనులుగా మారుస్తున్న తీరును, అక్కడి కథలు ఇంకా పట్టుకోవలసి ఉంది. ఆ జిల్లాలోనే పచ్చటి ప్రాంతాలు, నీళ్ళు లేని ప్రాంతాల మధ్య వైరుధ్యాలను కూడా అక్కడి కథలు పట్టుకోవాల్సి ఉంది రాసాని ఈ దిశగా కథా ప్రయాణం చేయగలరని ఆశించడంలో తప్పు లేదు

# గంటేడ గౌరునాయుడు

♦ ఎ. అప్పల్నాయుడు ♦

గంటేడ గౌరు నాయుడు వర్తమాన ఉత్తరాంధ్ర ప్రసిద్ధ కథకుల్లో వొకడు ఉత్తరాంధ్ర నుంచే ఆధునిక తెలుగు కథ ఆరంభమయిందన్నది (గురజాడగానీ సాంఖ్యాయన శర్మగానీ) యిటీవలిదాకా ఉత్తరాంధ్రను ఒక విశేషణంగా వివరించుకొచ్చిన పరిశీలకులకు మరికొన్ని ఆధునిక కథల ప్రతిపాదన లొస్తున్నాయి వీటికి తోడు వొక ప్రాంతానికీ, వొక వర్గానికీ, వొక కులానికీ ముఖ్యంగా వొక సిద్ధాంతానికీ సాహిత్యమో, సంస్కృతో, సమాజమో - లోబడి గానీ, అనుసరించిగానీ, అంగీకరించి గానీ వుండదనే ఆధునికాంతనంతర వాదంలో - గురజాడ అడుగుజాడ ప్రశ్నార్థకమయిన వేళయిది కానీ గురజాడ అడుగుజాడలో, ఆకాంక్షలో, వొక సాహిత్య, సాంస్కృతిక ప్రవాహ పరంపరయే ఉత్తరాంధ్రలో సాగిందీ, సాగుతున్నదీ గురజాడ, చాసో, రావిశాస్త్రి, బలివాడ, పూసపాటి, దాట్ల, భూషణం మొదలైన కీర్తిశేషులుగానీ, కా.రా, పంతుల జోగారావు, పతంజలి, శ్రీపతి నుండి శ్రీకాకుళ సాహితికథకులదాకా గానీ - ఉత్తరాంధ్ర కథకులకు గతమొక చారిత్రక జ్ఞాపకం మాత్రమే కాదు - భవిష్యత్ రచన కవసరమయిన వర్తమాన అధ్యయనాంశం గూడా! అందుకనే, గౌరునాయుడి "ఏటిపాట" కథా సంపుటికి ముందు మాట రాస్తూ.

"..అలనాటి అచ్చిపువలస పితూరి (1884)లో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరు సల్పిన యోధుని క్షతగాత్రగానంగానీ, ఆ తర్వాత అంద్ర, లక్ష్మీపురం, సాలూరు, మందసా వగైరా జమీందార్ వ్యతిరేక యుద్ధాన్ని నడిపిన రైతు వీరుని క్షతగాత్ర గానంగానీ, రాజ్యవ్యతిరేక వ్యవసాయక విప్లవ కథ సారథ్యం వహించిన నిన్నటి గిరిజన రైతాంగ యోధుని క్షతగాత్రగానంగానీ. మాకు చారిత్రక జ్ఞాపకాలు మాత్రమే కావు వర్తమాన అధ్యయనాంశాలు కూడా .." అన్నాడు

సరిగ్గా యీ అవగాహనతో గత వర్తమాన సాహిత్య గానం చేస్తున్న వాడు గౌరునాయుడు. గ్రామీణ కథకుడు జానపద కథకుడు. మంచినీ, మానవతనీ ప్రేమించేవాడు. మనుషులందరూ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వంతో మెలగే లోకం గురించి ఆరాటపడతాడు. మనుషుల - అనే వ్యక్తివాదంలోంచిగాక, సమాజమనే సమిష్టి వాదంలోంచి, సామాజిక గతితార్కిక చరిత్రలోంచి.. ఆలోచించాలంటే - ఆశగా, ఆసక్తిగా అధ్యయనం చేస్తాడు మనిషికే గాక భూమికీ పుండు (భూమి పుండు - కథ) జేసిన పెట్టుబడిదారీ అత్యున్నత రాక్షసత్వాన్ని అసహ్యించుకుంటాడు. 'గెంజిమెతుకుల' కోసం 'చొక్కాగుడ్డకోసం',

'నరాలు తెగిన నేల'లో 'బతుకాకు' కోసం విలపిస్తాడు ఉత్తరాంధ్ర, కళింగాంధ్ర సాంస్కృతిక గానం(ఏటిపాట) విన్పిస్తాడు

గౌరునాయుడ్ని దగ్గరగా, సహచరుడిగా, స్నేహితుడిగా యెరిగిన నేను అతనిని గ్రామీణ జానపద కథకుడిగానూ, మంచిని కోరే రచయితగానూ, ప్రాంతీయ ఆర్థిక, సామాజిక జీవిత చిత్రకారుడిగానూ - అతని కథల ద్వారా అర్థం చేసుకున్నాను. ఆయన రాసిన, దాదాపు యేభయి కథల్లో ఆయనే కొన్నింటిని ఆదిలో రాసిన వాటిని - యిపుడు ప్రస్తావించడు 1984లో తొలికథ 'శారద పెళ్ళి', 'కథాంజలి' (మద్రాస్) పత్రికలో అచ్చయ్యింది నాలుగైదేళ్ళపాటు, 'కథాంజలి' లోనూ, మరో పత్రికలోనూ మరో నాలుగైదు కథలు అచ్చయ్యాయి. గానీ, వొక అవగాహనతో, వొక అకాంక్షతో, వొక ఆర్తితో కథలు రాయాలన్పించి 1989లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో 'విముక్తి' కథతో తాను కథకుడిగా అయ్యానని చెప్పుకుంటాడాయాన. ఇందుకు కా రా., రా వి. శా స్త్రి, చాసో, భూషణంగార్ల కథల పరిచయంతో పాటు 1988లో అప్పల్నాయుడి "పోడు - పోరు" కథా సంపుటి ప్రధానంగా తనను మలుపు తిప్పిందంటాడు. గౌరునాయుడికి కళాత్మక హృదయం తల్లి పొత్తిళ్ళనించి, తండ్రి గుండెల మీదుగా యేర్పడింది తండ్రి గంటేడ సత్యంనాయుడుగారు కళాకారుడు, సంగీత వాయిద్యకారుడు, ఆదర్శవాది, ఫ్లూట్, హార్మోనియంతో తండ్రి పలికే సప్తస్వరాలను గౌరునాయుడు , శబ్దార్థాలను నేర్చుకున్న దశలోనే గుండెల్లో ప్రతిధ్వనింపచేసుకున్నాడు. గనక, గౌరునాయుడూ గాయకుడైనాడు, వాయిద్య కారుడైనాడు. అదనంగా తండ్రికంటే ముందుకు నడిచి, చిత్రకారుడూ, కథకుడూ, కవీ అయినాడు. స్పందించే హృదయాన్ని - తండ్రి యిస్తే ఆ హృదయానికో అవగాహనను - గురజాడ నుండి అట్టాడ దాకా సాహిత్యలోకం అందించిందంటాడు ఇవి గౌరునాయుడి కథా నేపథ్యానికి సంబంధించిన భావాత్మకాంశాలు ఆయనను కథకుడిగా ప్రభావితం జేసే, భౌతికాంశాలనూ క్లుప్తంగానైనా చూద్దాం

ఒక పురాతన జ్ఞానప్రవాహంలా సాగే - నాగావళినది నదీతీరాన రెల్లు పొదల్లోంచి, చిరుగాలుల సితారా. ఒంద్రుమట్టి మీద యెదిగిన - వెదురు పొదలు, వేణుగానాలు, పొద్దు పొడుపూ, పొద్దుమలుపూ వేళ కోటేరేసిన నాగళ్ళనీ, "అదిగో ద్వారక . ఆలమందలివిగో.." పసుల కాపర్ల రాగాలను మోసే గోర్జి (తోవ)లు, చుట్టూ దట్టమయిన తోటలమధ్య ఆశ్రమంలాంటి పల్లె! ఆరుగాలం శ్రమించే స్త్రీ పురుషులూ, ఆనంద విషాదాల స్పందనా వేదికలు రచ్చబండలు, అగరొత్తులు, హారతులూ, తులసి తీర్థాలూ అందించే ఈశ్వరాలయమూ - దర్శించండి! తలపాగా దులిపి, విశ్వాసంగా చూస్తూ, ముడతలు బడ్డ మొహంతో నాగావళిలా గలగలా నవ్వే. ..వొకానొక తరతరాల రైతుని ఊహించండి! ఇదంతా గతం నేడో..?

నరికేసిన అడవులు, కొరగాని క్షేత్రాలు, నేతకు నోచుకోని గుడిసెలు, ఎండి బీటలువారే పొలాలు, శిథిల రచ్చబండలు, రోజ్‌గార్ నిధుల్ని మింగిన గతుకుల రోడ్లు, పసుపు బారిన ముఖద్వారాలూ, అంగన్వాడీ అనాథ సెంటర్లూ,

వలసబోయే కుటుంబాలూ, యెందుకో విస్తరించే రోడ్లూ, యెక్కడివో ట్రాక్టర్లూ, పురుగుల మందులూ, నోట్ల కట్ల పాములూ, కొత్త పంటలూ, కొత్త రోగాలూ, కొత్త స్కీములూ, చెత్త సీరియల్ల టీవీలూ, వోటర్లుగా, పార్టీలుగా, స్కీములుగా, సబ్సిడీలుగా, వార్డులుగా - చీలిన వీధులు, విలపించే గ్రామ దేవతలూ - నదీ కన్పిస్తాయి

అచ్చెపు వలస పితూరీ నుండి, ఆది వాసీ రైతాంగ సాయుధ పోరు దాకా నెత్తురొలికిన క్షత గాత్రుల నేల యిది! వొకరకంగా యిక్కడి వర్తమాన కథకుల సాహిత్యం - క్షతగాత్ర గానమే! ఈ భౌతిక నేపథ్యం లోంచే గౌరునాయుడి "ఏటిపాట" వొచ్చింది.

పదహారు కథలతో "ఏటిపాట" కథా సంపుటి 1997లో శ్రీకాకుళ సాహితి ప్రచురణగా వొచ్చింది "ఏటిపాట" సంపుటికి చాలా సాహిత్య సంస్థలు అవార్డులనిచ్చేయి. అలాగే, "బతుకాకు" కథకు ఆంధ్రప్రభ బహుమతినిచ్చింది కథాసాగర్, కథాసీరీస్, తెలుగువర్శిటీ కథా సంకలనాలూ మొదలైన వాటిల్లో గౌరునాయుడి కొన్ని కథలు సంకలించబడినాయి "ఏటిపాట" తర్వాత "భూమిపుండు" (వంశధార కథలు) ' ఒకరాత్రి - రెండు స్వప్నాలు (ప్రజాసాహితి, ఆసరసాల (ఆంధ్రజ్యోతి) "జీవన్మృతులకు" లాంటి మంచి కథలు మరో సంకలనానికి సరిపడా ప్రచురణయిన కథలున్నాయి వీటిలోంచి, గౌరునాయుడి కథాశిల్పం, వస్తువు, కథకుని ఆకాంక్షా పరిశీలిద్దాం

మొదటగా, గౌరునాయుడ్ని గ్రామీణ జానపద కథకుడన్నాను అంటే, ఆతని శైలీ, వస్తువూ జానపదమన్న అర్థంలోగాదు. ఒక గ్రామీణ జానపద కథకుడి లాగే, గౌర్నాయుడికి పట్నపు వాసనా, నగరపు గాలీ సోకలేదు చదువుకో, వృత్తికో అటు వెళ్ళలేదు. అంతా పల్లె, పల్లెకానించిన చిన్న బస్తీల వరకే (పార్వతీపురం, కురుపాం). విద్యాపరంగా గూడా అంతంతమాత్రమే (కళాశాల, యూనివర్శిటీ దాకా వెళ్ళలేదు). పరభాషా జ్ఞానమేమీ లేదు మాతృభాష తప్పా. పండిత వంశానికిగానీ, సాహిత్య వారసత్వానికి గానీ చెందినవాడు గాదు వ్యవసాయిక కుటుంబం నుండొచ్చినవాడు.

యే హంగూ, ఆర్భాటమూ లేకుండా, నేలపొత్తిళ్ళలోంచి తలెత్తి, చిరుగాలికి పులకించే మొలకల్లా, గౌరునాయుడూ, గౌరునాయుడు కథలూ వుంటాయి

కవితాత్మక శైలి వాతావరణాన్నీ, పాత్రల్నీ, కవితాత్మకంగా వర్ణించే వాక్యాలు గౌర్నాయుడి శైలి ఉపమానాలతో పాఠకుడికి దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్టు చూపిస్తాడు ఆ ఉపమానాలూ, కవిత్వ పదాలూ - పాఠకుడ్ని ఆకట్టుకుంటాయి. ఉదహరణకు "ఏటిపాట" సంపుటిలో మొదటి కథ "విముక్తి"లో ప్రారంభ వాక్యం - "మండుతున్న పొయ్యిలా వుంది తూర్పు అరుణకిరణాలు పడి ఉతికి ఆరేసిన చెంగావి రంగు చీరలా మెరుస్తోంది - నాగావలి" యీ వాక్యాల్తో ఆరంభమై, వొక ఎండవేళ, తూర్పు కభిముఖంగా బండమీద బట్టలుతికే చాకలి వాని బాధామయ గాథలోకి పాఠకుడ్ని నడిపిస్తాడు నదీ, నదిలో బండమీద బట్టలుతకడం, ఎండ, ఆకలి, కుటుంబ యిక్కట్లూ.

వరుసగా, సహజాతిసహజ వాతావరణంలో పాఠకుడు నడుస్తాడు ఉపమానాలూ, కవితాత్మక వాక్యాలూ సందర్భానికి అతికినట్టుగాదు, సందర్భంలో ఉద్భవించి నట్టుంటాయి

"బతుకాకు" అనే కథలో, కూలికోసం తునికాకులు యేరేందుకు ఎండలో శ్రమించే దృశ్యాన్ని - "కొండ వెనుక సూర్యుడు - తునికాకు చిగురులా ఎఱ్ఱగా వున్నాడు", "వెలుగునీళ్ళతో మొహం కడుక్కొని, చిరుగాలి తువ్వాలుతో ఒత్తుకుంటోంది అడవి" అంటాడు.

"మసక మసక చీకటి - రంగు వెలిసిన నల్ల దుప్పటిలా - లోకమ్మీద కమ్ముకుంటోంది ", ".ఏటిపాట" కథ ఆరంభ వాక్యమిది ఒక అపూర్వ గాయకుని విషాద మరణానికి సూచికగా, ఆ గాయకుని భార్య దుఃఖానికి సూచికగా - కథ ఆ వాక్యాలతో ఆరంభమవుతుంది. పాఠకుడి హృదయపు లోతులను తడుముతాడు గౌరునాయుడు "శవస్నానంతో గడపంతా తడిసినట్లు - నేల బురద బురదగా వుంది" యీ వాక్యంలో ఉపమానం, వొక దుఃఖపు వాతావరణాన్ని కళ్ళకు గడ్తుంది

"..ఆకాశం - విరగ గాసిన నువ్వు చేను పొలంలా వుంది చుక్కలు - నువ్వు పువ్వుల్లా మిల మిల మెరుస్తున్నాయి." ఒక రాత్రి వేళ ఆరుబయట మంచమ్మీద వాలి, ఆకాశం వేపు ఓ రైతు చూస్తున్న దృశ్యమది 'నీటి ముల్లు" కథలో.

ఆ తర్వాత, కొంత సేపటికి - "పొలంలో పశువులమంద పడి, పొట్లాడుతూ చేను అంతట్నీ మడకమ్ముతున్నట్టు - నల్లని మబ్బులు ఆకాశంలో తారట్లాడ్తున్నాయి..."

ఆ నువ్వు చేను పండిచే రైతుకి - గుండె 'లయ' తప్పింది

"నుదిటిమీద రూపాయి కాసంత చినుకు - నుదుటి రాత మారుస్తున్నట్టు రాలింది", "మరో చినుకు పడింది - గుండెను గాయం చేస్తున్నట్టు..." ఆ రాత్రి, ఆవాన, నీటి ముల్లు అయి - ఆ రైతు ఆశలనూ, శ్రమనూ, యెలా ఊడ్చేసిందో - ఆ వాక్యాలతో మనకు, చినుకులో వనమూ తడిసేట్లు వర్ణిస్తూ చూపిస్తాడు.

పాఠకుణ్ణి - కథా ప్రాంతంలోకీ, వాతావరణంలోకీ తీసుకెళ్ళే కథనం గౌరు నాయుడి అన్ని కథల్లోనూ ప్రాంతమూ, వాతావరణమూ పాఠకుడికి బోధపడటం గాదు, అనుభూతిలోకి వస్తుంది పాఠకుణ్ణి తీసుకుపోతాడు.

"రాములు ఆత్రంగా యేరుతున్నాడు. పొద్దు నడినెత్తికెక్కింది. చెమటలు కక్కుతున్నాడు. జుత్తులోంచి చెమట ధారలుకడుతూ కళ్ళలోకి జారి, కళ్ళు మండుతున్నాయి కట్టుకున్న గావంచా మొత్తం చెమటతో తడిసిపోయింది..

గుబురుగా తుప్పలు ఆ తుప్పల్లో తునికాకు మొక్కలు. ఆశగా అటు వెళ్ళేడు. కస్సున దిగబడింది అరికాలులో ముల్లు. నులకతాడుతో కట్టిన ఆకుల చెప్పులోంచి ముల్లుపీకి. గుచ్చినచోట ఉమ్మితడి పూసి, ఆకుల కోసం చెయ్యి చాసేడు పరింకంపల ములు - చేతిని గీసుకుపోయేయి. ముళ్ళను

లెక్కచేయకుండా ఆకులు తెంచేడు. చెట్ల మీదనుండి చీమలు ఒళ్ళంతా రాలి, పాకేయి. వొకటే మంట ఎండ చీమల కాట్లు " తునికి ఆకు యేరటానికి వెళ్ళిన రాములు అనే పాత్ర, ఆ ఎండ, చీమలు, ముళ్ళు, అడవి అన్నీ పాఠకుడి అనుభూతిలోకి వొచ్చే యీ వాక్యాలు "బతుకాకు" కథలోవి

"దుక్కి చినుకులు పడితే బావుణ్ణు." ఆకాశం వేపు చూసి గొణిగేడు సత్యం నాయుడు ఆకాశం నిర్మలంగా వుంది బాగా దుక్కిదున్ని, చదును జేసి, గడ్డీ గాదం యేరి శుభ్రంజేసిన మడిసెక్కలా వుంది ఆకాశం

గట్టున నిలబడి చూసేడు. ఆశల్ని ఆరబోసినట్లు పచ్చని నువ్వు చేలు తెల్లని పువ్వుల్తో నవ్వుతున్నట్లు నువ్వు పంట చూపానినంతా నువ్వు చేలు.."

పాత్ర సత్యంనాయుడితో పాటు, పాఠకుడూ ఆకాశాన్నీ, నువ్వు చేనునీ చూస్తాడు - యిది "నీటి ముల్లు" కథ ఆరంభం దృశ్యం

పాత్రల్లోనూ, ప్రాంతంలోనూ విలీనమయిన కథకుడు

గౌరునాయుడు తన చుట్టూ వున్న మనుషుల్లోనూ, ప్రాంతంలోనూ మమేకమై కథ రాస్తాడు. గనక ఆయన పాత్రలకూ, ప్రాంతానికీ అలీనంగా కన్పడడు.

" .యీ ఊరికొక దండం. ఊరిపెద్దలకొక దండం తెల్లారితే టీ పాకల, అంబళ్ళేలప్పుడు ఆ సరసాలల్ల, రాత్రపుడు రామ్మందిరం కాడ - రాజకీయాలు మాట్లాడి, రండోళు కదలేసెస్తారు ఏల? ఎందుకూ ." అని "నరాలు తెగుతున్న నేల" కథలో పాత్ర తన గ్రామం, గ్రామ పెద్దల నిర్వాకం మీద తీవ్ర నిరసన వ్యక్తం చేస్తుంది.

"ఉప్ ...."

అక్షరాలు దిద్దుకుంటున్న ఓ పిల్లాడి పలకమీద చినుకుపడి, రూపాయి బిళ్ళంత మేర చెదరి, అక్షరం చెరిగిపోయింది.." ఇది, "బడిసాల" కథలోని మొదటి వాక్యం ఒక వాన చినుకుపడి, అక్షరం చెరిగిపోవటం - ఆ పాఠశాల దుస్థితికి సూచిక పైకప్పు పాడయి, శిధిలగోడల్లో నడిచే పాఠశాల వానొస్తే - శెలవు (వేసవి ఎండలకెలాగూ శెలవులే). అటువంటి గ్రామంలో "బడిసాల" నిర్మాణంకి, ఆ గ్రామ యువకులు పూనుకుంటారు ప్రజలను కలుస్తారు. సహకార మర్థిస్తారు. ప్రజలు తమకు వీలయిన సహకారం చేస్తారు గ్రామ పెద్దల్ని (సర్పంచ్ మునసబు, షావుకారు, వగైరాలు) కలుస్తారు పెద్దలు పెదవి విరుస్తారు రాజకీయం చేయబోతారు 'చిన్నా' అనే అవూరి యువకుడు, వేరే ప్రాంతంలో ఉపాధ్యాయవృత్తి చేస్తున్నవాడు, యువకుల్ని పాఠశాల నిర్మాణ కర్తవ్య నిర్వహణకు తప్పా - మరే విధమైన రగడకూ దిగనీయకుండా నియంత్రిస్తూ, - అందరి శ్రమతో ఆ గ్రామంలో పాఠశాల నిర్మిస్తాడు పిల్లల్తో ప్రారంభోత్సవం.. సందడి! పెద్ద మనుషుల పెద్దరికానికి వెన్ను చరుపై, యువతరానికి మేల్కొలుపు అయిందంటాడు

"ఉప్..."మని చినుకు పడ్తుంది. కానీ కొత్త బడిసాలలో అది అక్షరాలను చెరిపెయ్యలేదు. పాఠశాల శెలవుకు దారియ్యదు. పిల్లలు దీర్ఘాలు తీస్తూ

చదివే ఆ రాగాల సవ్వడితో- కురుస్తున్న వాన నీటి సవ్వడి కలిసి వేదపఠనంలా వుందంటాడు ముగింపులో!

ఆ గ్రామం - నిజానికి గౌరునాయుడు స్వగ్రామం బడిసాల నిర్మించింది వీరే, ఆ గ్రామంలోనే

" సినుకు పడితే బయ్యిం, పడప్పోతే బయ్యిం. సరుకమ్మబోతే బయిం కొనబోతే బయిం ఇలాగ బయపడుకొని బతకడమెన్నాళ్ళు? ఇదే నలుగురం అనుకోవాలి. ఒక గొంతుకి వొంద గొంతులు కలిస్తే..? దేశం నిండా రైతులే రైతులందరూ కూడబలుక్కుంటే. " "నీటిముల్లు" కథలో రైతు సత్యం నాయుడి వేదనలోంచి వొచ్చిన ఆకాంక్షలో గానీ,

"పేదోడి బతుకే పెమాదం. పెమాదాలకి జడిస్తే, సీటం బతకలేం పేదరికమూ, పెమాదమూ నేస్తరికం గట్టాయి గావాల వొకటి పోతేగానీ, మరొకటి పోదు అంతదాకా, పెమాదాల్తోటి పందెమేసి బతకడమే మనకి మిగిలిన తోవ..", "బతుకాకు" కథలో రాములు చెప్పిన బతుకు తోవలోగానీ,

" . యెక్కడినుండో వొచ్చిన పెట్టుబడులు - ప్రవాహమై, మన ముందో సాగరమై, అలల నాలుకల్తోటి ఆహ్వానిస్తుంటే, ఈతకొలననుకొని మురిసి పోతన్నాం గానీ, అదొక "తిరుగుడు గుమ్మి" అనీ, అందులో పడితే, గజ ఈతగాడైనా గుటుక్కుమని పోవలసిందేగానీ తేలడని తెల్సుకోలేకపోతన్నాం అవి మన ఊళ్ళని ముంచెయ్యక ముందే అడ్డుకట్టవెయ్యాల..", 'తిరుగుడు గుమ్మి' కథలో రిటైర్డ్ టీచర్ చేసిన హెచ్చరికలోగానీ - రచయిత యొక్క ఆర్తీ, ప్రజలనూ, ప్రాంతాన్నీ అమితంగా ప్రేమించి గింజుకులాడే సున్నిత హృదయమూ కన్పిస్తాయి. నిజానికి, పై పాత్రలేవీ - రచయిత కల్పనమైనవి గావు పాత్రలన్నీ - తన తాత, తండ్రి, తల్లీ, మామ, బావ, అన్న, అక్క, మిత్రులూ, బంధువులవే! ప్రాంతాలు, తను నివసించేవే! గనక, రచయిత - నిర్విరామంగా నాగేటి చాలు బోసే వొక రైతులా కండలు కరిగిస్తూ తిండి సృష్టించే కష్టజీవిలా, దోవపొడవునా పర్చుకున్న ముళ్ళనూ, రాళ్ళనూ, రప్పలనూ యేరిపారేస్తూ నడిచే మార్గదర్శక యాత్రికుడిలా. అన్ని కథల్లో విలీనమై వుంటాడు. అంతే తప్పా, కొలతబద్దలు పట్టుకొని, శిల్ప చతురతా విద్య ప్రదర్శిస్తూ, కళాఖండాల సృష్టి కర్తలా - ఆర్భాటంగా కన్పించడు, అలీనంగా కన్పించడు.

పాఠక హృదయానికి విజ్ఞప్తి జేసే కథకుడు· కథకులు తమ కథల ద్వారా పాఠకుని మేధస్సుకో, హృదయానికో, చైతన్యానికో స్పందన కలగజేస్తారు (వ్యాపార రచయితలు శరీరానికి . అనుకోండి అది వేరే విషయం) గౌరునాయుడు పాఠకుని హృదయానికి స్పందన కలుగజేస్తాడు. ఇందుకు ఉదాహరణగా "అవతలి ఒడ్డు" అనే కథను చెప్పొచ్చు ఒకానొక నదీతీర గ్రామం. నదిలో పడవ నడిపి బతికే పేదవాడు సోములు. పడవమీద అవతలి ఒడ్డుకి చేరే అనేకమంది సోములుకిచ్చేది తృణమో, ఫణమో, కొందరదీ యివ్వరు. ఈ కథ చదువుతుంటే - "బల్లకట్టు పాపయ్య" కథ గుర్తొస్తుంది. గానీ, యీ కథ సంఘటనల్లోనూ, పాత్రల్లోనూ, ప్రాంతంలోనూ భిన్నమైంది. ఆ గ్రామంలో - అన్ని గ్రామాల్లో వలే రాజకీయ పెద్దలూ, ముఠా కక్షలూ, వీటితో లబ్ధి పొందే

షావుకార్లూ వున్నారు నది అవతలి ఊరు వెళ్ళిన షావుకారి - ఓరోజు - పొద్దుగుంకే వేళయినా తిరిగి రాలేదు సోములుకి యింటివద్ద కళ్ళు కనబడని భార్యా, ఆకలి కడుపు మనవడూ, పొయ్యి మీదకి గింజలు తీసుకెళ్తేగానీ వెలగని పొయ్యీ ." ఆందోళన! ఆ సమయంలో అవతలి ఒడ్డునుంచి నాయుడి బావమరిది కేకేస్తాడు సోములు పడవేసుకెళ్తాడు అవతలి ఒడ్డుకి షావుకారి గురించి ఆరా తీస్తాడు

"ఆఁ .. కనబడ్డాడు. గానీ వొస్తాననలేదు మరేటొస్తాడు మరి రానట్టే పద, పద.." అని, నాయుడి బావమరిది, పడవని యివతలి ఒడ్డుకి నడిపించేస్తాడు సోములు కూడా, షావుకారిక రాడు గావాలనుకొని, యివతలి ఒడ్డున పడవని లంగరేసేసి, యింటికి అత్యతగా వెళ్ళిపోతాడు

గానీ, షావుకారొస్తాడు. అవతలి ఒడ్డు గ్రామ కూరాకుల వారి సాయంతో యివతలికి చేరుతాడు. సోములుమీద కోపంతో ఊగిపోతాడు ఇవతలి ఒడ్డున లంగరేసిన పడవ, వెదురు కర్రల్ని ముక్కలు జేసి, మోకు తాళ్ళను కోసేసి, ధ్వంసం జేయించేసిగానీ శాంతించడు షావుకారి.

మర్నాడు ఉదయం, విధ్వంస పడవను చూసి సోములు ఆక్రోశంతో, యెవడీ దుర్మార్గప్పనిజేసాడని తిడతాడు షావుకారి వొచ్చి, తనే చేసేసానని, తప్పు జేసినందుకు శిక్షవేసాననీ అంటాడు ఇద్దరి మధ్యా ఘర్షణ! ఒక అక్రమానికీ, దౌర్జన్యానికీ గురయిన వానికీ, గురి జేసినవానికీ మధ్య తలెత్తిన సంఘర్షణ. అయితే, తర్వాతొక సంఘటన జరుగుతుంది షావుకారి కూతురు మాణిక్యమ్మ గర్భిణీ. నొప్పులొస్తాయి, అర్జంటుగా పట్నం తీసుకెళ్ళి వైద్యం చేయించాలి గ్రామస్థులు సానుభూతి చూపుతారు. షావుకారికి తగిన గుణపాఠం జరిగిందిలే అనుకుంటాడు సోములు మొదట్లో షావుకారూ, ప్రజలూ బతిమాల్తారు - యెలాగో పడవను సిద్ధంజేసి, మాణిక్యాన్ని అవతలి ఒడ్డుకు చేర్చమని సోములు కాసేపు మౌనం వహిస్తాడు, ఆలోచిస్తాడు "యీ లోకంలోకి వొక జీవి రాబోతోంది. ఆ జీవితో నాకేమీ ఘర్షణలేదు యిప్పటి సంఘర్షణకీ ఆ జీవికీ సంబంధం లేదు. ఆ జీవిని సాదరంగా ఆహ్వానించాలి -" అని నిశ్చయించుకొని, పడవను బాగుజేసే పనిలో పడ్తాడు వెదురు కర్రలు సంపాదించమంటాడు షావుకార్ని, యీలోగా పడవని తాళ్లూ, కర్రలూ వేసి సిద్ధంజేస్తూ, మాణిక్యాన్ని తీసుకు రమ్మంటాడు తొందర జేస్తాడు. ఘర్షణ, పగ, ప్రతీకారం బదులు - భూమ్మీదకు నూతన ప్రాణిని ఆహ్వానించే మానవీయత కన్పిస్తుంది సోములులో

మాణిక్యాన్ని తీసుకురావటానికి వెళ్ళినవాళ్ళు - నది ఒడ్డు దగ్గరకు మాణిక్యం మరణించిందన్న వార్త తెస్తారు ఆ వార్త విన్న సోములు - పడవ విధ్వంస మైనప్పటికంటే యెక్కువగా బాధపడ్తాడు రహదారీ, రవాణా సౌకర్యమూ, నదిమీద బ్రిడ్జిలేని గ్రామాన్నీ, అందుకు కారకులైన పెద్దల్నీ నిరసిస్తూ-

"..యీ ఊరు బాగు పడేట్టు సెయ్యి తండ్రీ ." అని, ఆ నది ఆవలి ఒడ్డునున్న గుంప సోమేశ్వరాలయం వేపు చేతులెత్తి మొక్కుతాడు

కథ అక్కడితో ఆపకుండా, మాణిక్యమ్మను తల్చుకొని సోములు - "..అమ్మా మానిక్యమమ్మా, ఓడనేకండా అవతలొడ్డుకి యెలిపోనావా తల్లీ. " అని విలపిస్తాడు అదీ ముగింపు నిజానికీ వాక్యం పాఠకుని హృదయాన్ని సున్నితంగా తాకి, సంచలింప జేస్తుంది

ఇలా, హృదయానికి విజ్ఞప్తి జేసే కథనం - ఆదివాసీ జీవితాలమీద గౌరునాయుడు రాసిన "కొండమల్లె", "రాగాల చెట్టు", "రక్తాశ్రువు" కథల్లోనూ మనం గ్రహించవచ్చు

అలాగే, అన్య సంస్కృతి, బూతు సీరియల్స్, టీవీలో చెత్తా, నాగరీకం పేరుతో ప్రచారమయే బూటకం - వీటిపై ఆగ్రహం కలిగేట్లు కథనం జేసాడు మరికొన్ని కథల్లో "రంగు రంగుల చీకట్లోకి " కథ చదివితే పాఠకుడికి ఆగ్రహం కలుగుతుంది కుసంస్కృతిమీదా, వ్యాపార సాహిత్య, సంస్కృతిమీద

ప్రాంతీయ రాజకీయార్థిక పరిణామాల చిత్రణ గౌరునాయుడి మరికొన్ని కథల్లో తన ప్రాంతంలో రాజకీయార్థిక, సాంస్కృతిక మార్పులవలన జరిగే ఘటనల చిత్రణ కన్పిస్తుంది ఈ చిత్రణ, వొక సహజాతి సహజ జీవితంలా కన్పిస్తుంది. ఒక ప్రాంతీయ సాధికారతతో పార్వతీపురం బస్తీ నుంచి, భద్రగిరి ఏజెన్సీదాకా, బస్తీ, మైదాన, ఏజెన్సీ జీవితాలను గౌరునాయుడు 'బతుకాకు', 'కొండమల్లె', 'రాగాల చెట్టు' 'రక్తాశ్రువు', 'ఏటిపాట', 'తిరుగుడు గుమ్మి', 'భూమిపుండు' వగయిరా కథల్లో చిత్రించేడు.

రైతుల ఆశల్ని తుంచటమో, ముంచటమో చేసే మేఘాలూ, అక్కరకు రాని నదులు, చెమటల్నీ, చేసే అప్పుల్నీ మేసి యెదిగే ధరలేని పంటలూ, నాగేటి చాళ్ళల్లో, నడిచీ, నడిచీ వడలిన పశువులూ, జూద కేంద్రాల్లాంటి సంతలూ, యెరుకకందని కొత్త కొత్త విత్తనాలూ, ఎరువులూ, పురుగులు, నోట్ల కట్ల పాములూ, ట్రాక్టర్లూ, వలసబోయే గుడిసెలూ, పుట్టిన నేలవేళ్లు తెగుతున్న జీవాలూ - వర్తమాన ఉత్తరాంధ్ర ప్రాంతీయ విషాదగానం - గౌరునాయుడి "ఏటిపాట" కథా సంపుటి విన్పిస్తుంది

"తిరుగుడు గుమ్మి" కథ, రచయిత ప్రాంతీయ సాధికారతను తెలియజెప్పే మంచికథ

పార్వతీపురానికి దగ్గర్లో గల నాగావలి నది ఒడ్డు గ్రామమది. ఆ గ్రామంలో రైతులు ఋతువుల జూదంలో వోడిపోయేరు. భూములు కొరగాని క్షేత్రాలుగా, అప్పూ, సప్పుల్తో, బాధల్తో మిగిలేరు అభివృద్ధి చెందిన ప్రాంతం నిండి 'కమ్మ దొరలు' యీ కొరగాని క్షేత్రాలమీద దృష్టిపెట్టేరు. ఎకరా మూడు, నాలుగువేల రూపాయిల భూముల్ని ధరలు పెంచి, గ్రామ పెద్దల్ని దళారుల్ని జేసుకొని - ఆ గ్రామంలోని యెక్కువ మంది రైతుల భూముల్ని - కమ్మా దొరలు కొనేశారు. మెరక భూముల్ని బుల్‌డ్రోజర్లతో పల్లం జేసారు ఆకాశమే ఆధారమైన నేలకి బోర్లు దవ్వి - పాతాళ గంగను అందించేరు. అంతవరకూ, చోడి, జొన్న, కంది, నువ్వు, వరిలాంటి ఆహారపంటల నేలలో - అరటి, పసుపు, పత్తి, మిరపలాంటి వ్యాపార పంటలు లేచేయి.

"ఎటు చూసినా ఊరును పచ్చని మంటలేవో కమ్ముకొస్తున్నట్లు వ్యాపార పంటలు. ట్రాక్టర్ల రొదల ముందు మౌనంగా రోదిస్తోన్న నాగళ్ళు పంటల రెపరెపల్లో - యేవో అపశృతులు "

ఈ స్థితిలో, ఆ గ్రామంలో అప్పల్నాయుడనే రైతు మాత్రం తన భూమిని కమ్మ దొరలకు అమ్మకుండా, కాలంనెట్టుకు రాదలిచేడు పంటి బిగువుమీద పరిస్థితుల్ని దాటుకొస్తున్నాడు అప్పల్నాయుడి భూమి చుట్టూ వున్న భూమంతా కమ్మ దొర కోనుగోలుజేశాడు. అప్పల్నాయుడి భూమి మీదికి వెళ్ళేదారిని ఆటంక పరిచేడు దొర. ఘర్షించేడు నాయుడు గానీ, తన స్వంత భూమి చుట్టూ తాను కంచె వేసుకున్నాననీ, అది నా యిష్టం - అన్నాడు దొర గ్రామ జనం గూడా - డబ్బెట్టి కొన్నాడు, ఆడిష్టం - అనన్నారు

చివరికి, పంటి బిగువుమీద కష్టాలు దాటగలననుకున్న అప్పల్నాయుడికి చేసిన అప్పులు తడిసి మోపెడవటం, యిటు దొర యిరకాటాలూ, అటు దళారీ పెద్దల బేరసారాల్తో - ఆ భూమిని అమ్మేస్తాడు. ఆ భూమి అతని తల్లి పసుపు కుంకుమల కింద తెచ్చింది కన్నోరినించి.

"...ఆ భూమి వేపు చూస్తేచాలు - తన తల్లి సంకెళ్ళతో దీనంగా చూస్తున్న ట్టన్పించేది

ఆ తర్వాత, మరో యేడాదికి - అదే కమ్మదొర వద్ద - లేబర్‌తో పన్లు చేయించే 'మేనేజర్' గా అప్పల్నాయుడు చేరక తప్పింది గాదు. తల్లి పసుపు కుంకుమల భూమి పోగా - మిగిలిన ఎకరా పాతిక సెంట్ల మెరక - తన కుటుంబాన్ని ఆదుకునేది కాదు. చేతికందిన కొడుకు - కర్రల కోసంవెళ్ళి కాలిరిగి అవిటివాడైనాడు. కోడలు - అవిటి కొడుకునొదిలి ఎగువీధి నాయుడితో అక్రమ సంబంధం పెట్టుకుని, అది వీధిన పడటంతో, నూతిలో గెంతి చని పోయింది. చిన్న కొడుకుని చదువు చాలించి, గొడ్ల కాపలాకి పెట్టేడు 'మేనేజర్'గా చేరిన అప్పల్నాయుడు చివరికి - పాలేరు పనులు చెయ్యాల్సి వొచ్చింది. అప్పల్నాయుడు గారూ అని ఆదిలో పిల్చిన దొర, తర్వాత 'అప్పలయ్యా' అనీ, తర్వాత 'అప్పడూ' అని పిలవటమారంభించేడు.

".....ఏనుగు గానుగ తిరగమంటే అదే. కుంచమెళ్ళి అడ్డలో దూరవలసిన రోజులొచ్చేయి...." అప్పల్నాయుడి స్థితికి, తోటి గ్రామస్థుల సానుభూతి ఆకు పచ్చని పంటల్నీ, ట్రాక్టర్ సాగునీ, నోట్ల కట్టలూ, కమ్మదొరల సిగరెట్ పొగల్నీ, పెంకుటింటి టీ నీళ్ళనీ... నోరూరితే లొట్టలు వేసుకున్న.. .గ్రామస్థులకు నెమ్మదిగా వొక్కక్క పొరా తొలగి పోయి అసల దురంతమేదో గోచరించసాగింది.

పండిన పంటలు - తమ కళ్ళ ముందు నుంచీ, ఆకలి కడుపులు ముందు నుంచి పట్నాలు చేరిపోయేవి అన్నా, దద్దా, బావ, అక్కా, వరస, వావిల బంధుత్వాల స్థానంలో - కూలీ, మేస్త్రీ, గుమస్తా గుర్తింపులొచ్చేయి. గ్రామ ఉమ్మడి గోర్జిలు (దోవలు) రద్దయినాయి. చిన్న చిన్న రైతులూ తమ వ్యవసాయాన్ని, వృద్ధి జేసుకోవటానికి, కమ్మదొరనే ఆశ్రయించాల్సొచ్చేది ఆ

ప్రాంతంలోని రాజకీయ పెద్దలూ, ప్రభుత్వ అధికార్లూ గ్రామస్థుల కంటే - కమ్మదొరలనే గౌరవించనారంభించేరు

"బలమంతుడి సవ్వారి బగమంతుడు మోత్తాడని' సామెత యథార్థమై, మారుతున్న పరిస్థితులకు మూగసాక్షిగా అప్పల్నాయుడూ, గ్రామస్థులూ మిగిలేరు

అప్పుడొక సంఘటన జరిగింది

అప్పల్నాయుడి 'ఎడ్ల'ను బందెల దొడ్డికి, అదీ ఆ వూరినుండి దూరంగా, యెక్కడో వున్న "వీరఘట్టాం" బందెల దొడ్డికి - ట్రాక్టరెక్కించి తోలుకు పోబోయేడు కమ్మదొర !

పశువులు - మెరక మీద గడ్డి మేశాయి అది, పూర్వంనిండీ కేవలం పశువుల కోసం వొదిలేసిన మెరక. అల్లువారి మెరక గానీ, వాళ్ళు భూమి అమ్మినపుడు - యీ మెరకా దొరస్వాధీనమైంది దొరదాన్ని 'స్వంత ఆస్థి' అన్నాడు ఊరుమ్మడి 'పశుల మేత స్థలం' కాదన్నాడు పశులకాపరి పిల్లలు ధిక్కరిస్తే పశువుల్ని 'బందెల దొడ్ల'కు తోలుకుపోబోయేడు దొర.

నిజానికి ఆస్తి అనేది యేదయినా సామాజికమే. సామాజిక ఆస్తిని స్వంత ఆస్తిగా మార్చుకో జూసే యత్నాలే గత వర్తమానాలు! అందుకు జరిగిన ఘర్షణే చరిత్ర

అయితే, గ్రామం కళ్ళు తెరచింది. ఆర్థిక పరిణామాలు, రాజకీయ పరిణామాలు, మౌనంగా భరించిన జనం - సాంస్కృతిక దుర్మార్గం దగ్గర కొచ్చేసరికి ఆగ్రహించేరు. అందరూ ఆగ్రహంతో సమీకృతమై, 'బందెల దొడ్డి'కి పశుల్ని తోలుకుపోయేందుకు బయల్దేరిన కమ్మదొర 'ట్రాక్టర్'ని చుట్టుముట్టేరు. మానవహారం ముట్టడిలో - కాసుల యంత్రం మౌనంగా నిలబడి పోయింద'ని కథను ముగించేడు గౌరు నాయుడు. నిజానికి గ్రామస్థుల సున్నిత సాంస్కృతిక విలువమీద దాడితో ఆగ్రహం - కట్ట తెగింది. గానీ అప్పటికే అది ఆర్థిక, రాజకీయ, సామాజిక, దురాక్రమణకు ఆగ్రహంతో నిండి వుందన్నది కథలో మనకు కన్పిస్తుంది అప్పల్నాయుడు పాత్ర వొక ముఖ్య పాత్రగా కథ నడిచినా, గ్రామ ప్రజలూ, వారి బంధుత్వాలు, వారి సామాజిక బంధాలు, విలువలూ, పంటలూ, పశువులూ - అన్నీ యెట్నించో వొచ్చిన పెట్టుబడిదారీ వ్యవసాయ సంబంధాలకు , వాణిజ్య విలువలకు, ధన ప్రవాహ సుడిగుండాల్లో - యెలా గింగిర్లు కొట్టేయో, రక్త స్పర్శతో వివరించిన కథ 'తిరుగుడు గుమ్మి'. ప్రాంతీయ సాధికారతతో వొచ్చిన మరో కథ "భూమి పుండు". ఇది శ్రీకాకుళ సాహితి ప్రచురించిన "వంశధార కథలు' సంకలనంలో వొచ్చిన మంచి కథ నిజానికి యిది "తిరుగుడు గుమ్మి" కథకి కొనసాగింపు కమ్మదొరలు పెట్టుబడుల ప్రవేశం తర్వాత వొక దశాబ్ద కాలంలో జరిగిన మార్పులన్నీ - యీ కథలో కన్పిస్తాయి భూములు అమ్ముకున్నవాళ్ళు కూలీలుగా మిగిలిన దశ కాక, చిన్న చిన్న రైతులు - పెట్టుబడిదారీ వ్యవసాయ పద్ధతుల్లోకి వెళ్ళలేక, గతంలా మిగలలేక, భూములు పుండ్లుగా, ప్రణాలయి బాధించే స్థితిని చెప్తుందీ కథ.

స్వంతనేల పెట్టుబడుల ప్రవాహంలో మునిగిపోయి, యంత్రాలొచ్చి కూలిపన్లు పోయి, చిన్న రైతులూ, దొరలకే భూములు కౌలుకిచ్చేసి, - పట్నాలకూ, నగరాలకూ పనులకోసం వలస బోవటం, ఉత్తరాంధ్ర వర్తమానం ఇక్కడి పార్వతీపురం, చీపురుపల్లి, శ్రీకాకుళం, పలాస వగైరా రైల్వేస్టేషన్లలో గ్రామాలకు గ్రామాలే - గోనెసంచీ మూటలై, చంకల బిడ్డల్తో, పొట్ట చేత్తో పట్టుకు గూళ్ళొదిలిన పక్షుల గుంపులై - రైళ్ళు కిక్కిరిసిపోతున్నాయి అలా వలసబోయే ఓ రైతు, ముందురోజు రాత్రి, నిద్రబోలేక తెగిపోతున్న వేళ్ళను, కాలిపోతోన్న ఆశలను, కూలిపోతున్న బతుకునూ - మంచమ్మీద పరుచుకుని దొర్లి దొర్లి యేడుస్తాడు "వొకరాత్రి, రెండు స్వప్నాలు" కథలో

గౌరునాయుడికి మంచి గుర్తింపునూ, ప్రచారాన్నీ యిచ్చిన కథ "ఏటి పాట". ఈ కథ ఒక జానపద గాయకుడి జీవిత నేపథ్యంలోంచి నడిచిన కథ

"నాధుడి లేనిదే నగలింకేలనో తల్లీ, పురుషుడూ లేనిదే పూలు నాకేలమ్మా, సరసుడూ లేనిదే సంపదలు నాకేలమ్మా "

సంపదల్ని, సంసారాల్నీ, గత బంధాలనూ వొదులుకొని, ఆ పాట వెంట, ఆ రాగం వెంట వెన్నెల రాగమాలపించే చందమామ వెంట పరుగెత్తే తారలా సూరమ్మ, పాటకుడు పైడయ్య వెంట వెళ్ళిపోయింది.

శశిరేఖా పరిణయం, ఊర్మిళ నిద్ర, సీతమ్మగారి వనవాసం లాంటి పౌరాణిక కథలు, సన్యాసమ్మ కథ, దువ్వందొర కథలాంటి జానపద కథలూ అద్భుతంగా పాడి, బతుకు వెళ్ళదీసే పైడయ్యకు ఆ తర్వాత నాయిరాలమ్మ సూరమ్మ తన యింటిదయ్యాక, బతుకుయాతన యెక్కువైంది అంతకు ముందులో, గ్రామాల్లో ప్రజలు తన జానపదగానం వినటంలేదు రేడియో, టీవీ, సిన్మాలొచ్చి తన పాట పాచిదయ్యింది. అపుడే, వొక మాస్టారుకు పరిచయం. బతుకుపాట పరిచయం బతుకొక యుద్ధమని యెరుక! పాట మారింది. పాట పోరాట మయ్యింది. జీవన ఆరాటమయ్యింది ఫలితంగా గ్రామంలోని పెత్తందార్ల పగ. పైడయ్య దాడి, పైడయ్య హత్య.

"బుంగతోడు ఆడెవుడు.. పాలేరు ఈడెవుడు

తల్లి భూదేవి కాడ గొప్పోడు కాడెవుడు.." సూరమ్మ పెదాలు దుఃఖపు గొంతులో ప్రతిధ్వనించేయి నది ఒడ్డు మీద పైడయ్య మృతదేహం, యీ ప్రతిధ్వని గానం....! పాఠకునికి జానపద గానం నుండీ, వర్తమాన జనగానం దాకా - వొక విస్తృత జీవన గానాన్ని విన్పిస్తుంది. కథ ఆరంభం నుండీ, ముగింపు దాకా ఉపమానాలూ, కవిత్వ పదాలూ, పాటలూ, మరోవైపు బుగతలూ, కామందులూ వారి కామవికారాలూ, పేదల బాధల బతుకులూ, పోరాటాలూ.. కలగలసి . కథను హృదయమంతా విప్పి చదువుకుంటాం.

జీవితం గురించి సైద్ధాంతిక వ్యాఖ్యలా గాక అనుభవ సారాంశ వ్యాఖ్య - జేసే కథకుడు గౌరునాయుడు నిర్దిష్ట పరిస్థితుల్లో నిర్దిష్ట ప్రాంతంలో, జీవితంలో యెదురయ్యే సమస్యల్ని - ఆ నిర్దిష్ట సందర్భోచిత అనుభవసారంతో

పరిష్కారాన్ని సూచిస్తాయి జీవితాన్ని వ్యాఖ్యానిస్తాడు 'జీవసూత్రం', 'బతుకాకు'- కథలే ఉదాహరణలు

'జీవసూత్రం' కథలో వొక గ్రామంలో బీభత్స వాన వరద పిడుగులు పడతాయి వొక పిడుగుపాటుకి వొక పశులకాపరి మరణిస్తాడు గ్రామమంతా విచారిస్తుంది దుఃఖాన్ని దిగమింగుకొని మృతుని అంత్యక్రియల గురించి సమాలోచన చేస్తుంది సర్పంచ్, మాజీ మునసబు, కరణం అందరూ తర్జన భర్జన పడ్తారు సహజ మరణం కాదు గనక, పోలీస్‌లకు రిపోర్టివ్వాలే మోనంటాడు కరణం వాన, నది పొంగిపొర్లటం, రిపోర్టు సాధ్యం గాదని, ఊరందరొక మాటమీద నిలబడి, దహనం చేసేస్తే యే పోలీసులకీ, యేటీ తెల్దు, యేమయిపోదని కొందరూ, హమ్మో పోలీసుల్తోటి యవ్వారం, మాసెడ్డ సిక్కు- వొద్దొద్దని కొందరూ, చివరికి పొద్దు మలిగేవేళ గావడం, అంత్యక్రియలకి సమయం కాదని, రేపే అంత్యక్రియలు జరగాలి గనక, రేప్పొద్దున్నకే పోలీస్ రిపోర్టిచ్చెయాలనీ అందరూ నిర్ణయిస్తారు మర్నాటికి, శవ జాగరణ చేస్తారు మర్నాటి మధ్యాహ్నం ఒంటి గంట దాటిగానీ, పోలీసు అధికార్లు రాలేదు. వచ్చిన వాళ్ళు, సహజ దబాయింపుతో, పశుల కాపర్లనీ, ప్రజల్నీ, గ్రామ పెద్దల్నీ, భయపెట్టేరు. 'పిడుగుపాటు మరణం కాదది - అందరూ చేసిన హత్య' అని ఆరోపించేడు లారీలు ఝుళిపించేరు చివరికి, అయిదువేల రూపాయల సర్దుబాటుకి - కేసూ గేసూ మాఫీ అని బేరం పెట్టడం యువకులు గ్రామస్థులందర్నీ వొప్పించి, ఆ సమస్య పరిష్కారాన్ని తమ కొదిలెయ్యమనటం, ఆ విధంగా గ్రామస్థులు సమస్యను యువకుల కొదిలెయ్యగా, వారు అయిదు వేలూ యిస్తాం. పంచాయితీ ఆఫీసులో కూర్చోమని పోలీస్ అధికార్లకి చెప్పి, యిటువేపు అంత్యక్రియలకి యేర్పాట్లు చెయ్యటం జరుగుతుంది డబ్బుకోసం యెదురు చూస్తున్న అధికార్ల దగ్గరకు యువకులు పదిమంది వెళ్ళి, పంచాయితీ ఆఫీస్ రూము తలుపులు మూసేసి అధికార్లతో సమస్య పరిష్కరించుకుంటారు.

"లోకంలో యెన్నో ధర్మాలున్నాయి మారుతున్న కాలంతోపాటూ ధర్మాలు మారుతున్నాయి కానీ, కాలం మారినా తరాలు మారినా - ఎన్నటికీ మారని 'సూత్రం' వొకటుంది ప్రాణికోటి పూజలందుకొని కాపాడాల్సిన దైవం కాలనాగై పడగవిప్పి, కాటు వెయ్యబోతే, 'ఆత్మరక్షణార్థం' అమాయకత్వం తన కాలిగోళ్ళను కత్తులుగా మార్చుకొని, ముక్కును యీటెగా మార్చుకొని గరుడపక్షి అయి రెక్కలు విదిలిస్తుంది - అదే ఎన్నటికీ మారని "జీవసూత్రం" అని కథ ముగుస్తుంది తరతరాల జీవనానుభవసారంతో చేసే వ్యాఖ్యయిది

అలాగే "బతుకాకు" కథ కూడా - కూలికోసం మండుటెండల్లో కొండా కోనల్లు, రాళ్ళూ రప్పల, ముళ్ళ తుప్పల మధ్య - 'తునికి ఆకు' లు యేరేందు కెళ్తాడు 'పులి భోజనం' గాడు దప్పిక గొని, చావు దప్పి బతుకుతాడు. కొడుక్కి పెళ్ళిజేసి, యింటిలో ఆడదిక్కు యేర్పాటు జేసి, వున్నంతలో సుఖంగా ఉండాలని ఆరాటపడ్తాడు ఆకు యేరివేత కూలీరేట్ల పోరాటం సంగం, మరోవేపు ఫారెస్టు అధికార్ల జులుం పామూ, పురుగూ, రాయీ, రప్పా, దప్పికా అంతావొక భయంకర యాతనగా దినదినగండంగా వుంటుంది దినదినగండంలో

కొడుక్కి - రైలుబండిలోకి తునికాకుల మూట యెక్కించేసి, తనూ ఎక్కబోగా, జారిపడి కాలు తెగిపోయింది బతుకు . తెగి ముక్కలయ్యింది అయినా, పులిభోజనం, ఆ తునికాకు యేరటానికే వెళ్తుంటే కోడలు - యింకా ఆకుల కోసం యెళ్తావా? అని భయంతో ప్రశ్నించగా

" . అమ్మీ, పేదోడి బతుకే పెమాదం, పెమాదాలకి జడిత్తే బతకలేం. పేదరికమూ, పెమాదమూ నేస్తరికం గట్నాయి గావాల! ఒకటి పోతేగానీ, మరొకటి వొదల్దు. అంతదాకా పెమాదాల్తోటి పందెమేసి బతికీడమే మనకి మిగిలిన తోవ.." అనంటాడు కథ ఆ వాక్యంతో ముగుస్తుంది. జీవనానుభవ సారంతో వొచ్చిన వ్యాఖ్య అది!

తన చుట్టూవున్న జీవితాన్ని జీవిస్తూ, ప్రాంతాన్ని ప్రేమిస్తూ, అవాంఛనీయ పరిణామాలను ప్రశ్నిస్తూ, గతవర్తమానాలను దర్శిస్తూ కళింగాంధ్ర ఉచ్ఛ్వాస, నిశ్వాసాలకు కథనం జేస్తున్న అపురూప కథకుడు గౌరునాయుడు

# బమ్మిడి జగదీశ్వరరావు

♦ ఓల్గా ♦

బమ్మిడి జగదీశ్వరరావు విప్లవ కథకుడు విప్లవ కథలనీ, విప్లవకథకులనీ వేరుగా చూడాలా అనేది చాలామంది వేసే ప్రశ్న నా అభిప్రాయంలో విప్లవ కథ సమాజాన్ని చూసే పద్ధతిలో, అర్థం చేసుకునే పద్ధతిలో విశ్లేషించే పద్ధతిలో ఒక స్పష్టమైన మార్గంలో నడుస్తుంది కథకులందరికీ సమాజ జీవితమే ముడిసరుకు. ఐతే ఆ ముడిసరుకుని ఎవరు ఎలా ఏ ప్రయోజనం కోసం వాడుతున్నారనేదే చర్చించాల్సిన విషయం ప్రజలలో నీచాభిరుచుల్ని రెచ్చ గొడుతున్నారా? జీవితాన్ని పరిచయం చేసి ఊరుకుంటున్నారా? కఠోర వాస్తవాల్ని చూపి భయపెడుతున్నారా? జీవితం ఎడతెగని మార్పుతో కూడినదనీ దానిని సామాజిక హితానికనుగుణంగా మార్చుకోవచ్చనే ఆశను కలిగిస్తున్నారా? అనేది చూడాలి విప్లవ కథకుడు ఈ చివరి పని చేస్తాడు

చాలామందికి ఉండే ఇంకొక పెద్ద అపోహ - సిద్ధాంతానికి జీవితానికీ మధ్య పెద్ద అగాధమేదో ఉందనీ, ఈ విప్లవ రచయితలు సిద్ధాంతాలు రాస్తారనీ లేదా సిద్ధాంతాలను బలవంతంగా జీవితాలలో చొప్పిస్తారనేది. ప్రపంచాన్ని చూసి అర్థం చేసుకునేందుకు ఏ ప్రాపంచిక దృక్పథం లేని దరిద్ర నారాయణులు కొందరు లేవదీసిన ఈ భ్రమలో విప్లవ రచయితలు సైతం పడతారు. దేనికీ భయపడని రచయితలు నీ కథలో అంతా సిద్ధాంతం ఉందయ్యా జీవితం లేదు అనేసరికి భయపడిపోతారు. అది అపప్రథ అనుకుని దాన్ని తొలగించుకోటానికి నానాపాట్లు పడతారు. తాము ఇంకో నలుగురిని అదే మాట అంటారు. చివరికి మట్టి తీగలకు ముందుమాట రాసిన వరవరరావుగారు కూడా "ఆయనెక్కడా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించ డానికి ప్రయత్నించకపోయినా ." అని సిద్ధాంతం అనే భయంనుంచి బజరాను విముక్తం చేసి "వీటిల్లో జీవితమే కనిపిస్తుంది" అని వెన్ను తట్టారు కానీ వెంటనే ఉపయోగపు విలువకూ మానవ సంబంధాలకూ మధ్య జరిగిన ఘర్షణలో మానవ సంబంధం గెలిచిన తీరుని వివరించారు. నిజానికి ఉపయోగపు విలువ కథలో మొదటి నుంచీ ఉంది. దానిని విమర్శకులు ఎంత బాగా ఎత్తి చూపితే పాఠకులకు మానవ సంబంధాల్లో వచ్చే ఘర్షణల మూలాలు అంత బాగా అర్థమవుతాయి ఆ ఆర్థిక సంబంధాల సారాంశాన్ని విప్పి చెప్పే సిద్ధాంతాన్ని ఒంటబట్టించుకున్న రచయితే ఆ దృష్టితో మానవ సంబంధాలను చిత్రీకరించ గలడు కథలో పాత్రల స్థితిగతుల్ని బట్టి నేపథ్యాన్ని బట్టి చైతన్యాన్ని బట్టి

ఎంత మోతాదులో ఎలాంటి శిల్పంతో చెప్పాలో రచయిత నిర్ణయించుకుంటాడు కాని విషాదం ఏమిటంటే వెన్నెల, చందమామ, పూల తీగలూ, పరిమళాలూ, కన్నీళ్ళు యింకా అనేకానేక ఉపకరణాలు పేజీకి పుంజీడు నింపితే ఆ కథలో జీవితం, శిల్పం ఉన్నట్టు, అవేమీ లేకుండా ఉన్న విషయాన్ని ఉన్నట్టు రాసిన, చైతన్యవంతమైన పాత్రలున్నా అందులో జీవితం, శిల్పం ఏమీ లేనట్లు భయపెడతారు రచయితలూ భయపడతారు భావుకత కథలో పాత్రకుంటే ఆ పాత్రను భావుకతతో చిత్రించాలి రచయిత రచయితే భావుకుడై ప్రతి పాత్రనూ, కథనూ భావుకతతో నింపేసి అదే జీవితమనీ, శిల్పమనీ భయపెట్టే విమర్శకులున్న రోజుల్లో బజరా ఒక సిద్ధాంత నిబద్ధతతో జీవితంలోని పలు కోణాలను చూశాడు ఆ సిద్ధాంతంలోని బలాలూ, బలహీనతలూ కూడా ఆయన కథలలోకి వస్తాయి వచ్చాయి. కానీ ఆ కథలకొక వెన్నెముక ఉంది

'రెక్కల గూడు', పిండొడిం', 'మట్టి తీగలు' మూడు కథా సంకలనాలలోని 33 కథలు బమ్మిడి జగదీశ్వరరావు తెలుగు సాహిత్యంలో ఉత్తమశ్రేణి కథకుడని తేల్చి చెప్పాయి. మొదటి సంపుటం రెక్కల గూడులో బజరా ప్రధానంగా స్త్రీల జీవితాలను స్పృశించాడు ఆ జీవితాలలో గూడు కట్టుకుని ఉన్న హింసనూ, దు:ఖాన్నీ, అభద్రతనూ విప్పి చెప్పాడు స్త్రీలు తమని తాము తిరస్కరించుకుని, తమని తాము లేకుండా చేసుకునే క్రమంలోకి వివాహమనే వ్యవస్థ ద్వారా ఎట్లా నెట్టబడతారో 'సరుకు' కథలో బజరా చెప్తాడు. ఆ కథలో రాజేశ్వరి పెళ్ళికోసం తన పేరు మార్చుకుంటుంది ప్రధానంనాడు ఆమె వేలికున్న చిన్న లోపాన్ని చూసి ఆమెకు ఐదు నిముషాల ముందు కట్టబెట్టిన చీరా జాకెట్ విప్పేసుకుపోతారు పెళ్ళి కొడుకు తాలూకు మనుషులు. ఈ కథ చదివి వాళ్ళమీద కోపం తెచ్చుకోవటం చాలా సులభం లోకంలో ఇలాంటి వాళ్ళు కూడా ఉంటారనుకుని, మనం మరీ అలాంటివాళ్ళం కాదులే అని పాఠకులను తృప్తి పడనిస్తే 'సరుకు' కథా ప్రయోజనం నెరవేరదు. వివాహ వ్యవస్థ ఇలాంటి రాక్షసులను తయారు చేస్తుందనీ, ప్రతి స్త్రీ ఏదో ఒక స్థాయిలో ఈ హింసకు గురవుతుందనీ అర్థం చేసుకున్నపుడే మనం సమూలమైన మార్పు గురించి ఆలోచిస్తాం అలా ఆలోచింపజేసే రచయిత బజరా భరణం కథలో రచయిత వివాహం స్త్రీకి జీవితకాల నిర్బంధం ఎలా అవుతుందో చెబుతాడు. "విడాకులు పొందినా ఆడది స్వంత ఆస్తే దాని మీదెవ్వడూ చెయ్యి వెయ్యా కూడదు. నీడ పడకూడదు ఒకసారి తాళి కట్టించుకున్న నేరానికి జీవితాంతం కట్టుబడి ఉండాలి అలా కట్టుబడి ఉండటానికే, నిర్బంధించడానికే మనోవర్తి అందుకే భరణం చెల్లిస్తారు దానికే చట్టాలు, కోర్టులూ కాపలా కాస్తాయి" పైకి స్త్రీలకు సహాయపడుతున్నట్లు కన్పించే ఈ పద్ధతుల వెనకాల ఎప్పటికీ స్త్రీలను పరాధీనులుగా చేసే కుట్ర ఉందని 'భరణం' కథతో అర్థం చేయించారు రచయిత వివాహేతర సంబంధాలలో ఉన్న హింసను విప్పి చూపే 'రెక్కల గూడు' వంటి కథ అపురూపమైన అరుదైన కథ. ఇటువంటి కథలు కలకాలం నిలిచే కథలు

ఈ సమాజంలో భార్యమీద కంటే తన సంబంధంలోకి వచ్చిన ఇతర స్త్రీల మీద ఎక్కువ హింస జరిపే అవకాశం మగవాడికి ఎంత ఉందో రెక్కల గూడు కథ చెబుతోంది భార్యమీద భర్త హింస జరిపితే ఆమె తరపున మాట్లాడానికి పుట్టింటివారో, మాటసాయానికి యిరుగు పొరుగులో వుంటారు వాళ్ళు ఏ సహాయమూ చెయ్యలేకపోయినా ఆమె కనీసం నోరువిప్పి తనగోడు చెప్పుకునే అవకాశమైనా వుంటుంది. ఒకరిద్దరి సానుభూతైనా దొరుకుతుంది ఒక నైతికబలం, హక్కు తనకున్నట్లు ఆమె భావించే అవకాశం వుంటుంది కానీ వివాహేతర సంబంధంలో - భర్త వున్నప్పుడు మరొక పురుషునితో పెట్టుకొనే సంబంధంలో జరిగే హింసకు ఎవరినుంచీ చిన్న మాటసాయం కూడా దొరకదు ఆ హింస తీవ్రస్థాయిలో జరుగుతున్నకొద్దీ చుట్టు పక్కలవాళ్ళు, చుట్టపక్కాలూ తృప్తి కూడా పడతారేమో అన్నట్లుంటుంది వారి ప్రవర్తన సమాజపు కట్టుబాట్లు దాటినందుకు తగిన శాస్తి జరిగిందంటారు ఒక వేళ యింత 'హింస' లేకపోతే 'తగినశాస్తి' ఆమెకు జరిగి తీరుతుందనే నమ్మకంతోనే ఈ నీతిమయ సమాజం వూపిరి పీలుస్తుంటుంది ఐతే దీనివల్ల మనకర్థమయ్యే దేమిటి? వివాహేతర సంబంధాల్లో హింసకు సాంఘిక మద్దతు వుంటుంది దానిని ఒంటరిగా ఎదుర్కోవాలి కాబట్టి ఆ సంబంధాలలోకి పోగూడదనే నిర్ధారణకు రావటమా? ఆ నిర్ధారణకు రావటానికి రెక్కల గూడు కథ అక్కర్లేదు. పురాతన సాహిత్యం చాలానే ఉంది వివాహేతర సంబంధంలోని హింసను చిత్రించిన 'రెక్కల గూడు' మనకు చెప్పేదేమిటి? స్త్రీలు తమ లైంగికత్వాన్ని తాము నిర్వచించుకోవాలి. తమ లైంగికత్వం మీద కంట్రోలుని తమ చేతుల్లో వుంచుకోవాలి. అట్లా కానినాడు అది ఏ సంబంధమైనా అనివార్యంగా హింస జరుగుతుంది భార్యలకూ, తల్లులకూ దొరికే కొద్ది సాంఘిక మద్దతు పైకి కొంత బలాన్నిచ్చినట్లు కనిపించినా ఆ మద్దతు యొక్క అసలు రహస్యం స్త్రీల లైంగిత్వాన్ని అదుపు చేయటమే మా మాట విని మేం విధించిన కట్టుబాట్లకు లొంగితే ఏదన్నా సాయం చేస్తే చేస్తాం అంటే అర్థమేమిటి? పైగా ఆ సాయంకూడా చెయ్యకుండా వుండటానికి వాళ్ళు ఎన్ని వక్రమార్గాలో కనిపెట్టారు. ఆలుమగల తగవుల్లో మరొకరు తలదూర్చరాదనీ, కుటుంబ విషయాలను బైటికి తేగూడదనీ, ఇంటిగుట్టు రచ్చకీడ్వరాదనీ రకరకాల భావ జాలాలతో స్త్రీల మెదళ్ళను తినేశారు ఇవన్నీ దాటుకుని బైటికివస్తే కూడా జరిగే సాయం అంతంత మాత్రమేనని వరకట్న హత్యలూ, విచారణలూ మనకు చెబుతూనే వున్నాయి. కాబట్టి వివాహసంబంధంలో హింసనుంచి స్త్రీలకు సాంఘిక మద్దతు దొరుకుతుందనీ, ఏ కాస్త రక్షణో దొరుకుతుందనే భ్రమలోంచి బైటపడి - ఏ సంబంధమైనా అది మనమీద మనకున్న అధికారాన్ని నాశనం చేయనిదై వుండాలని మనం అర్థం చేసుకోవాలి. మన రెక్కలు బలంగా వుండాలి మనం ఎటైనా స్వేచ్ఛగా ఎగరగలమనే విశ్వాసం మనమీద మన కుండాలి మన జీవితాన్ని మన యిష్ట ప్రకారం గడిపేందుకు మన రెక్కలతో మనకొక స్వంతగూడు నిర్మించుకోవాలి. అప్పుడు మన బలాన్ని చూసి మన

శత్రువులు భయపడతారు మన జీవితానందం మనకు దక్కుతుంది మన కష్టానికి ఫలితం దొరుకుతుంది మన రెక్కల మీద తప్ప మరి దేని మీదా విశ్వాసం వుంచుకోవద్దని మన మనసుల మీద చెరగని ముద్రవేసి చెబుతుంది 'రెక్కలగూడు'. ఏ సాహిత్యంలో నైనా యిట్లాంటి కథలు అరుదుగా వుంటాయని చెప్పగలిగిన అపురూపమైన కథ 'రెక్కల గూడు'

'ఎర్రకలువ' ఈ సంపుటిలోని మరో విలక్షణమైన కథ ఎర్రకలువ పోరాట కథ ఫాక్టరీలలో సమ్మెలు, రైతులు పడే కష్టాలు, ప్రభుత్వ నిర్బంధాలు ఆర్థిక విధానాలవల్ల నగరాలకు వలసపోతున్న ప్రజలు, అక్కడ వారి కొత్త సమస్యలు, పోరాటాలూ ఇవన్నీ ఈ కథలో వున్నాయి. ఇలాంటి కథలు యింతకుముందూ వచ్చాయి ఆ కథలకూ దీనికీ ముఖ్యమైన తేడా ఒకటుంది సామాన్యంగా పోరాటాలలో, పోరాటాలకు దారి తీసే సంక్లిష్ట సమయాలలో కుటుంబ భారాన్ని స్త్రీ ఎంతగా మోస్తుందన్న విషయం చాలా కథలలో కనిపించదు ఫాక్టరీ సమ్మె గురించో, కార్మిక కర్షకుల దోపిడీ గురించో రాసే రచనలలో ముఖ్యంగా ఉండేది ఉత్పత్తి జరిగే చోట జరిగే దోపిడీ గురించీ, పోరాటం గురించీ, దానివల్ల ఆ దోపిడీ భారాన్ని అందరికంటే ఎక్కువ మోసేది స్త్రీలే అనే విషయం సామాన్యంగా ఎవరి దృష్టికీ రాదు అభారాన్ని స్త్రీల వైపునుంచి, చిత్రించటంలో 'ఎర్రకలువ' ప్రత్యేకత వుంది ఈ కథలో గున్నమ్మపల్లెలో వుంటూ, 'వున్న కొద్ది భూమినీ సాగుచేస్తూ యిల్లు నడుపుతుంటే, భర్త జూట్ మిల్లులో పనిచేస్తుంటాడు మిల్లు మూసేస్తే ఇల్లు చేరిన భర్త, బళ్ళు మూసేస్తే ఇల్లు చేరిన పిల్లలూ, గిల్టు దిద్దులూ, బేసరీ పడక ముక్కులకూ, చెవులకూ పుల్లలు పెట్టుకుని పుళ్ళు చేసుకున్న కూతురి బాధ - ఉద్యోగం పోగొట్టుకుని ఇల్లు చేరిన మరిది, అప్పులు కట్టమని వేధించే బ్యాంకువాళ్ళు, విత్తనాలకని తెచ్చిన గింజలు కాచిపోయాల్సిన స్థితీ, కరువు, పోలీసుల దాడీ - గున్నమ్మకు ఒక సమస్య కాదు ఒక బాధ కాదు, ఈ అన్ని సమస్యల్లోంచీ బాధల్లోంచీ ఆమె ధైర్యాన్ని, బలాన్ని తెచ్చుకుంది బాధపడుతూ, భయపడుతూ కూచుంటే కాదని నడుంబిగించి ఇంటా బయటా విరామం లేకుండా పనిచేసింది పోరాడింది తనలాంటి స్త్రీలను చూసి ఉత్సాహాన్నీ, ధైర్యాన్నీ తెచ్చుకుంది పోరాటంలోకి వస్తున్న స్త్రీల గురించి వాస్తవంగా సాగిన కథ ,ఇది ఐతే గున్నమ్మకు భర్తనుంచి గానీ, కుటుంబంనుంచిగానీ ఎలాంటి నిర్బంధం, హింసాలేకపోవటం కేవలం ఆమె అదృష్టమో - జగదీశ్వరరావుగారి కార్మికవర్గ పక్షపాతమో! ఆర్థిక దోపిడీ, అణచివేతలకు కూడా స్త్రీలను సరుకులుగా చేసి, వారి శ్రమశక్తినీ, పునరుత్పత్తి శక్తినీ కంట్రోలు చేయటం అనేది ముఖ్య కారణాలు. అవి కూడా ఈ కథలో వచ్చివుంటే కథ మరింత సమగ్రంగా వుండేది

'లక్కపిడతలు' కథ జండర్ వివక్ష చిన్నతనంనుండీ కుటుంబంలో ఎలా అమలవుతుందో చూపిస్తుంది ఆడపిల్ల ఆట వస్తువులు లక్కపిడతలు మగపిల్లలకు బంతులూ, బొంగరాలూ, గోలీలూ, తుపాకులూ ఎన్నో వుంటాయి

ఆడపిల్లలకు బుల్లి బుల్లి స్టవ్వులు, గిన్నెలు, బొమ్మల పెళ్ళిళ్ళు చెయ్యటానికి చిన్న చిన్న పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు బొమ్మలు, నీళ్ళుపోసి, పౌడరేసి, అన్నంపెట్టి, నిద్రపుచ్చి పెంచుకోటానికి బుల్లిపాపాయిల బొమ్మలూ వుంటాయి. తమ జీవితాలకు ముఖ్యమైన విధులను చిన్నతనంలోనే నేర్చేసుకుంటారు ఆడపిల్లలు ఇక ఆ లక్కపిడతలు దిష్టి పిడతలై జీవితాంతం వెంబడిస్తాయి తోమిన గిన్నలేతోమి, వూడ్చిన యిళ్ళే వూడ్చి, చేసిన పనే చేసే స్త్రీలు తామంటే తమ బాధ్యతలనే నమ్ముతారు. మొత్తం సమాజమంతా అలాగే నమ్ముతుంది. భార్య పుట్టింటికి వెళ్తే భర్త భోజనం గురించి యిరుగు పొరుగులకూ, స్నేహితులకూ, బంధువులకూ ఎంతో శ్రద్ధ అతనికి ఆహ్వానాలు అందుతాయి. సానుభూతి వెల్లువవుతుంది అదే భర్త వూర్లో లేనపుడు భార్య తన యిల్లు చక్కబెట్టుకుని, తనకు పని తగ్గింది గనక యిరుగు పొరుగుకు సాయం చెయ్యాలి ఆమె నెవరూ భోజనాలకు పిలవరు. హోటల్ కెళ్ళడం ఆమెకూ, చుట్టూవారికీ కూడా అఘాయిత్వపు పనిలా కన్పిస్తుంది ఈ జండర్ వివక్షను లక్కపిడతల కథ చిత్రిస్తే, ఆ వివక్షను ప్రచార సాధనాలు మరింత స్థిరపడేలా చేసే క్రమం గురించి 'మా యింట్లో మహాభూతం' కథ చెబుతుంది. ఇది చాలా ముఖ్యమైన కథ. ఈ సంకలనంలో టీ.వి. ప్రకటనలను ఆనందంగా చూసేవాళ్ళు తాము మింగుతున్నది ఎట్లాంటి విషమో గ్రహించరు. మొత్తం విషాన్ని రక్తంలోకి ఎక్కించి మానవ రక్తాన్ని కలుషితం చేస్తాయి టి.వి., సినిమాలు వాటిని ఎదుర్కోవటం ఎట్లా అన్నది పెద్ద ప్రశ్న. అసలు వాటిపై ప్రజల వ్యతిరేకతను కూడగట్టడమే పెద్ద పని. పెద్ద ఫ్యాక్టరీలలో నెలల తరబడి సమ్మెలు నిర్వహించవచ్చు. నిర్వహించగల యూనియన్లు, నాయకులు వుంటారు. కానీ టి వి.లను కొనకుండా ఆ కార్యక్రమాలు తయారు కాకుండా; సినిమాలను ఆడనివ్వకుండా చేయటం. యివి చెయ్యగలిగిన సంఘాలు ఇప్పటివరకు లేవు. వినోదం, సమాచారం పేరుతో ఈ రెండు ప్రచార సాధనాలూ కక్కుతున్న విష కాలుష్యాన్ని ఎట్లా ఎదుర్కోవాలో సీరియస్‌గా ఆలోచించాల్సిన అవసరం ఉంది. స్త్రీల వైపు నుంచి అదెంత ముఖ్యమో, ఎంత అత్యవసరమో బమ్మిడి జగదీశ్వరరావు కథ గుర్తు చేస్తుంది

స్త్రీల గురించి సమాజంలో వున్న మిత్‌లను విప్పి చూపిస్తూ, స్త్రీల బలాన్ని, వారు తమ మీద తాము అధికారం సంపాదించుకోవాల్సిన అవసరాన్ని చెప్పే ఈ కథలు స్త్రీవాద సాహిత్యానికి మరింత బలాన్నిస్తాయి వర్గము, లింగమూ రెండూ అణచివేత క్రమంలో ఒకదానికొకటి సహాయపడుతున్నాయనీ, వర్గ దోపిడీ, పురుషాధిపత్యమూ ఒకదానినుంచి ఒకటి విడదీయలేనంతగా పెనవేసుకు పోయి ఉన్నాయనే కథలు బమ్మిడి జగదీశ్వరరావు రాయగలడనే నమ్మకం ఈ కథలు చదివినపుడు మనకు కలుగుతుంది

వస్తు వ్యామోహం విపరీతంగా పెరిగిపోతున్న రోజుల్లో ఆ వ్యామోహం మనుషుల్ని ఒకరినుంచి ఒకరిని ఎలా దూరం చేస్తుందో 'పెనం' కథ చెబుతుంది. వస్తువు వాడుకోవటానికికాక హోదాకు సంకేతమైనపుడు వస్తువులకు మనుషులకూ

మధ్య సంబంధాలూ, మనుషులమధ్య సంబంధాలు ఏమవుతాయి అన్న విషయం మీద చాలా తక్కువ కథలే వచ్చాయి అలాగే వస్తు వ్యామోహంలో అప్పులు చేయటం, అవి తీర్చలేక ఆత్మహత్యలు చేసుకోవటం గురించిన మంచి కథ 'ఒక హత్య - మరో ఆత్మహత్య', 'మట్టి తీగలు' కథ జీవితం మనుషుల మధ్య సంబంధాలను మార్చి వారి మనసుల నెంత కఠినం చేయగలదో చూపే కథ మనుషుల మధ్య ప్రేమలుంటాయి తగిన జీవన పరిస్థితులుంటే అవి చక్కగా వికసిస్తాయి కూడా ఆ మానవ పరిమళాలు నలుదెసలా విరజిమ్మే అవకాశం లేకుండా చేస్తుంది కర్కశ సమాజం ఈ సమాజంలో మనుషులు మనుషులుగాక ఉపయోగ విలువ వున్న వస్తువులుగా మారతారు తల్లి, తండ్రి, అక్క, తమ్ముడు స్నేహితులు తోటి మానవులు అందరూ ఈ ఉపయోగపు విలువ కోసం తూచబడతారు విలువ కట్టబడతారు తోసివేయబడతారు ఈ తూకానికి అతీతంగా మనుషులను ఆత్మీయతతో స్నేహంతో విలువకట్టే హృదయం మానవులకుంటుంది ఆ సున్నిత హృదయానికి కర్కశ లోకపు విలువలకూ నిరంతరం యుద్ధం జరుగుతుంటుంది ఆ యుద్ధంలో చాలాసార్లు సున్నితత్వం కోల్పోతారు మానవులు కొన్నిసార్లు గెలుస్తారు ఒకరినొకరు ఆప్యాయంగా అల్లుకోగలుగుతారు. అలా అల్లుకునే మట్టి తీగలు చేసే జీవన పోరాట స్పర్శను 'మట్టి తీగలు' కథ మనకు చూపుతుంది

పరాయీకరణకు గురవుతున్న మానవుల మీద ప్రేమ బజరా కథలన్నిటిలో మనకు కనిపిస్తుంది ముఖ్యంగా ఆర్థికరంగంలో సరళీకరణ ప్రవేశించినప్పటి నుంచీ, అంతంత మాత్రంగా అమలవుతున్న సంక్షేమ పథకాలు అసలే అటకెక్కి నప్పటినుంచీ మన గ్రామీణ ఆర్థిక పరిస్థితి రోజు రోజుకీ క్షీణించిపోతోంది. గ్రామాలలోని దుర్భర దారిద్ర్యం అక్కడి మనుషుల మధ్య అగాధాలను సృష్టిస్తోంది పరాయీకరణ అక్కడ సైతం తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది ఆ విశ్వరూపంలోని కొన్ని భాగాలను బజరా తన కథలలో ప్రతిభావంతంగా ఆవిష్కరించాడు. పండించే రైతుకు పంట ధర నిర్ణయించే అధికారం లేకపోవడం, అవసరాల ఒత్తిడిలో సమూహంగా నిలవాల్సిన రైతులు ఎవరికివారై పోవటం గురించి రాసిన కథ 'గతుకులు' కులం జలగలా పట్టి మనుషుల్ని పీడిస్తున్న తీరు వివరించే కథ జలగ ఒకవైపు రక్తం పీల్చే వర్గ దోపిడీ, మరో వైపు ఆత్మాభిమానాన్ని దోచే కుల అణచివేత ఈ రెండింటినీ అధిగమించాల్సిన పేద దళితుల గుండె ఎంత పెద్దదో 'జలగ' కథ చెప్తుంది జలగ పట్టుకుంటే, ఆ పట్టుని ఒదిలించటానికి దాని మీద పొగాకు నమిలి ఖాండ్రించి ఉమ్మెయ్యాలి దళితులు ఈ కులవర్గ దోపిడీల మీద కూడా చెయ్యాల్సింది ఆ పనేనని చెప్పక చెప్పిన మంచి కథ 'జలగ'

సమాజంలోని సకల విషయాలనూ నడిపించే సామాజిక చలన సూత్రాలను అర్థం చేసుకున్న వారు రచయితలైతే, వారికి భాష మీద మంచి పట్టు ఉంటే తమ చుట్టూ ఉన్న జీవితాల్ని గమనించే ఓపికా తీరికా ఉంటే ఎలాంటి

మంచి కథలు రాయొచ్చో బజరా కథలు నిరూపిస్తాయి మాండలీకంతో బజరా మంచి సొగసుని కథలోకి తీసుకొస్తాడు సామెతలూ, నుడికారాలూ పుష్కలంగా వాడతాడు ఎంతో అవసరమైతే తప్ప ఇంగ్లీషు పదాలు దొర్లించడు వాక్య నిర్మాణంలో సంక్లిష్టత్వం ఉండదు వర్ణనలు వర్ణనల కోసం కాకుండా వాతావరణాన్ని మన కర్థం చేయించడానికి చేస్తాడు ఆ వాతావరణానికీ కథా గమనానికీ సంబంధం ఉన్నప్పుడే ఆ వర్ణనలు చేస్తాడు అందువల్ల అవి మనల్ని విసిగించవు భాషను ఉపయోగించటంలో ఇతను ఎంతో సంయమనం పాటిస్తాడు అవసరమైన చోట ఎంతో నిర్మొహమాటంగా రాస్తాడు కాబట్టి అనవసరమైన చోట కేవలం కథను గ్లామరైజ్ చెయ్యటానికి పదాలను గుప్పించాల్సిన అవసరం అతనికి రాలేదు విలువలు, అభివృద్ధి, సంస్కృతివంటి సంక్లిష్టమైన విషయాలను కథారూపంలో ఖచ్చితమైన అవగాహనతో చెప్ప గలగటం బజారా ప్రత్యేకత

# కుప్పిలి పద్మ

♦ బి. తిరుపతిరావు ♦

తెలుగు కథా సాహిత్యం ఎనిమిదవ దశకం తరువాత వస్తురూపాల్లో గొప్ప మార్పులకు లోనయిందనటంలో అతిశయోక్తి ఎంత మాత్రం లేదు ఈ మార్పులకు కారణమయిన శక్తులలో ఒకటి స్త్రీవాదం అనటం కూడా వాస్తవ విరుద్ధమయిన విషయం కాదు. స్త్రీవాదుల ఈ కృషిలో కుప్పిలి పద్మ పాత్ర కూడా ఉంది. ఆ కృషి కొనసాగింపులో భాగమే ఆమె రాసిన కథలు కుప్పిలి పద్మ దాదాపు ఒక దశాబ్దంన్నర పైగా స్త్రీవాద సాహిత్య ప్రపంచంలో వుంది. అనేక కథలతో పాటు, ఒకటి రెండు నవలలు రాసింది. మామూలుగా మన ప్రవచనాల్లో విస్మరించబడే అనేక సూక్ష్మ విషయాలను, వాటి రాజకీయ ప్రాధాన్యతను విశ్లేషిస్తూ పత్రికలలో 'కాలమ్స్' రాసింది, రాస్తోంది అందువల్ల ఈ మధ్య కాలంలో జరిగిన చర్చలు, వాదోపవాదాల నుంచి రూపొందిన స్త్రీవాద సాహిత్య చేతనకు ఆమె అతీతంగా వుండటం అసాధ్యం నిజానికి ఈ చేతనే ఆమె సాహిత్య సృజనకి ప్రధాన ప్రేరకం కాబట్టే సమకాలీన సాహిత్యంలో కుప్పిలి పద్మ సాహిత్యాన్ని గురించి ఒక అవగాహనకు రావటానికి ఈ దశాబ్దన్నరకాలంలో స్త్రీవాద భావనలు సాహిత్యంలో ఏస్థాయిలో ప్రతిఫలించాయి, ఏ కొత్త ప్రతిమానాల్ని ముందుకు తెచ్చాయి అనే విషయాల్ని మననం చేసుకోవటం అనివార్యమౌతుంది.

తెలుగులో స్త్రీవాదం ముందుకు తీసుకువచ్చిన కీలకాంశాలలో **మొదటిది:** వైయక్తికాంశాలకున్న రాజకీయ పార్శ్వాన్ని చూడటం, రెండు · స్త్రీలను పురుషుడి అనుభవాలకు objects గా చూడటం కాకుండా, అసలు సామాజిక విశ్లేషణలనే స్త్రీల అనుభవం నుండి చేయటం, **మూడు:** అమలులో వున్న భాషని, ప్రతిమల్ని, ప్రతిమానాల్ని(paradigms) ప్రశ్నించటం, నాలుగు రచన (ఏరచననైనా) దానికదే ఒక జండర్ వ్యక్తీకరణగా వుంటుందని గుర్తించటం, ఐదు: చరిత్రలో మార్జినలైజ్ చేయబడిన స్త్రీల పాత్రని వెలికితీసి స్త్రీ చరిత్రకు రూపకల్పన చేయటం, **ఆరు:** పితృస్వామిక సమాజపు అధికార నిర్మాణాలను, సంబంధాలను నిరాకరించటం, ఏడు: సాంఘిక, వైయక్తిక విముక్తులను గురించి పునరాలోచనలు చేయటం, ఎనిమిది: వ్యాఖ్యాన ప్రతిమానాల్ని (interpretative paradigms) మార్చుకోవటం, **తొమ్మిది** : ఏ సామాజిక జ్ఞాన సంబంధ విషయమయినా భాష ద్వారా filter అవుతుందని (ముఖ్యంగా స్త్రీల విషయంలో పితృస్వామిక సంస్కృతి పునాదిగా గల భాష ద్వారా) గుర్తించటం, పది: కుటుంబాన్ని లైంగికతకి కేంద్రంగా, లైంగిక సంబంధాల్ని నియంత్రించే లేక కుదించే స్థానంగా చూడటం స్థూలంగా

ఈ విషయాలన్నీ ఈ దశాబ్దన్నరకాలంలో కొంత శక్తివంతంగానే తెలుగు సాహిత్య ప్రపంచంలోకి వచ్చాయి దీని వెనుక అనేకమంది స్త్రీవాద రచయితల పాత్ర వుంది అలాగే చరిత్ర, సాహిత్య విమర్శ రంగాలలో కూడా స్త్రీవాదులు పరిగణింప దగిన కృషి చేశారు ఈ కృషి మొత్తాన్ని చాలావరకు తన రచనల్లో సంలీనం చేసుకోవటమే కాకుండా, ఆ కృషిని మరింత విస్తృతపరిచే ప్రయత్నం కుప్పిలి పద్మ చేయటం కన్పిస్తుంది అయితే కుప్పిలి పద్మ ప్రధాన రంగం కాల్పనిక సాహిత్యం కాల్పనిక రంగంలో ఆమెకృషి సాలభంజిక కథల సంపుటంలో కన్పిస్తుంది

పదకొండు కథలున్న సాలభంజిక సంపుటిలో దాదాపు అన్ని కథలూ స్త్రీ పురుష సంబంధాలలో చాలా సున్నితాంశాలకు సంబంధించినవి అయితే ఈ సున్నితాంశాల వెనుకనున్న దారుణాన్ని, దానికి కారణమయిన పితృస్వామ్య ఆలోచనా ధారని ఈ కథలు బహిర్గతం చేస్తాయి. జీవితాన్ని స్థూల క్షేత్రాల్లో పరిశీలించటం కొంచెం తేలికే, అయితే సూక్ష్మ క్షేత్రాల్లో వుండే సంక్లిష్టతల వల్ల అనివార్యంగా ఆ సూక్ష్మాంశాల్ని విశ్లేషించటం, పరిశీలించటం కష్టతరం అవుతుంది. అయితే స్త్రీవాదులు దీన్ని తేలిగ్గా అధిగమించగలిగారు. జీవితపు పరిశీలనల్లో, విశ్లేషణల్లో మరింత సూక్ష్మ క్షేత్రాల్ని, సంక్లిష్టతల్ని సాహిత్యంలో శక్తివంతంగా ఆవిష్కరించగలిగారు ఈ సంపుటిలోని కుప్పిలి పద్మ కథలు ఈ విషయాన్నే మరొకసారి రుజువు చేస్తాయి

మనిషి ఆనందాన్ని కేవలం ఆర్థిక కోణం నుండి అర్థం చేసుకునే పద్ధతికి ఇవ్వాళ విలువలేదు. ఆర్థికేతర అంశాలకున్న ప్రాధాన్యత కూడా ఇవ్వాళ మనకి స్పష్టమవుతోంది ముఖ్యంగా స్త్రీ పురుషుల సంబంధాన్ని ఆర్థికాంశాలు మాత్రమే నియంత్రించలేవనే విషయం కూడా ఇవ్వాళ అవగతమౌతోంది. స్త్రీ మానసిక అవసరాలకీ, ఇష్టాయిష్టాల వ్యక్తీకరణలకీ, కేవలం వ్యక్తీకరణకేకాక వాటిని వాస్తవ స్థితిలో అమలు చేసుకోగలిగే space భార్యభర్తల సంబంధంలో తప్పనిసరిగా వుండాలనే చైతన్యం ఇవ్వాళ పెరుగుతోంది space లభ్యం కానప్పుడు ఆ సంబంధం విచ్ఛిన్నమవటం అనివార్యమౌతోంది. ఈ స్పేస్ లేనిది ప్రధానంగా స్త్రీకే కాబట్టి స్త్రీనే ఈ విషయంలో నష్టపోతోంది కుప్పిలి పద్మ సాలభంజిక సంపుటిలో చాలా పాత్రలు ఈ space కోసమే తపిస్తుంటాయి. ఆ space లేని స్థితిలో ఉండే ఊపిరాడనితనాన్ని వ్యక్తపర్చుతూ వుంటాయి. మరింత నిర్దుష్టంగా చెప్పాలంటే ఇదీ ఒక రకమైన అస్తిత్వ అన్వేషణ అతని కలలు అనే కథలో చిత్రించబడింది ఈ space కోసం చేసే అన్వేషణే. ఈ అన్వేషణలోనే 'ఆమె' అతని నుంచి విడిపోతుంది. 'అతని' అభివృద్ధి క్రమంలో 'ఆమె' other గా మిగలటం వల్ల తాను కోల్పోతున్న జీవితాన్ని (తనకిష్టమైన జీవితాన్ని) గురించిన తపనతో ఆమె వేరు పడుతుంది. 'అతని' అభివృద్ధి క్రమంలో ధ్వంసమవుతూ వున్న 'ఆమె' మానవీయ లక్షణాలు, కుల, వర్గ, మత, లింగ, వయోభేదం లేకుండా మనుష్యులు డబ్బు కాగితాలుగా మారిపోతున్న క్రమంలో పాల్గొనటం ఇష్టంలేని 'ఆమె' తీసుకున్న నిర్ణయాన్ని గురించి సమాజం తీసుకునే వైఖరిని బట్టి ఆ సమాజ స్థాయిని అంచనా వేయవచ్చు.

'అతని కలలు' కథ మాత్రమే కాక ఈ సంపుటిలో చాలా కథలు సమాజంలో వ్యక్తులు నిరంతరం ఆలోచించే సమస్యల గురించినవి కావు అలా కాకపోవటం వల్లనే ఈ కథలు ప్రత్యేకంగా కన్పిస్తాయి సమాజం చాలా చైతన్య పూరితంగానే విస్మరిస్తూ వచ్చిన విషయాల్లోని దారుణాన్ని బహిర్గతం చేసిన స్త్రీవాద సాహిత్యంలో ఈ కథలు అవిభాజ్యాలు "అతని అభివృద్ధిని స్వీకరించే శక్తి నా వెర్రి చిన్న మనసుకు లేదు" అని అతని కలలులో 'ఆమె' వాదించినా, ఇమోషనల్, "వయొలెన్స్" గురించి (కుబుసం కథలో) ఆందోళన చెందినా అంతర్లీనంగా మనకు కనిపించేది మనం ఇప్పటిదాకా విస్మరించిన అంశాలకు చెందిన చర్చనే కథా రూపంలో మన ముందు పెట్టటమే

ఇరవయ్యో శతాబ్దపు తెలుగు సాహిత్యం మౌలికంగా రాజకీయ ఉద్యమాల ప్రేరణ నుంచి రూపొందుతూ రావటం వల్ల తక్షణ సమస్యలను ఎప్పటికప్పుడు గుర్తించి వాటికి సాహిత్య విశ్లేషణలు చేయటం తెలుగులో చాలా మామూలుగా జరుగుతూ వస్తూ వుంది ఈ అభిప్రాయానికి తక్షణ ఉదాహరణ ప్రపంచీకరణకి ప్రతిగా వచ్చిన, వస్తున్న తెలుగు కథలు, కవిత్వం ఈ spontaneous reaction మిగతా భారతీయ భాషా సాహిత్యాలలో లేదని చెప్పలేం కానీ, తెలుగులో ఉన్నంత నిర్దుష్టంగా ఉధృతంగా మాత్రం లేదని స్పష్టంగా చెప్పవచ్చు ఈ సంపుటిలోని 'యిన్‌స్టెంట్ లైఫ్' వీటిల్లో ఒకటి.

ఆధునికీకరణ క్రమం సృష్టించే విధ్వంసానికి మరొక అందమైన పేరు 'అభివృద్ధి' (development) ఈ అభివృద్ధి క్రమపు అత్యున్నత రూపమే ప్రపంచీకరణ ఇదీ మరొక వలసవాదపు అభివృద్ధి పేరుతో పాత వలసల్లోకి ప్రవేశిస్తూ వుంది రజనీ కొఠారి లాంటి వాళ్లు ఈ విషయాన్ని ఎప్పుడో చెప్పారు

సమాజంలో ఇప్పటికే మార్జినలైజ్ చేయబడ్డ జీవితాలు ఈ ప్రపంచీకరణ ఫలితంగా మరింతగా ధ్వంసమవుతున్నాయి. ఈ ధ్వంసాన్ని యిన్‌స్టెంట్ లైఫ్ కథ చిత్రిస్తుంది ప్రపంచీకరణ సృష్టిస్తున్న ధ్వంసాన్ని ప్రధానంగా మూడు layers లో చిత్రిస్తుంది. ఒకటి : ఇడ్లీ బండి కుర్రాడు నరసింహం, డబ్బా ఫోను కుర్రాడు, ఇంకా రోడ్డు మార్జిన్స్‌లో బండ్ల మీద వ్యాపారం చేసుకుంటున్న వాళ్ళ జీవితానికి సంబంధించిన layer. రెండవది ప్రేమించి పెళ్ళి చేసుకున్న ఇద్దరు ఎగువ మధ్యతరగతికి చెందిన వాళ్ళ జీవితంలో డబ్బు తీసుకువచ్చిన మార్పు, ముఖ్యంగా విలువల పతనానికి సంబంధించినది మూడవది: ఇద్దరు ప్రేమికుల ప్రేమని 'ప్రాక్టికాలిటి' దెబ్బతీసిన క్రమాన్ని గురించిన layer మూడు layers లో కథ వుండటం ద్వారా ఈ కథ ఒక నవలకు సరిపడే విస్తృతిలో ఉంది వస్తుపరంగా చాలా ambitious గా వుందీ కథ. ఈ ambition అంతిమంగా కథా శిల్పాన్ని దెబ్బతీసింది శిల్పం విషయం ఎలా వున్నా, వ్యక్తుల మధ్య సంబంధాల్లోని చాలా సూక్ష్మ విషయాల్ని, ఎత్తుగడల్ని, వాటి వెనుక వున్న రాజకీయాల్ని ఈ కథ బహిర్గతం చేస్తుంది

ప్రపంచీకరణ సారాంశంలోనే కాదు, చాలా బహిరంగంగా కూడా కొన్ని సాంస్కృతిక ప్రత్యేకతల్ని, విభిన్నతల్ని కుదిపి ధ్వంసం చేసే క్రమమే 'సార్వజనీనత' దాని అంతిమ లక్ష్యం సార్వజనీనత అంతిమంగా ఒక ప్రాంతపు సంస్కృతిని,

చరిత్రని మిగతా ప్రపంచంమీద రుద్దే ప్రయత్నమే ఈ క్రమం ఇప్పటికే. మొదలయి కొనసాగుతూ వుంది వర్తమాన తెలుగు సమాజంలో పైన మనం చెప్పుకున్న మూడు layers లో ఈ క్రమం సృష్టిస్తున్న విధ్వంసాన్ని చిత్రిస్తుంది. ఈ నేపధ్యంలో మనుష్యుల మధ్య సంబంధాల్లో, గాఢత లోపించటం లైఫ్ లైట్‌గా మారిపోవటాన్ని గురించి ప్రశ్నించటం కూడా ఈ కథలో కన్పిస్తుంది అన్నింటికంటే ముఖ్యంగా ఈతరం మీద కొత్త managerial theories చూపిస్తున్న ప్రభావాన్ని, ఆ ప్రభావాల ఫలితంగా వ్యక్తుల మధ్య సంబంధాల్ని, ప్రేమతో సహా అన్నింటిని కేవలం use, value నుంచి చూసే దృష్టిని లోతుగా చిత్రిస్తుందీ కథ వ్యక్తిని వీలున్నంతవరకు అమలులో వున్న వ్యవస్థతో, విలువల చట్రాలతో అనుసంధానించటం వ్యవస్థీకృతం చేయటంలో ఈ managerial theories పాత్ర చాలా ఉంది అలాగే వ్యక్తిని పనిచేసే యంత్రంగా చూడటం, మార్చటం కూడా చేయటం, వ్యక్తి పరాయీకరణ చాలా సహజపరిణామమని, హేతుబద్ధమని రుజువుచేసి నమ్మించటం ఈ సిద్ధాంతాలు నిరంతరం చేసే పని. ఇది సారాంశంలో వ్యక్తి మూర్తిమత్వాన్ని వ్యవస్థతో అనుసంధానించే ప్రయత్నమే. కథలో ఈ Personality Development పేరుతో జరుగుతుంటుంది ఈ కథలో Personality Development క్లాసులో సందీప్‌కి నేర్పింది పై అంశాల్నే ఫలితంగా అతనిలో రూపుదిద్దుకున్న reason ముందు శరీరాల మోహస్పర్శలాంటి emotinal విషయాలు అతనికి పట్టవు. తన 'order of things' లో మిగతా విషయాలకి ఏ మాత్రమూ విలువలేదు. తనదంతా career oriented జీవితం ఈ క్రమంలో ఏ సంబంధ బాంధవ్యాలు అతన్ని నిలువరించ లేవు, ప్రేమ కూడా.

పంతొమ్మిది వందల తొంభయ్‌లలో తీవ్ర వేగంగా మొదలయిన సరళీకృత ఆర్థిక విధానాలు ఈ దేశ ఆర్థిక స్థితిని అధోగతిపాలు చేయటంతోపాటు, మనుష్యుల్ని వొట్టి వినిమయదారులుగా మార్చుతున్నాయి. మనుష్యుల మధ్య సంబంధాలలో ఉండే తడిని ఆవిరి చేస్తున్నాయి ప్రజల్లో నగర జీవితం మీద వ్యామోహం అధికమౌతోంది పల్లెలు నగరాలకు వలసపోతున్నాయి. వ్యవసాయ కూలీలే కాకుండా, ఎగువ మధ్యతరగతి బృందాలు పొలాల్ని తెగనమ్మి 'అదృష్టాల్ని పరీక్షించుకునేందుకు నగరాలకు పరుగులు తీస్తున్నాయి. అనుత్పాదక రంగానికి చెందిన ఫైనాన్స్ కంపెనీలు, రియల్ ఎస్టేట్ వ్యాపారాలు వూపందు కున్నాయి స్థిరాస్తుల్ని డబ్బులోకి మార్చుకుని ఆ డబ్బుమీద వచ్చే వడ్డీతో బతికే సోమరిపోతు వర్గాలు కూడా తయారయ్యాయి ఈ క్రమాన్ని కూడా యిన్‌స్టంట్ లైఫ్ కథలో చిత్రించటం జరిగింది. మరింత స్పష్టంగా చెప్పాలంటే వినిమయ సమాజం కుటుంబ సంబంధాల్లో కూడా సృష్టిస్తున్న బీభత్సాన్ని బహు పార్శ్వాలలో బహిర్గతం చేయటం ఈ కథలో కన్పిస్తుంది

పాత్రల పరంగా చూసినప్పుడు కుప్పిలి పద్మ పాత్రలు కొన్ని హఠాత్తుగా వాటి చైతన్యస్థాయిని పెంచుకుంటాయి ఫలితంగా ఆ పాత్ర పరిధికి మించి ప్రవర్తిస్తుంటాయి ఇది ప్రధానంగా రచయిత నుంచి పాత్రకుండే స్వయం ప్రతిపత్తిని దెబ్బతీసి రచయితే పాత్ర కావటం వల్ల జరుగుతుంది. కుప్పిలి పద్మలో ఈ ఛాయలు అక్కడక్కడా చూడవచ్చు. ఉదాహరణకి యిన్‌స్టంట్

లైఫ్ కథనే తీసుకోవచ్చు ఈ కథ నాలుగో పేజీలో అరుంధతి గ్లోబలైజేషన్ ఫలితంగా మారుతున్న నగరాన్ని గురించి తన తల్లికి వివరిస్తూ వుంటే తల్లి ఆశ్చర్యంతో వింటూ వుంటుంది అలాగే వేరొక సందర్భంలో 'అన్నేసి గంటలు మీరంతా ఏం మాట్లాడుకుంటారు' అని అడుగుతుంది ఈ రెండు సందర్భాలలోనూ వర్తమాన సామాజిక స్థితి గురించి అరుంధతి తల్లికి అవగాహన ఏమాత్రం లేదని స్పష్టమవుతుంది అయితే కథలో మరొక చోట పై స్థితికి పూర్తిగా భిన్నంగా "యాటింగ్ వరల్డ్ రాగానే రోజా కూరలు కొనుక్కొచ్చే అవ్వ తట్ట లేచిపోయింది కదా?"అంటుంది ఇంతకంటే మరింత విశ్లేషణాత్మకంగా "గ్లోబలైజేషన్ బ్యాంక్ దగ్గరే ఆగిపోదమ్మా, బెడ్ రూంలోకి వచ్చేస్తుంది" అని అంటుంది. కథలో ఇటువంటి లోపాలు జరగటం కథలో తమ కథల్ని తిరిగి చూసుకునే ప్రయత్నం చేయకపోవటంవల్ల జరుగుతుంటుంది

శిల్ప సంబంధమయిన కొన్ని లోపాల్ని వదిలిపెడితే, యిన్‌స్టంట్ లైఫ్ కథ గొప్ప సామాజిక విశ్లేషణాత్మక కథగా అనిపిస్తుంది ఒకే విషయానికి వ్యక్తులు వాళ్ళ వాళ్ళ సంస్కారాలను బట్టి స్పందించే తీరులో ఉన్న అంతరాల్ని చక్కగా ప్రతిఫలిస్తుందీ కథ కథలో అరుంధతి తల్లి ప్రేమించి పెళ్ళి చేసుకున్న వ్యక్తి సంస్కారంలో వచ్చిన మార్పుని సహించి అతనితో సర్దుకుపోయి జీవిస్తూ వుంటుంది. ఇందుకు భిన్నంగా అరుంధతి తను ప్రేమించిన వ్యక్తి సంస్కారంలో వచ్చిన మార్పుని ద్వేషించి అతనికి దూరంగా జరుగుతుంది ఈ సందర్భంలో అరుంధతి తల్లి అరుంధతితో అన్న మాటలు గమనార్హాలు, "మీరు నిర్ణయాలు త్వరగానే తీసుకుంటారు. పట్టుకు వేళ్ళాడరు. టైమ్ వేస్ట్ కాదు". ఈ వేళ్ళాడక పోవటం అనేది వర్తమాన సామాజిక సందర్భంలో స్త్రీకి అస్తిత్వ అవసరంగా అనివార్యమౌతోంది. ఈ అనివార్యతను కథలో చాలా ఆత్మవిశ్వాసంతో ప్రతిష్ఠించే ప్రయత్నంలో కుప్పిలి పద్మ చాలా వరకు సక్సెసయింది.

యిన్‌స్టెంట్ లైఫ్ కథలోని అంశాల్నే మరికొన్ని పార్శ్వాలలో చూపించి చర్చించిన కథ ప్రకంపనం. శిల్పపరంగా కూడా ఇది మంచి కథ వర్తమాన యాంత్రిక సమాజం వల్ల వ్యక్తుల జీవితాల్లో ఏర్పడ్డ శూన్యాన్ని, ఖాళీని మరింతగా వినిమయం చేయటం ద్వారా పూరించుకోవటం జరుగుతోంది. ఇదే భావాల్ని సమాజం కూడా ప్రచారం చేస్తూ వుంటుంది ఉన్న ఆస్తులు, ఫ్యాక్టరీలు, అమ్మివేసి జీవితంలో శూన్యాన్ని, బోరుని, షాపింగ్ ద్వారా భర్తీ చేయటమనే విషయాన్ని ఈ కథలో ఒక విషయంగా, విమర్శనాత్మకంగా చర్చించటం జరిగింది అలాగే సరళీకృత ఆర్థిక విధానాల నేపధ్యంలో ధ్వంసమయిపోతున్న దేశీయ పరిశ్రమల గురించి, వ్యక్తుల జీవితాల్లో నిరంతరం పెరుగుతూవున్న ఊపిరాడని స్థితిని కూడా ఈ కథ చిత్రిస్తుంది. సరిగ్గా ఈ స్థితిని శర్మిష్ఠ తండ్రి మాటలు ప్రతిబింబిస్తాయి. ఆయన ఇలా అంటాడు "ప్రపంచంలో ఎక్కడయినా వ్యాపారం చేసుకోవచ్చుననే అవకాశం వుంటే బాగుండునని క్లబ్బులో మేం ఎన్నోసార్లు అనుకునే వాళ్ళం. రావాలని గట్టిగా కోరుకున్నాం దారులు పూర్తిగా వోపెన్ చేసినట్టే వుంది, కానీ యీ యిరుకేమిటో అర్థం కావటం లేదు". అలాగే,

"బోర్ కొడితే షాపింగ్‌కి వెళ్ళారా" అని శర్మిష్టతో ఆమె తల్లి అనటంలో వర్తమాన సమాజం వ్యక్తుల్ని కేవలం వినిమయదారుల్నిగా మార్చుతున్న వైనం అవగత మవుతుంది

వ్యక్తికి ప్రైవేటు జీవితం అనేది గత సమాజాల్లోనే ఎంతో కొంత సాధ్యపడింది వర్తమాన సమాజాల్లో వ్యక్తికి Private space చాలా వుందని అనిపించినా, సారంలో అది నిజం కాదు సమాజపు నిఘా, ఫుకో (Foucault) భాషలో చెప్పాలంటే ఫ్యూడల్ సమాజాల్లో కంటే ఆధునిక సమాజాల్లోనే వ్యక్తి మీద సమాజపు Survilance పెరిగింది ఈ నిఘా అనేది కుటుంబం దాకా విస్తరించింది సమాజంలో పెట్టుబడి రూపం మరింతగా వికృతమవుతున్న నేపథ్యంలో ఈ క్రమం మరింత వేగమవుతోంది కుటుంబంలో భర్త చేసే ఉద్యోగంతో ఏ మాత్రం సంబంధంలేని భార్యల జీవితాల్ని కూడా ఆయా భర్తలు పనిచేసే కంపెనీలు నిర్దేశించే స్థితి ఇవ్వాళ ఉంది. బహుళజాతి కంపెనీల రాకతో ఈ స్థితి మరింత దారుణంగా పరిణమించింది ఫలితంగా కుటుంబాలలో ఒకానొక 'emotional voilance' చోటు చేసుకొంటుంది ఈ voilance ని కుబుసం కథ బహిర్గతం చేస్తుంది. మనం ఎంత కాదనుకున్నా, కుటుంబంలో వ్యక్తుల సంబంధాల్లో, పాజిటివ్ అర్థంలో నయినా, కొన్ని stratagies నడుస్తూ ఉంటాయి భార్యభర్తల మధ్య కూడా ఇవి అనివార్య మౌతున్నాయి. అయితే అంతిమంగా వీటిల్లో విజయం సాధిస్తోంది పురుషుడే అవుతున్నాడు. ఈ క్రమంలో other గా మిగులుతోన్న స్త్రీ అణచివేతకు గురవ్వటం అనివార్యమౌతోంది ఈ అణచివేత నుంచి తప్పుకోవాలంటే కుబుసం కథలో ఉత్తర లాగా విహారిలతో ఘర్షణ తప్పదు స్త్రీ తన గుర్తింపుని assert చేసుకోవటానికి ఇది అనివార్యం.

శరీర రాజకీయాల (bio-politics) గురించి మరింత లోతుల్లోకి వెళ్ళి చర్చించినవాడు మిషేల్ ఫుకో ఒక్కడేననిపిస్తుంది తన రచన 'The History of Sexuality' మొదటి భాగం చివర్లో, పెట్టుబడిదారీ సమాజ అభివృద్ధి నేపథ్యంలో వ్యక్తి అస్తిత్వానికి అంతకు ముందటి సమాజాల్లో పొంచివున్న మృత్యువాత (menance of death) స్థానాన్ని ఆధునిక సమాజాల్లో వ్యక్తి జీవితంమీద లభించిన నియంత్రణ ఆక్రమించిందంటాడు ఈ శరీర రాజకీయాల్ని అమలు చేసే తలాల్లో (spaces) కుటుంబం కూడా ఒకటి కుటుంబం అనేది మామూలు దృష్టితో చూస్తే వ్యక్తి వైయక్తికతలంగా, వ్యక్తి స్వేచ్ఛని కాపాడే రక్షిత స్థలంగా కన్పిస్తుంది అయితే ఆచరణలో అదెంత మాత్రం నిజం కాదనే విషయం తెలుస్తుంది Vikki Bell అనే ఆయన ఇలా అంటాడు "The family is the proper home of sexuality - it is also the place at which sexual relations are the most strongly circumscribed" ఈ పై స్పృహకు సంబంధించిన వాతావరణం మొత్తం కుప్పిలి పద్మ కథలో కన్పిస్తుంది. ముఖ్యంగా కుటుంబంలో లైంగికసంబంధాల్లోని సంక్షోభాన్ని పద్మ కథలు ప్రతిఫలిస్తాయి.

ఈ సంపుటిలోని శక్తివంతమయిన కథల్లో మరొకటి సాలభంజిక. ఈ కథ చాలా నిర్దుష్టంగా వర్తమానాన్ని చిత్రించిన కథ ఇది మన సమాజంలో కార్పొరేట్ కల్చర్, టూరిస్ట్ కల్చర్ నిరంతరం పెరుగుతూ వున్న నేపథ్యంలో రూపు దిద్దుకున్న కథ వర్తమాన లైంగిక వ్యాపారంలో సమిధలవుతున్న స్త్రీల కథ

ఇది ఈ కథలో కనిపించే మాధురి, నేహ, అంజలిలు ఈ బీభత్సానికి ప్రత్యక్షంగా గురయిన పాత్రలు ఈ బీభత్స వాతావరణంలో వ్యక్తులు వాళ్ళవాళ్ళ అస్తిత్వాల్ని నిలుపుకోవటానికి 'protective mechanisms' రూపొందించుకోవాలి అలా కానప్పుడు వాళ్ళజీవితాలు ధ్వంసమవుతుంటాయి ఈ కథలో మాధురి, నేహలు ఆ mechanisms ని రూపొందించుకున్నారు అలాగే సమాజం విసిరే ట్రాప్స్ నుంచి తమని తాము కాపాడుకోగలిగిన survival tricks వీళ్ళ దగ్గర వున్నాయి ఈ tricks వుండటంవల్లనే "ఆలోచించకండి. మెకానికల్ జాబ్‌లో యిన్‌వాల్వ్ అవండి," అ నేహ అనగలుగుతుంది అయితే tricks ని రూపొందించుకోలేని అంజలి ఎయిడ్స్‌కు గురయి ఆత్మహత్యకు ప్రయత్నించింది

సాలభంజిక కథలో మాధురి నేహ, అంజలిల పాత్రల రూపకల్పనలో ఈ రచయిత్రి శక్తి కన్పిస్తుంది మాధురి బాధ్యతాయుతమైన స్వేచ్ఛలో, నేహ వైయక్తికమైన స్వేచ్ఛకోసం చేసే అన్వేషణలో చక్కగా చిత్రీకరింపబడ్డారు ఈ సంక్షోభాన్నించి బయటపడే ప్రయత్నంలో భాగంగా ముందు కుటుంబ సభ్యులతో, ఉద్యోగాల్ని వదిలి వేస్తాననే ప్రతిపాదన చేస్తుంది. సహజంగానే కుటుంబం అందుకు అంగీకరించదు ఏ నైతిక విలువల అస్తిత్వం మీదనయితే కుటుంబ వ్యవస్థ ఆధారపడి ఉందో అదే నైతిక విలువలు మాధురి వైయక్తిక జీవితంలో ధ్వంసమయి, తాను ఒక మార్కెట్ సరుకుగా మారిపోయినా కుటుంబం దాన్నించి ఆమెను బయటకు తీసుకువచ్చే ప్రయత్నం చేయకపోగా, "నీది యెలాంటి చికాకైనా కాస్త సర్దుకుపోమ్మా" అంటుంది ముఖ్యంగా, అప్పటికి ఆ కుటుంబంలో వైయక్తిక జీవితాన్ని కోల్పోయి, ఆ స్పృహకు సంబంధించిన ఛాయలు కూడా మిగుల్చుకోని మాధురి తల్లి, అలాగే 'అవసరాలే మేధస్సు, శరీరం పెట్టుబడి' అంటుంది నగర జీవితాన్ని, వ్యక్తుల మధ్య సంబంధాల్లో డబ్బుకి వుండే పాత్రని గురించి అస్పష్టమైన అంచనా వున్న నేహ నామమాత్రంగా నగరంలో స్త్రీకి లభించే స్వేచ్ఛ కూడా సారాంశంలో పురుషుడి ప్రయోజనాల్ని చాలా స్పష్టంగా గుర్తించగలుగుతుంది ఆ గుర్తింపులోంచి ఆమె ఇలా ప్రకటించ గలుగుతుంది. "సొంతంగా బతికే అమ్మాయిలపై ఈ మగవాళ్ళకేం గౌరవం, ప్రేమ వుండవు వున్నట్టు నటించి మనలని వాళ్ళ కెరీర్‌కోసం సరదాలకోసం వాడుకుంటారు. అలాగే ప్రేమ ప్రాణం కంటే గొప్పదనుకుని, ఆ నమ్మకం విఫలమయి చివరికి ఎయిడ్స్‌తో ఆత్మహత్యకుపక్రమించిన అంజలి ఈ మూడు పాత్రలు అమలులో వున్న సామాజిక దౌష్ట్యాన్ని మూడు పార్శ్వాలలో రేఖా మాత్రంగానైనా ప్రతిబింబిస్తాయి ఇంతకుముందే చెప్పుకున్నట్టుగా పతనమవుతూ వున్న మానవ సంబంధాలు ముఖ్యంగా డబ్బు సంబంధంగా మారిపోయిన కుటుంబ సంబంధాలు, మొత్తం సమాజంలో ధ్వంసమవుతూవున్న విలువలు చూసి నిజంగా బాగున్నట్టేనా? అని తనలోతాను తర్కించుకునే మాధురి, అమలులో వున్న విలువల వ్యవస్థని, దాని తరహాలోనే దెబ్బతీయాలని చూసే నేహ, నిజాయితీతో ప్రేమించి, ప్రేమించిన వ్యక్తి మోసం చేస్తే, అంచనాలు తల్లకిందులైప్పుడు అస్తిత్వ అసంబద్ధతని తర్కించి సమాధానం దొరక్క ఆత్మహత్యలకు పూనుకుంటున్న వందలాది మంది స్త్రీలని సంకేతంగా అంజలిలు

పై ప్రతిపాదనకి ఊతంగా కన్పిస్తారు ప్రముఖ తాత్త్వికుడు బాద్రిలార్డ్ 'Aids is a crash in sexual relations' అంటాడు ఆ crash ని సూక్ష్మంగానైనా ఈ కథలో చిత్రించటం జరిగింది

ఈ కథ చాలా సందర్భాలలో ప్రేమ చుట్టూ ఆవరించి ఉన్న mythsని ఛేదిస్తూ వున్నప్పటికీ ప్రేమ, నిజమైన ప్రేమ జీవితంలో అసాధ్యమేమీ కాదని ప్రతిపాదిస్తుంది ఈ ప్రతిపాదన మాధురి కౌశిక్‌ల సంబంధాలలో కన్పిస్తుంది. వీళ్ళిద్దరూ అచేతనంగా ఒక వ్యవస్థగా పెళ్ళిని వ్యతిరేకిస్తారు ఒకళ్ళకి ఒకళ్ళు 'ఎసెన్షియల్ బీయింగ్స్' గా వుండటమే ముఖ్యంకానీ పెళ్ళి ముఖ్యం కాదని వీళ్ళు రుజువు చేస్తారు

ప్రతిదాన్ని సరుకుగా, ప్రతి సరుకు లాభాలు ఆర్జించి పెట్టాల్సిందిగా చూసే పద్ధతి వర్తమాన సమాజపు common sense భాగమయింది దీనికి సంకేతంగా ఈ కథలో సురేష్ కన్పిస్తాడు. "యింత అందం ఉంది క్యాష్ యిట్" అని అనటంలో మనకు కనిపించేది ఈ స్పృహే చాలా sophisticated గా దుర్మార్గమైన భావాలకు రూపమివ్వటం సురేష్ లక్షణం.

ప్రపంచీకరణ పుణ్యమా అని మన సమాజం మరింతగా సాంస్కృతిక విధ్వంసానికి, విలువల పతనానికి గురి కాబోతుంది కార్పొరేట్ వ్యాపారంతోపాటు టూరిజం రంగం కూడా మరింత విస్తృత మవబోతోంది ఈ క్రమంలో వందలాది అంజలిలు రూపొందబోతున్నారు అనేకమంది సాలభంజికలు రూపుదిద్దుకొన్నారు. వీళ్ళని లేక ఆ క్రమాన్ని చాలా తీవ్రంగానే హెచ్చరించే కథ సాలభంజిక రూపంలో లభించబోయే స్వేచ్ఛా, ఆర్థిక స్వాతంత్ర్యం సారాంశంలో పరమ దారుణంగా వుంటాయనే విషయాన్ని కూడా ఈ కథ బహిర్గతం చేస్తుంది. ఈ కథలో నేహ, అంజలిలు ఏదో ఒకస్థాయి సాధించుకున్న space ఆర్థిక పుష్టి అంతిమంగా వాళ్ళ జీవితం సుఖమయం అవటానికి దోహదం కాలేదనే విషయం కూడా కథలో స్పష్టపర్చబడింది

ఇంకా ఈ సంపుటిలో 'ఎడారి చూపులు', 'ఆకాంక్ష' లాంటి మంచి కథలున్నాయి. ముఖ్యంగా మాండలికంలో నడిచే 'కొత్త చావు' లాంటి కథ ఉంది దీన్ని కథ అనటం కంటే 'మోనోలాగ్' అనటం సరైనది. ఎయిడ్స్‌తో వివక్షతకు గురయిన లేక అవబోతున్న ఒక పాత్ర ఉద్వేగభరిత స్వగతమే ఈ కథ తీవ్రవాదనలోంచి పుట్టుకొచ్చిన కసిని శక్తివంతంగా ఈ కథ ప్రతిఫలిస్తుంది. కథలో ఉంది ఒకేపాత్ర, మిగతా పాత్రలు ఈ ఒక్కపాత్ర స్వగతంలోంచే మనకు పరిచయమవుతాయి ఈ పాత్ర స్వగతంలో వైయక్తికమైన వేదనతోపాటు, తన స్థితికి కారణమయిన సమాజంమీద తీవ్ర కసి కనిపిస్తుంది. ఆమె తన స్వగతంలో ఇలా అంటుంది "నాకు ఆ రోగమున్నదో లేదో ఆ దేవున్కి యెరకనో 'గానీ వుంటే గన్క లోకంలో మగోడన్నోడిని యిడవకుండ అంటియ్యి. సావనీ లంజ కొడుకుల్ని, సావనీ బాడుకావుల్ని"

కుప్పిలి పద్మ ఇప్పటికే చాలా కథలు రాసింది. ఎక్కువ కథల్లో సంభాషణలకు ఇచ్చినంత space వాతావరణ చిత్రణకి యివ్వదు. పాఠకుల్ని

కథలోకి ప్రవేశపెట్టేది వాతావరణ చిత్రణే, అదిలేనప్పుడు ఆ కథలో పాఠకుడు లీనమై చదవటం కుదరదు నాటకకర్త రంగాలంకరణ, సంగీతంలాంటి వాటి ద్వారా పొందే ఈ సౌకర్యం, కథకులు వాతావరణ చిత్రణ ద్వారా పొందటం జరుగుతుంది మరి ఈ చిత్రణ మిస్ అవటం కథలో పెద్దలోపమే కుప్పిలి పద్మ కథల్లో ఈ లోపం చాలా తరచుగా కన్పిస్తుంది ఒక నిర్దిష్టవాదాన్ని ఊతం చేసుకునో లేక ప్రేరణలోనో రాసే కథల్లో ఈ చిత్రణ పట్ల మరింత జాగ్రత్త అవసరం ఈ జాగ్రత్త లేనప్పుడు కథ వొర్థి argumentation వ్యాసంలాగా తేలిపోయే ప్రమాదం వుంటుంది

కుప్పిలి పద్మ కథల్లో కొన్ని పాత్రలు చాలా చైతన్యంతో వుంటాయి ఈ చైతన్యం అనేది ఇవ్వాళ సామాజిక జీవితంలో సగటు స్త్రీకి వున్న చైతన్యానికి భిన్నమయిన చైతన్యం మరి ఈ పాత్రలు పొందిన చైతన్యానికి సంబంధించిన నేపథ్యం కథలో రేఖా మాత్రంగానయినా ప్రస్తావించకపోవటం వల్ల అక్కడక్కడ పాత్రలు types అనిపిస్తాయి మాండలీకంలో కథ రాయగలిగిన కుప్పిలి పద్మ తన మిగతా కథల్లోని భాషని మరికొంత రోజువారీ భాషకు దగ్గరగా తీసుకు రావచ్చు అలాగే వస్తువుల పేర్లు ప్రస్తావిస్తున్నప్పుడు రచయిత్రి సాంకేతిక పరిజ్ఞాన ప్రదర్శన అవసరం. ఉదాహరణకి ఫోన్ అంటే కార్డ్ లెస్ ఫోన్ లాంటి పదాలు కథలో కొంత కృత్రిమత్వం చోటు చేసుకోవటానికి కారణమవుతుంటాయి

కుప్పిలి పద్మ పాత్రలు చాలా వరకు తామున్న స్థితి నుంచి బయటపడడం చాలా సులువు అనే చైతన్యాన్ని, భ్రమని కల్పిస్తాయి అయితే ఆ చైతన్యం పాత్రకు ఉన్నట్లు convincing గా అన్ని సందర్భాలలో రచయిత్రి చూపించటం జరగదు ఎల్లోరా కథలో ఎల్లోరా లాగా 'నా యెబిలిటీస్ పెంచుకోవాలి, తిరిగి నా ప్రపంచాన్ని నిర్మించుకోవాలి" అని నిర్ణయించుకోగలిగిన పాత్రలు వున్నప్పటికీ, ఎక్కువ సందర్భాలలో అలా లేకపోవడం వల్ల, ఆయా పాత్రల చైతన్య స్థాయి గురించి పాఠకుల్లో సంశయాలు తలెత్తుతాయి. ఇంకా చెప్పాలంటే విప్లవ కవిత్వంలో కన్పించే కాల్పనికత ఈమె కథల్లోనూ కన్పిస్తుంది కాల్పనికత సాహిత్యానికి మెరుగే, అది మితిమీరినప్పుడు సాహిత్యం శక్తిని కోల్పోయి వాటి స్థాయి దిగజారుతుంది. ఈ లక్షణం కుప్పిలి పద్మ కథల్లో కొంచెంగా మాత్రమే వుంది ఈ కొద్ది పరిమితుల్నించి బయటపడగలిగితే ఒక శక్తివంతమైన స్త్రీవాద కథా రచయిత్రిగా పేరు తెచ్చుకున్న పద్మ మరింతగా తన స్థాయిని పెంచుకునే అవకాశం ఉంది.

# మహమ్మద్ ఖదీర్‌బాబు

♦ కాత్యాయని ♦

మంచికథలనేవి ఏ కాలంలో, ఏ ప్రాంతంలో వొచ్చినా, ఏయే వాదాల్లో భాగంగా వొచ్చినా వాటి ఆకర్షణలో రహస్యం మాత్రం ఎప్పుడూ వొక్కటే - వాటి పాదాలు నేలమీదా, దృష్టి జీవితతత్వం మీదా వుండటం ఖదీర్ బాబు కథలకు గుర్తింపును తెచ్చిపెట్టినవి కూడా ఈ లక్షణాలే

జీవిత వాస్తవికతను చిత్రించే కథలు రాయాలంటే ముందుగా ఆ జీవితం కథకుడికి దగ్గరగా తెలిసినదై వుండాలి. ఆ ఎరుక వ్యక్తిగత అనుభవం ద్వారా వొచ్చిందీ కావొచ్చు, లేదా తన సామాజిక అస్తిత్వానికి చెందిన సామూహిక అనుభవమూ కావొచ్చు ఖదీర్‌బాబు కథల్నే తీసుకుంటే - వాటిలో కొన్ని కథలు తన కుటుంబం లోనూ యితర ముస్లింల జీవితాల్లోనూ గుర్తించిన అనుభవాలకు సంబంధించినవి మరికొన్ని కథలు ముస్లిం మైనారిటీలతో బాటుగా గ్లోబలైజేషన్ దాడికి గురవుతూ ఉన్న యితర వర్గాలతో సహానుభూతినీ, వాళ్ళ పోరాటాలకు మద్దతునూ ప్రకటించేవి

ఇది స్థూలమైన విభజన మాత్రమే. ముస్లిం ఐడెంటిటీకి సంబంధించిన కథలకూ, గ్లోబలైజేషన్ వ్యతిరేక కథలకూ వాటి స్పిరిట్‌లో సన్నిహితమైన సంబంధమే ఉంది ఈ కథలన్నింటికీ నేపథ్యంగా రచయిత, తన సొంత· వూరైన కావలినే ఎన్నుకోవటమూ, ఆ ప్రాంతపు భాషను ఉపయోగించటమూ కూడా యీ కథలకు బలాన్ని చేకూర్చిన అంశాలు దీనివల్ల తను చెప్తున్న కథను నిర్దిష్టంగా, సాధికారికంగా చెప్పటానికి అవకాశం కలిగింది తనకు ఎంతగా సహానుభూతి ఉన్నప్పటికీ వొక తెలుగు ముస్లిం రచయితగా అరబిక్ దేశాల్లో ముస్లింల జీవితాల్ని గురించో, ఏ దేశంలోనో జరుగుతున్న గ్లోబలైజేషన్ వ్యతిరేక పోరాటాల్ని గురించో ఖదీర్‌బాబు మంచి కథ రాయగలడని ఊహించలేం అలాగే, యీ కథలు తెలుగు దేశంలో ముస్లింలందరికీ సంపూర్ణ ప్రాతినిధ్యం వహిస్తాయని కూడా చెప్పనక్కర్లేదు.

ఖదీర్‌బాబుకు కథకుడిగా గుర్తింపు తెచ్చిన దావత్, జమీన్‌లాంటి కథలు వచ్చేనాటికి తెలుగు సాహిత్యంలో ముస్లింవాద గాలులు బలంగా వీస్తున్నాయి. బాబ్రీమసీదు విధ్వంసంతో, ఆ సందర్భంగా జరిగిన హింసతో ముస్లింల జీవితాల్లోని ఆందోళనా, అభద్రతా తీవ్రస్థాయికి చేరాయి. ప్రారంభదినాల్లోన ముస్లింవాద సాహిత్యం యీ పరిస్థితికి రెండు పద్ధతుల్లో ప్రతిస్పందించింది. ఒకటి, తమ నేల మీద తమను పరాయివాళ్ళుగా చేస్తున్న కుట్రలమీద ఆగ్రహం, రెండోది ముస్లిం ప్రజల ఐక్యతకూ, అభివృద్ధికీ అడ్డంకిగా వున్న

ఇస్లామిక్ ఛాందసవాదాన్ని వ్యతిరేకించటం 1996-98ల మధ్యన వొచ్చిన ముస్లింవాద సాహిత్యం యీ రెండు అంశాల చుట్టూ తిరగటాన్ని గమనించొచ్చు ఆ దశలో యితర సాహితీ ప్రక్రియల కన్నా కవిత్వమే ఎక్కువగా వెలువడింది

ఇస్లాంలో మౌలికంగావున్న ప్రజాస్వామిక, సమానత్వ భావాలను వక్రీకరించి, తమ ప్రయోజనాలకు వాడుకుంటున్న ఇస్లామిక్ ఛాందసవాదుల్ని ముస్లిం కవులు నిరసించారు పర్దా పద్ధతికీ, తలాక్ విధానానికీ, మసీదుల్లో ప్రవేశాన్ని నిషేధించటానికీ వ్యతిరేకంగా ముస్లిం స్త్రీలు లేవనెత్తిన ప్రశ్నలతో గొంతుకలిపారు ముస్లింల మధ్యన శాఖా భేదాలనూ, ఆర్థిక అంతరాలనూ ఎత్తి చూపించారు వరకట్నాలనూ, శక్తికిమించిన అట్టహాసాలనూ వ్యతిరేకించారు దావత్, జమీన్ కథలు యీ వాతావరణంలో నుంచి పుట్టినవే

'వజూనీళ్ళతో దేహాన్నే కాదు

నా మత రీతుల్ని శుభ్రపరుస్తాను' (జవాబ్) అని ఖదీర్ రాసిన కవితకూ, అతని 'దావత్' కథకూ ప్రేరణ వొక్కటే

ఒక మధ్యతరగతి ముస్లిం కుటుంబంలో ఆడపిల్ల పెళ్ళి చెయ్యాలంటే యెన్ని యిబ్బందులు పడాలో, చివరికి ఆకష్టమంతా రవ్వంత సంతోషాన్నయినా మిగల్చకుండా ఎలా ఆవిరైపోతుందో చెప్పే కథ 'దావత్' శక్తికి మించిన స్థాయిలో కట్నాలూ, కానుకలూ యిచ్చుకున్నా మగపెళ్ళివాళ్ళకు తృప్తిలేదు ఇటు సొంత చుట్టాలకూ ఆడపెళ్ళివాళ్ళ యిబ్బందులు పట్టవు పలావులోకి మాంసం ముక్కలు చాలనందుకు అమ్మాయి వైపు బంధువుల్లో మగవాళ్ళకు కోపాలొచ్చాయి పెళ్ళాలను చావగొట్టి కసి తీర్చుకున్నారు. ఆడవాళ్ళు తినేందుకు అసలు అన్నమే మిగల్లేదని ఎవరికీ పట్టనేలేదు పెళ్ళి బాధ్యతలన్నీ చూసు కుంటున్న పిల్ల మేనమామ అస్లాంకు యిదంతా చూసి రోతపుట్టింది "రేయ్! అల్లా నాకు ఆడపిల్లల్ని యివ్వలేదు యిస్తే వాళ్ళను నరికేయనన్నా నరికేస్తాను గాని, యిట్టాంటి పెళ్ళిళ్ళు మాత్రం చెయ్యన్రా" అని రెండు వైపుల వాళ్ళమీదా విరుచుకుపడ్డాడు ఆడపిల్లని కన్నందుకు అవమానాల పాలవ్వాల్సిన పరిస్థితిని కల్పిస్తున్న పెళ్ళి పద్ధతులమీదా, ఆర్భాటాలమీదా నిరసన ప్రకటించే కథ 'దావత్'

హిందూ మతోన్మాద సంస్థలు రెచ్చగొడుతున్న ముస్లిం వ్యతిరేకత మానవ సంబంధాలను యెంతగా విధ్వంసం చేస్తోందో వివరించిన కథ 'జమీన్'. హుసేనూ, బ్రమ్మయ్యా కావలిలో పుట్టి పెరిగిన బాల్యమిత్రులు సొంత వూరిమీద పంచప్రాణాలు నిలుపుకున్న వాళ్ళు చాలాకాలంపాటు వృత్తిరీత్యా వేరే వూళ్ళో వున్న హుసేనుకు వృద్ధాప్యంలో కావలిలో స్థిరపడాలని కోరిక. కావలిలో వున్న బ్రమ్మయ్య కూడా తనకున్న స్థలాన్ని మిత్రుడికి అమ్మటానికి సిద్ధపడ్డాడు ఆ రకంగా జీవిత చరమాంకంలో కలిసి బతకాలనుకున్న ఆ బాల్యమిత్రుల కల నెరవేరలేదు కారణం, ఆర్.ఎస్.ఎస్ సభ్యుడైన బ్రమ్మయ్య కొడుకే అతని రాజకీయాల ప్రకారం, హుసేను 'జీవాల్ని నరికే కసాయోడు', ముస్లింలకు యీ దేశంలో ఏ హక్కూ లేదు

హుసేను గ్గూడా యీ వూరిమీద తమకున్నంతహక్కు వున్నదని చెప్పటానికి బ్రమ్మయ్య చేసిన ప్రయత్నాలు ఫలించలేదు కొడుకుని ఎగిసితన్నాడు ఆచోటు యింకెవ్వరికీ యివ్వనని హుసేనుకు హామీ 'యిచ్చాడు. కానీ, 'బెదిరింపుల బతుకు నేను బతకలేనురా' అని కన్నీళ్ళతో వెళ్ళిపోయాడు హుసేను ముస్లింలు అనివార్యంగా యీ సమాజానికి దూరమవ్వాల్సిన పరిస్థితి యేర్పడిందనీ, దాన్ని ఆపేంత బలమైన లౌకికవాద శక్తులు లేకుండా పోయాయనీ యీ కథ సూచిస్తుంది

కొంతకాలంపాటు తెలుగు సాహిత్యాన్ని వువ్వెత్తున ముంచెత్తిన ముస్లింవాద సాహిత్యం క్రమంగా, యితర అస్తిత్వ వాదాల్లాగే వొక మూసలోకి చేరిపోవటం మొదలైంది హిందూ తాత్వికతను ఎదిరించే శక్తిని కోల్పోయి, వ్యక్తుల్ని బూతులు తిట్టుకోవటం దగ్గర ఆగిపోయే కథలూ, కవితలూ వొచ్చాయి. తిట్టుకుంటూ కూచోవటంలోని సుఖానికి రచయితలు అడిక్ట్‌య్యారు. హిందూ మతోన్మాదులకు పిసరంతైనా నష్టం చెయ్యలేని యీ రకం పోరాటం చాలా సులభం కానీ, హిందూ సమాజం చూడటానికి నిరాకరిస్తున్నవీ, వక్రీకరిస్తున్నవీ అయిన ముస్లిం జీవితాల్లోని పాజిటివ్ కోణాలను సాహిత్యంలోకి తీసుకురావటానికి చాలా వోపిక కావాలి వీటికి మూలమైన ఇస్లాం తాత్వికతనూ, అందులోని ప్రజాస్వామిక దృక్పథాన్నీ ముందుకు తెచ్చి, హిందూత్వ భావజాలపు సంకుచితత్వానికి ప్రత్యామ్నాయంగా నిలబెట్టటానికి కష్టపడాలి ఆ పనికి పూనుకున్న అతికొద్ది ముస్లిం సాహిత్యంలో 'దర్గామిట్ట కతలు' కూడా భాగమయ్యాయి.

ఏ ప్రత్యేకతలూ, గుర్తింపులూ లేని సామాన్య ముస్లిం జీవితాల్ని గొప్ప కథా వస్తువులుగా కొత్త కోణాల్లోంచి చూపించాయి 'దర్గామిట్ట కతలు' ఎలక్ట్రీషియన్ కరీం సాయిబూ, సర్తాజ్ బీ, జరీనా, పూల రిహానా, నజీరల్లా, బాల కార్మికులు మన్సూర్, జావేద్.... అందరూ మామూలు మనుషులే - వాళ్ళు చెప్పే జీవిత సత్యాలు మాత్రం చాలా లోతైనవి పూటగడవని వాస్తవానికీ, గతకాలపు వైభవాలకూ మధ్యన సతమతమైపోయే సగటు ముస్లింలూ - పిల్లల ఆకలి తీర్చటం కన్నా మతనియమాలు గొప్పవేమీ కావని తెగేసి చెప్పే ముస్లిం స్త్రీల ధిక్కార స్వరాలూ - ఆడపిల్లపెళ్ళి చేసేందుకు అబద్ధాలాడి తన్నులు తినే గతిలేని తల్లులూ - యాభై రూపాయల కోసం ఖురాన్‌మీద ప్రమాణం చేసే అనివార్యపు తిరుగుబాట్లూ - బంగారపు కొలుముల్లో అనామకంగా కరిగిపోయే పసితనాలూ అన్నీ ముస్లింల సగటు బతుకుల్లోని చేదునిజాలే

మతాలకు అతీతమైన మానవతా చిహ్నాలైన దర్గాలూ, రొట్టెల పండుగలూ - ప్రజాస్వామిక స్ఫూర్తిని చాటే పీర్ల పండగలూ - మతాల అడ్డుగోడల్ని ధిక్కరించే మానవ సంబంధాలూ, 'దర్గామిట్టా కతల్లో' అడుగడుగునా ఎదురవుతాయి అలాగని, హిందువుల్లో ఇంటర్నలైజ్ అయిపోయిన ముస్లిం వ్యతిరేకతనూ, చిన్న చూపునూ యీ కథలు క్షమించి వొదిలెయ్యవు ముస్లిం పిలగాణ్ణి 'కాలా జాన్వర్' మీదికి నెట్టి యేడిపించే సతీష్ సింగునీ, తెలుగు సరిగ్గా రానందుకు చిన్న బుచ్చే రమాదేవి టీచర్నీ

గుర్తు చేసి, హిందూ సమాజాన్ని సెన్సిటైజ్ చేస్తాయి హిందూ, ముస్లిం సంబంధాల్లోకి బొమ్మా బొరుసూ కూడా 'దర్గా మిట్ట కతల్లో' కన్పిస్తాయి

'దూద్ బఖష్' ముస్లిం రచయితలు మాత్రమే రాయగలిగే కథ తన రక్తాన్ని పాలుగా మార్చి బిడ్డను పెంచి పెద్ద చేసే తల్లి రుణాన్ని, బిడ్డలు యెన్ని జన్మలెత్తినా తీర్చుకోలేరనేది ఇస్లాంలోని వొక విశ్వాసం అలాంటి బిడ్డలు తల్లికన్నా ముందు మరణిస్తే, తల్లి రుణం తీర్చుకోని పాపానికి పై లోకాన ముక్తి దొరకదు తన రుణంనుంచి విముక్తి చేస్తూ పాలభిక్ష పెడుతున్నానని అందరి ఎదుటా తల్లి చెప్తేనేగానీ బిడ్డకు అంత్యక్రియలు జరగటానికి వీల్లేదు ఇదంతా నజీరమ్మకూ తెలుసు. ఐనా తన వొక్కగానొక్క కొడుకు షఫీ చనిపోతే, అతనికి దూద్ బఖష్ పెట్టడానికి ఆమె ఎంత మాత్రమూ వొప్పుకోలేదు

పధ్నాలుగేళ్ళకే కుటుంబ భారాన్ని నెత్తికెత్తుకున్న షఫీకి టి బి వొచ్చినా వైద్యం చేయించుకునేందుకు డబ్బులేకా, సమయం దొరక్కా చచ్చిపోయాడు వాడు చావుకు దగ్గరవుతున్నాడని తెలిసి కూడా, పనిలోకి తరమటం తప్ప నజీరమ్మకు గత్యంతరం లేదు. ఆ రకంగా వాడి చావుకు కారణమయ్యారని ఆమెకు తెలుసు ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేనంతగా తనువాడికి రుణపడి పోయింది. దూద్ బఖష్ పెట్టే అర్హత తనకు లేదనే నజీరమ్మ భయం

దర్గా మిట్ట కతల్లో సర్తాజ్ బీ రంజాన్ వుపవాసాలు చెయ్యటానికి భయపడేది కూడా యిలాంటి కారణంతోనే సరైన సంపాదన లేని భర్తతో, ఇంటెడు మనుషులతో ఆవిడ సంసారాన్ని లాక్కురావాలి పిల్లలకు కడుపునిండా అన్నం పెట్టాలంటే చిన్నా చితకా దొంగతనాలు చేస్తేగానీ కుదరదు నిజాయితీగా, పవిత్రంగా వుపవాసాలు చెయ్యలేనప్పుడు, చేసి పాపం కట్టుకోలేనని ఆమె వాదన.

పెరుగుతున్న ఆర్థిక సంక్షోభం పేద ముస్లిం కుటుంబాలను మరింత కుంగదీస్తోంది. మత విశ్వాసాలు బోధించే విలువలు అసందర్భమైపోయాయి ఈ వొత్తిడిని అంతిమంగా భరించాల్సింది ఆడవాళ్ళే. మత విశ్వాసాలను వృత్తి ప్రదర్శనగా చూడకుండా, వాటి విలువలకు కట్టుబడే నిజాయితీ అవసరమని యిలాంటి ఆడవాళ్ళు గుర్తు చేస్తారు పితృస్వామ్య కుటుంబాలు మగపిల్లలకిచ్చే ప్రాధాన్యత షఫీ లాంటి పేదింటి కుర్రాళ్ళకు ముళ్ళకిరీటమైపోతోందని కూడా 'దూద్ బఖష్' గుర్తు చేస్తోంది. ఈ పరిస్థితిలో కొట్టుకుపోవటం తప్ప నజీరమ్మకూ, షఫీకీ కూడా మరో మార్గం లేదు.

సమాజంలోని అన్ని రంగాలనూ కబళిస్తున్న గ్లోబలైజేషన్ పరిణామాలనూ, దాన్ని ప్రతిఘటించేందుకు పెనుగులాడే శక్తులనూ చిత్రించినవి 'న్యూ బాంబే టైలర్స్', 'ఖాదర్ లేడు', 'పెండెం సోడా సెంటర్' కథలు

ఇవాళ్టి సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావం స్థానిక వృత్తి, వ్యాపారాల మీద ఎంతగా కమ్ముకుందో 'ఖాదర్ లేడు' కథ చెప్తుంది. ఎక్కడో వున్న ప్రపంచబ్యాంకు యిచ్చిన వొక్క ఆదేశం మన వూళ్ళల్లోని రోడ్డు మార్జిన్ల వ్యాపారస్తుల్ని కూడా తుడిచి పెట్టయ్యగలదు. ప్రపంచబ్యాంకు ప్రాజెక్టుగా మొదలైన రోడ్ల విస్తరణ కార్యక్రమం పెద్ద పెద్ద నగరాల్లోనే కాదు, కావలిలాంటి

చిన్న పట్టణంలో దుకాణాలను కూడా వొదిలిపెట్టలేదు దాంతో పెద్ద వ్యాపారస్తులు లక్షల్లో నష్టపోతే, మార్జిన్ వ్యాపారస్తులకు జీవితమే తుడిచి పెట్టుకుపోయింది అద్దె సైకిళ్ళ దుకాణం నడుపుకునే ఖాదర్ బతుకు దెరువుని పోగొట్టుకుని, పోలీసుల చేత దెబ్బలు తిని ఎటో అదృశ్యమైపోయాడు. బట్టల వ్యాపారం చేసే బైసాని వెంకట సుబ్బయ్యకు అతనితో వున్న స్నేహం వల్ల ఖాదర్ కోసం ఆందోళన పడ్డాడు కానీ, కొద్ది రోజులే త్వరలోనే తన షాపుని మళ్ళీ కట్టుకునే పనిలో మునిగిపోయాడు. ఇంకొన్నాళ్ళ తర్వాత, మార్జిన్ దుకాణాలు పోయి తన పెద్దదుకాణం చక్కగా రోడ్డు మీదికి కన్పిస్తున్నందుకు సంతోషపడే స్థితికి కూడా వొచ్చింది. మనుషుల మధ్యన వర్గ విభజనల్ని యీ ఆర్థిక పరిణామాలు మరింత గట్టి పరుస్తున్నాయి వెంకటసుబ్బయ్య వ్యాపార ప్రయోజనాలముందు ఖాదర్‌తో వున్న స్నేహసంబంధాల విలువ చిన్నదై పోయింది కొద్ది రోజుల్లోనే అతని వ్యాపారాన్ని కూడా ముంచెయ్యటానికి విదేశీ సరుకులు సిద్ధంగా వున్నాయి అతని మనసులో కూడా ఖాదర్‌లాంటి వాళ్ళకు చోటు మిగలనంత సంక్షోభం అతన్ని కూడా చుట్టుకుంటుంది. ఏ మానవ సంబంధాలకూ విలువలేని వొంటరి ప్రపంచాల్లోకి అందరం విసిరెయ్యబడతాం. ఈ విధ్వంస మంతటినీ సూచిస్తుంది 'ఖాదర్ లేడు' కథ గ్లోబలేజేషన్ పరిణామాలను రెండు కోణాల్లోంచి చూపిస్తుంది యీ కథ ఒక వైపున ఆత్మహత్యలు గానో, అదృశ్యాలుగానో ముగిసిపోయే ఖాదర్ లాంటి వ్యక్తుల జీవితాలుంటాయి. కానీ, మరో వైపున కుల, మత, లింగ విభేదాలను దాటుకొని సంఘటితమయ్యే పేద ప్రజల పోరాటాలు కూడా అనివార్యమవుతాయి ఖాదర్ విషాదాంతానికి అవతలివైపున మార్జినోళ్ళ ఐక్య పోరాటం భవిష్యత్తు మీద కొత్త ఆశను కలిగిస్తుంది

గొప్ప ఆత్మవిశ్వాసంతో, శ్రమమీద గౌరవంతో గ్లోబల్ మార్కెట్ దాడిని తిప్పికొట్టే ప్రయత్నం చేసిన వ్యక్తుల్ని గురించి చెప్పిన కథలు 'న్యూ బాంబే టైలర్స్', 'పెండెం సోడా సెంటర్'

పీరుభాయి ఆరితేరిన టైలర్‌గా తయారై 'బాంబే టైలర్స్' దుకాణం పెట్టడం వెనక బోలెడంత శ్రమా, పట్టుదలా వున్నాయి దర్జీ పనంటే యిచ్చిన కొలతల్ని బట్టి కుట్టడం గాదు మనిషిని బట్టి కుట్టడమని ఆయన అభిప్రాయం. కావలి చుట్టుపక్కల ఆయన తిరుగులేని టైలర్

కాలక్రమంలో రెడీమేడ్ బట్టలు రంగంలోకి వచ్చేశాయి మనిషి వయసుతో ఆకారంతో సంబంధం లేకుండా అందరూ వొకే ఫ్యాషన్ మూసలో యిమిడి పోయేట్టుగా మన అభిరుచులు డిజైన్ చెయ్యబడ్డాయి. సంపన్న దేశాలు నిర్ణయించిన యీ నమూనాను ధిక్కరించే సాహసం ఎవరికీ లేదు దాంతో దర్జీ పనివాళ్ళ దుకాణాలు మూతపడ్డాయి. కావలిలో దర్జీలందరూ కూడా కొత్తగా వచ్చిన రెడీమేడ్ ఫ్యాక్టరీల్లో కూలికి చేరారు. అక్కడవాళ్ళు శ్రమపడి, సృజనాత్మకంగా పనిచెయ్యనక్కర్లేదు కటింగ్ మిషన్ కత్తిరించిపెట్టిన ముక్కల్ని కలిపి కుడితే చాలు ఆదాయం కూడా బాగానే గిట్టుబాటవుతుంది

ఇలాంటి పనిని పీరుబాయి ఎంతగా అసహ్యించుకున్నా, కుటుంబ పరిస్థితి వల్ల ఆయనకూ ఫ్యాక్టరీలో చేరక తప్పలేదు కానీ అక్కడ యిమడటం

ఆయన వల్ల కాలేదు ఆ ఫ్యాక్టరీలో తన నైపుణ్యానికి చోటు లేదు అంతేకాదు, అక్కడ తను పీరుభాయి అనే దర్జీగా, వ్యక్తిగా గుర్తించబడడు వాళ్ళు కేటాయించిన నంబర్ తప్ప తన వునికికి అర్థమేలేదు కొడుకు ఆ పనిలోనే వుండిపోయినా, ఆయన మాత్రం వెనక్కి వెళ్ళిపోయాడు మళ్ళీ ఆయన దుకాణంలో పనిమొదలైంది ఆ దుకాణం పేరు 'న్యూ బాంబే టైలర్స్' 'బాంబే టైలర్స్' పీరుభాయి చేసేపని పాతదేకానీ, ఆయన లక్ష్యం, పోరాటం పూర్తిగా కొత్తవి

'పెండెం సోడా సెంటర్'లో చంద్రయ్య జాతీయ వాది జాతీయోద్యమం సాగుతున్నంత కాలమూ దానికి తన సహాయ, సహకారాలను అందించినవాడు ఆ సోడా సెంటర్ ఆయనకు కేవలం వ్యాపారం కాదు జాతీయోద్యమ ప్రచారానికి వేదిక - ఉద్యమానికి అవసరమైన ఆర్థికవనరు "కాసింత చక్కెర, కాసింత నిమ్మరసం, కాసిన్ని చలువవేర్లతో చమత్కారాలు" చెయ్యటానికి ప్రయోగశాల ఊళ్ళోకి విదేశీ పానీయాలు వస్తే ఆయన ఎదురు తిరిగేవాడు, వెళ్ళగొట్టేదాకా పోరాడేవాడు

స్వాంతంత్ర్యం వచ్చినా, దేశంమీద సంపన్న దేశాల ఆర్థిక అజమాయిషీ పోలేదు జాతీయోద్యమ కాలంలోని కుటీర పరిశ్రమల దృక్పథం కొనసాగలేదు. మన మార్కెట్లను ఆక్రమించిన విదేశీ వస్తువులన్నిటిలాగే కోకాకోలా కూడా వచ్చేసింది దాని రుచిలోని గొప్పదనం కంటే, అది సంపన్న దేశపు పానీయం కావటమే గొప్ప ఆకర్షణ. జనమంతా దాని మోజులో పడిపోయారు కోకాకోలా కంపెనీ అధికారులు స్వయంగా వొచ్చి చంద్రయ్యకు ఏజెన్సీ యిస్తామంటే ఆయన అంగీకరించలేదు. పైగా దానికి పోటీగా 'పెండెం కోలా'ని తయారు చేసి వూళ్ళో సంచలనం సృష్టించాడు దేశవాళీ పనిమంతుల నోటి దగ్గర కూడు లాగేసిన ఆ పానీయం. ఆయనకు ప్రజల నెత్తురులా కన్పించేది దాన్ని అమ్మి లాభాలు గడించటమంటే నెత్తురు కూడు తినటమేనని భావించాడు.

చంద్రయ్య చనిపోయి, ఆయన కొడుకు కృష్ణుడు దుకాణం యజమాని అయ్యాడు ఆ దుకాణంచేసే వ్యాపారంలోనూ, నిబద్ధతలోనూ యే మార్పూలేదు జాతీయవాదులు దేశంనుంచి వెళ్ళగొట్టిన కోకాకోలా మరోసారి ప్రవేశించింది విదేశీ వ్యాపార సంస్థలు కూల్‌డ్రింకుల్నే కాక, మంచినీళ్ళ అమ్మకం కూడా ప్రారంభించాయి ఓ మంచినీళ్ళ కంపెనీ తమ వుత్పత్తుల్ని అమ్మి పెట్టమని కృష్ణుణ్ణి కోరింది అతను నిర్ద్వంద్వంగా తిరస్కరించి తండ్రి ఉద్యమ వారసత్వానికి కొనసాగింపుగా నిలబడ్డాడు.

'న్యూ బాంబే టైలర్స్' తో పీరుభాయీ, 'పెండెం సోడా సెంటర్'లో చంద్రయ్యా, కృష్ణుడూ కేవలం వ్యక్తులుగా కన్పించరు ప్రపంచవ్యాప్తంగా సాగుతున్న గ్లోబలైజేషన్ వ్యతిరేక పోరాటాలకు వీళ్ళు ప్రతీకలు. 'పెండెం కోలా' ను గురించి చదువుతుంటే యిటీవల అరబ్ దేశాల్లో తయారైన 'మక్కాకోలా' గుర్తొస్తుంది.

పీరుభాయి, చంద్రయ్యల దేశాభిమానంలోనూ, అస్తిత్వ ప్రకటనలోనూ కన్పించే వొక ప్రధానమైన అంశం శ్రమమీద గౌరవం రెడీమేడ్ బట్టలు కుడితే

పీరుభాయికి కుటుంబం హాయిగా గడిచిపోతుంది కానీ, తన అస్తిత్వానికి గుర్తింపు వుండటమే ఆయనకు ముఖ్యం శ్రమతో, పట్టుదలతో సాధించిన వొక విద్య, ఎంత ఆత్మగౌరవాన్నీ, ధైర్యాన్నీ యివ్వగలదో పీరు భాయిని చూస్తే అర్థమవుతుంది రెడీమేడ్ ఫ్యాక్టరీలో ఆయన యిమడలేక పోవటానికీ, ఆయన కొడుకు మాత్రం సర్దుకుపోయి పనిచెయ్యగలగటానికీ కూడా కారణం యిందు లోనే వుంది కొడుకు తరం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలూ, అవసరాలూ తీవ్రమైనవే కావొచ్చు అంతకన్నా ముఖ్యమైంది పీరుభాయి కొడుకు తండ్రిలాగా సృజనాత్మక కళాకారుడు కాకపోవడం అతను మొదట్నించీ కత్తిరించి యిచ్చిన బట్టలు కుట్టడానికీ అలవాటుపడ్డాడు అందుకే అతనికి పీరుభాయిలాగా అవమానంతో రగిలిపోయే ఘర్షణ ఎదురవలేదు

'పెండెం సోడా సెంటర్' చంద్రయ్య కొడుకుకున్న స్థాయివేరు అతను తండ్రి వ్యాపారంలోని అన్ని మెలకువలూ అర్థం చేసుకున్నవాడు, సృజనాత్మకంగా ప్రయోగాలు చేసినవాడు విదేశీ సరుకుల విషయంలో తండ్రి తీసుకున్న నిర్ణయాల గురించి అవగాహన కలిగినవాడు అందుకే తండ్రి ఆశయాల కొనసాగింపు అతనికి సులభమవుతుంది విదేశాల్లో తయారైన కూల్ డ్రింక్స్ అమ్ముకోటానికి సిద్ధపడితే కృష్ణుడికి మంచి లాభాలే వొస్తాయి కానీ అందులో అతని నైపుణ్యానికీ, శ్రమకూ చోటులేదు. ఊళ్ళో యువకులంతా కూల్ డ్రింకులు అమ్ముకుంటూ బద్ధకంగా గల్లాపెట్టెల ముందు కూచోవటానికి అలవాటుపడ్డారని రచయిత చెప్తాడు శ్రమను గౌరవించే కృష్ణుడి తత్వాన్ని, వాళ్ళకు భిన్నంగా నిలబెడతాడు.

ఐతే యీ అంశం కథలో సరిగా ఎస్టాబ్లిష్ అయినట్టుగా తోచదు కృష్ణుడు యింటా, బయటా ఎదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభంలో అతని మానసిక సంఘర్షణ ఏమిటో ఎక్కడా కన్పించదు కృష్ణుడు పుట్టి పెరిగిన కుటుంబ వాతావరణం వల్ల అతను వ్యక్తిగతంగా నిజాయితీ, నిబద్ధతలు కలిగినవాడుగానే వుండటాన్ని విశ్వసించగలం ఐతే అతని ఆదర్శాలకు బలాన్నిచ్చే సామాజిక వాతావరణం అతనికి లేదు. చంద్రయ్యకున్నట్టుగా సామాజిక ఉద్యమాలతో సన్నిహిత సంబంధంలేదు ఉద్వేగపూరితమైన వాతావరణం లేదు. అందువల్ల కృష్ణుడు తీసుకున్న నిర్ణయం ఆదర్శవంతమైనదీ, అవసరమైనదీ అయినప్పటికీ, ఆ నిర్ణయాన్ని తీసుకోవటంలో జరగాల్సిన పరిణామక్రమం, కృష్ణుడి పాత్రలో కన్పించదు అతని కుటుంబ సభ్యుల అభిప్రాయాలేమిటో, వాళ్ళతో అతనికున్న సంబంధాలు ఎలాంటివో కూడా అర్థం కాదు

'దావత్', 'జమీన్' కథల్లో కూడా కొన్ని పాత్రల స్థాయిని రచయిత ఆదర్శాలు డామినేట్ చెయ్యటం కన్పిస్తుంది 'దావత్'లో అస్లాం పాత్ర చైతన్య స్థాయికీ, కథ చివర్లో అతను మాట్లాడిన మాటలకూ పొంతన కుదరదు. ఏ గొడవలూ జరగకుండా పెళ్ళి పూర్తయిపోతే చాలనుకునే మామూలు మధ్య తరగతి కుటుంబీకుడు అస్లాం చివరికి మగపెళ్ళివాళ్ళ ముందు అవమానం జరగటం ఆయన్ని బాధించిందే గానీ, మిగిలిన యిబ్బందులనూ, సర్దుబాట్లనూ సహజంగానే భావించాడు. ఆడవాళ్ళకు అన్నం మిగిలకపోతే మసాలా వడలు

తెప్పించి పెట్టెయ్యొచ్చని నిర్ణయించుకున్నవాడు ఇలా అన్ని విషయాల్లోనూ మామూలు మధ్యతరగతి వ్యక్తిలాగానే ఆలోచించే అస్లాంకు పెళ్ళితంతుమీద మౌలికమైన అభ్యంతరం వుండటం ఆశ్చర్యం "ఒక ఆడది ఒక మొగోడు కలిసి కాపురం వుండాలంటే యింత తగాదా ఎందుకురా యిన్ని బాధలు ఎందుకురా యింత కర్చెందుకురా. యిన్ని వందలమంది ఎందుకురా" అనేంత చైతన్యాన్ని ఆ పాత్రకు ఆపాదించటం కష్టమే. 'జమీన్'లో హుసేన్నూ, బ్రమ్మయ్యల మధ్య స్నేహానికి తగిన వాతావరణం కూడా సరిగ్గా చూపించినట్టు కనపడదు అసలు మాలపాళానికీ, కసాబ్ గల్లీకి మధ్యన అంత తీవ్రమైన శత్రుత్వాలు ఎందుకున్నాయో అర్థంకాదు మతతత్వ రాజకీయాల ఆధిపత్యం వున్న సందర్భాల్లో తప్ప, పేద ప్రజల మధ్యన మతవిశ్వాసాల కారణంగా శత్రుత్వం యేర్పడటం ఎక్కడా జరగదు పైగా హిందూ, ముస్లిం ప్రజలు కలిసి జరుపుకునే వేడుకలూ, పండుగలూ కూడా గ్రామాల్లో చిన్న పట్టణాల్లో ఎన్నో కన్పిస్తాయి హుసేన్నూ, బ్రమ్మయ్యలమధ్య స్నేహాన్ని చూపించటం కోసం, హిందూ ముస్లిం ప్రజల మధ్య శత్రుత్వాన్ని కృత్రిమంగా కల్పించినట్లుగా తోస్తుంది ఆ వాతావరణం ప్రభావంనుంచి వాళ్ళిద్దరూ తమ స్నేహాన్ని రక్షించు కోవటంలో సహకరించిన అంశాలూ ప్రత్యేకంగా కన్పించవు

శిల్పపరమైన యిలాంటి చిన్న చిన్న లోపాలను, ఖదీర్‌బాబు కథల్లోని బలమైన యితివృత్తాలూ, అలవోకగా సాగిపోయే కథనమూ మరుగుపరుస్తాయి నెల్లూరు జిల్లా ప్రజల జీవిత చిత్రణా, మాండలిక భాష యీ కథల చుట్టూ వొక వాతావరణాన్ని సృష్టిస్తాయి అన్నిటికన్నా ముఖ్యంగా యీ కథలు మానవ సంబంధాలమీద వొక విశ్వాసాన్నీ, బతుకు పోరాటానికి నైతిక మద్దతునూ అందిస్తాయి. ముస్లింల అస్తిత్వాన్ని అసెర్ట్ చేసుకుంటూ, మెజారిటీ హిందూ సమాజాన్ని సెన్సిటైజ్ చేస్తాయి.

# సింగమనేని నారాయణ

♦ బి. సూర్యసాగర్ ♦

" ప్రతి రెండు మూడేళ్ళకు ఈ ప్రాంతంలో ఈ కరువు పునరావృత మవుతూనే ఉంది కొన్ని ఏళ్ళుగా, కొన్ని తరాలుగా ఈ గడ్డ జీవితం ఇలాగే ఉంటూ ఉంది మాకు చెరువులునిండే వర్షాలు వద్దు రోడ్డు పక్కల ఉండే గుంటలూ, గోతులూ నిండే వర్షాలు చాలు! బతికిపోతాము అయినా ఆ కరుణకు కూడా నోచుకోవడం లేదు మా గడ్డ! తలచుకునే కొద్దీ శరీరంలో ప్రకంపనలు "

ఆ గడ్డ అనంతపురం జిల్లా ఆ గడ్డమీదా పుట్టుకొచ్చిన కథకుడు సింగమనేని నారాయణ ఆయన ఉత్తమపురుష దృక్కోణంతో రాసిన కథ "దృశ్యమూ - అదృశ్యమూ"లో ప్రధాన పాత్ర అంతరంగమధనమే పై వాక్యాలు

సింగమనేని అనంతపురం పట్టణానికి దగ్గరలో వున్న మరూరు బండమీద పల్లి గ్రామంలో మధ్యతరగతి రైతుకుటుంబంలో 1943లో పుట్టారు తిరుపతి ఓరియంటల్ కళాశాలలో శిక్షణ పొందారు గ్రామీణ ప్రాంతాల హైస్కూళ్ళలో తెలుగు పండిట్‌గా పనిచేసి 2001లో పదవీ విరమణ చేశారు. ఈ జీవిత నేపథ్యం ఆయన కథా సాహిత్యంలో కళాత్మకంగా ప్రాణం పోసుకుంది

రాయలసీమలో ఆధునిక కథ, ఆ మాటకొస్తే, ఆధునిక మనదగ్గ సాహిత్యమంతా, సర్కారు జిల్లాలతో పోలిస్తే నలభైయ్యేళ్ళు ఆలస్యంగా మొదలయింది రాయలసీమకు తొలి ఆధునిక కథకుడు కె సభా. అనంతపురం జిల్లాకు సింగమనేని అలాంటి వారు. అనంతపురం జిల్లాలో 1940 ప్రాంతంలో జి రామకృష్ణ, చిలుకూరి నారాయణరావు, తూమాటి దొణప్ప కొన్ని కథలు రాసినా సలక్షణమైన ఆధునిక కథకు శ్రీకారం చుట్టినవారు సింగమనేని. కథా వస్తురూపాలను ఆయన ఉన్నతస్థాయికి చేర్చారు మార్క్సిస్టు తాత్వికత ఆయన జీవితావగాహనను సంపన్నం గావించింది. ఆయన కథల్లో ఆ అవగాహన ప్రతిఫలించింది

సింగమనేని తొలి కథ జూదం ఇప్పటికి ఆయన నలభై కథలు పైగా రాశారు 1999కు ముందు రాసిన కథలు జూదం (1988) సింగమనేని నారాయణ కథలు (1999) అను పేర్లతో రెండు సంపుటాలుగా వచ్చాయి

సింగమనేని కథా సాహిత్యం అపూర్వమయిన అనంతపురం జిల్లా (అనంత) రైతాంగ జీవన చిత్రాలను లిఖించింది. మొత్తం దేశంలోనే అత్యల్ప వర్షపాతం గల జిల్లా అనంతపురం ఐదారుశాతం సాగుభూమికి కూడా సాగునీటి సౌకర్యం లేదు అత్యల్ప వర్షపాతంతో, అడుగంటిన భూగర్భ జలాలతో మెట్ట వ్యవసాయం

ఎడారిలో సేద్యంగా మారింది అప్పులు, పస్తులు వలసలు గ్రామీణ జీవితాన్ని వల్లకాడు గావించాయి కనీస జీవనావసరాలనుండి కూడా వంచిస్తున్న ప్రాకృతిక, సామాజిక శక్తులతో రైతుల నిస్సహాయ సంఘర్షణను సింగమనేని కథలు నమోదు చేశాయి ఈ ప్రాంత బీద రైతాంగ జీవితాలు ఆయన కథల ద్వారా తొలిసారిగా సాహిత్యంలో నగ్నంగా, భయోద్విగ్నంగా నర్తిస్తూ నిలిచాయి జూదంలో నారప్ప, అడుసులో నారాయణప్ప, విముక్తిలో వెంకటప్ప, ఉచ్చులో కర్రోడు జీవితంలోంచి సాహిత్యంలోకి నడుచుకొచ్చిన పాత్రలు ప్రేమ్‌చంద్ రైతాంగ చిత్రాలను, పెరల్‌బక్ విప్లవాత్పూర్వ చైనా రైతాంగ చిత్రాలను అవి గుర్తుకు తెప్పిస్తాయి

అనంత రైతుల జీవితాల్లోని ప్రధాన పార్శ్వాలను తొలిసారిగా సింగమనేని ఆవిష్కరించారు తరువాత వచ్చిన ప్రతిభావంతులైన కథకులు స్వామి, శాంతినారాయణ, చిలుకూరి దేవపుత్ర మొదలగు వారికి మార్గదర్శకులయ్యారు పలాయనవాద కథా సాహిత్యానికి చోటు లేకుండా పోయింది

రైతాంగ పాత్రలు, జీవితం సింగమనేని కథల్లో అత్యంత వాస్తవికంగా, విశ్వసనీయంగా రూపుదిద్దుకున్నాయి అదంతా ఒక కళాత్మక కాల్పనిక సత్యంగా రూపొంది జీవిత సత్యాలను వెల్లడించేవిగా ఆయన కథలు నిర్మితమయి వుంటాయి

సింగమనేని విశిష్టమైన ఆరు రైతాంగ కథలు రాశారు - జూదం, అడుసు, ఊబి, ఉచ్చు, విముక్తి, అలజడి పేర్లు క్లుప్తంగా ఉండి కథల సారాన్ని పట్టిస్తాయి మొత్తంగా ఈ కథలు అనంత రైతుల స్థితిగతులకు దర్పణం పడతాయి

సింగమనేని మొదటి కథ 'జూదం' సాహిత్య మాస పత్రిక ప్రజాసాహితి నవంబర్ 1978 సంచికలో అచ్చయ్యింది కరువు పీడిత అనంత రైతాంగ సమాజపు ఆందోళన కర వాస్తవికతను, సాహిత్యలోకం ద్వారా ఈ కథ చర్చకు పెట్టింది కథలోని నారప్ప పీడిత రైతాంగ ప్రతినిధిగా పరిచయమయ్యాడు ఇరవై ఏళ్ళ కిందట పదెకరాల తరీ, ముప్పై ఎకరాల మెట్టకలిగి వుండిన నారప్ప, ఉమ్మడి కుటుంబం, ముగ్గురన్న దమ్ములు భాగాలు పంచుకొనే నాటికి తలా మూడువేల అప్పుకూడ పంచుకున్నారు కురవని వానలు, ఎండిపోతున్న బావులు, పెరిగిన కరెంటు కోతలు, గిట్టుబాటుగాని పంటల ధరలు, వడ్డీ వ్యాపారులు, తనఖా బేంకులలో పెరిగిన అప్పులు, నడ్డివిరిచే వడ్డీలు, పెరుగుతున్న జీవన వ్యయం, డబ్బు అవసరాలు తప్ప మరో ఆలోచన సాగనివ్వని బీద బతుకులు, శివయ్య, గుగ్గిళ్ళమ్ముతుండిన రామశేషయ్య వంటి వ్యాపారులు, రైతుల బతుకులను తాకట్టుబెట్టుకుని మంత్రించినట్లు షావు కార్లవడము- ఇదంతా రెండు రోజుల కథాసమయ పరిధిలో సారభూత జీవన శైలి ఆలోచనల చిత్రణతో దృశ్యమానం చేశారు రచయిత జూదంగా మారిన వ్యవసాయం రైతుల జీవితాలను అతలాకుతలం చేస్తున్న తీరును కథ అనుభూతం చేస్తుంది

జూదం కథ కొనసాగింపు ఊబి వెండితీగెలాగ ఏకధాటిగా వాన కురిసినట్లు, వెనిక్కాయి పంట చేతికొచ్చినట్లు నారప్ప సంతోషదాయకమైన కలకంటూ వుండినట్లు కథ ఆరంభమవుతుంది చిన్నకొడుకు కిష్టిగాడు తట్టిలేపడంతో ఉలిక్కిపడి మేల్కొని నీరసపడతాడు నారప్ప గొప్ప ఆరంభం ఇది రచయిత శిల్ప ప్రతిభకు తార్కాణం పెద్ద కూతురును మెట్టినింటికి పంపడానికి ధర్మారం వెళ్ళి రెండు చీరలు తెమ్మని భార్య లక్ష్మమ్మ ఒక వైపు, ఎండిపోతున్న పంటను రక్షించుకోవడానికి బావిలో బోర్ వేయించమని ప్రాధేయపడే పెద్దకొడుకు ఒక వైపు వుండగా భార్యమెడలోని మూడు పారవుల బంగారు గొలుసును బ్యాంకులో కుదవబెట్టి తెచ్చిన మూడువేల రూపాయలతో బోర్ వేయిస్తాడు నారప్ప ఏడుమట్టులు దిగినా చుక్కనీరు లేక నారప్ప గుండెల్లో బండపడె ఆ వెంటనే జారీ అయిన నీళ్ళులేని బావి మీద కరెంటు బిల్లుతో నిశ్చేష్ఠుడవుతాడు నారప్ప మట్టూ మట్టూ బోరు దిగుతుంటే నీటి కోసం రైతు చూపే ఉత్కంఠ, దింపుడు కళ్ళెం ఆశను సింగమనేని అద్భుతంగా అక్షరబద్ధం చేశారు. తెలుగు సాహిత్యంలో గొప్ప చిత్రీకరణల్లో ఒకటిగా దీనిని భావించవచ్చు నిస్సహాయంగా అనంత రైతులు సాగిస్తున్న జీవన్మరణ దైనందిన పోరాటం గుండెలనవసింప జేస్తుంది

అడుసు కథలో తన చీనీ పంటకు నలభైవేల రూపాయల ప్రతిఫలం ఆశించి అనంతపురం పట్టణ వడ్డీ వ్యాపారులు, లారీ బ్రోకర్లు, నాగపూర్ మండీ వ్యాపారుల సాలెగూళ్ళలో ఇరుక్కొని ఆఖరుకు పదిహేడువేలు కూడ లభించక కుంగిపోయిన నారాయణప్ప భారతంలో కర్ణుని తలపిస్తాడు. చిన్న కూతురు కోరిన లంగాగుడ్డ కూడా కొనుక్కురాలేని అశక్తతలో నాగపూర్ నుంచి తిరిగొచ్చిన నారాయణప్ప, కొడుకును వెంటతీసుకొని 'ఒరే రాముడా! ఈ చెట్లు మనల్ని సర్వనాశనం చేస్తాయిరా అంటూ చీనీచెట్లను ఫెడల్ ఫెడీల్‌మని కూల్చి వేసిన భయానక శబ్దం పాఠకులను వెన్నాడుతుంది. ఇతర వస్తూత్పత్తి దారుల మాదిరీ రైతులు తమ పంటకు ధర నిర్ణయించలేకపోవడం ఎంత అన్యాయమని నారాయణప్ప సంధించిన ప్రశ్న సమాధానం పొందవలసే ఉన్నది.

ఉచ్చు కథలో భూస్వామ్య పెత్తందారీ శక్తుల దోపిడీ పీడనల కింద నలిగిపోతున్న సన్నకారు, రైతుకూలీ జనం బతుకు లెక్కాచారంగా చిత్రించ బడింది వెనుకబడిన వ్యావసాయిక సమాజంలో హింసాత్మకమైన శ్రమ దోపిడీకి జీతగాళ్ళ వ్యవస్థ ఆలంబనగా వుంటూ వచ్చింది జీతగాళ్ళలో అత్యధిక భాగం మాదిగలే వెంకటరెడ్డివద్ద జీతగాడుగా కుదిరిన కుర్రోని కొడుకు జ్వరంతో వున్నా రెండ్రోజులు పనికి మల్లుకున్నందుకు వెంకటరెడ్డి యెగిచ్చి యెగిచ్చి తన్నడంలో ఊరిడిచి పారిపోతాడు. ఇచ్చిన అయిదు నూర్లు లెక్క వెంటనే చెల్లించాలని రెడ్డి పంచాయితీ బెట్టిస్తాడు వెంకటరెడ్డి, పంచాయితీ పెద్దలు కర్రోడి నిస్సహాయతా ఆధారంగా అతడు నానా కష్టం చేసి సాగులోకి తెచ్చుకున్న అతడి సమస్త ఆస్తి అయిన ప్రభుత్వమిచ్చిన మూడెకరాల పట్టాభూమిని వెంకటరెడ్డి పరం గావించడానికి పన్నే ఉచ్చు అద్భుత సంభాషణా కౌశలంతో వెల్లడి చేయబడింది చేజిక్కిన కీటకంపై సాలీడు అల్లే మృత్యువల అనుభూత మవుతుంది. కర్రోడి ఆక్రందనను ఒక విషాద కావ్యంగా మలిచారు సింగమనేని

పొలాన్ని రెడ్డికి కట్టబెడుతూ ఇచ్చిన తీర్పు విని ". కాస్సేపటికి మల్లక్క(కర్రోడి భార్య) ఎర్రికేక పెట్టింది కర్రోడు ఒక ఊగు ఊగి ముందుకొరిగాడు" అను చిన్న ముగింపు వాక్యాలు ఆ బీదజీవుల గుండెల్లో సంభవించిన భూకంపాలను ప్రకంపించాయి కథ చదువుతుండగా కాళీపట్నం రామారావు యజ్ఞం కథ మన మనోఫలకంపై ప్రత్యక్షమవుతూ వుంటుంది

"రేపు యెసిట్లోకి యేంటివీ లేవు ఆ రంగప్పనన్నా యిన్ని గింజలడుగు మూడు రోజుల్నుంచి చెప్పుతావుంటే చెవిలోకి యేసుకోకుండా వుండావు ." అంటూ భార్య హెచ్చరించడంతో, బీడీముక్క దొరక్క నోరు పీకుతున్నట్లున్న వెంకటప్పకు గుండెల్లోరాయి పడినట్లయింది ఇది విముక్తి కథ ప్రారంభం ఊరంతా తిరిగినా యెసిట్లోకి గింజలు గాని, బీడీలకు పావలా దుడ్లుగాని అరువు దొరకవు. పావలా వుంటే ఇయ్యి నాయనా అని గోముగా అడిగిన పిల్లగాడి చిన్న కోర్కెను కూడా తీర్చలేని అశక్తత అయిదెకరాల తోట, ఇరవై ఎకరాల మెట్టగల రైతు వెంకటప్ప ఆ సాయంత్రానికి యాభై రూపాయల అడ్వాన్సు తీసుకుని రోడ్డు పనికి కూలీగా కుదురుకోవడంతో కథ ముగుస్తుంది. కరువు పీడిత రైతాంగానికి మరొక విశిష్ట ప్రతినిధి పాత్ర వెంకటప్ప కమ్యూనిస్టు పార్టీ భూమికోసం, భుక్తికోసం పోరాడండి అని పిలుపిస్తూ వేసిన కరపత్రం ఎవరో చదవగా విని, భూమికోసం గాదు, భూమిని వదిలించుకోవడం కోసం పోరాటం చెయ్యాల్ల అని నారప్ప గొణుక్కుంటాడు. అయితే భూమిని వదిలించుకోవడం విముక్తి కానేరదు నిత్య కరువు, కాటకాలు తెచ్చిపెట్టిన మానసిక నిర్వేద వైపరీత్యమది. తెల్లవారని రాత్రులు అనంత రైతాంగం బతుకులు. ఈ స్థితిని బలంగా కథల్లోకి తెచ్చి చూపారు సింగమనేని.

వెనకబడిన ప్రాంతాల దైన్యమూ, రైతాంగ రైతుకూలీల జీవన సమస్యలు, స్వాతంత్ర్యానంతరం అధికారం చేజిక్కించుకున్న భూస్వామ్య, దళారీ, పెట్టుబడిదారీ వర్గాలు గత యాభై అయిదేళ్ళుగా పరిరక్షిస్తున్న అర్థ భూస్వామ్య - అర్థ వలస సామాజికార్థిక నిర్మాణం యొక్క ఫలితాలే ఆ వ్యవస్థను నిర్మూలించుకోవడం మాత్రమే రైతాంగానికి, సకల పీడిత ప్రజానీకానికి విముక్తిని ప్రసాదించ గలదు. అయితే ఈ ఆలోచనను, ఆచరణను పాదుచేసే విప్లవాత్మక రైతాంగ ఉద్యమాలు అవసరం మేరకు వృద్ధి చెందలేదనద్ది కూడ ఒక వాస్తవం

సింగమనేని రైతాంగ కథల్లో పరిష్కారాల ఊసు లేకపోవడంలో ఆశ్చర్యం లేదు 1980 దశకం చివరలో కొంత పుంజుకున్న సాగునీటి ప్రాజెక్టుల కోసం ఆందోళనలు కూడా రైతాంగాన్ని క్రియాశీలకంగా కదిలించలేకపోయాయి. కమ్యూనిస్టు ఉద్యమాలు రైతాంగ అవసరాల అంచులను కూడా స్పృశించలేదు గొప్ప మార్పులపట్ల రైతులకు ఆశ ఏర్పడలేదు. పరిస్థితులతో సర్దుబాటు, ఓర్పు వారి తాత్వికతగా రూపొందాయి. వారివి మాసిపోయిన బతుకులు. వారు కోరే మార్పు కనుచూపుమేరలో కనపడని బతుకులు

ప్రాంతీయ నిర్దిష్టతను సాహిత్యం అవశ్యంగా ప్రతిఫలిస్తుంది, ప్రతిఫలించాలి కూడా. నిర్దిష్ట సత్యాలను వెల్లడించడంలోనే సాహిత్యానికి సార్వజనీనత

సిద్ధిస్తుంది సింగమనేని కథల జీవిత సత్య ప్రతిఫలన లక్ష్యంగా కలిగినవి వాటి సార్వత్రిక ప్రాధాన్యత దీని ఫలితమే ఆయన నిర్మించిన రైతాంగ చిత్రాలు భాషాంతరీకరణ చేస్తే అన్ని భాషల, అన్ని ప్రాంతాల వారికీ అర్థమవుతాయి

* * *

సింగమనేని అత్యుత్తమ రైతాంగ కథలకు ఒరవడి పెట్టడమేగాక పట్టణ మధ్యతరగతి జీవితాలగురించి, విద్యావ్యవస్థలోని కొన్ని భ్రష్ట కోణాల గురించి మంచి కథలు రాశారు ప్రతి కథా ఒక సామాజిక సారాన్ని వెల్లడించేదిగా వుంటుంది మనం సర్వసాధారణమనుకొని విస్మరించే విషయాలు ఆ కథల్లో చదివి ఆశ్చర్యపోతాము ఆ విషయాలకు సంబంధించిన కొత్త ఎరుక పాఠకునికి కలుగుతుంది

హింస కథలో మధ్యతరగతి రైతు కుటుంబం నుంచి వచ్చిన నారాయణ సెంకడరీ గ్రేడ్ టీచర్‌గా ఒక పల్లెలో కాపురముంటాడు తన అవసరాలను పక్కకు బెట్టి పల్లెలోని ఉమ్మడి కుటుంబానికి అన్నివిధాలా సహాయ పడుతుంటాడు అప్పులు చేసి ఆదుకుంటాడు. భార్య సావిత్రి కూడా భర్త ననుసరించి నడుచుకుంటుంది అయినా పల్లెలోని తనవారు మాత్రం వారిద్దరూ స్వార్థపరులనీ దుబారా జీవితం గడుపుతారనీ, నిందారోపణలు చేస్తూ మనశ్శాంతి లేకుండా చేస్తారు ఆరోపణలను తన వద్దకు మోసుకొచ్చిన మిత్రుడు దూరపు బంధువు అయిన వెంకటేశ్వర్లుతో తన అవస్థలను వివరించి వాపోతాడు వెంకటేశ్వర్లు నారాయణ నిజాయితీని వేదనను అర్థం చేసుకుంటాడు. మిత్రున్ని బస్సెక్కించానికి వెళుతుండగా పల్లె మనిషొకాయన "...ఇది నీకు తగునట్రా! వాళ్ళు ఉసూరుమంటే నువ్వు సుఖపడగలవా." అని నిలదీస్తుంటే నారాయణ బేలగా వెంకటేశ్వర్లువైపు చూశాడు అంటూ కథ ముగుస్తుంది. ఆ హింస అనంతం అన్నదే సూచన నివురు గప్పిన నిప్పులా అది వ్యక్తులను కాల్చుకు తింటున్న వైనాన్ని రచయిత సున్నితంగానూ, బలంగానూ బహిర్గత పరిచారు

వ్యక్తి చొరవను, స్వతంత్రతను భూస్వామిక భావజాలం సహించదు. అన్ని వేళలా సంపూర్ణ విధేయతను కోరుతుంది. భూస్వామిక ఉమ్మడి కుటుంబ వ్యవస్థకు రక్షణ కవచం అది తద్వారా చిలికే మానసిక హింస వ్యక్తిత్వాల్ని దహిస్తుంది పెట్టుబడిదారీ ఆర్థిక, సంస్కృతీ సంబంధాలు అభివృద్ధి అయిన చోట ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నం కావడమూ, వెనుకబడిన ప్రాంతాల్లో అవి కుళ్ళుతూ కొనసాగడమూ స్పష్టంగా కనిపిస్తున్న వాస్తవం.

బెత్తెడు ఆదాయాలు, మూరెడు ఆశల పట్టణ మధ్యతరగతి జీవితాల్లో వస్తు వ్యామోహ సమ్మోహనాలు, కుహనా హోదాల ఆరాటాలు తెచ్చిపెట్టే ప్రమాదాలను, పరాయీకరణను 'ప్రమాదవీణ' వీణా నిక్వాణంగా మన ముందుంచింది వస్తువ్యామోహ మాయావి ఆత్మలను వశం చేసుకొని నిజమైన సామాన్య జీవితానందాలను దూరం చేస్తున్న వైనాన్ని ఈ కథ ఆహ్లాదకరమైన శైలీ శిల్పంతో పాఠకుల అంతరాంతరాలను స్పృశిస్తుంది. ఆ మాయావి ఆడవాళ్ళను మాత్రమే ఆవహించేది అను సూచన కథలో ఉన్నా అది జెండర్,

వర్గ, వయోభేదాలు లేకుంటే సమాజాన్నంతా ఆవరిస్తూ పెట్టుబడిదారులకు లాభాలు గడిస్తూ ఆత్మిక విధ్వంసాన్ని పర్యావరణ వినాశనాన్ని కలిగిస్తున్న భూతం అన్నది నిజం

విష్ కథ నిరంకుశ అధికారుల అల్ప వ్యక్తిత్వాలపై చెంపపెట్టు పాలనా వ్యవస్థలో హెడ్ గుమస్తాలనుంచి సూపరింటెండెంట్‌లు, సెక్షన్ ఆఫీసర్లు, హెడ్ కానిస్టేబుళ్ళు, హెడ్‌మాస్టర్లు, ప్రిన్సిపాళ్ళు, ఐఎఎస్‌ల వరకు ఈ వర్గం విస్తరించి వుంది కథలోని హెడ్‌మాస్టర్‌కు పేరు కూడా లేదు. అతన్నొక సామాజిక నమూనాగా చిత్రించడానికి రచయిత అనుసరించిన శిల్ప సూత్రం అది హైస్కూల్లో టీచర్లు రోజూ హాజరు రిజిస్టర్‌లో సంతకం చేసేటప్పుడు అనవాయితీగా చెయ్యెత్తి నమస్కారం చెబుతుంటారు దానిని తన హక్కుగా భావించుకుంటాడు హెచ్చెమ్ ఒకరోజు లెక్కల టీచర్ విష్ చేయలేదని గమనించి ధిక్కారము సైతునా అనుకొని ఆ టీచర్ కాస్త ఆలస్యంగా రావడాన్ని సాకుగా మెమో జారీ చేస్తాడు పరిస్థితిని అర్థం చేసుకున్న టీచర్లు ఇక మీదట విష్ చేయకూడదని తీర్మానించుకుంటారు మరుసటి రోజు ఏ ఒక్కడూ విష్ చేయకనే రిజిస్టర్‌లో సంతకాలు చేసి యధాలాపంగా వెళ్ళిపోతుంటే హెచ్చెమ్ స్థాణువయిపోయి ప్రాణలొదిలేస్తాడు పాఠకుల చేతనలో నవ్వుల పాలవుతాడు హెచ్చెమ్ మేకపోతు గాంభీర్యాన్ని బహిర్గత పరచడానికి రచయిత వ్యంగ్యం శైలిని కంఠస్వరాన్నీ ప్రయోగించిన తీరు చక్కగా అమరింది. చిత్రకారుడు చిన్న బ్రష్ స్ట్రోక్‌తో చిత్రంలో గొప్ప మార్పును సాధించే విధంగా 'విష్' కథను అల్లినారు సింగమనేని హెచ్చెమ్ పాత్రను వ్యాఖ్యానిస్తూ సర్కస్ పులులు అని కేతువిశ్వనాథరెడ్డి సరిగ్గా అభివర్ణించారు

పితృస్వామ్య జనిత పురుషాహంకారంతో నిస్సహాయ స్త్రీల ఆత్మగౌరవాన్ని అవమానించే చీడ వ్యక్తిత్వాన్ని అతిచిన్న కథ జవాబులో నగ్నంగా నిలబెట్టారు సింగమనేని. కుటుంబంలో పురుషాధిపత్యాన్ని గుర్తెరిగే పిల్లలు తల్లికి పరాయ వారయిపోతారు. ఆఫీసునుంచి వచ్చిన గంగాధరం చెంతకు, ఇద్దరాడపిల్లలు తరవాత కలిగిన సుపుత్రుడు నాలుగేళ్ళవాడు 'అమ్మకొత్తింది' అంటూ గోముగా చేరడంతో అతను రెచ్చిపోయి ఎందుకు కొట్టావంటూ దాడి చేస్తాడు. ఆ దాడికి మూలమైన పిల్లగాన్ని గురించి "..వాడు భయం నటిస్తూ తండ్రి మోకాళ్ళ దగ్గరే నిలబడ్డాడు....వాడికి మహా ఉబలాటంగా ఉంది ...ఏదో జరుగుతుందని.." అని చిత్రించడం ద్వారా తలిదండ్రుల మధ్య సామరస్య రాహిత్యం ద్వారా సంస్కార హీనుడైన తండ్రి పక్షం వహిస్తూ స్వభావ వక్రత పొందిన పిల్లవాన్ని రూపుగట్టించాడు రచయిత. భర్త గద్దింపులకు నిరసన చూపులూ, గొణుగుడే ఆమె సమాధానాలు చెంపమీద దెబ్బలకు, వీపుమీద గుద్దులకు రక్షణగా చేతులు పైకెత్తి అడ్డం పెట్టి పేరులేని ఆ భార్య "నీ కోసం తీసిపెట్టిన కాఫీవాడు తాగితేనూ. .." అని ఒణుకుతూ చెప్పిన సమాధానం కథాక్రమానికి ఊహించని ముగింపుగా వుంటూ మృగప్రాయమైన గంగాధరానికి దిమ్మదిరిగేంచేదిగా, పాఠకులలో కథా లక్ష్యం బలంగా నాటుకొనేలా తోడ్పడింది

సింగమనేని కథల ముగింపు విశిష్టంగా వుంటుంది. అది అత్యంత

చమత్కారంగా కనిపిస్తూ, కేవల చమత్కారంకోసం కాకుండా కథా లక్ష్య సాధనకు, ఒక సాక్షాత్కారానికి తోడ్పడే శిల్ప పరికరమని పాఠకులు గుర్తించేలా వుంటుంది కథాశిల్ప మర్మజ్ఞుడు సింగమనేని నారాయణ

'మకరముఖం' కథ దళిత జనావళి ఆత్మగౌరవాన్ని అవమానిస్తున్న వర్ణవివక్ష నైచ్యాన్ని బహిర్గత పరిచింది జీతగాళ్ళుగా బతికే కుటుంబంలో పుట్టి ఒక క్రైస్తవ ఉపాధ్యాయుని కరుణవల్ల విద్యావంతుడైన హరిజన యువకునిలో ఆత్మగౌరవ సాక్షాత్కారాన్ని ఈ కథ సాధించింది సెకండరీగ్రేడ్ టీచర్‌గా సెలెక్టయి ఉద్యోగంలో చేరడానికి పయనమైపోతున్న ఆ హరిజన యువకుని పాత్ర ద్వారా ఉత్తమపురుషలో కథను నడిపిస్తుంది ఇందువల్ల కథనం విశ్వసనీయంగా రూపొంది కథా లక్ష్యం చక్కగా సాధించబడింది తను చదువుకొనే రోజులనుంచీ రిజర్వేషన్‌ల అమలు సాంఘిక ద్రోహమనీ, వాటివల్ల ప్రతిభ మంటగలిసి పోయిందనీ, భవిష్యత్ అంతా ఎస్సీగాళ్ళదే అనీ వింటున్న వ్యాఖ్యానాల గాయాలు, బాల్యంలో అనుభవించిన అస్పృశ్యతా అవమానాలు తన కళ్ళెదుటే హోటళ్ళలో అమలవుతున్న రెండు గ్లాసుల విధానం అతని ఆత్మగౌరవాన్ని అగ్ని పరీక్షకు పెడతాయి గ్రామం చేరిన తరువాత ఆ ఊరాయన ఒకరు స్కూలుకు దారి చూపెడతాడు స్కూలు బిల్డింగ్ కూలిపోయినందున ఆంజనేయ స్వామి గుడిలో స్కూలు నడుస్తుంటుంది గుడి బయట నిప్పులు చెరిగే ఎండలో ఒక టీచర్ పిల్లలకు పాఠం బోధిస్తుంటాడు ఆ టీచర్ హరిజనుడ యినందున గుడిబయట పాఠం చెప్పక తప్పదని తనను స్కూలు వద్దకు తెచ్చిన వ్యక్తి వ్యాఖ్యానించి వెళ్ళిపోతాడు. అవమానపు అగ్నిగుండంలోంచి క్షణకాలంలో తేరుకొని స్వాభిమానంతో "నేను కూడా హరిజనుణ్ణే" అని ప్రకటిస్తాడు.

ప్రధానమంత్రి నుంచి ప్యూన్ వరకు పాలనా యంత్రాంగంలో వ్యాపించిన లంచగొండితనము, దురహంకారము పరమ అసహ్యకర సామాజిక నమూనాల్ని ఉత్పన్నం చేస్తున్నాయి వాటినెదిరించి క్షాళన చేయవలసిన విద్యాధిక వర్గం వెన్నెముక లేకుండా, సామాజిక చింతన లేకుండా నిర్జీవంగా వుంటున్నది. ఆ వర్గం జాతి ప్రజలకు నాయకత్వమెలా వహించగలదు? 'బుడగలు' కథలో దీనిని వస్తువుగా తీసుకున్నారు సింగమనేని తాలూకా కేంద్రంలో పదవ తరగతి పబ్లిక్ పరీక్షల్లో ఇన్విజిలేషన్ డ్యూటీ చేసినందుకు రావలసిన టి.ఎ. కోసం తాలూకా ఆఫీసుకు ఆర్గురు టీచర్లు వస్తారు ఆఫీసులో పని చేసిపెట్టవలసిన ఎస్టీవో వుండడు అతను వేరే ఊర్లో కాపురముంటూ విధులకు హాజరు కాకపోవడంపట్ల కోపగిస్తూ కలెక్టరుకు కంప్లెయింట్ పెట్టాలని, పత్రికలకు రాయాలని, ముఖ్యమంత్రికి పిటిషన్ పెట్టాలని చిందులేస్తారు అయితే చేయడమేమీ వుండదు ఎస్టీవో ఆలస్యంగా రావడమే గాక టోకన్‌లు జారీ చేయడంలో నిర్లక్ష్యం ప్రదర్శిస్తాడు చిందులేసిన టీచర్లు తిట్టుకుంటూ పడిగాడ్పులు పడతారేగాని కనీస నిరసన కూడ తెలపరు. ఆఖరుకు ప్యూనుద్వారా లంచం సమర్పించుకొని పని నెరవేర్చుకుంటారు. వారి మాటల ఆర్భాటం నేపథ్యంలో వారి పిరికితనం బహిర్గత పరచబడింది కథ ఆరంభంనుంచీ టీచర్ల

మధ్యసాగు చొల్లు సంభాషణ వారి ఆత్మిక డొల్లతనాన్ని వెల్లడిస్తూ వారి అంతిమ లొంగుబాటును ఖరారు చేసింది అదే ఈ కథలోని శిల్పనైపుణ్యం

'కంచె' లో వెంకటాపురం హైస్కూలులో 7వ తరగతి పబ్లిక్ పరీక్షల్లో ఉత్తీర్ణతాశాతం అధ్వాన్నంగా ఉన్నందుకు కారణాలు అన్వేషించి పరిష్కారాలు సూచించడానికి వచ్చిన డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్ ఇతర స్కూళ్ళ మాదిరే మాస్ కాపీయింగ్ చేయించమని సలహా ఇవ్వడంతో స్కూల్ హెడ్‌మాస్టర్, టీచర్లు నిర్విణ్ణులవుతారు

'పరీక్షిత్తు' కథలో 7వ తరగతి పరీక్షల్లో పిల్లలకు కాపీయింగ్ చేసే అవకాశాన్ని హెడ్‌మాస్టర్ ఇవ్వలేదనే కక్షతో ఆ గ్రామ ప్రజలు అతన్ని చితకదన్ని బాటపక్కన పడేసిపోతారు

ఈ రెండు కథలు ప్రభుత్వాలు అమలుపరుస్తున్న విద్యావిధానం కొని తెచ్చిన భ్రష్టత్వాన్ని తెలుపుతాయి

ఎయిడ్స్ మాదిరి వ్యాపిస్తున్న వాస్తు మౌఢ్యం పై మంచి కథ 'అవాస్తవికత' రచయిత ప్రయోగించిన వ్యంగ్య శైలి, స్వరమూ ఆ కథకు ప్రాణం. ఎన్ని ఈతి బాధలున్నా రిటైర్ అయి కొత్త ఇల్లు కట్టుకొని వెంకట్రామయ్య తృప్తిగానే జీవిస్తుంటాడు. మిత్రుడు కృష్ణమూర్తి చూడ్డానికని వచ్చి వెంకట్రామయ్య బాధలన్నిటికీ మూలకారణం ఇంటి వాస్తుదోషంలో ఉందని నొక్కివొక్కాణించి భయోత్పాతం సృష్టిస్తాడు విజయనగర సామ్రాజ్యపతనం, బాబ్రీ మసీదు కూల్చివేత, హుసేన్‌సాగర్‌లో బుద్ధ విగ్రహం మునుగుగు వాస్తుదోషం ఫలితాలేనని బల్లగుద్ది చెబుతాడు ఒక నీ ఇల్లనగా ఎంత అని బోధ చేస్తాడు నైరుతి మూలన కట్టిన లావెట్రీ అరిష్టాలకు మూలమని ప్రకటిస్తాడు వెంకట్రామయ్యను వాస్తుభూతం ఆవహిస్తుంది. హైదరాబాదు నుంచి వచ్చిన వాస్తు నిపుణునికి ఐదువేలు ఫీజు సమర్పించుకొని సలహా కోరితే గుమ్మాలు కిటికీలు కలిసి బేసి సంఖ్యలో వుండరాదనీ, ఇల్లు దక్షిణం వైపు ఎత్తుగా వుండరాదనీ, ఖరాఖండిగా చెప్పాడు. ఆ విధంగా ఇంటిని సరిచేయబోతే ఇల్లు కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. ఆ సమయంలో హైదరాబాద్ నుంచి వచ్చిన మిత్రుడు ప్రొఫెసర్ ప్రకాశం వాస్తునమ్మకాలను శాస్త్రీయంగా కొట్టి పారేస్తూ ధైర్యం నూరి పోసి రక్షిస్తాడు శాస్త్రీయ దృక్పథం, సామాజిక చైతన్యం లోపిస్తే ఎంతటి దౌర్భల్యాల పాలు కాగలమో ఈ కథ వ్యంగ్య వైభవంతో మన చైతన్యంపై ముద్ర వేస్తుంది.

* * *

"వాసంత తుషారం, నీకూనాకూ మధ్య నిశీధి, నిషిద్ధం" కథల్లోని స్త్రీ పాత్రలు అద్భుత వ్యక్తిత్వ సౌందర్యానికి ప్రతీకలు అవి సరికొత్త వ్యక్తిత్వాలకు, కొత్త జీవితానుభవాలకు, కొత్త ఆత్మవిశ్వాసానికి ప్రతినిధులు ఆధునిక స్త్రీ చరిత్రను తిరగరాస్తుందని గురజాడ ప్రకటించిన విశ్వాసాన్ని వాస్తవం చేసిన పాత్రలు అవి. అవి నిజజీవితం లోనివే సమాజంలో చోటు చేసుకున్న నూతన భావాలను, ప్రవర్తనను ఆ కథలు మన ముందు ఉంచాయి

'వాసంత తుషారం' లో ఎమ్మే చదివిన వెంకటపతి రైతు రామకృష్ణప్ప కొడుకు. చదువుకున్న టౌన్ అమ్మాయి వసంతను వెంకటపతికి చేసుకోవడానికి పెద్దల మధ్య సంప్రదింపులు ప్రాథమిక దశలోఉండగానే, వెంకటపతిని చూడడానికని వసంత, ఆమె స్నేహితురాలు తుషార పల్లెటూరుకు వస్తారు. ఆ విడ్డూరాన్ని జీర్ణం చేసుకోలేక రామకృష్ణప్ప ఇబ్బంది పడుతుండగా భార్య వెంకటలక్ష్మమ్మ అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తుతూ గలగలా నవ్వేసి, "మా వాడెంత అదృష్టవంతుడమ్మా! నేనెప్పుడూ అనుకొనేదాన్ని. బోడి ఎప్పుడూ మగపిల్లలేనా ఆడపిలల్ని పెళ్ళి చూపులు చూసేది - ఏం! ఆడపిల్లే పెళ్ళి ఎందుకు చూడగూడదు? అని" అంటూ వాసంత, తుషారలకు ఆప్యాయంగా మర్యాదలు చేసి తోటలో వున్న కొడుకును పిలిపిస్తుంది. ఉత్తమ సాహిత్య పరన స్పర్శతో సంస్కారం పొందిన వెంటకపతి విషయాన్ని సరదాగా స్వీకరిస్తాడు వెంకటలక్ష్మమ్మ పాత్ర ఒక నూతన సాహిత్యావిష్కరణ మన గ్రామీణ మహిళల ఔన్నత్యానికీ, ఆరోగ్యకర జీవన పార్శ్వానికి ఆ పాత్ర ఒక ప్రతీక వెంకటలక్ష్మమ్మ ప్రవర్తన సిద్ధాంతంలోంచి వచ్చినదికాదు జీవితంలోంచి సాఫీగా వచ్చినదిగా చూపడంలో రచయిత ప్రతిభ తెలుస్తుంది ఆ పాత్ర జీవితానుభవ స్థాయి లోంచి అది సహజంగా వెల్లడయిన ప్రవర్తన - అది సాధ్యమేనా అని తర్కించం! ఒప్పేసుకుంటాం! కథా వాస్తవికతకు అదే గీటురాయి

'నిషిద్ధం'లో ఉద్యోగిని, ఉత్తమ సంస్కారి, భావుకురాలు అయిన మమత, పెద్దలు నిశ్చయించిన తను పెళ్ళాడబోయే భాస్కర్ ప్రవర్తనలోని స్వార్థ సంకుచిత స్వభావాన్ని, అతనిలో మానవీయ స్పర్శ లోపించడాన్ని గమనించి ఆ సంబంధాన్ని తిరస్కరించడానికి నిశ్చయిస్తుంది సంస్కారభేదాల దాంపత్యంలో అనేక విషాదాలకు, హింసకు, అస్తిత్వ వేదనకు స్థానంగా వుంటున్నాయి. మానవాళిని వెన్నంటి వుంటున్న తాత్విక, సామాజిక, వ్యక్తిపర సమస్య అది మమత, భాస్కర్‌ల మధ్య వున్న మౌలిక సంస్కార వ్యత్యాసాలను ఒక చిన్న సంభాషణ ఒక చిన్న సందర్భం ఆలంబనగా రచయిత సున్నితంగా వ్యక్తపరచారు. మమతకు కొడవటిగంటి కుటుంబరావు మొదలగు ప్రగతిశీల రచయితలు నచ్చగా, ఆ పేర్లయినా తెలియని పరిస్థితి భాస్కర్‌ది ఒక సందర్భంలో ఇద్దరూ యాదృచ్ఛికంగా ఒకే టౌన్‌బస్‌లో ప్రయాణిస్తుండగా సీటులేక వెనక సీట్లవద్ద నిల్చొన్న మమత, ముందుసీట్లో కూచొనివున్న ఒకవ్యక్తి పసిపాపనెత్తుకొని ఇబ్బంది పడుతూ నిలుచున్న ఓ తల్లికి సీటు ఖాళీ చేసి, ఇవ్వడానికి నిరాకరిస్తాడు. ఆ వ్యక్తి భాస్కర్ అని గుర్తు పట్టిన మమత అతని వైఖరిని అసహ్యించు కుంటుంది. అతనితో కలిసి జీవించే నిర్ణయాన్ని దృఢంగా తుడిపేసుకుంటుంది. స్త్రీలకు స్వతంత్ర వ్యక్తిత్వం కల్పించగల జీవన స్వేచ్ఛకు మమత ప్రతినిధి.

పరిణత వయస్కులైన విద్యాధిక యువతీయువకుల మధ్య రూపొందే ఆకర్షణ, సామాజిక, ఆర్థిక ఒత్తిళ్ళు విధించే మానసిక సంకెళ్ళ నేపథ్యంలో ఆవిష్కారం కావడాన్ని 'నీకూ నాకూ మధ్య నిశీధి'లో చూస్తాం. కర్నూలు మెడికల్ కాలేజీలో మెడిసిన్ కోర్సు పూర్తి చేసిన సురేంద్ర, సుధ, ఢిల్లీలో పి జి ప్రవేశ పరీక్ష రాయడానికి వెళుతూ ప్రయాణంలో తారసపడి విద్యార్థి

దశను, ఇతర విషయాలను గూర్చి సంభాషించుకుంటారు ప్రయాణ క్రమంలో సురేంద్ర సుధపట్ల ఆకర్షితుడవుతాడు తిరుగు ప్రయాణంలో సుధ తన స్వంత ఊరయిన కర్నూలులో తమ ఇంటికి సురేంద్రను తీసుకుపోతుంది అక్కడ సురేంద్ర ఆకస్మికంగా సుధకు వివాహ ప్రతిపాదన చేసి ప్రాధేయపడతాడు వాస్తవికతావాది, పరిణత మనస్కురాలు, ఉత్తమ సంస్కారి అయిన సుధ, తమ మధ్యగల కులాల అంతరాన్ని అతని తల్లిదండ్రులు అంగీకరించగలరా అనే సందేహాన్ని వ్యక్తపరిచింది అదే విధంగా పెద్ద కట్నం సాధించుకోవలసిన అతని కుటుంబ ఆర్థిక పరిస్థితిని ఎత్తిచూపి పునరాలోచించి నిర్ణయం తీసుకొమ్మని సున్నితంగా చెబుతుంది ఆ రాత్రి సురేంద్ర అక్కడే నిద్రిస్తాడు తెల్లవారగా చూస్తే సురేంద్ర కనిపించడు "నన్ను క్షమించండి సుధగారూ" అని రాసి వుంచిన చీటీని చదివి సుధ గట్టిగా నవ్వేస్తుంది సందర్భం అర్థమయి పాఠకులూ నవ్వేస్తారు సుధలోని ఆత్మవిశ్వాసమూ, లోకజ్ఞానమూ, ప్రేమాన్విత స్వభావమూ నేపథ్యంలో సురేంద్ర దౌర్బల్యాన్ని చిత్రించిన తీరు అద్భుతమైనది కథాశిల్పం గొప్ప ఆకర్షణతో ఉత్కంఠతో మనల్ని వెంట తీసుకుపోతుంది కథా కథనం అత్యంత సహజంగా, ఆకర్షణీయంగా సాగింది ఈ ప్రేమ కథ ఒక సామాజిక విషాద గాథ కులము, డబ్బు విలువలు యువతను దుర్బలులుగా మార్చి వారిలో సహజంగా ఉత్పన్నమయ్యే ప్రేమ భావనను విఫలం చేసే క్రమాన్ని ఈ కథ మనముందుంచింది.

'దృశ్యమూ - అదృశ్యమూ' కథలో డబ్బు సులువుగా సంపాదించడంలోని మెళకువలు తెలియకపోవడమే గాక ఆ యావే లేని మూర్తి (కథ చెప్పే ప్రధాన పాత్ర) కట్నాలు ఇచ్చుకోలేక కూతుళ్ళ పెళ్ళి చేయలేకపోతాడు "డబ్బుతో డబ్బును సంపాదించడం నేటి కళ", అని ప్రకటించే అతని మిత్రుడు నరసింహం, పొలం అమ్మగా వచ్చిన యాభై వేలతో ఫైనాన్స్ కార్పొరేషన్‌లో భాగస్వామి కావడం, రియల్ ఎస్టేట్ వ్యాపారం, ఇళ్ళు కట్టించి అమ్మడం, షేర్లు కొనడం అమ్మడం మొదలగు కార్యకలాపాలతో పదేళ్ళ కాలంలో పాతిక లక్షలు పోగేసిన తీరు ఒక అద్భుతంలా తోస్తుంది మూర్తికి. "నీ సాహిత్యం, పుస్తకాలూ నీ సమస్యలను పరిష్కరించవు మూర్తి" అంటాడు నరసింహం అతనితో పోటీ బెట్టి మూర్తిని దెప్పుతుంది అతని భార్య శారద "నరసింహం సమర్థత ఎన్నేళ్ళు కష్టపడితే మాత్రం నాకెలా వస్తుంది? అయినా నాకు బాధ వుండదు! ఇది మరీ ఆశ్చర్యం!!" అనుకుంటాడు మూర్తి ఇది అతని వ్యక్తిత్వ ఉదాత్తతను, నైర్మల్యాన్ని ప్రస్ఫుటించిన అంతరంగ భాషణ. 1980లనుంచి వేగం పుంజుకున్న సులభ ధనార్జన వైఖరులకు చిన్న ప్రతీక నరసింహం ఆ వైఖరులు నేటికి విశ్వరూపం ధరించడం, అవి తెచ్చిపెట్టిన మానవీయ విలువల విధ్వంసనం మనకళ్ళ ముందున్న వాస్తవము

సాదా జీవనశైలిని, సంపద్వంతమైన ఆత్మిక ప్రపంచాన్ని, సంతోష దాయకమైన మానవ సంబంధాలను సింగమనేని కథలు ప్రతిపాదిస్తాయి. మానవీయ విలువల్లో జీవన సార్థకతను అన్వేషిస్తారు ఆయన. జీవితంపట్ల అపారమైన ప్రేమ ఆయన తాత్విక ప్రతీక. అందుకే ఆయన అన్యాయము,

అసత్యం, డాంబికం, అల్పత్వాలను ద్వేషిస్తారు. ఆయన కథలు ఆయన జీవన తాత్వికతకు సాహిత్య దర్పణాలు

ఫ్యాక్షనిజం ఇతివృత్తంగా సింగమనేని రెండు కథలు రాశారు - అనంతం, ఫిరంగిలోజ్వరం

ఫ్యాక్షనిజాన్ని అమానుషమైన సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థగా వెల్లడి చేసే విశిష్టమైన కథ 'ఫిరంగిలోజ్వరం' ఇండియా టుడే 2002 వార్షిక సాహిత్య సంచికలో అది అచ్చయింది ఒక నవలగా విస్తరణ పొందగల కథ వెంకట నాయుడు, వీరారెడ్డి ఇరుగుపొరుగూర్ల భూస్వాములు సారా కాంట్రాక్టుల కోసం పోటాపోటీగా తలపడుతూ సైన్యాలను నిర్మించుకొని సాధారణ ప్రజలను సమిధలను చేస్తూ, పరస్పర దాడులు సాగిస్తూ, ఫ్యాక్షనిస్టు మురాలుగా రూపొంది గ్రామీణ జీవితాన్ని అల్లకల్లోలం గావిస్తారు. సారా రారాజుగా రెండుసార్లు ఎమ్మెల్యేగా, ఒకసారి మంత్రిగా నియోజకవర్గానికి శాసనకర్తగా వెలిగినవాడు వెంకటనాయుడు పదవులకు నామినేషన్లు, కాంట్రాక్టులకు టెండర్లు, తగాదాల పంచాయితీలు, ఎన్నికల రిగ్గింగ్ అన్నీ అతడి అదు పాజ్ఞలలో వుండవలసిందే శత్రునిర్మూలన సశేషంగా జరగాల్సిందే. వీరారెడ్డి క్రమంగా బలహీన పడతాడు వీరారెడ్డి వర్గానికి చెందిన సుగాలీ తాండాల నాయకుడు గణేనాయక్, ఎన్టీఆర్ మద్యనిషేధం విధించగా అతని అధీనంలోని దొంగసారా కాచే తాండాలమీద ఎక్సైజ్‌వాళ్ళ దాడులు తీవ్రంకావడంతో రక్షణకోసం నాయుడు పంచన చేరతాడు ఇద్దరూ సారా వాటాలు పంచుకుంటారు. చంద్రబాబు ముఖ్యమంత్రి అయ్యాక మద్యపాన నిషేధాన్ని పాక్షికంగా సడలించడంతో, నాయుడువంటి సారాకాంట్రాక్టర్లు బ్రాందీ షాపుల లైసెన్సుల కోసం యుద్ధాలు చేసుకుంటారు చీప్ లిక్కర్ ప్రవాహానికి తాండాల దొంగసారా ఆటంకమవుతుంది. నాయుడు, గణేనాయక్‌ల మధ్య మైత్రి తెచ్చిన సారా ఇప్పుడు వైరం తెచ్చింది నాయుడు తాండాలపై ఘోరమైన దాడులు జరిపిస్తాడు. ఈ పరిస్థితుల్లో నాయుడు చీనా తోటను రాత్రికి రాత్రే ఎవరో నరికేస్తారు అది గణేనాయక్ పనే అని ప్రకటించి అతని అంతానికి ప్రతిన బూనుతాడు నాయుడు. ఎక్కడున్నా లొంగిపోవాలని, తాండాలు అతన్ని పట్టివ్వాలని హెచ్చరిస్తాడు తాండాలు తగలబెట్టిస్తాడు నాయుడు వీరారెడ్డి మధ్య మైత్రి కుదురుతుంది స్వార్థ వ్యాపార ప్రయోజనాల కోసం జిల్లా సర్వనాశనమవుతుంటే సూర్యోదయం కోసం ప్రజలు ఎదురు చూస్తున్నారంటూ కథ ముగుస్తుంది. గణేనాయక్‌పై వెంకటనాయుడి ప్రతిజ్ఞ సెప్టెంబర్ పదకొండు తరువాత బిన్‌లాడెన్‌పై అమెరికా సామ్రాజ్యవాదుల ప్రతిజ్ఞను, తాండాలు తగులబెట్టడం ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లపై అమెరికా కురిపించిన పాశవిక బాంబుల వర్షాన్ని గుర్తుకు తెస్తాయి ఆధిపత్య రాజకీయాలు కుగ్రామంలో అయినా, అంతర్జాతీయ స్థాయిలో అయినా ఒకే తీరుగా నడవడం అవగతమవుతుంది సమాజాల వ్యావసాయిక వెనుకబాటుతనం సకల వెనుక బాటుతనాలకు ఆధారభూమిగా వుంటుంది. ఆ ఆధారంమీద ఫ్యాక్షనిస్టు రాజకీయాలు ఒక

ఆధిపత్య వ్యవస్థగా ప్రత్యేక తీవ్రతతో వ్యక్తము కావడాన్ని ఫిరంగిలోజ్వరం ఉద్వేగ భరిత కథనంతో దృశ్యమానం చేసింది అదొక అద్భుతమైన సెల్యులాయిడ్ కథనం

రచయితకు జీవితము, సాహిత్యము రెండు తెలిసుండాలి అంతే ముఖ్యంగా వాటి మధ్యగల సంబంధ బాంధవ్యాలూ తెలిసుండాలి అప్పుడే ఉత్తమ సాహిత్య సృజన సాధ్యమవుతుంది సింగమనేని కథా సాహిత్యం ఆ విధంగా సృజింపబడినదే "నాకు కథా రచన సహజంగా అబ్బలేదు, గట్టిగా సాధన చేసి నేర్చుకున్నాను" అని సింగమనేని అంటారు ఆయన కథలు చాలా సహజంగా ఆవిష్కారం కావడానికి కారణం ఆ సాధనే ఆయన ప్రతిభావంతుడైన జీవిత పరిశీలకుడు. జీవితం క్షుణ్ణంగా తెలిసిన ఆత్మవిశ్వాసంతో మానవ జీవితాన్ని సున్నితంగా స్పృశించడం ఆయన కథల్లో అనుభూత మవుతుంది ఆయన కథలు జీవిత సాక్షాత్కారంగా ఉంటూ పదేపదే గుర్తుకొస్తాయి కథల్లోని వస్తు - రూప ఐక్యతకు అదే కొండగుర్తు

శైలీ శిల్పాలు, వస్తువుపట్ల రచయిత దృక్పథాన్ని బట్టి ప్రధానంగా రూపు దిద్దుకుంటాయి. అనవసర శిల్పచాతుర్యాలు సింగమనేని కథా తత్వంతో పొసగవు ఆయన కథా శైలీ శిల్పాలు సాహిత్యంలో ప్రజా దృక్పథానికి చెందినవి ఆయన కథలు ప్రగాఢ జీవితానుభవాన్ని అందిస్తాయి జీవన ఔన్నత్యానికి కట్టుబడి ఉండే విధంగా మన మీద ప్రభావం నెరపుతాయి అనంత కథకు ఒరవడి దిద్దడమే గాక తెలుగు కథకు కొత్త ఆవిష్కరణలు జోడించిన వారు సింగమనేని నారాయణ.

# తెలుగు కథకులు - కథన రీతులు

## మొదటి సంపుటంలో

| | కథకులు | వ్యాసకర్తలు |
|---|---|---|
| 1 | గురజాడ అప్పారావు | - రాచపాళెం చంద్రశేఖరరెడ్డి |
| 2 | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | - అబ్బూరి ఛాయాదేవి |
| 3 | చలం | - ఓల్గా |
| 4 | చింతా దీక్షితులు | - మధురాంతకం రాజారాం |
| 5 | వేలూరి శివరామశాస్త్రి | - డా॥ మహతీ శంకర్ |
| 6 | మల్లాది రామకృష్ణశాస్త్రి | - ఇంద్రగంటి జానకీబాల |
| 7 | బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం | - మధురాంతకం రాజారాం |
| 8 | మునిమాణిక్యం నరసింహారావు | - పోలాప్రగడ సత్యనారాయణమూర్తి |
| 9 | సురవరం ప్రతాపరెడ్డి | - కాలువ మల్లయ్య |
| 10 | కరుణకుమార | - మధురాంతకం రాజారాం |
| 11. | అడివి బాపిరాజు | - డా॥ వి. సిమ్మన్న |
| 12 | విశ్వనాథ సత్యనారాయణ | - ముదివేడు ప్రభాకరరావు |
| 13 | పాలగుమ్మి పద్మరాజు | - వాడ్రేవు వీరలక్ష్మీదేవి |
| 14 | బుచ్చిబాబు | - పోరంకి దక్షిణామూర్తి |
| 15 | కొడవటిగంటి కుటుంబరావు | - ఓల్గా |
| 16 | గోపీచంద్ | - ఆర్.ఎస్. సుదర్శనం |
| 17 | బాలగంగాధర తిలక్ | - కోడూరి శ్రీరామమూర్తి |
| 18 | కె సభా | - మధురాంతకం రాజారాం |
| 19 | చాగంటి సోమయాజులు | - సింగమనేని నారాయణ |
| 20 | కొనకళ్ళ వెంకటరత్నం | - మధురాంతకం రాజారాం |
| 21 | సత్యం శంకరమంచి | - వావిలాల సుబ్బారావు |
| 22 | మా గోఖలే | - పాపినేని శివశంకర్ |
| 23 | రాచకొండ విశ్వనాథశాస్త్రి | - కాత్యాయనీ విద్మహే |
| 24 | పూసపాటి కృష్ణంరాజు | - భరాగో |
| 25 | పురాణం సుబ్రహ్మణ్యశర్మ | - రామమోహనరాయ్ |

# తెలుగు కథకులు - కథన రీతులు

## రెండవ సంపుటంలో

| కథకులు | వ్యాసకర్తలు |
|---|---|
| 1 కాళీపట్నం రామారావు | - వివిన మూర్తి |
| 2 భమిడిపాటి రామగోపాలం | - సూరి సువర్ణలక్ష్మి, ఎస్ ఝాన్సీరాణి |
| 3 ఇల్లిందల సరస్వతీదేవి | - పోలాప్రగడ రాజ్యలక్ష్మి |
| 4 బలివాడ కాంతారావు | - మధురాంతకం రాజారాం |
| 5 మునిపల్లె రాజు | - బి వి రామిరెడ్డి |
| 6 అబ్బూరి ఛాయాదేవి | - ఓల్గా |
| 7 భానుమతీ రామకృష్ణ | - సి మృణాళిని |
| 8 శీలా వీర్రాజు | - నాళేశ్వరం శంకరం |
| 9 పెద్దిభొట్ల సుబ్బరామయ్య | - రాచపాళెం చంద్రశేఖరరెడ్డి |
| 10 రంగనాయకమ్మ | - కాత్యాయనీ విద్మహే |
| 11 ముళ్లపూడి వెంకట రమణ | - కవనశర్మ |
| 12. ఆర్.ఎస్. సుదర్శనం | - నవీన్ |
| 13. ఆర్ వసుంధరాదేవి | - బండి నారాయణస్వామి |
| 14 హితశ్రీ | - మధురాంతకం రాజారాం |
| 15 కొలకలూరి ఇనాక్ | - జి లక్ష్మీనరసయ్య |
| 16. కేతు విశ్వనాథరెడ్డి | - పి సంజీవమ్మ |
| 17. సొదుం జయరాం | - ఆర్వీయార్ |
| 18. పులికంటి కృష్ణారెడ్డి | - డా॥ వి ఆర్ రాసాని |
| 19. ఇచ్ఛాపురపు జగన్నాథరావు | - మధురాంతకం నరేంద్ర |
| 20. అల్లం శేషగిరిరావు | - ఎ వి రెడ్డిశాస్త్రి |
| 21 కళ్యాణసుందరీ జగన్నాథ్ | - సౌభాగ్య |
| 22. బీనాదేవి | - పి సత్యవతి |
| 23. కలువకొలను సదానంద | - వల్లంపాటి వెంకట సుబ్బయ్య |
| 24 వాకాటి పాండురంగరావు | - పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, మధురాంతకం రాజారాం |
| 25 మధురాంతకం రాజారాం | - సింగమనేని నారాయణ |